# శ్రీమదాంధ్రమహాభారతము
## ఆనుశాసనికపర్వము



### ఆంధ్రమహాభారతము - ఉపాఖ్యానములు

ఆంధ్రమహాభారతావతారికయందు నన్నయభట్టు భారతమును నిర్వచించుచు ఈపద్యమును రచించియున్నాడు.

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని, యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని, కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహమని, యైతిహాసికు లితిహాసమనియుఁ
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చయంబని మహిఁగొనియాడుచుండ
వివిధవేదతత్త్వవేది వేదవ్యాసుఁ, డాదిమునిపరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై, పరగుచుండఁజేసె భారతంబు.
(1–1–32)

భారతము నిజమునకు భరతవంశముఖ్యులైన కౌరవపాండవ కథాప్రాముఖ్యము కలిగినట్టిది. కాని వారి కథను మాత్రమే రచించుట సంస్కృతమున వేదవ్యాసమునికి, ఆంధ్రమున నన్నయభట్టునకును ఆదర్శముకాదు. ధర్మతత్త్వజ్ఞులను, అధ్యాత్మవిదులను, నీతివిచక్షణులను, కవివృషభులను, లాక్షణికులను ఐతిహాసికులను, పౌరాణికులను, భారతరచనచే తృప్తిపొందించవలసిన బాధ్యత తనకు గలదని నన్నయ గుర్తించి యాభారమును తాను వహించినాడు. ఇట్టి వైవిధ్యము కలిగిన పఠితలను సంతుష్టులచేయుట, కౌరవులయొక్కయు పాండవులయొక్కయు వర్ణనవలన నేర్పడిన పరిమితమయిన కథాపరిధివలన సాధ్యముకాదు. అందుచేత మరికొంత విస్తృతరంగము కావలెను. ఆరంగమును పూరించుటకు మహాభారతమునందలి యుపాఖ్యానములు చాలవరకు తోడ్పడినవి.

లోకమునందు న్యాయమును, నీతినిస్థాపించుట, ప్రోత్సహించుట కావ్యమునకు ముఖ్యవిధి కదా। అందును ప్రథమమహాకావ్యరచనచేసిన నన్నయపై ఈబాధ్యత మరింత అధికము గానున్నది. కావ్యములోని యొకకథతో కాంతాసమ్మితముగా నీతినిబోధించుటకంటె, అదేకావ్యమున పలువిధములైన కథలనుగ్రహించి, నీతిబోధచేయుటయందు శక్తిప్రభావము లధికముగా నుండుననుటలో సందేహములేదు యుధిష్ఠిరుని సత్ప్రవర్తనచేతనేకాక హరిశ్చంద్రుని వృత్తాంతమువలనను సత్యవాక్ప్రభావమును ప్రతిపాదించుటలో గల ఔచితిని ప్రత్యేకముగా చెప్పనవసరములేదు

ఇక ఉపాఖ్యానమనగానేమి యనుప్రశ్నకు సమాధానము చెప్పవలసియుండును. సర్ మోనియర్ విలియమ్సు పండితుడు ఉపఖ్యానమనగా A subordinate tale or story, an episode అను నర్థమును వ్రాసియున్నాడు. దీనినిబట్టి ప్రధానకథకు అంతర్గతముగాను, ప్రత్యక్షపరోక్ష సంబంధము కలిగినవిగానున్న మహాభారతమునందలికథలను ఉపాఖ్యానములుగా గ్రహించవలసి యున్నది. ఈనిఘంటికుడే మహాభారతమునందలి నలోపాఖ్యానమును ఉదాహరణముగా చెప్పియున్నాడు.

మహాభారతముననున్న ఉపాఖ్యానములను ఈకిందివిధములుగా వింగడించవచ్చును.

1. మహాభారతమునకు పూర్వరంగముగా నున్నట్టివి యయాతిచరిత్రము మొదలైన ఉపఖ్యానము లిందు చేరును. ఈవిభాగమునకు చెందిన కథలు ఆదిపర్వమున ధృతరాష్ట్ర పాండురాజుల జననము అనుప్రధానకథాభాగమువరకు సీమితమైయుండును.

2. మహాభారతకథలో పరోక్షసంబంధము కలిగినవేగాని,అందలిపాత్రము లీకథలలోకన్పింపవు ప్రసక్తాను ప్రసక్తముగా భారతమునందలి పాత్రములచేతకాని, కవివలనకాని వివరించబడి నట్టివి పంచేంద్రియోపాఖ్యానము, అంబోపాఖ్యానము మున్నగునవి ఉదాహరణములగును.

3. ఒకసిద్ధాంతమునుకాని, ఒకనీతినికాని ప్రతిపాదించి, దానినిపుష్టిచేయుటకు చెప్పబడినకథలను మూడవవిభాగమున చేర్చవచ్చును. వామదేవునికథ (అరణ్య)లో బ్రాహ్మణప్రభావము చెప్పబడియున్నది. అట్లే ధర్మవ్యాధోపాఖ్యానము (అరణ్య) పతివ్రతామహాత్మ్యము వక్కాణింపబడినది ఇటువంటి సందర్భములందు అనేక ఉపకథలురచితమైనవి.

4. పౌరాణిక ప్రాముఖ్యము కలిగిన ఘట్టములు వచ్చినప్పుడు, ఆవిశేషములను ప్రపంచించుటకుల్లేఖించినకథలు - భీష్మపర్వమున వ్యాసుడు కథనముచేసిన నారాయణునితపము, పరమేశ్వరుమహిమ అను చిన్నకథ లీవిభాగమున చేరును, కుమారస్వామి మహిమాభివర్ణనము (శల్యపర్వమున) కూడ నీసందర్భమున సరిపోవును.

5. వైదిక సంప్రదాయమునకు సంబంధించినవ్యక్తులు, క్షేత్రములు, మహిమలు వీరికిచెందిన కథలను చివరివిభాగములుగా చెప్పవచ్చును ఆధ్యాత్మికచర్చ లేరడినప్పుడు తదుపవత్తికములుగా చెప్పబడికథలన్నియు నీవిభాగముననే గ్రహించుట యుచితము. సంవాదపూర్వకములైన పెక్కుకథలును ఇందేచేరును. అనుశాసనికపర్వమునందలి వీతహవ్యునిబ్రాహ్మణ్యము. అశ్వమేధపర్వమునందలి ద్వాదశవార్షిక యజ్ఞప్రభావము, అదేపర్వముననున్న ఉమామహేశ్వర సంవాదము మొదలయినవి యిందుల కుదాహరణము లగును.

పదునెనిమిది పర్వములు కలిగి, కొన్నివేలసంఖ్యలోనున్న గద్యపద్యములతోకూడిన విస్తృత గ్రంథము మహాభారతము. ఈగ్రంథమునకెన్ని యుపాఖ్యానములున్నవి యని గుర్తించుటకు నేను ప్రయత్నించితిని. నాకు లభించిన సంఖ్యావివరము లిట్లున్నవి.

| పర్వము | ఆశ్వాసము | ఉపాఖ్యానములసంఖ్య |
|---|---|---|
| ఆదిపర్వము | I | 8 |
| ,, | II | 8 |
| ,, | III | 4 |
| ,, | IV | 4 |
| ,, | V | 2 |
| ,, | VI | - |
| ,, | VII | 4 |
| ,, | VIII | 8 |
| సభాపర్వము | I | 2 |
| ,, | II | 1 |
| అరణ్యపర్వము | I | 2 |
| ,, | II | 8 |
| ,, | III | 10 |
| ,, | IV | 7 |
| ,, | V | 8 |
| ,, | VI | 2 |
| ,, | VII | 2 |
| విరాటపర్వము | IV | - |
| ఉద్యోగపర్వము | IV | |
| భీష్మపర్వము | I | - |
| ,, | II | - |
| ,, | III | - |
| ద్రోణపర్వము | I | - |
| ,, | II | 8 |
| ,, | III | - |
| ,, | IV | - |
| ,, | V | 2 |
| కర్ణపర్వము | I | 2 |
| ,, | II | 2 |
| శల్యపర్వము | I | - |
| ,, | II | 10 |
| సౌప్తికపర్వము | I | - |
| | II | 2 |
| స్త్రీపర్వము | I | 1 |
| | | - |

| | | |
|---|---|---|
| శాంతిపర్వము | VI | 94 |
| అనుశాసనికపర్వము | I | 9 |
| | II | 8 |
| | III | 5 |
| | IV | 8 |
| | II | 3 |
| అశ్వమేధపర్వము | I | 2 |
| | II | 5 |
| | III | 1 |
| | IV | 8 |
| | | 101 |

ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక పర్వములలో ఉపాఖ్యానములులేవు. ఈవివరములను బట్టి ఆంధ్రమహాభారతమున మొత్తముఉపాఖ్యానములసంఖ్య 101 అనితేలుచున్నది. వీనియందు పైన వివరించిన వివిధభాగములకు చెందినవియున్నవి. ఇవికాక శాంతిపర్వమున అనేకములు మహిమాధి వర్ణము లున్నవి. వానిలో కధ లేకపోవుటయు, ఒకవేళ యున్నను దృశ్యాదృశ్యప్రాయముగా నుండుటయుకలదు అంతచేతవానిని ఉపాఖ్యానములలో చేర్చవలనుపడదు ఇక నీయుపాఖ్యానములు కవిత్రయమువారి రచనలన్నిటియందును చేరినవి. అందుచేత నుపాఖ్యానరచనయందును ముగ్గురు కవులునమానమే అనిచెప్పవలసియుండును. ప్రధానకథ పటిష్టముగానున్న పర్వములందు ఉపాఖ్యానములు లేకపోవుటయు, ప్రధానకథకు కొంత వెసులుబాటు కలిగినప్పు డుపాఖ్యానములసంఖ్య పెరుగుటయు పైవివరములవలన తెలియవచ్చుచున్నది విరాటపర్వమున నుపాఖ్యానములులేకుండుటకును శాంతిర్వమున అధికసంఖ్యలో అనగా 94 ఉపాఖ్యానము లుండుటకును కారణ మిదియే. ఇక పైన పేర్కొనిన వివిధవిభాగములక్రిందనున్న యుపాఖ్యానములలో ప్రతినిధిప్రాయములుగా నున్నదానిని గ్రహించి యందలివిశేషముల నుల్లేఖించుట ప్రస్తుతము చేయదగియున్నది.

1 మొదటివిభాగము మహాభారతకథకు పూర్వరంగముగానున్న ఉపాఖ్యానములుచేరును ఇవి కథాప్రారంభమున నుండుటచేత నన్నియు ఆదిపర్వముననే యున్నవి. ఆంధ్రమహాభారతమున నీకథల నన్నిటిని నన్నయభట్టే రచించియున్నాడు. వీనిలో అనేక రమ్యకథలున్నవి. అన్నింటినిగురించి చెప్పుట సాధ్యముకాదుకాబట్టి ఒకటిమాత్ర ముల్లేఖింతును "యయాతిమహారాజుచరిత్రము" అను ఉపాఖ్యానము, మనము, గ్రహించిన యావిభాగమున చక్కగా సరిపోవును ఆదిపర్వమునందలి తృతీయాశ్వాసమున నూటముప్పది గద్యపద్యములందున్న దీయుపాఖ్యానము. రాక్షసులకు గురువైన శుక్రునియధీనమున మృతసంజీవని యనువిద్యకలదు. దానినిసంపాదించుటకు దేవతలు ప్రయత్నించిరి దానికిసాధనముగా బృహస్పతికుమారుడగు కచుని యెన్నికచేసిరి. అతడు శుక్రాచార్యుల సన్నిధికి వెడలి యాతనిశిష్యత్వమును సంపాదించెను.అతని అభిమానమును పొందెను. కానిమత్సరగ్రస్తులైన రాక్షసు లాతనిని సంహరించి భస్మముచేసి, యాభస్మమును శుక్రుడు గ్రహించు మద్యమున కలిపి వేయుదురు మద్యముతో కచుడును శుక్రునిగర్భమున ప్రవేశించును. ఇదితెలుసుకొని శుక్రుడు కచుని

జీవితునిచేయును. తన్నుతాను జీవింపజేసుకొనుటకు కచునికి మృతసంజీవిని ప్రసాదించును.దానితో దేవకార్యము తీరినది. కథలోదీనిని మొదటిభాగముగా గ్రహించవలెను.

శుక్రునకు దేవయానియను కుమార్తె కలదు. ఆమెకచుని గుణశీలములచే నాకర్షితయై అతనిని వలచినది. కచుడు మృతసంజీవని సంపాదించిన యనంతరము తిరిగివెడలుచున్నప్పుడు తనమనస్సు వెల్లడించినది. కాని ధర్మసూక్ష్మములు తెలిసిన కచుడు, గురువుపుత్రిని వివాహమాడుటకు తిరస్కరించినాడు. దానితో సహనమునుకోల్పోయిన దేవయాని యాతని శపించినది. కచుడు ప్రతిశాప మిచ్చినాడు. కథలో నిది రెండవభాగము.

వృషపర్వుని కూతురుశర్మిష్ఠ. దేవయానికి శర్మిష్ఠకు ఒకానొక సందర్భమున వివాదమేర్పడినది. రాజకుమార్తె గురుపుత్రికను నూతత్రోయించినది.వేటకువచ్చిన యయాతిమహారాజు దేవయాని దీనావస్థను గమనించి యామె నుద్ధరించినాడు కాని దేవయాని శర్మిష్ఠపై క్రోధమువూనినది. తండ్రి శక్తినియుపయోగించి, శర్మిష్ఠను తనకుదాసిగా చేసికొన్నది.దీనిని మూడవభాగముగాగ్రహించవలెను.

తరువాత దేవయాని తండ్రియనుజ్ఞయై యయాతిమహారాజును భర్తగాపొంది యాతని వలన సంతానముపొందుట, శర్మిష్ఠయు యయాతివలన కుమారులను పొందుట, దానికి కోపించిన శుక్రుడు యయాతిని అనమయజరాపీడితుడగునట్లు శపించుట, తనకును, శర్మిష్ఠకును కుమారుడైన పూరుని వలన యయాతియౌవనమును గ్రహించి, అనేకవత్సరములు రాజ్యపాలనముచేసి, తరువాత పూరునకు రాజ్యమప్పగించి, వానప్రస్థము చేయుట మున్నగు ఘట్టములు కలిగినట్టిది కథలోని చరమభాగము. నన్నయభట్టికథను పరమరమణీయముగా చిత్రించెను

ప్రధానభారతకథకు పూర్వరంగముగానున్న యీయయాతి చరిత్రము ఎట్టిప్రయోజనములు సాధించినది యనునంశము పరిశీలించవలసియున్నది. ఈకథ యుపక్రమణమిట్లు కలదు.

''......జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె.

''వర్ణధర్మముల్ గాచుచు వసుధయెల్ల
ననఘచరితుఁ డై యేలిన యయాతి
భూసురోత్తమ భార్గవపుత్రియైన
దేవయానిని దానెట్లు దేవిఁజేసె.

''విపులతేజంబునను దపోవీర్యమునను
జగదనుగ్రహ నిగ్రహశక్తియుక్తుఁ
డయినట్టి యయాతికి నలిగి యేమి
కారణంబుగ శాపంబు కావ్యుఁడిచ్చె?

''మఱియు నస్మద్వంశకరుం డయిన యయాతిచరిత్రంబు వినవలతు జెప్పుమని యడిగిన వానికి వైశంపాయనుండిట్లనియె (౩-౧౮-౧౯.)

జనమేజయుడు వెలిబుచ్చిన సంశయములను తీర్చుటకు వైశంపాయనుఁ డీకథనుల్లేఖించినాడు. భారతమునకు వేదవిహితమైన వర్ణాశ్రమధర్మప్రతి పాదనము ముఖ్యధ్యేయములలోనొకటి, దీనిని

అటువ్యాసుఁడును, ఇటునన్నయగారును పాటించియున్నారు. యయాతిక్షత్రియుడు. "వర్ణధర్మము లొగాచుచు వసుధయెల్ల ననఘచరితుడై యేలినయట్టివాడు". అతడు బ్రాహ్మణకన్యనెట్లువివాహమాడెను అనునది జనమేజయుని సందేహము. ఎటువంటి విచిత్రపరిస్థితులలో దేవయాని, యయాతికి పాణి గ్రహణము జరిగినదో యీకథవివరించును. కావ్యుడు వారిసంబంధమును ఆమోదించుటయే కాక, దానియందు అవక్రమదోషము లేకుండెడుమని' వరమును ప్రసాదించినాడు. కథలోని యీ ఘట్టము ఇటు జనమేజయునకు, అటు యయాతికిని కలిగిన సంశయవిచ్ఛేదనముకావించినది. భారతము ప్రతి పాదించువర్ణాశ్రమధర్మమునకు భంగము కలుగలేదనియు నిరూపించినది. ఇది మొదటిప్రయోజనము.

రాక్షసగురువైన శుక్రాచార్యుడు ప్రత్యేకవ్యక్తిత్వముకలిగినవాడు. రాజనీతికుశలుడు. బుద్ధిలో బృహస్పతివంటివాడు. అట్టి శుక్రుడు ధర్మపరిపాలనముచేయుచున్న యయాతిని యెందుకనిశపించెను? అనునది రెండవప్రశ్న. ఇదినముచితమే స్వాభావికముగా దుష్టుడైనవాడు దుష్టముగా ప్రవర్తించినచో వానిప్రవర్తనను ఎవరును విపరీతముగాభావించరు. కాని ఉత్తమశీలము కలిగినట్టివాడు స్వల్పమైన అపచారము చేసినను లోకమంతయు వానివైపే చూచుచుండును. లోకోత్తరబుద్ధిమంతుడుగా ప్రఖ్యాతి వహించిన శుక్రుడు యయాతిని శపించుటకు బలవత్తరమైన కారణముండియుండవలెను. అదియెట్టి దనగా, దేవయానిని యయాతికి భార్యగానిచ్చి శర్మిష్ఠను వారికి దాసిగా నొసగెను. ఆసందర్భమున నాతఁడొక కట్టడి చేసెను. "దీనికిఁ బ్రియంబున నన్నపాన భూషణాచ్ఛాదన మాల్యానులేపనాదుల సంతోషంబు సేయునది. శయనవిషయంబునఁ బరిహరించునది అనునదియే యాతఁడు చేసిన విని మయము. కాని, యీనియమమును యయాతి చివరకు కొనసాగింపలేకపోయెను. పరిస్థితుల ప్రభావ మున శర్మిష్ఠను స్వీకరించి యామెను సంతానవతినిచేసెను. దీనికినలిగిన దేవయానితండ్రితో ఫిర్యాదు చేసినది. శుక్రుడాగ్రహించి యయాతిని శపించెను తానుఏర్పరచిన నియమమును పాటించని యయాతి నింద్యుడనియు తనకుమార్తెకు,అపకారముచేసినాడని భావించియే శుక్రుడు శపించెననియు కథలోవివరించబడినది. అనగా శుక్రుడుచేసినదానిని సమర్థించి చెప్పినట్లే యయ్యెనని యర్థము. నింద్యుడు శిక్షితుడగుటయే యిందలి పరమార్థము.

భారతవంశమున పూర్వులై ముఖ్యులైనవారిని గురించి చెప్పెడు సందర్భమున నీకథ వచ్చినది. యయాతి కుమారుడగు పూరుడు భరతవంశజులలో ప్రముఖమైనవాడు. అతని జన్మ వృత్తాంత మిందు గలదు. యయాతి సుక్షత్రియుడు. దేవయాని బ్రాహ్మణకన్య. న్యాయము నకు వీరిద్దరికిని కలిగిన కుమారుడు యయాతి రాజ్యమునకు వారసుడు కావలెను. కాని వారికాయోగ్యతలేదు దేవయాని క్షత్రియకన్య కాకపోవుట వారి అయోగ్యతకు నొక కారణము దేవయాని కుమారులైన యదుతుర్వసుద్రుహ్యానులు స్వయముగా త్యాగబుద్ధిలేనివారు తండ్రి తన జరాభారమును గ్రహించి తమ యౌవనము నీయమని కోరగా "తగిలి జరయు రుజయు దైవవశం బున-నయ్యేనేని వానిననుభవింత్రు-గాక యెఱిఁగియెఱిఁగి కడఁగి యారెంటిఁ జేకొందురయ్య యెట్టి కుమతులైన(1-8-198)అదితండ్రికోరికను నిరాకరించినవారు. తండ్రి వారిని రాజ్యమునకు ననర్హులుగా నిర్ణయించెను. ఇక శర్మిష్ఠకుమారుడు పూరుడు అన్నివిధములయోగ్యుడు రాజవంశమునందు జన్మిం చిన శర్మిష్ఠకుమారు డగుటకూడ యితని యోగ్యతలనునొకటి ఇతడు పితృభక్తిపరాయణుడు తండ్రి యగు యయాతి జరాభారమును గ్రహించి, తనయౌవనమును నాతనికిచ్చిన త్యాగశీలుఁడు. ఇట్టివని

చేసి తండ్రియనుగ్రహమును, అతనిరాజ్యమును సంపాదించి వానికి అర్హుడనిపించుకొన్నట్టివాడు. ఇట్టియోగ్యతలు కలవాడు భారతవంశపూర్వులలో ముఖ్యుడగుట యెంతయో సముచితముగానున్నది.

జనమేజయుడు స్వయముగా భరతవంశజుడు. అతనికి తనపూర్వులైన వీరుల కథలు వినుటయం దాసక్తిమెండు. అందుచేతనే "అస్మద్వంశకరుండైన యయాతిచరితంబు వినవలతుంజెప్పుమని" వైశంపాయనుని ప్రార్థించినాడు. దానికనుగుణముగనే యీకథవర్ణితమైనది. చాళుక్యరాజరాజ నరేంద్రుడు-

హిమకరుదొట్టి పూరుభరతేశ కురుప్రభుపాండుభూపతుల్
క్రమమున వంశకర్తలనఁగా మహినొప్పిన యస్మదీయ వం
శమునఁ బ్రసిద్ధులై విమలసద్గుణశోభితులైనపాండవో
త్తముల చరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్ట మెప్పుడున్. (1-1-14)

అని నన్నయభట్టుతో విన్నవించుకొనుట యిట్టిదే. ఎవరైనను పుణ్యశ్లోకుని కథవినుట కుత్సహింతురుకదా। యయాతిచరిత్రము నీసందర్భమున పొందుపరచుటలో నీప్రయోజనములన్నియు సమకూడినవి.

ఒకకథ చిన్నదిగాని, పెద్దదిగాని యున్నప్పుడు, అందు కొన్నిపాత్రలు,వానిమనఃప్రవృత్తులు ఉండకపోవు. కథలోని యీపాత్రలు, వాని ప్రవర్తనలు, వివిధసంఘటనలును రసోత్పత్తికి కారణమగుచుండును. యయాతి చరిత్రమునగల పాత్రము లెట్టివి? వాని చిత్తవృత్తు లెట్టివి యను సంశమును యిప్పుడు పరిశీలింపవలెను.

ఈ కథలో ముఖ్యమైన పాత్రములివి. దేవయాని, కచుడు, శర్మిష్ఠ, యయాతి, శుక్రుడు. వీరి చుట్టు కథ పరిభ్రమణము చేయును. అంతమున పూరుడు ప్రవేశించును. కాని వాని భాగము కథలో స్వల్పము. తన త్యాగగుణమును ప్రదర్శించి రాజ్యార్హతను సంపాదించుకొను నంతవరకే పైన పేర్కొనిన వారిలో దేవయాని కథలో ప్రముఖస్థానము నాక్రమించుచున్నది. ఈమెకు కచుని దర్శించిన నాటినుండి యాతనిపై ననురాగము కలిగినది. అతడాలస్యముగా ఇంటికి తిరిగివచ్చినచో నాతనికై పరితపించును. ఈ అనురాగమునకు కారణము కచుని వినయశీలత, గురుభక్తి కావచ్చును. కాని యీ అనురాగము ఏకపక్షమేయైనట్లు కాన్పించును. కచుని ధ్యేయము దేవకార్యమును సాధించుటయే. ఒకవేళ దేవయానితో నాతడు స్నేహముగా నున్నను తన కార్యమును నిర్వర్తించుకొనునంతవరకుసు మాత్రమే. అందుచేతనే 'గురుతనూజను గొలిచి'నాడు, కాని యామెను ప్రేమించలేదు. చివరకు పనిసాధించుకొనిన తరువాత కచుడు వెడలిపోవు సమయ మాసన్నమైనది. దేవయాని తనమనస్సునందలి కోరికను వెల్లడించినది. కాని కచున కీదృష్టియే లేదుకదా. "లోకనింద్యమగు నర్థము నీవాక్కునఁ దెచ్చుటుచితమె"(1-3-180)యని వారించినాడు, దేవయానిశపించినది. అయినను నాతడు చలించలేదు. వెడలిపోయినాడు. ఇచట దేవయాని విచిత్రముగా ప్రవర్తించినది. మొదట నామెకు నతనిపైగల యనురాగము మాత్రమే మనకు తెలియును. కాని నిరాకృతయగుటతో నామె మనస్తత్వమున మార్పు సంభవించినది. అసూయతో నాతని శపించినది. అసూయ కలుగనే

కూడదు. కలిగినచో అది నిరంతరము అధికమగుచునే యుండును ఇది ముందు కథలో దేవయానిలో చూడగలుగుదుము.

ఒక స్వల్పమైన విషయమున పరిధానములు మార్పు చెందినపుడు దేవయాని శర్మిష్ఠతో కలహించి నూత ద్రోసి వేయబడి యవమానమునకు పాలైనది. ఇది యామెకు కలిగిన రెండవ భంగపాటు. యయాతి యామెను ఉద్ధరించినను మత్సరగ్రస్తమైన మనముతో నామె ప్రతీకారమును పూనుకొన్నది శర్మిష్ఠను కన్యకాసహస్రముతో తనకు దాసిగా జేసికొన్ననే కాని యామెకు ప్రతీకార వాంఛ తీరలేదు. తరువాత యయాతి మహారాజును తనకు పతిగా నిర్ణయించుకొని తండ్రి యనుమతిచే నాతని వివాహమాడినది. అయినను ఆమె మనస్సున ప్రవేశించిన మాత్సర్యము తొలగిపోనేలేదు. శర్మిష్ఠకు శయనవిషయమున బహిష్కారము విధింపజేసినది కాని యీనిర్ణయము సరిగా నడువలేమ యయాతివలన శర్మిష్ఠ సంతానవతి యైనదని తెలియుటలో నామె మనస్సునందలి మాత్సర్యమునకు అంతమే లేకపోయినది. తండ్రితో తన పతి నేరమును నివేదించినది తత్పరిణామముగా యయాతికి అసమయ జరాభారము సంప్రాప్తమయ్యెను అతనికి ఇట్టి యవస్థ కలుగుట నిజమునకు దేవయానికే యాఘాతము. కాని మత్సరగ్రస్తమగు బుద్ధిగల దేవయాని కింతటి విచక్షణాజ్ఞాన మెచ్చటిది ? ఆమె దానిని పూర్తిగా కోల్పోయినదన్నమాటే. ఈ విషయ మింతటితో నాగలేదు. ఇట్టి వక్రబుద్ధిగలవానికి సంతాన మెంతటియోగ్యత కలిగినట్టిది యను పరీక్షకూడ వచ్చినది. ఈమె కుమారు లాపరీక్షకు నిలువలేకపోయిరి. రాజ్యార్హతను కోల్పోయిరి. అయోగ్యులుగా నిర్ణయింపబడిరి ఇట్లు దేవయానిపాత్ర ఉదాత్తతను కోల్పోయెను.

కచుడు ఈ కథయందు ఒకవిధముగా విషాదాంతనాయకుడు మిక్కిలి యోగ్యుడు. దేవకార్యనిర్వహణభారసమర్థుడు. సుకుమారత్వమును, వినయప్రియవచన మృదుమధురత్వంబును, అనవరత నియమవ్రత ప్రకాశిత ప్రశాంతత్వంబును గలవాడు. అందుచేత నిష్ఠతో 'గురుని గురుతనూజఁ గొలిచి యయ్యిరువుర నెమ్మి వడసెఁ దనదు నేర్పు పేర్మి'. ఈతని మంచితనమును రాక్షసులు సహించలేదు. హానిచేయదొడగిరి. ఎటులో గురుపు రక్షించుచుండెను. చివరకు వారీతని కాల్చి భస్మముచేసి సురయందు కలిపి శుక్రాచార్యునకు త్రాగించిరి. ఇట్లీతడు గురుగర్భమున చేరెను. అచటినుండియే మృతసంజీవనీవిద్యను పొందినాడు. దాని ప్రభావముచేతనే గురుని పునర్జీవితుని చేసినాడు. ఇంతటితో దేవకార్యప్రయోజనము ముగిసినది. గురునాజ్ఞ పొంది స్వస్థానమునకు బయలుదేరినాడు. అప్పుడు దేవయాని తన మనస్సునందలి కోరిక వెల్లడించినది నిజమునకు కచున కాదృష్టియె లేదు. ఆవిషయమును వెల్లడించి, గురుపుత్రికను వలచుట ధర్మముకాదని పలికినాడు. దేవయాని యాగ్రహముచే శపించినది. కాని యీ శాపమునకు తగినంత కారణము లేదు అందుచేతనే ధర్మపథంబు తప్పనివాడగు కచుడు ఆమెకు ప్రతిశాపమిచ్చినాడు ఇటులైనను, మృతసంజీవనీ ప్రభావమునకు భంగము కలుగలేదు. కచుడు దేవలోకమునకు వెడలెను మొత్తముమీద కచున కుత్తమగుణములన్నియు నున్నవి ఆ గుణములే యతని కార్యసాధనకు తద్వార దేవకార్యసాధనకు ఉపయోగించినవి. దేవతలు, తాను కృతార్థులైరి.

యయాతి యీకథయందు (నిజమున కిది యాతనిచరిత్రయే) ద్వితీయ నాయకుడు. క్షత్రియోచితమైన గుణము లన్నియు గలవాడు. జలధి విలోలవీచి విలసత్కులకాంచి సమంచితా

వసీవహన సమర్థుడు. నూతబడిన దేవయానిని ఒకానొక సందర్భమున పైకి దిగిచినాడు కాని యామెయం దాతనికి నెట్టిభావమును కలిగినట్లు కాన్పించదు మరియొకసారి పుష్పాపచయముచేయు దేవయానిని చూచి యామె నభ్యర్చితుడైనాడు ఇచటకూడ నాతడు దేవయానిచే నాకర్షితుడు కాలేదు. కాని 'యతిశయరూపలావణ్య గుణసుందరి యయిన శర్మిష్ఠ' నెఱుంగ వేడినాడు. దేవయాని యామెనుగుఱించి చెప్పుటయేకాక-

"నన్నువివాహమై నహుషనందన యీలలితాంగిఁదొట్టి యీ
కన్నియ లందఱున్ దివిజకన్యలతోనెనయైనవారు నీ
కున్నతిఁ బ్రీతిసేయగ నృపోత్తమ వాసవుఁబోలిలీలతో
నిన్నరలోక భోగములనేకము లందుము నాపుడున్" (1-8-181)

అని ప్రార్థించినది. కాని యయాతి యింకను నామెపై ననురక్తుడైనట్లులేదు, వర్ణాశ్రమధర్మ భంగమగునని యీ వివాహము తగదని పలికినాడు కాని దేవయాని శుక్రునిచే చెప్పించి యొడంబడజేసినది. మొత్తముమీద నీవివాహము యయాతి కోరి చేసికొన్నదికాదు. దేవయాని ప్రోత్సాహమే దీనికి కారణమైనది. ఇక శర్మిష్ఠపై నాతనికి ప్రథమమునుండియు ననురాగదృష్టియే కలదు. కాని దాని 'శయన విషయమున పరిహరించు' నియమమున్నది. కాని, యొక సందర్భమున తన్నేలుకొమ్మని శర్మిష్ఠ ప్రార్థించెను. మొదట కాదన్నను, తరువాత నామె కోర్కెను ఆతడు మన్నించినాడు. స్వయముగా నాతనికి శర్మిష్ఠపైగల యనురాగమేమి మానవ సహజమగు దౌర్బల్యమేమి యాతని నీపనికి ప్రోత్సహించినది. దీని పరిణామముగా శుక్రునివలన శప్తుడై జరాభారపీడితుడైనాడు. ఈ శాపమున, ఆతని యపచారము కన్న, దేవయాని గర్వము మాత్సర్యమే అధికకారణములైనవి కాని శర్మిష్ఠవలన తనకు కలిగిన కుమారుడగు పూరుని సహాయమున నీసంకటము గడచిపోయినది యయాతి అనేకవత్సరములు ప్రజారంజకముగా రాజ్యముపాలించి చివరన వానప్రస్థుడయ్యెను.

ఈకథయందు శర్మిష్ఠ పాత్రకూడ సముచిత స్థానమునే ఆక్రమించుచున్నది. ఆమె చరిత్రయందు మనకెచ్చటను కళంకము కాన్పించదు. ఒకే సందర్భమున నామె రాక్షసగురుపుత్రికతో పరుషముగా నిట్లు మాటలాడినది.

"మాయయ్యకుఁ బాయక పని
సేయుచు దీవించి ప్రియము సప్పుచు నుండున్
మీయయ్య వెండి మహిమలు
నాయొద్దన పలుక నీకు నానయు లేదే?" (1-8-187)

నిజమునకిది యపరాధమేయైనచో దానికి అధికతరమైన శిక్షనే తాననుభవించినది. ఎటులైననేమి ఉత్తమశీలముకలిగిన సంతానమును యయాతివలన పొందగలిగినది.కాని దేవయాని యనినను, ఆమె కఠినస్వభావ మనినను శర్మిష్ఠకు చాలభయము. ఒకసారి దేవయాని యామెకు కుమారులెట్లు కలిగిరని ప్రశ్నించినది. తన సంతానమున కామె హానిచేయునని కాబోలు,

చేయవలెను. ఇట్టి శక్తియు, అభిప్రాయమును నన్నయకుండుటచే, యీ చిన్నకథయగు యయాతి చరిత్రయందుగూడా కొన్నిలక్షణములు కాన్పించుచున్నవి. ముఖ్యమైనవానిని వివరింతును.

భారతరచనమునకు ప్రోత్సాహమిచ్చిన రాజరాజనరేంద్రునకు రచించిన నన్నయకు వైదిక మహత్మ్యముపై గౌరవముకలదు. మహాభారతమునకు పంచమవేదమని పేరుండుటచే దానియందు వేదమహాత్వమును చెప్పెడి యంశము లచ్చటచ్చట వచ్చుచునేయుండును. అవకాశముకలిగినప్పుడు నన్నయ తెలుగులోనికి ఆ భావములను అనువదించును. కవితా నాతనికిగల స్వభావమిది. ఒక సందర్భమున అష్టకాదులు, లోకధర్మములను తమకు చెప్పుమని యయాతిని ప్రార్థింతురు. అప్పుడు యయాతి తాను రాజుగానున్నప్పుడు అనుభవముచే సంపాదించిన ధర్మములను వివరించును. ఆ సందర్భముననే-

"వేదవిహితవిధుల నాచరించుట యూర్ధ్వ
గతికిఁ దెరువువిధులఁ గడచియెందు
నేఁగఁబడినవాని నోఁగఁ జేయుట
యధమగతికి మార్గమనిరి బుధులు" (1-9-220)

అని వేదవిహితవిధుల మహత్వమును వక్కాణించి చెప్పును అట్లే -

"గురుశుశ్రూష సేయుచు నిత్యాధ్యయనాగ్నికార్యంబులయం దప్రమత్తులయి శమదమశౌచముల దాల్చి యవిప్లుత బ్రహ్మచర్యులయిన బ్రహ్మచారులును దాపంబునకుఁ బరోపతాపంబునకు వెఱచి ధర్మార్జితంబైన విత్తంబున నతిథులం బూజించుచు, యజ్ఞంబులు సేయుచు. ." నున్నవారు యుక్తాచార్యులని యుపదేశించును ఈ అంశములన్నియు వేదమహత్వమునే సూచించును కదా

కావ్యమున వర్ణనము ప్రధానాంగములలో నొకటి సందర్భమునకు తగినట్లుగా వర్ణనలు చేయుట ఉత్తమకవిలక్షణము. అది ఋతువర్ణనము కావచ్చును లేక మఱియొకటికావచ్చును. కథలో నిమిడిపోవునట్లుగను, స్పష్టముగా నుండునట్లుగను వర్ణనములు చేయుట నన్నయస్వభావము ఈకథ లో కూడ నట్టివర్ణనములు కాన్పించుచున్నవి. హోమధేనువులను కాచుటకు వెళ్లిన కచుడు ప్రతి దినము సూర్యాస్తమయసమయము వరకు తిరిగియింటికి వచ్చెడివాడు కాని యానాడుమాత్రము రాలేదు. దానికి దేవయాని దనమనంబున మలమల మఱుంగుచుంటోయి తండ్రికిట్లనియె;

"వేఁడిమయూఖుముల్ గలుగువాఁ డపరాంబుధిఁ గ్రుంగె ధేనువుల్
నేఁడిటువచ్చె నీవతను నిష్టమె యిన్ భవదగ్నిహోత్రముల్
పోఁడిగ వేల్వఁగాఁ బడియెఁ బ్రొద్దును బోయెఁ గచుండు నేనియున్
రాఁడు వనంబులోన మృగరాక్షసపన్నగబాధ నొందెనో" (1-8-112)

ఈపద్యమున సూర్యాస్తమయము వర్ణితమైనది. ఆసమయమున సామాన్యముగా జరుగుచున్న కార్యకలాపములు చెప్పబడినవి కాని దీనికి కచుఁ డింటికిరాకపోవుటకు సంబంధమున్నది సాయంత్ర మగుటతో చీకటి యావరించును. అట్టి నిశా సమయమున మృగరాక్షస పన్నగులు విజృంభింతురు.

కచునకు వారివలన బాధకలిగినదేమో యని దేవయాని విచారము ఈపద్యమున సాయంకాలమునకు గలగుర్తులను వివరించుట కచుని యాగమనములేకపోవుట, అను రెండువిషయములు చాలచక్కగా వివరింపబడినవి. ఆంధ్రమహాభారతమునందేకాదు,ఆంధ్రసాహిత్యముననే ప్రకృతివర్ణనకు పునాదివేసిన పద్యములలో నిదియొకటి అందలి ప్రకృతివలెనే యిదియు నిసర్గరమణీయము. ప్రబంధకవులవలె నష్టాదశవర్ణనల నీకవి చేయకపోయినను, స్త్రీవర్ణనము, పుష్పాపచయవర్ణనము కూడా నిందు జేసి యున్నాడు.

కావ్యమునకుగల ప్రధానాశయములలో నీతిబోధయొకటి కావ్యము విశ్వశ్రేయస్సునకై దోహదము చేయవలయునని దృఢముగా భావించిన కవులలో నన్నయయొకడు. ఆదృష్టితోడనే సందర్భమును పురస్కరించుకొని కావ్యమున నీతిని ఈతడు ప్రవేశపెట్టుచుండును. నీతిబోధ కేవలము ప్రధానకథకే సీమితము కాలేదు. ఉపకథలలో కూడ వానికి సముచితస్థానము కలదు. ఇది చూడ దగినది.

"గురులకు శిష్యులు పుత్రులు
పరమార్థము లోకధర్మపథ మిది దీనిం
బరికింపక యీపలుకులు
తరుణీ గురుపుత్రి నీకుఁ దగునే పలుకన్?" (1—8—181)

దేవయాని కచుని ప్రియుడుగా భావించి, తన యభిప్రాయమును నాతనితో తెలిపినప్పుడు, బృహస్పతి కుమారుడు పలికినమాటలివి. శిష్యులు గురువులకు కుమారులవంటివారు. అందుచేత గురుపుత్రియగు దేవయాని తనకు సోదరివంటిది ఇది లోకధర్మము. దీనికి భిన్నముగా ప్రవర్తించుట అధర్మమగును. ఈవిషయమును కథాపరముగాను, సామాన్యలోకధర్మముగాను కచుని నోట పలికించినాడు కవి

''అనుపమ నియమాన్వితులై
యనూనదక్షిణలఁ గ్రతుసహస్రంబులు సే
సినవారికంటె నక్రో
ధనుఁడ గరం బధికుఁ డండ్రు తత్త్వవిధిజ్ఞుల్'' (1—8—146)

'కోప ఘూర్ణిత బాష్పపూరితనయనయై యున్న'' దేవయానితో శుక్రుఁడు పలికిన మాటలివి. ఎన్ని నియమములు పాటించిననేమి? ఎన్నియజ్ఞములు చేసిననేమి, క్రోధము కలిగినచో వానికి ఫలము లేదు.అక్రోధనుఁడే,నియమాదికములు పాటించినవానికన్న నధికుడు.అనికుమార్తెకు తండ్రి హితబోధ కావించినాఁడు. కాని, స్వాభావికముగా క్రోధముకలిగిన దేవయాని తండ్రిమాట చెవిబెట్టలేదు. మహారాజుగానున్న యయాతిని వివాహము చేసుకొన్నను సౌఖ్యమును పొందలేకపోయినది. తనకుమారులకు రాజ్యపదవి చేకూర్చలేకపోయినది. ఆమె తండ్రిమాటలను విని క్రోధమును విడిచినచో నిట్టిదురవస్థ కలిగియుండెడిదికాదను పరమార్థమును ప్రతిపాదించుటయే కవిసంకల్పముగా నున్నది ఇట్టినీతులు ధర్మములు భారతమున ప్రధానకథయందును, ఉపాఖ్యానములందును, అనేక సందర్భములలో కలవు. యయాతిపూరునకు బోధించిననీతి (ఆది-8-208నుండి206వరకు) యిట్టిదే.

ఏకావ్యమునందైనను, అలంకారములు కావ్యములను శోభాహేతువులు. ఈవిషయమును నమగ్రముగా గుర్తించినవాడు నన్నయ. యయాతిచరిత్ర యను నీ యుపాఖ్యానమున నమయోచితముగా కవి యలంకారప్రయోగము చేసియున్నాడు అన్నిటిని గురించి వివరించుట. సాధ్యముకాదు కాబట్టి ఒకటిమాత్రము పరిశీలింతును.

'అసదృశ యౌవనంబిది' (ఆది- 3-170) అని శర్మిష్ఠ నోటినుండి వెలువడిన పద్యమున దృష్టాంతాలంకారమున్నది స్త్రీకి యౌవనము కలుగుట, వనమున కలిగిన కుసుమసముద్గమము వంటిది ఇతరులు పూవుల సౌభాగ్యము ను జూచి యానందించినప్పుడే వాని వికాసము సార్థకమగును అట్లే పతిలభించినప్పుడే స్త్రీకికలిగిన యౌవనము ప్రయోజనమును పొందును.ఒకవేళ కుసుమసముద్గమమున దుర్గమ వల్లరులచేత, అగోచరత్వము సంప్రాప్తించినచో దాని సౌందర్యమంతయు వృథయగును. అటులే పతి లాభము లేమిచేసి అసదృశమైన యౌవనము నిష్ఫలమగును కదా. ఈ సుందరమైన భావమును దృష్టాంతాలంకార మూలమున నీపద్యమున నన్నయ నిక్షిప్తము చేసియున్నాడు. ఇది శ్లేషానుప్రాణితమగుట విశేషము

ఇట్లు ఈ యయాతి చరితము ఉపాఖ్యానమే యయ్యు, అనేక సుందర కావ్యలక్షణములచే భాసించుచున్నది

2 ఇప్పుడు రెండవ విభాగమునకుచెందిన యుపాఖ్యానముల గుర్చించి చెప్పవలసియున్నది. ఈ యుపాఖ్యానములు మహాభారతకథతో ప్రత్యక్షసంబంధము కలిగినట్టివికావు, అయినను వీనికి ముఖ్యకథతో పరోక్ష సంబంధముండును ప్రాయికముగా ముఖ్యకథలోని యొకపాత్రమువలన చెప్పబడుట జరుగును. లేదా, మరియెవరైన ముఖ్యకథలోని పాత్రలకు నిట్టి చిన్న కథలను వివరింతురు ఇది కథలోని సంఘటనను బట్టి జరుగుచుండును ఇట్లు చూడగా నీ విభాగమునకు చెందిన యుపాఖ్యానములు ప్రాముఖ్యమునందు గౌణములని చెప్పవలసియుండును. అయినప్పటికిని యివి ముఖ్యకథకు శోభాహేతువులుగా నున్నవని చెప్పటలో సందేహములేదు. ఈ విభాగము నందలి యుపకథలకు పంచేంద్రియోపాఖ్యానము అనునది ప్రతినిధి ప్రాయముగానున్నది. దానిని పరిశీలింతము.

పంచేంద్రియోపాఖ్యానము ఆదిపర్వము సప్తమాశ్వాసమునకలదు. భారతకథలో ద్రౌపదీస్వయంవరము తరువాత నీకథ వివరించనైనది ద్రౌపదిని, పాండవులకు స్వయంవరమున లభించిన దానిని కుంతీదేవి, తన కుమారులైదుగురును వివాహమాడవలెనని నిర్దేశించినది. కాని, లోకమున నిట్టివిషయము అపూర్వమును, విచిత్రమునునైనది. అందువలన ద్రుపదునకు తన కుమారుతైను ఐదుగురురికిచ్చి వివాహముచేయుట సమ్మతము కాలేదు. వివాహముచేయ ననుటకును సాధ్యము కాకయున్నది. పాండవులు అర్జునుని వలన ద్రౌపదిని స్వయంవరమున నంపాదించిరి, ఇట్లు కథలో నొక నమస్య యేర్పడినది. ఈ సమస్య నెట్లుపరిష్కరించవలెనో యెవరికిని తోచినది కాదు. అప్పుడు కృష్ణద్వైపాయనుడు సాక్షాత్కరించి, పంచేంద్రియోపాఖ్యానమును చెప్పను. దైవనియుక్తిని తెలియజేయును. అందలి రహస్యములను వివరించును. అప్పుడందరావివాహమునకు నంగీకరింతురు కథలోకలిగినచిక్కు విడిపోవును.

ఈ ఉపకథ నిజమునకు ద్రౌపది పూర్వజన్మ వృత్తాంతము వంటిది దానిని వ్యాసుని వంటిమహనీయుడు చెప్పెననే గాని దాని పరమార్థము బోధపడదు. అందుచేతనే కవి యీ కథను వ్యాసముఖమున పలికించినాడు ఆ కథ యిట్లుండును నాలాయనియైన యింద్రసేన మౌద్గల్యుడను మహామునిభార్య ఆమె పరమపతివ్రత. కర్మవశమున మౌద్గల్యుడు రోగపీడితుడై జరాభారబాధితుడయినను ఇంద్రసేన భక్తితో నాతనికి ఉపచారములుచేయుచుండెడిది ఆమె సేవానిరతికి, భక్తికి మెచ్చి, మౌద్గల్యు డామెకు కావలసిన వరములను ప్రసాదింతును కోరుకొమ్మనెను ఇంద్రసేన యిట్లనెను "మునీంద్రా, నాకుఁ గామోపభోగేచ్ఛ పెద్దఁ గలదు నీవును దపశ్శక్తిఁ గామరూపధరుండ వయి, యీబీభత్సం బగు రూపం బుడిగి మనోహరం బయిన యాకారంబునఁ బంచధావిముక్తుండయి, నన్నురమియింపు, కామభోగంబుల దనుపుము. ఆమె కోరిక ననుసరించి మౌద్గల్యుడు ఐదు దేహంబుల దాల్చి యనేకస్థానంబుల అనేక సహస్రవత్సరములు నాలాయనియైన యింద్రసేనతో విహరించెను చివరకు బ్రహ్మలోకము చేరెను ఇట్లింద్రసేన కోరిక నెరవేరినను, ఆమె కామభోగంబుల తృప్తిచెందలేదు మరుసటి జన్మమున కాశీరాజు దుహితగా జన్మించెను. బహుకాలము కన్యాత్వముననే కాలము గడిపి తన దౌర్భాగ్యమునకు చింతించి పతిని పొందుటకు శివునిగోరుచు ఘోరమైన తప మాచరించెను. ఆమె తపస్సుచేయుకాలమున యముడు, వాయువు, ఇంద్రుడు, అశ్వినులు, ప్రత్యేకముగావచ్చి, తమ సంతానమునకు నామె భార్య కావలయునని కోరిరి కఠిన తపశ్చర్య యనంతరము మహేశ్వరుడు సాక్షాత్కరించెను ఇంద్రసేన తనకుఁ బతిదానము సేయుమని యాతనిని యేనుమారులు ప్రార్థించెను ఈశ్వరుడు కరుణించి, దేహాంతరమున నీకైదుగురు పతులు లభింతురని వరమును ప్రసాదించెను ఆమె దానికి నాశ్చర్యము ప్రకటింపగా, ధర్మమునకు భంగము కలగదని చెప్పెను. అప్పు డామె 'అయ్యేవురు పతుల యందును ప్రత్యేక సంగమంబునను, కౌమారంబును, పతి శుశ్రూషా సిద్ధియుఁ గామ భోగేచ్ఛయు సౌభాగ్యంబును ప్రసాదించుమ"ని శివునిప్రార్థించి యాతనిచేత నావరములను పొందెను. గంగాతీరమున నున్న యింద్రుని తోడ్కొని రమ్మని శివు డామె నాదేశించెను. ఆమె గంగాతీరము చేరి ఇంద్రుని రాకకై ప్రతీక్షించుచుండెను

నైమిశారణ్యమున యముడు సత్రయాగము జేయుచు యజ్ఞదీక్షితుడై యుండి ప్రాణిహింసమాని యుండెను అందుచేత మానవులు మరణము లేక విచ్చలవిడిగా ప్రవర్తించుచుండిరి. దీనిని సహింపనోపక యింద్రాదిదేవతలు బ్రహ్మపాలికి జని, మరణము లేకపోవుటచే మానవులకును, దేవతలకును భేదము లేకపోయెనని వాపోయిరి బ్రహ్మ వారిని సమాశ్వాసించి యాగము ముగిసిన తరువాత, యముడు తిరిగి మానవుల నంత మొందించు ననియు,నాతని యాగఫలితముగా మహావీరులైన యైదుగురు జన్మింతురనియు చెప్పి పంపించెను. ఈవిషయములు విని ఇంద్రుడును, నాతని సహచరులును, గంగా నదీసమీపమున వెడలు చుండిరి. ఆనది నీటినడుమ నొక కన్యక రోదించు చుండెను. దానికన్నీరు కనక కమలంబులుగా మారుచుండెను. ఇదిచూచుచు విస్మయమునొందినయింద్రుం డామెను సమీపించి యామెను గుర్తించియు యామె దుఃఖించుటకు కారణమును గురించియు ప్రశ్నించెను. "నాదు రోదనంబు నన్ను నెఱుగంగ వలతయేని యమర వల్లభుండ నావిఖుండరమ్ము" అని పలుక వాసవు డామె ననుసరించి వెడలెను. అట్లు వెడలగా హిమవదచల కందరారచిత రత్నవేదికా

తలంబున సింహాసనాసీనుండయి వరుణరూపంబున నొక్క తరుణితో జూదంబాడుచున్న యాది దేవుంగని పరుషుండుగా వగచి సురపతి కోపించి "నేను శక్తిమంతుఁడనగు ఇంద్రుఁడను కదా, నా యెదుట నుత్తమసింహాసనమెక్కి జూదమాడుట నీకుతగునా" యనియ-క్షేపించెను. దానికి రుద్రుడు కోపించి, క్రీడాభంగము చేసిన ఇంద్రునిపట్టితెమ్మని యక్కన్యక నాజ్ఞాపించెను. ఆమె కరస్పర్శచే నింద్రుడునిశ్చలుడై భూమిపైబడెను "అపుడు రుద్రుఁ డిట్లుపలికెను గొప్పబలశాలివని గర్వించి పలికి తివికదా! నీభుజవీర్యము ప్రకాశిత మగునట్లుగా నీపర్వత వివరమును దెరువుము" హరి వచనాను సార మింద్రుడు హిమవద్గహ్వరమును తన బాహువులతో తెరిచెను. అతని కాశ్చర్యము కలుగు నట్లుగా నాగుహయందు తనస్వరూపములు కలిగిన మరి నలువురుండిరి నేనెందులకో ఐదు రూపములను ధరించితి నని యింద్రుఁ డద్భుతపరుచుండగా మీ రైదుగురును దేవహితార్థముగా భూలోకమున జన్మించుడని శివుడా దేశించెను వారే ధర్మానిల శక్రాశ్వినులు. తమకు నాధారం బుగా ధర్మజ భీమార్జున నకుల సహదేవులుగా జన్మించిరి. అయింద్రుల శేవురకును నేకపత్నిగా దీపంబు చేసి శ్రీమూర్తి యయిన యాజ్ఞసేని యజ్ఞవేదియందు జన్మించెను

పైన చెప్పినట్లు ద్రౌపదీపాండవుల వివాహసందర్భమున నేర్పడిన సమస్యను తొలగిం చుట కీకథ సాహాయ్యపడి ముఖ్యకథకు గొప్ప ప్రయోజనమును సాధించిపెట్టినది. అందుచేత, నీ కథ కేవలము కథను పెంచుటకు చెప్పబడినట్టిది కాదు భారత కథతోపరోక్ష సంబంధము కలిగి లోకవిరుద్ధముగా పంచభర్తృకయైన ద్రౌపది సచ్ఛీలమును నిరూపించుటకు తగినసామగ్రిని సమ కూర్చినది.

ఈ పంచేంద్రియోపాఖ్యానము అతిలోకవిషయమైన పూర్వజన్మచరిత్రను గురించి చెప్పనట్టి కథ. ఈకథలో నాయకుడనదగినవాడు మౌద్గల్యుడు. కాని,యీతడు నామమాత్రముననే నాయకుడు. ప్రాముఖ్య మంతయు నాయికకే అందుచేతనే మొదట నామె సచ్ఛీలము, భర్తకు నామె చేయు శుశ్రూష వర్ణింపబడినవి. తరువాత ఆమె తన భర్తను ఉత్తమ రూపము ధరించి, తనకు కామోపభోగముల సమకూర్పుమని ప్రార్థించినది అత డట్లే చేసినాడు. అయినను జీవిత మంతయు నామెకీ సౌఖ్యము కలుగనేలేదు అందుచేత మనుజ స్వభావసిద్ధ మగునట్లుగా నామె అసంతృప్తినే పొందినది మరునటి జన్మమున కూడ భర్తృసంయోగము కలుగలేదు. ఆమెకు వరమును ప్రసాదించిన శివుడు ఐదుగురు భర్తలను నియోగించెను కాని ఆ జన్మమునకు కానట్లే యున్నది ఈ యైదుగురు పాండవులుగా నామె యాజ్ఞసేనీరూపమును ధరించిన తరువాత లభించిరి. ఇట్లామె యనుభవించిన అసంతృప్తి, చేసిన తపఃఫలము ఈనాటికి నెరవేరినవి. పంచ భర్తృ సంయోగమున దోషమును రుద్రుడు నివారించుటచేత నామె పవిత్రశీలమునకు భంగము రాలేదు.

భారత రచనకుగల ప్రధానాశయము, దేవహితమును నిరూపించుట. ఈ ఉపాఖ్యానమున నదియు కొంత సూచితమైనది బాహుబలము కలవాడనని గర్వించిన యింద్రుని స్వరూపముల నైదింటిని, భూలోకమున జన్మించుమనియు, గీర్వాణహితము సేయుట కిట్లు చేయవలయు ననియు శివు డాదేశించెను ఇట్లా కథకు దేవహితము అను ప్రయోజనము కూడ సిద్ధించినది. క్షత్రియులుగా జన్మించినను తమ వీరోచితచర్యలచే దుష్టుల సంహరించు పాండవులు కేవలము మనుష్య

మాత్రులుకారు అతి మానుషశక్తి సంయుతులు, అను విషయమును కూడ నీకథ అంతర్గతముగా బోధించుచున్నది. ఈ విధముగా నీకథ ప్రసన్నమై 'నన్నయగారి ప్రసన్న కథాకలితార్థయుక్తికి' నిదర్శనముగా నున్నది. 'సతికి నొక్కరుండ పతిగాక యెందును బతులు పలుపురవులు కతల కలదె' అని కాశి రాజదుహితచేత పలికించుట యీ కవికిగల నానారుచిరార్థసూక్తి నిధిత్వము నకు ప్రతీక.

"అమిత స్థావరజంగమం బయిన బ్రహ్మాండంబు దానింతయున్
మమతాగోచర మీ త్రిలోకములు నన్మద్బాహువజ్రాను పా
ల్యము లే నింద్రుఁడ నిట్టి నన్ను నకలీలన్ జూదమాడంగ ను
త్తమ సింహాసన మెక్కి నీకుజనునే దర్పించి నాముందటన్" (1-7-279)

ఉత్తమ పదములు ఉత్తమ స్థానములందు కూర్చుట కవిత్వమునకుగల లక్షణములలో నొకటి యని పెద్దలు చెప్పుదురు. ఇంద్రుడసినోట పలికించిన యీ పద్యమున, ఆతని నిష్కారణగర్వము, ఆడంబరము, శబ్దములయొక్క అందమయిన పొందికచేత బహురమ్యముగా ప్రకటితమ యినవి. ఇట్టిమంచి పద్యములు ప్రధాన కథయందున్నను, ఉపాఖ్యానములందున్నను హృద్యము గానే భాసించును.

కేవల మీరువది నాలుగు గద్య పద్యములందున్న యీ యుపాఖ్యానము, ఇన్ని ఉత్తమ విశేష ములతో భాసించుచున్నది.

8 అరణ్య పర్వమునందలి ధర్మవ్యాధోపాఖ్యానము మూడవ విభాగమున చేర్చదగి యున్నది. ఈ యుపకథయందు, ప్రధానాంశము పతివ్రతామహాత్మ్యప్రతిపాదనము గౌణముగా అనేక ధర్మనీతి విశేషములు కథ నాధారముగా జేసికొని యుల్లేఖింపబడియున్నది కౌశికుడను బ్రాహ్మణుడు ఒక వృక్షచ్ఛాయను వేదాధ్యయనము చేసికొనుచుండగా, ఒక పక్షిపైనుండి రెట్ట వేయును. ఆతడు దానికికోపించి, దానివైపు చూడగా, నాతని క్రోధాగ్నికి యాహుతియై యది మర ణించెను. క్షణికమైన క్రోధముచే కౌశికు డట్లుచేసినను, అల్పజీవిని సంహరించినందులకు వగచి వికలమనస్కుడగును. తరువాత సమీపగ్రామంబున కరిగి యొకగృహిణియింటి ముందాగి భిక్షము వేడును ఆ గృహిణి పాత్రశోధనము చేయుచుండగా, నామెపతి యధిక క్షుధాతురుడై గృహమున కేతెంచును గృహిణి తన భర్తకు అన్నపాదులు సమకూర్చి, శయనాదికములు కల్పించి, యాతడు విశ్రమించుచుండగా కౌశికునకు భిక్షమిడుటకు వచ్చును. కౌశికుడుకోపముచే నామెను దూలనాడును. ఆమె తన భర్త యాకలితో వచ్చిన వృత్తాంతమును చెప్పి, భర్తకన్నను పరదైవము లేదనియు, నాతని పరిచర్య తరువాతనే యితరులు ఆదరణ చేయదగుదు రనియు వక్కాణించును క్రోధము మంచిదికాదనియు. ఆతని క్రోధాగ్నికి యాహుతి యగుటకు తాను కొక్కెరవంటిదానిని కాదనియు తనపాతివ్రత్య మహాత్మ్యముచేతనే, తనకు కొక్కెరవృత్తాంతము తెలిసినదనియు వివరించును ధర్మ వ్యాధుడను కిరాతకుడుమిథిలానగరమున గలడనియు నాతడనేక ధర్మములను వివరించి చెప్పుననియు పలికి యాతని నటకు వెడలుట కాదేశించును. కౌశికుడు ధర్మవ్యాధుని చూచుటకు వెడలును. అచట మిథిలానగరమున ధర్మవ్యాధుడు సూనాపణమున మాంసవిక్రయము చేయుచుండెను.

ఆసమీపమునకు చేరనొల్లక కౌశికుడు దూరముగా నిలుచుండును ధర్మవ్యాధు డిది గుర్తెతిగి బ్రాహ్మణ గృహిణి యాదేశమున పచ్చితివా యని ప్రశ్నించి, యతని తన గృహమునకు తోడ్కొనిపోయి యతిథి మర్యాద లాచరించెను ఈ ధర్మవ్యాధుడు ధర్మశాస్త్రాది విద్యలకు నిధివంటివాడు అందు చేత ననేకధర్మములను కౌశికునకు బోధించును చివరకు ప్రత్యక్షదైవములవంటి వారగు తన తల్లిదండ్రులను చూపించును. వారికి తనపైగలవాత్సల్యమును, తనకు వారిపైగలభక్తిని వివరించును.

వారు కౌశికుని చూచి సంతోషింతురు. ధర్మవ్యాధునికిగల అనంతవిజ్ఞాననిరతికి, పితృభక్తికి కౌశిక డాశ్చర్యపడుచుండగా, నాకిరాతుడు తన పూర్వజన్మవృత్తాంతమునుచెప్పి యాతని సందేహ నివృత్తి చేయును.

మహాభారతమున నీకథ యెట్టి సందర్భమునందు చెప్పబడియున్నది, అను అంశము ను వివరించవలెను. వనవాసము చేయుచు, నియతుడై యున్న యుధిష్ఠిరుడు మార్కండేయమహర్షివలన అనేక ధర్మసూక్ష్మములను తెలిసికొనుచుండును అట్టిసమయమున నాత డిట్లనెను. "పతివ్రతలైన వారిచరిత మత్యంత ధర్మసూక్ష్మంబుఁ గగము - దుష్కరముగాదె తలఁప నిర్ధూత దురిత-యట్లుగా గావున విన వేడ్కయయ్యె జెప్ప-వయ్య పుణ్యానతీ ప్రభావంబునాకు,"(౮-౬-౮) 'మఱియు తల్లిదండ్రు లిరుపురియందును బుత్త్రనిమిత్తంబైన యాయాసం బెవ్వరికెక్కుడు? వారలయెడ బుత్త్రిందెట్టివాఁడు గావలయు? హీనయోనిజాతుండైన పురుషుండేమి తెలంగునడవడిం బరమధార్మిక లోకంబులు పడయు? నవియును వివరింప నీవ యర్హుండవనిన అమ్మహాముని(౮-౬-4) యాతని కీకథ వినిపించెను అనగా పుణ్యవతీ ప్రభావముతో బాటు, పితృభక్తి తత్పరత మొదలైన వృత్తాంతము లీకథలో నుండవలెను నిజమున కిందవి యన్నియు నున్నవి.

ఈ చిన్నకథ, ప్రధానముగా ముగ్గురు వ్యక్తులకు సంబంధించినది. వీరిచిత్తవృత్తులు మనస్తత్త్వములు ఈ కథకు ప్రాణసదృశముగానున్నవి. ఈముగ్గురిలో మొదట చెప్పదగినవాడు కౌశికుడు. ఇతడు ధర్మతపశ్శీలుడును, సంతతాధ్యయనపరుండును నగుటచేత శక్తిసమన్వితుడు. కాని వయస్సున చిన్నవాఁడగుటచే కొంత కోపస్వభావము కలవాడు. పక్షి తనపై రెట్టవేసినదని కోపించి, దానిని మృత్యువు వాత బడవేసెను. గృహిణి తనకు భిక్షము వేయుట కాలస్యము చేసినదని యామె పైకూడ కోపించెను అయినను కౌశికుడు తనతప్పును తెలిసికొనలేని మూర్ఖుడుకాడు. పక్షిపై రనలి నందులకును, పతివ్రతపై కోపించినందులకును పశ్చాత్తప్తుడయినాడు చివరకు తాను తల్లిదండ్రులను నిర్లక్ష్యము చేసిన దానికిని, విచారించి తనప్రవర్తనను మార్చుకొనుటకే నిశ్చయించుకొనెను. ఇట్లి కౌశికుని పాత్రము మానవ సహజమైన స్వభావమునే వ్యక్తీకరించుచున్నది. ఇట్టిపాత్ర కథకు నౌచిత్యమును సమకూర్చి, కథను రమ్యముగా చేసిన దనుటలో సందేహములేదు.

బ్రాహ్మణగృహిణి యీకథలోని రెండవవ్యక్తి. ఈమెపేరేమియో తెలియదు. కౌశికునకు తన శక్తి యున్నట్లుగనే, యీమెకు పతివ్రతాశక్తి కలదు. కాని, కౌశికునిలో కాన్పించుకోప మీమెలో లేదు. అందుచే నాపాత్రకంటె కొంచ ముత్కృష్టమైన పాత్రమీమెది ఈమె తనభర్తనే దైవ

ముగా భావించి, యాతనికి పరిచర్యచేయు విశ్వాసము కలిగినట్టిది. భిక్షుకుడుగా నేతెంచిన బ్రాహ్మణుడైన కౌశికునికూడ కొంతకాలము వేచియుండ జేసినది. అతడు కోపించుచుండగా "క్రోధమోహ నామకులైన ఘోరశత్రు- లిరువు రెరియించుచుందురు రెపుడు నంత-రంగ మయ్యుభయంబు నడంగకున్న(- గలదె యూరక బ్రాహ్మణ్యగౌరవంబు" (3-5-20) అని యాతనికి బుద్ధిచెప్పినది. "నీకోపంబున నొక్క-కొక్కెర నిహతంబయ్యెగాదె యిది మదీయ పాతివ్రత్య మహిమం జేసి కాంచితి" నని (3-5-22) వక్కాణించినది. కౌశికునకు సన్మార్గోపదేశము గావించినది ధర్మవ్యాధుని కనుగొనుమని మాదేశించి యాతనికి జ్ఞానోదయము గావించినది. ఇట్టిపాత్రము ప్రయోజనవంత మగుటయు, చదువరులకు పతివ్రతామహిమము విశదమగుటయు సంభవించనది.

కథాక్రమమున ధర్మవ్యాధుడు చివరివాడైనను కథయం దీతనిపాత్రము ముఖ్యమైనట్టిదనుటలో సందేహములేదు. ఇతడుజ్ఞాని. పరమధర్మనిరతుడు. పితృభక్తికలవాడు ధర్మాచరణమునందును, సత్యశీలమునందును అణుమాత్రమైన కళంకములేనివాడు. జాతిచే నంత్యజుడయినప్పటికి జ్ఞానాదికములచే నున్నతుడు. అందువలన లోకోత్తరమైన శీలముకలవాడుగా చెప్పవలసినవాడు. కథయం దీతని ముఖముననే కవి యనేకధర్మముల నుపన్యసింప జేసినాడు.

ఇట్టిమూడుపాత్రములు మూడుభిన్నస్వభావములను కలిగినట్టివి. ఇట్టి భిన్నస్వభావులు కలిసికొనుట వారిలోవారికి కలిగిన భావసంఘర్షణయే కథకు ఆయువుపట్టై, చదువరులచేత ఆసాంతము చదివించుటకు నాధారభూతమగుచున్నది.

కథలో ఉత్సుకతనుసృష్టించి, కథాపఠనమునకు కుతూహలమును కలుగజేయుట మంచి కథకులు చేయుపనులలోనొకటి. దీనినే యాంగ్లభాషయందు Suspense అని వ్యవహరింతురు. ధర్మవ్యాధునికి సంబంధించిన యీ చిన్నకథలో నీగుణము బహుళముగానున్నది. కథలో మూడునాలుగుచోట్ల ఆశ్చర్యకరమగు సంఘటనలు కలుగుటయు, చివరివరకు పాఠకుని నవి లాగికొనిపోవుటయు సంభవించును కథలోని యీ లక్షణమును పరికింతము.

కౌశికుడు ఒకనాడు "గ్రామసమీపము నందొక్క- వృక్షమూలంబున నాసీనుండై వేదంబులు గుణియించుచుండ దదీయశాఖాగతంబైన యొక్క- కొక్కెర యాతనిపై రెట్టవెట్టిన నమ్మహాద్విజుం డలిగిచూచుటయు నది యప్పుడ నిశ్చేతనంబై నేలంబడినది (3-5-7). దీనిలో బ్రాహ్మణుడు, వృక్షచ్ఛాయతో గూర్చుండి వేదాధ్యనముచేయుటలోగాని, చెట్టుపైనున్న కొక్కెర రెట్టవేయుటలోగాని విచిత్రవిషయమేమియు కాన్పించదు. ఇది సహజమే కాని కౌశికుడలిగి చూచినతోడనే కొక్కెర నిశ్చేతనంబై నేలబడుట చదువరుల కాశ్చర్యము కలిగించును. కౌశికు డింతటి తపఃప్రభావము కలవాడాయని విస్మయము నొందించును కాని, యీ ఘట్టము మనస్సున కాహ్లాదమును కలిగించదు. మనకేకాదు, కౌశికుడు స్వయముగా పశ్చాత్తాపమును పొందెను. "అక్కట నాహృదయము గదు- నక్కటికములేనిదయ్యె ననిమిత్తమ యీ- కొక్కెర నిటు సేసితి"(3-5-8)నని వికలమనస్కుడైనాడు ఇట్టిశక్తికలిగిపశ్చాత్తాపమను మంచిగుణమునైతము గల కౌశికు డింకేమి చేయనున్నాడో యను నుత్సుకత పాఠకున కిచ్చుట తప్పక కలుగును.

భిక్షమునుకోరి వచ్చిన కౌశికునిగాక, తన భర్తను సమాదరణచేసినది బ్రాహ్మణగృహిణి కౌశికుడు కోపించినాడు. ఆమెను కూడ శపించునేమోయని మనకనిపించును. కాని, పతిహితమును గోరుటలోని మహాత్మ్యమునామె యుగ్గడించుటతో కొంతశాంతినివహించెను అంతటితో నాగలేదు. గృహిణి "నీవతి క్రోధనుండవగుట నెఱుంగుదు, నీకోపంబున నొక్క కొక్కెర నిహతంబయ్యెగాదె?"(3-5-22) యని పలికినది. ఈమాటలు కౌశికునేకాదు, మననుకూడ నాశ్చర్యమున ముంచివేయును. ఇది యొక యద్భుతవిషయముకదా! ఎక్కడనో యడవిలోజరిగిన సంఘటన మీమెకెట్లు తెలిసినదని కౌశికునితోబాటు మనమును వితర్కించుకొందుము. కాని కవి దీనికి సమాధాన మా గృహిణిచేతనే చెప్పించెను. 'మదీయపాతివ్రత్యమహిమంజేసి కాంచితి'(3-5-22)నని యామెచెప్పుట వలన పాతివ్రత్యమహిమ యింతటిదికదా యను విస్మయము కలుగకపోదు.

ధర్మరహస్యములు తెలిసికొనుటకు మిథిలానగరమునగల ధర్మవ్యాధునిచూడు మని యా గృహిణి యాదేశించినది. కౌశికుడు ప్రయాణమై మిథిలానగరము చేరినాడు. అచట "నల్పమృగమాంస ఖండంబు లంగడిం బచరించి యమ్ముచున్నవాని, ననవరత విక్రయాగత జనసమావృతు నక్కిరాతుంగని యతిజుగుప్సితంబయిన సూనాపణంబు సేరనొల్లక" (3-5-27) దూరముగా నిలుచుండినాడు మాంసవిక్రయముచేయు వ్యాధుడెక్కడ? ధర్మోపదేశమెక్కడ? ఏలయీవ్యర్థాశ్రమము? అని కౌశికుడును మనమును భావింతుము. కాని, కిరాతుడు 'అతనిరాకపోడిగ నిజబుద్ధినెఱిగి యతని యున్నయెడకు వచ్చి-పరమభక్తి మ్రొక్కి- ధరణీసురేశ్వరుఁ-గుశలమడిగి ప్రియము గొనలు నిగుడ'-(3-5-2) ఇట్లు పలికినాడు "అనఘపతివ్రతాతిలకమైన నితంబిని నాతెఱంగు సెప్పినఁ జనుదెంచితీవు ననుఁ బ్రీతి గనుంగొన నీమనోరథం-బును మదిలోనెఱుంగుదును" (3-5-28) ఈమాటలకు కౌశికుని మనస్సులో కలిగిన యసహ్యభావము పటాపంచలగుటయేకాదు, 'ధర్మవ్యాధు నెఱుక కచ్చెరువంది, పతివ్రతయెఱుకయుందలంచి, యిది రెండవునాశ్చర్యంబుగంటి' (3-5-30)నని భావించినాడు. ఈ ఆశ్చర్యముకౌశికునకేకాదు. అతనితో మనముకూడ చేరుదుము. కథకు ముఖ్యమైన ధర్మోపన్యాసములు ధర్మవ్యాధుని ముఖముననే రావలసియున్నవి. అందుచేత, ఆతనివ్యక్తిత్వమెట్టిదో చూపించుట కీయాశ్చర్యకరఘట్టము పూర్వరంగమైనది.

కిరాతుడు వివిధవిషయములకు సంబంధించిన యనేక ధర్మరహస్యములను కౌశికునకు వివరించును. అతని ధర్మజ్ఞత, వివేచనాజ్ఞానమునకు మరియొకసారి యాశ్చర్యము కలుగును అంతటితో ముగియలేదు. 'పతివ్రత పనుపునంజేసి నీవు ధర్మజ్ఞానార్థంబు నాయున్నయెడకుం జనుదెంచిన నప్పతివ్రతవలని యనుగ్రహంబున నీకు నెల్లవియు నెఱింగించితిఁగాని నీదెస నాదుచిత్తంబు ప్రియంపడియుండదు నీచేసిన యకార్యంబొక్కటి కలదది యెయ్యదియనిన-

'ఎంతయు వృద్ధులై తమకు నీవొకరుండవ దెప్పగాఁగ న
త్యంతముదంబునన్ బ్రతుకు తల్లినిదండ్రిని నుజ్జగించి ని
శ్చింతుడవై సదాధ్యయనశీలత వారియనుజ్ఞలేక యే
కాంతమ యిమ్మెయిన్ వెడలితక్కట నీవు గరంబుగ్రూరతన్" (3-5-120)

అని నిందించినాడు కూడ. కౌశికునకు జ్ఞానోదయమయినది. ఇంకొకసారి యాశ్చర్యమును కలిగినది "నినునొకశూద్రుఁగాదలఁపనేర గుణాకరనీచరిత్రముం-గన మదనద్భుతంబొలసె" (3-5-139) యని యాతనికి నంజలి ఘటించినాడు.

ఇట్టికథలో నడుగడుగున నద్భుతఘట్టములెదురై చదువరుల కాశ్చర్యచకితులనుజేసి వారిలో నుత్సుకతకలిగించుటకు కారణములగును. ఇదియొక కథాకథన శిల్పమనదగియున్నది ఎఱ్ఱా ప్రగడకవి ఈ కథానిర్మాణ శిల్పరహస్యము నీకథయందు బహురమ్యముగా పాటించినాడని చెప్పవలసియున్నది. ధర్మవ్యాధోపాఖ్యానమునకు ధర్మోపదేశము ప్రధానము కదా! ఈ కథను నాధారముగాజేసికొని రచయిత వివిధధర్మములను చక్కగా వ్యక్తముచేసినాడు. కథాబంధము చేత నీధర్మోపదేశమును శోభించుటజేసి, యాధర్మోపదేశమునకు కావ్యత్వము సమకూడినవి. ఈ ధర్మములెట్టివి. కథలో వీనికిగల ప్రాముఖ్యమేమి, యనునంశములను పరిశీలించుట యప్రస్తుతము కాదు.

మహాభారతము పంచమవేదమను ప్రఖ్యాతిని పొందియుండుటచేత, వేదములలో చెప్పబడిన వర్ణాశ్రమవ్యవస్థనుగురించి, సందర్భానుసారముగా భారతము వక్కాణించుచునే యుండును ఈ యుపాఖ్యానమునందలి ధర్మవ్యాధుడు గురువృద్ధజనాతిథి విప్రదేవతార్చన లొనరించువాడు కాబట్టి యతనినోట వర్ణాశ్రమధర్మోత్కృష్టత నిట్లు వ్యక్తముచేయించినాడు. "బ్రాహ్మణులకుఁ దపస్స్వాధ్యాయ సత్యబ్రహ్మచర్యంబులును, రాజులకు దండనీతియు, వైశ్యులకుఁ గృషిపశుపాలన వాణిజ్యంబులును, శూద్రులకు శుశ్రూషయు నెట్లు పరమధర్మంబయిదెల్లు నట్టుమాకును (కిరాతులకు) మృగయోపజీవనంబు పరమధర్మంబు.........ఇంతియేకాదు.

"తనకుల ధర్మము విడువక
మనుట పరమ ధర్మమండ్రుమాన్యులు చిత్తం
బునఁ గృప గలుగుట ముఖ్యపుఁ
బనిసైరణవలయు నఖిలభావములందున్" (3-5-87)

అనియు భారత మీసందర్భమున ప్రపంచించుచున్నది.

భారతీయజీవితవిధానమున అహింసకు చాలా ప్రాముఖ్యము కలదు. అహింసా సిద్ధాంతమును భగవద్గీత (భారతాంతర్గతమే కదా!) మొదలు కొని, గాంధీగారిసూక్తులవరకును నొక్కి వక్కాణించుచున్నవి. ఆంధ్రభాషయందును, ఇతరభారతీయభాషలయందును. వెలువడిన పురాణ కావ్యసాహిత్యములందేదో యొకవిధముగా నహింసాసూత్రప్రతిపాదనము జరుగుచునే యున్నది. పరమధర్మమైన అహింసాధర్మమును భారతమునకూడ క్షేత్రరచయిత ప్రవేశ పెట్టియేయున్నారు. ఈయుపాఖ్యానమున సందర్భమును పురస్కరించుకొని అహింసాసిద్ధాంత మిట్లుప్రతిపాదింపబడియున్నది

"జీవహింస యెన్నండును జేయననము
యొరులుసంపితెచ్చిన హింస మొనర విలిచి

తగినవెలకమ్మి బ్రతుకుదు దద్ధనమున
నమలమానసశాంతి నాయర్థమెందు. (3-5-33)

మాంసవిక్రయముచేయు వ్యాధుడు అహింస నెట్లు పాటించును? అను సందేహమునకు నీపద్యమున సమాధానముకూడ నున్నది అధర్మవ్యాధుడే 'అహింస ధర్మవితతికెల్లను మేటి' అని విశ్వాసమును, ఆచరణమును కలిగినట్టివాడు ఇట్టివాడగుటచేతనే యితరులను బోధించుటకును అర్హు డనిపించుకొనెను.

మనుష్యునకుగల అంతశ్శత్రువులలో క్రోధము మిక్కిలి భయంకరమైనది ఎంతటిప్రజ్ఞాశాలియైనను, క్రోధము నణచివేయనినాడు వాని ప్రజ్ఞ నిష్ఫలమే. ఈ యుపాఖ్యానమున పలుతావులందు క్రోధమువలనకలుగుహాని ఉపదేశ రూపమున చెప్పబడియున్నది. "క్రోధంబుగొని యాడుట లగ్గుగాదు" "క్రోధమోహనామకులైన ఘోరశత్రు-లిరువు రెరియించుచుండుదు రెపుడు నంత-రంగ మయ్యుభయంబు నడంగకున్న-గలదె యూరశక్తిబ్రాహ్మణ్య గౌరవంబు" (3-5-25) ఈ వాక్యములు గృహిణి, కౌశికునకు నుపదేశించినవి.

"విను విషయజ్ఞానమునకు
ననయంబును మనసుమూల మది కామక్రో
ధ నిరూఢమగుచు బురుషుని
ననిశము నెలయించు నింద్రియార్థక్రియలన్". (3-5-60)

ఇది ధర్మవ్యాధు డుపదేశించి నట్టిది.

మానవజీవితమున సత్యవాక్కునకుగల మహత్వ మింతింతనరానిది. వేదములందలి సత్యంవదేతి సూక్తులును, పురాణములందలి హరిశ్చంద్రాది మహానుభావుల కథలును దీనియందుండు పరమార్థమునే బోధించుచున్నవి మహాభారతమునకు శ్రోతయైన జనమేజయుడు 'మితహిత సత్యవాక్యు' డుగా పేర్కొనబడినాడు. పరమధర్మోపదేశ నిర్దేశకమైన ధర్మవ్యాధోపాఖ్యానముకూడ యథోచితముగా సత్యవాఙ్మహత్త్వమును వివరించుచున్నది.

"భూతహితంబుగా బలుకుబొంకును సత్య ఫలంబునిచ్చు ద
ద్భూత భయాస్పదంబగు ప్రభూతపుసత్యము బొంకునట్ల ప్రా
ణాతురుడైనచో బరిణయంబునయందును బల్కు-బొంకు స
త్యాతిశయంబయంద్రు మహితాత్మక యిట్టివి ధర్మసూక్ష్మముల్." (3-5-62)

అని కేవలము ధర్మసూక్ష్మతయే సత్యవాక్కునకు మూలమైనదని వివరింపబడినది. ఈ పద్యమే 'వారిజాక్షులందు వైవాహికములందు' వంటి ప్రజాదరణపొందిన పద్యములకు మూలమైనది.

మానవునకును, జంతువులకును మౌలికముగా కొన్ని లక్షణములలో భేదమున్నది. మానవుడు సంఘజీవి. ఈ సంఘమున మానవుడు జీవించవలెనన్నచో నిశ్చేతనుడుగా నుండుట సాధ్యముకాదు. యథాశక్తి కర్మమునాచరించుట మానవుని విధియైయున్నది. కర్మలేనినాడు మానవునకు

సంఘముతో సంబంధము తెగిపోవును. జంతుప్రాయుడగును. మనుష్యునిజీవితమున కర్మకుగల ప్రాముఖ్యము నీకథయం దిట్లు కవి వర్ణించినాడు.

''పురుషుఁడు కర్మాధీనత
నరుగక తనవశమ యనిన నాపదలు రుజల్
మరణంబును నివియేవియుఁ
బొరయక యుండంగ బ్రతుకఁబోలదె చెపుమా'' (3-5-69)
''కర్మవశతఁజూవె కలుగుదేహము దేహ
వర్తనంబు కర్మవశతఁ బుట్టు
దేహపాతమైన దేహస్థుఁడగు జీవుఁ
డరుగుఁ గర్మవిహితమైన యెడకు.''(3-5-70)

కౌశికుడు తపముపై నభిలాషకలవాడు. అందుచేత ననేకధర్మముల నుపదేశించుచున్న ధర్మవ్యాధునితో

"దేహమున ధాతుసంశ్రయదీప్తుఁడగుచు-వహ్నియెట్లుండు? శారీరవాయువులకు నెలవు తెయ్యవి? యవినాకు నిశ్చయముగఁ జెప్పమని'' కోరినాడు. ఆయోగవిద్యారహస్యములను ధర్మవ్యాధుఁ డిట్లు వివరించెను'

''మూర్ధదేశమునకు వర్తితంబై వహ్ని, నాత్మాగ్ని నాభి దదాశ్రయంబు
శిరమునఁ బావకాంతరమునఁ. జరియించుఁ, బ్రాణుండు భూతాత్మభావుఁ డతఁడు
వరుసఁ బ్రాణాపానులియవురు, నయ్యగ్నివెలిఁగింతు రనపేతవృత్తులగుచు
గదవస్తితలము లాస్పదములుగా, వహ్ని పరిగతుండగుచు నపానుఁడుండు
గడఁగి విణ్మూత్ర నిర్గమకారి యతఁడు, కర్మబలయత్నకారియై కంఠతలము
నందు దానుండు వర్తించు నఖిలదేహ, సంధులందును వ్యానుండు సంచరించు'' (3-5-101)

ఇట్టివే అనేకయోగ రహస్యముల నిదే సందర్భమున వివరించెను.

స్థాలీపులాకన్యాయముగా పైనవివరించిన విశేషములేకాక, ధర్మవ్యాధోపాఖ్యానమున నింకను, పతివ్రతామహిమ, బ్రాహ్మణమహత్వము, బ్రహ్మవిద్యాప్రభావము, మాతాపితృభక్తి మహిమ, ఇంద్రియనిగ్రహశక్తి మున్నగు అనేకవిషయములుకలవు. నూటముప్పదియెనిమిది గద్య పద్యములకు సీమితమైన యీచిన్న కథలో నిన్నియంశములను కవిచొప్పించుట చూడ నాశ్చర్యము కలుగకమానదు ఈయంశములు కథాంతర్గతముగానే యున్నవి యనునంశమును నిటవిస్మరింపలేము.

4. నాలుగవవిభాగమున, పురాణములందలి యుదాత్తతను వివరించుటకు కొన్నికథలు చెప్పబడుసందర్భము, నుల్లేఖింపబడునట్టి యుపాఖ్యానములనుగురించి వివరించవలసియున్నది "వరమ

పౌరాణికుల్ బహుపురాణసముచ్చయంబ"ని భారతమును కొనియాడుట యిట్టియనేక యుపాఖ్యానము లకాకరమగుటచేతనే. ఈవిభాగము నందనేక చిన్నకథలున్నవి. వానితో త్రిమూర్తులలో నెవరిదోయొకటి మహత్వవివరణముండును. దేవహితమునుగురించి చెప్పట యుండును. ఈకథలనన్నిటిని పేర్కొనుటకును నిటనవకాశములేదు. ఇట్టికథలకు ప్రతినిధిగా కుమారస్వామికథను గ్రహించుట సముచితముగా నుండునని భావించితిని. ఇక నీకథను వివరించి దానియందలి వివిధవిశేషములను పేర్కొందును.

ఆంధ్రమహాభారతములో శల్యపర్వమునందలి ద్వితీయాశ్వాసమున కుమారస్వామి మహిమాభివర్ణనము అనుపేరుతో నీకథ వర్ణింపబడియున్నది. ఈకథకు సందర్భ మేమనగా, భారతయుద్ధము ప్రారంభమగు సమయమున బలరాము డచటికివచ్చి శ్రీకృష్ణుడు పాండవులయెడ పక్షపాతియని, విరాటాదిబంధులు వినఁగ పలికెను. "హరియెఱుగని చక్కటియును-బురుషార్థము నాకెఱుంగ లేలునె యాని-ష్ఠురత వినఁజాలఁజాలక-సరస్వతీతీర్థమునకు జనియెదుబుద్ధిన్" (9-2-148) వెడలి పోయెను అట్లువెడలి యుద్ధముచివరన, భీమదుర్యోధనులు ద్వంద్వయుద్ధముచేయునాటికి తిరిగివచ్చెను భీముడును.దుర్యోధనుడుతనశిష్యులేకాబట్టి వారుచేయుయుద్ధమునుచూచుట కాతనికి కుతూహలముకలిగెను అప్పుడుభారతకథవినుచున్న జనమేజయుడు"బలదేవుండు తీర్థయాత్రనిర్వర్తించిన తెఱంగును, భీమసుయోధనుల గదాయుద్ధంబు చెల్లినభంగియు నతనికాలోన నచటికేగుదేర సమకూరినవిధంబును వివరించిచెప్పుమనెను, వైశంపాయనుడు బలరాముని తీర్థయాత్రనువివరించుచు, ప్రధానతీర్థవర్ణనము, మంకణమహాముని మహాత్మ్యాభివర్ణనమును వర్ణించెను.

మహేశ్వరుడు తన వీర్యమును అగ్నియందిడెను కాని యగ్ని దానివహింపజాలకపోయెను. అత డావిషయమును బ్రహ్మకెఱుకపరచి వానిని గంగాగర్భభూతముగ నొనర్చెను. గంగ, తేజోమయంబైన యాగర్భంబును హిమవత్పర్వతముమీద సముత్సృష్టముచేయగా, కనకమయంబైన శరస్తంభంబున నగ్నిసన్నిభుండగు కుమారుండై యొప్పె. అచట చరించుచున్న కృత్తికలు, పుత్రార్థినులై యా బాలుని యెత్తుకొనిరి. విచిత్రముగా నాయార్వురికి చన్నులుచేపెను. అప్పుడద్భుతముగా నాబాలుడు ఆరు ముఖంబులుదాల్చి వారందరి స్తన్యపానము చేసెను. వారాశ్చర్యపడి యాబాలుని నెప్పటియట్ల నునిచిరి. అట్లాకుమారుడు అగ్నిభవుడు, గాంగేయుడు, శరజన్ముడు, కార్తికేయుడు అనంబరగెను. బృహస్పతి యాతనికి జాతకకర్మాద్యనుష్ఠానంబు నిర్వర్తించెను. ఆప్రదేశము స్వర్ణమయమైయుండెను.

ఆకుమారుడు ఉత్తమమనదగియెడు తపము విహారముగాను, ధాత్రిధాత్రిగాను, ధనుర్వేదములు, శ్రుతులు తనను సేవించగాను ప్రవర్ధమానమొందెను. ఒకనాడు మహేశ్వరు డుమాసహితుడై తనపరివారముతో నాబాలుని చూడవచ్చెను. అప్పుడు బ్రహ్మవిష్ణులును, ఇంద్రాది దిక్పాలురును, దేవతాగణముతో నచటికి వచ్చిరి. ఇట్లు వచ్చినవారి కభిముఖముగా నాయోగబలాన్వితుడైన బాలుడు వచ్చుచుండెను. అట్టి సమయమున శివుడు " ఉమయు నగ్నియు గంగయునుండ నన్ను-గారవంబున నధికునిఁగాఁదలంచి-చక్కనాపాలి కేతెంచు నాక్కొవీఁడు-సంభృతస్నేహభక్తి

విఘ్నంధుఁడగుచు" (9-2-170)అని భావించెను. మహేశ్వరుడేకాదు ఉమ,అగ్ని, గంగకూడ నిట్లే భావించిరి. వారి భావములను దివ్యబోధమున కన్నవాడగుటచేత నబ్బాలుడు తనయోగకౌశల్యమును ప్రదర్శించి చతుర్మూర్తిచతుష్టయమునుదాల్చి యన్నలుపురుయొద్దకు నేకకాలమున జనెను వారు అద్భుతమగ్నమానసులైరి. తరువాత ఒక రూపమును ధరించి నిలిచెను

అప్పుడు శివుడు, గంగ, ఉమ, అగ్ని, బ్రహ్మనుచేరి గుణవంతుడైన యీకుమారునికి యోగ్యమైన పదమును ప్రసాదింపుమని ప్రార్థించిరి. దేవహితమును కోరెడువాడు కాబట్టి, కుమారుని దేవసేనకు పతిగా నియమించి యాతని శక్రవరుణాదులకు నప్పగించెను. దేవతలాతని నాయున్నతపదవి నభిషేకించుటకు సంకల్పించిరి హిమవంతుడు సకలరత్నమయమైన దివ్యపీఠము పెట్టెను. కుమారుని యాపీఠమున నునిచి బృహస్పతి హోమకార్యమును నిర్వర్తించెను త్రిమూర్త్యాదులు సరస్వతీజలముచేత నాతని నభిషేకించిరి గంధర్వాదులు నృత్యగానములు గావించిరి. అభిషేకానంతరము వివిధదేవతాధిపతులు మహావీరులైన సైనికులను నాతని కప్పగించిరి. మహేశ్వరుడు ధ్వజమును, ఇంద్రుడు శక్తిని, విష్ణుమూర్తి వనమాలికను, పార్వతి నిత్యనూతనమైన వస్త్రమును, గంగ ఉజ్వలసుధామయ కమండలువును, బృహస్పతి దీప్తదండమును, గరుత్మంతుడు వాహనముగానుండు మయూరమును, వరుణుడు తామ్రచూడమును, కుబేరుడు దర్పితచ్ఛాగమును, బ్రహ్మ కృష్ణాజినమును, శత్రువిజయశక్తిని యాతనికి సమర్పించిరి ఆ షణ్ముఖునకు రాక్షసనాశనము చేయు సామర్థ్యము కలుగవలెనని భూతమయమగు మహాసైన్యము నిచ్చెను. ఇంద్రాదులు పరివేష్టించి యుండగా నామహాసేనానాయకుడు దేవతలకు, మీశత్రు లెవరైనను పరిమార్తునని వరమును ప్రసాదించెను త్రిమూర్తులు వారివారి స్థానముల కరిగిరి.

తరువాత తారకు డనురాక్షసునివలన దేవతలు బాధనొందుచున్నారనితెలిసి తనసైన్యముతో షణ్ముఖుడు ఆరాక్షసునిపైదండెత్తెను. ఆరెండుసైన్యములకు భీకరయుద్ధము సంభవించెను కుమారుడు శక్తినిధరించి యనేకరాక్షసవీరులను సంహరించెను, చివరకాశక్తిచేత తారకాసురుడు మడిసెను. తరువాత బలికుమారుడగు బాణుని,యాతనిదుశ్చర్యలకు గినిసి నిహతుజేసెను. దేవతలు పుష్పవృష్టి కురిపించిరి. అచట ప్రతిష్ఠితుడైన కుమారుని బలదేవుడు ప్రదక్షిణ ప్రణామంబు లాచరించి కృతార్థుడయ్యెను.

ప్రధానకథయగు మహాభారతమున భీమదుర్యోధనుల గదాయుద్ధము ప్రముఖమైనదియు, అంత్యమైనదియునైనది. ఆఘట్టము జరుగుబోవునందర్భమున కవి యీపౌరాణికోపకథను కూర్చినాడు. ఇట్లుచేయుటచేత ముఖ్యకథాగమనమున కాటంక 'మేర్పడినదని చెప్పవలనుపడదు. ఎందుచేతననగా, జరగబోవు ద్వంద్వయుద్ధమును చూచుటకు బలదేవుడుకూడ వచ్చినాడు. ఆతడు ఆవీరద్వయమునకు గదావిద్యయందు గురుత్వమును వహించినట్టివాడు. అట్టిమహనీయు డింతకాలమేమిచేసెను అని జనమేజయు డడుగుటలో నాశ్చర్యములేదు.ఆజనమేజయుని యుత్కంఠదీర్చుటకే వైశంపాయను డీకథను చెప్పియున్నాడు.

కుమారస్వామికథ యెందులకు నిటవచ్చినది? యనుప్రశ్నమునకుసమాధానము చెప్పవలసి యున్నది. బలరాముడు భారతయుద్ధసమయమున అనేకపుణ్యతీర్థములనుసేవించుచు సోమతీర్థము

నకు వెడలినాడు అప్రదేశమునందే యనిమిషులు షణ్ముఖునకు నిర్జరసేనాధిపత్యంబునకు నభిషే కంబు సేసిరి అతడు తారకాదులైన యసురులం దెగటార్చెను ఇట్లుచెప్పి వైశంపాయనుడు 'ఆతనిజన నాదివృత్తాంతము కౌరవంశజాతుండవగునీకు వినదగుఁజెప్పెద నాకర్ణింపుమనియు జనమేజయునితో చెప్పియున్నాడు. ఇట్లుచెప్పుటవలన నీకథకుచక్కని సంచర్భశుద్ధి యేర్పడినదనుటలో సందేహము లేదు.

దేవహితమునుగురించి భారతము పలుసార్లు నడువుచునేయున్నది అవిశేషమును కథారూప మున చెప్పుటకుకూడ పౌరాణికమైన కుమారస్వామిజన్మము,అతడు తారకునిసంహరించుట మొద లగు వృత్తాంతము లాలంబనమైనవి ఇట్లుచూడగా దేవహితమను ముఖ్యాశయ మీకథవలన కొంత వరకు నెరవేరినది.

మహాభారతము కేవలము విష్ణుమహాత్త్వమునుగాని, కేవలము శివమహత్త్వముగాని బోధించు గ్రంథముకాదు. అవకాశమేర్పడినప్పుడు కేశవుని దుష్టశిక్షణము, శిష్టరక్షణమును వర్ణించిచెప్పును అట్లే సందర్భమువచ్చినప్పుడు మహేశ్వరుని మహిమాభివర్ణనము చేయును అందుచేతనే యీగ్రం థము సర్వజనాదరణీయమైనది. శైవసంప్రదాయపరంపరయందు కుమారస్వామికి విశేషప్రాము ఖ్యమున్నది ఆప్రాముఖ్యమును సందర్భమునుబట్టి వర్ణించుటనుకూడ నుచితముగాభావించి, కవి యీచిన్న పౌరాణిక కథకు మహాభారతమున స్థానము కలిగించియున్నాడు, ఇట్టి కథలవలన మహా భారతము శివకేశవుల యభేదమును నిరూపించి, యద్వైత సిద్ధాంతమును ప్రతిపాదించునట్టిదిగాను నున్నది.

6. వేదోక్తమయిన యజ్ఞయాగాదికర్మల మహత్వము పంచమవేద మనబరగిన మహాభారత మున ప్రసక్తానుప్రసక్తముగా వచ్చుచునే యుండును. స్వయముగా యుధిష్ఠిరుడే యుద్ధమునకు పూర్వము రాజసూయము, యుద్ధమునకుతరువాత నశ్వమేధమును నాచరించియున్నాడు రాజులిట్టి వేదవిహితయజ్ఞాదికముల నాచరించుట నాటి సంప్రదాయము ఈరెండుయజ్ఞములకును ప్రధానభారత కథతోప్రత్యక్షసంబంధమున్నది. ఇవికాక ఉపఖ్యానములందును, వేదములందుచెప్పబడిన యజ్ఞయా గాదుల ప్రశంసలు చేయబడియున్నవి. ఒకవిషయమును కథాపూర్వముగా ప్రతిపాదించి వివరించు టకు మహాభారతరచయితలకు ఇష్టమయిన విషయము ఈసందర్భమున అగస్త్యమహర్షి యాచరిం చిన ద్వాదశవార్షికయజ్ఞమునకు సంబధించిన చిన్నకథ చెప్పవలసియుండును

"జన్నంబులునందు రాజన్యులు దవమున, మునిజనంబులుశాంతినవఘ విప్రు
లానక్తులగుదు రట్లగుటఁగాదే పల్కు, రవనీశ్వరులు దొల్లి యాగకృతుల
నతులకీర్తి నను నధ్గతులనుబడిసిరి ధర్మనందనుండత్యుదాత్త భంగిఁ
దొంటి భూనాథులకంటె నత్యమునను శౌచమునను భక్తిశ్రద్ధనీగి
నతిశయిల్లె వేదవ్యాసుఁడాదిగాఁగఁ గలుగు నార్యజనులచిత్తములకు నెక్కి
నమరవల్లభుచంద మందముగఁజేసె నశ్వమేధంబు మెచ్చులకాకరముగ"

మహాభారతమునకు శ్రోతగానున్న జయమేజయమహారాజు పలికిన యీవాక్యములను చూడగా నాటిరాజన్యులకును, ప్రజలకును యజ్ఞయాగాదులయందెంతటి దృఢవిశ్వాసముండెనో స్పష్ట

మగును. ఈయజ్ఞములందును రెండువిధములున్నవి. హింసాయుతమై పశువిశసనముచేయు యజ్ఞము మొదటివిధమునకు చెందినది. అహింసాత్మకమై ధాన్యాదికములనే యజనసాధనములుగా నుపయోగించిచేయునట్టిది రెండవవిధమునకు చెందినది ఈరెంటియందును, అహింసాత్మకమైన యజ్ఞమే యుత్తమ మైనదనువిషయమును మహాభారతము ప్రతిపాదిచుచున్నది. ఆ విషయమును నిరూపించుటకే అగస్త్యుని ద్వాదశవార్షికయజ్ఞ కథ యుల్లేఖిత మైనది ఆ కథ యిట్లుండును.

అగస్త్యమహర్షి ద్వాదశవార్షికయజ్ఞమును ప్రారంభించి చేయదొడంగెను ఈయజ్ఞము పశువిశసనములేనిది. అహింసాత్మకము ఈ యధ్వరమునకు దివ్యానుభావముగలయట్టి మును లనేకులు ఋత్విజులుగానుండి అఖిలతంత్రముల నాచరించుచుండిరి. అట్టిసమయమునందు ఇంద్రుడు వర్షములువడనీయలేదు. తత్ఫలితముగా ఓషధులు వికలత్వమునుపొందెను. అగస్త్యుడారించవలసియున్నయన్నదానవిధు లెట్లుచెల్లునోయని యటచేరినమునిసంఘములు విచారించుచుండిరి అందును అగస్త్యుఁడు ద్వాదశవార్షికంబైన దీక్షావిశేషము నొందినవాఁడు ధర్మమార్గాగతం బైన ద్రవ్యంబుదక్క నొండు వినియోగింపడు వాసవుఁ గురియుటలేదు. అని వారు తమలోతాము మాట్లాడుకొనుచు వ్యాకులపడుచుండిరి వీరి యీమాటలు అగస్త్యునిచెవిని బడెను అత డిట్లు వారితో పలికెను "న్యాయమును పరికించి, యజ్ఞమునకు భంగముకలిగించక, ఇంద్రుఁడు మేఘముల నాజ్ఞాపించి వృష్టికలిగించెనా మంచిది. లేదా నేనే స్వయముగా అమరేంద్రుని పదవినివహించి, వర్షమునుగురిపించి యీలోకమును రక్షింతును. మీరు విచారింప నవసరములేదు. అట్లు కాదేని, మూడులోకములందున్న బహుళోదార ద్రవ్యకోటులున్న యునికి మీపాదముల పరిసరమునకుఁ దేదొరకొను నస్రమమునఁ దెచ్చెదను. అంత చేసినవలయునా యన్న మీరు సందేహించినచో ఉత్తరకురుభూములు సమృద్ధిగా ఫలించియున్నవి. సంకల్పమాత్రమున నటునుండి యాగకాలమునకు ధాన్యములిచ్చుటకు వచ్చును. నేను నిర్మలబీజ హవిస్సత్రము చేయగా జగతి వణుపులంటెరునే? జన్నము విఘ్నపడునె? మీరు విచారించనక్కరలేదు" ఇది విన్న మును లిట్లనిరి. "అగస్త్యా! నీవు ధర్మాగతి నంసిద్ధవస్తుదాయివి. నీకు నీ నిరవద్యతపము వ్యయముచేయుట యెందులకు? వాసవునిపై కినుకవహించి యఖిలజగద్ధన మాచరించుటయెందులకు? ఉత్తరకురుభూముల ధాన్యములెందులకు? నన్మాన్యబీజహుతములందు ఫలేచ్ఛ యోజింపనేల? మాకొరకు నీచిత్తమిన్ని విధముల బారినదికాదా! నీమనస్సును నిశ్చింతచేసికొని సుఖముండుము మేముమాచేసినట్టి సుకృతములచేత సులభముగా వలయు నాహారములదెచ్చికొందుము" ఇట్లు వారుమాట్లాడుకొనుచుండగనే, ఇంద్రుడు సమృద్ధిగా వర్షము కురియుదని మేఘములనాజ్ఞాపించి, సువృష్టిని కలిగించెను. తాను స్వయముగా నగస్త్యునిదర్శించి వినయముతో తనను కావుమని వేడుకొనెను అగస్త్యుడు తనకు విధేయుడైన యింద్రుని గారవించి, యధావిధిగా గౌరవాదికములు గావించి, శాంతినద్వచనలీల ప్రమోద మొనర్చి, యాతనిని దేవపురికి వీడ్కొలిపెను. లోకము సంతసమందెను. జన్నము నిర్విఘ్నముగా కొనసాగెను యాగాంతమున మునులు అగస్త్యుని యర్చనముల తృప్తులై తమతమ యావాసములకు వెడలిరి 'ఇవ్విధంబు నహింసారహితంబుగా మహితయాగంబు నుప్రయోగంబుచేసి యగస్త్యుడు పరమప్రశస్తి నుజ్జ్వలుండై వెలింగెం గావున ధర్మమారాగతద్రవ్యకృతంబై తపోమయంబైన యజ్ఞంబు ప్రాజ్ఞమనోజ్ఞంబై వెలయు'.

ఈ చిన్నకథయందు ద్వాదశవార్షికయజ్ఞమహత్త్వము ప్రధానాంశమని వేరుగాచెప్పపనిలేదు. కాని యిందలియగస్త్యుడు, ఇంద్రుడువారివారి స్వభావములనుప్రదర్శించి కథను రమ్యమొనర్చిరి. అగస్త్యుడు గొప్ప తపశ్శక్తికలవాడు అతడుచెప్పిన యసాధ్యమైన పనులనన్నిటిని చేయసమర్థుడు. అందును యజ్ఞవిషయముకాబట్టి యెట్టిసాహసమునకును వెనుకాడని ధీరుడు. కాని తపోమూర్తి, సౌమ్యస్వభావుడుకాబట్టి క్షమాశక్తియు సమృద్ధిగాకలవాడు. అందుచేతనే వినయముతో తన్నుదర్శించుటకు వచ్చిన ఇంద్రుని సహనముతో క్షమించి తనసౌమ్యస్వభావమును, సహనశీలత్వమును ప్రదర్శించినాడు.ఇట్టి యున్నతగుణములనుకలిగిన యగస్త్య డీచిన్నకథయందు కథానాయకు డైనాడు

ఇంద్రుడు రజోగుణప్రధానుడు. అగస్త్యుని ద్వాదశవార్షికయజ్ఞమున పశుబలి జరుగలేదని కినుకవహించి అనావృష్టిచే సంచలనము కలిగించినాడు. యజ్ఞకర్తకును, అచ్చట చేరిన మునులకును కొంతవ్యాకులత్వమును కలిగించెను.కాని యింద్రుడు, మూర్ఖుడుకాడు. అగస్త్యమహర్షి శక్తిసామర్థ్యములు చక్కగా తెలిసినవాడు. సంకల్పమాత్రమున నాత డేపనియైనను సాధించునని యాతనికి తెలియును అందుచేతనే యజ్ఞభంగము జరుగకుండునట్లు సువృష్టికురిపించినాడు.ఇట్లుచేయుటయందు ఇంద్రుని మంచితనమునకన్న, అగస్త్యుని మహిమనే ప్రాధాన్య మధికము ఈవిధముగా ఇంద్రుని యందు ప్రతినాయకున కుండవలసిన లక్షణములన్నియు నిక్షిప్తములైనవి ఇట్లీ చిన్నకథయందు నాయక ప్రతినాయక సంఘర్షణ మేర్పడుటయు, ప్రతినాయకుడు నాయకునకు చివరను విధేయుడగుటయు ననువృత్తము సంఘటిల్లినది. కథలోని శిల్పలక్షణమిది. ఈలక్షణము కథను ప్రసన్నము చేసినది

యజ్ఞమహిమాభివర్ణన మీకథలోని ప్రధానాంశముకాబట్టి,సందర్భానుసారముగా 'ధర్మమార్గాగత ద్రవ్యకృతంబై తపోమయం బను యజ్ఞంబు ప్రాజ్ఞజనమనోజ్ఞంబై వెలయు, నంటి మాటలను చేర్చి కథకు ప్రయోజనమును సమకూర్చినాడు కవి. ఈ యుపాఖ్యానము అశ్వమేధపర్వమున చతుర్థాశ్వాసమున నున్నది

పైవిభాగములందు పేర్కొనబడిన ఉపాఖ్యానములేకాక, మహాభారతమునందు, అనేక సందర్భములలో ననేకకథలు వర్ణింపబడియున్నవి వాటినన్నిటినిగురించి చెప్పుట సాధ్యముకాదు కాబట్టి, స్థూలముగా నీ విభాగములలో చేరువానిని మాత్రమే ముచ్చటించితిని. నేను గ్రహించిన కథలలో పశుపక్ష్యాదులు పాత్రలుగానున్నవానిని- నాడీజంఘోపాఖ్యానము, భీష్ముడు చెప్పిన వృద్ధహంసకథ వంటివి గ్రహించలేదు ఈ కథలన్నియు ముఖ్యముగా లోకనీతికి చెందినట్టివి. ఇవి యేదోయొక రూపమున తరువాత వెలువడిన పంచతంత్ర హితోపదేశములందు చోటుచేసికొన్నవి. అట్టివానిని గురించి చెప్పుట మరియొకగ్రంథమే యగును.

ఈ పరిశీలనమున ముఖ్యవిషయ మొక్కటిచెప్పి ముగింతును ఈయుపాఖ్యానములందేదియు నిష్ప్రయోజనముగా కాన్పించదు ప్రధానకథతో నేదియో యొకవిధమైన సంబంధమునుకలిగియే యుండును. ఈకథలన్నియు ప్రధానకథారమ్యతకు పోషకములుగానే యున్నవి. కాని, కథాగమనమునకు విఘాతమును కలిగించునట్టివికావు. అందుచేత మహాభారతమునందలి ప్రధానేతివృత్తమునకు గల ప్రాధాన్యము, ఉపాఖ్యానములకును గలదన్నచో అతిశయోక్తిగా భావించ నవసరములేదు.

—ఎం. కులశేఖరరావు

# కవిత్రయభారతము - ఛందఃప్రయోగము

'అమలినతారకానముదంబులనెన్నను,
సర్వవేదశాస్త్రముల యశేషపారము ముదంబునఁ బుద్ధి
బాహువిక్రమమున దుర్గమార్థజలగౌరవభారతభారతీసముద్రము
దఱియంగ నీదనువిధాతృనకైనను నేరఁబోలునే'

అని నన్నయగారు పరమ వినయసూచకముగా నేక్షణాన ఈ మాటలు రాజరాజనరేంద్రునితో అన్నారోగాని, భారత భారతీ సముద్రము దఱియంగ నీదు విషయమున, చిత్రముగా ఆయన యందే వర్యవసించినవి భారతకావ్యము నాయన మొదలుపెట్టనయితేపెట్టినారుగాని, ఆ కావ్యము మాత్రమాయనచేతులలోపూర్తిగాలేదు.ఆయనతరువాత దాదాపువందఏబదిసంవత్సరములకు భారతము మొత్తమున ఆరింటఅయిదువంతులభాగమును తిక్కనగారు రచించినను,ఆతరువాత దాదాపుమరి ఏబది సంవత్సరములకు ఎఱ్ఱనగారి వలనగాని భారతము సమగ్రముకాలేదు ఎఱ్ఱనగారు రచించిన భాగము భారతము మొత్తము మీద చాల తక్కువ నన్నయ, ఎఱ్ఱనల రచన మొత్తము కలిసినగాని భారతము మొత్తమున ఆరింట నొకవంతుగాదు. ఏది యెట్లైయినను తెలుగున భారతము సమగ్రమగుటకు ఇదులు పదులుగాదు వందలనంవత్సములు జరిగినవి ఈ కవిత్రయము భారతము మొత్తమున నెరసిన ఛందఃప్రయోగమును-ఒక్క ఛందఃప్రయోగమును గూర్చికాదు,మరి యేయంశమును గూర్చి చెప్పుకొనవలెనన్నను ఈదీర్ఘమయిన కాలవ్యవధానమును గమనించవలసి యుండును ఈకావ్యమును ప్రారంభించిన నన్నయగారినాటికి తెలుగునకావ్యరచనజరగలేదు.తెలుగు కావ్యరచనారీతికి మార్గదర్శియైనమహర్షిఆయన అందుకే తెలుగువారికి ఆయనరెండవవాల్మీకి;ఒకవిధముగా చెప్పినచో, తెలుగుపద్యవిద్యకునాద్యుడు కాని ఎఱ్ఱనగారినాటికి,ఈమధ్యకాలమున కావ్యరచన చాలాజరిగినది.అయినను ఒకచిత్ర మేమనగా, ఎఱ్ఱనగారు మిగిలినయంశములం దెట్లున్నను, ఛందఃప్రయోగవిషయమున అచ్చముగా నన్నయగారేయన్నట్లు భారతారణ్యపర్వశేషమును పూరించినారు, ఎఱ్ఱనగారుధీరవిరారుడు। అందువలననే, 'తత్కవితారీతియుగొంతదోప, తద్రచనయకా,నారణ్యపర్వశేషముపూరించినారు. 'తద్రచనయకా, నన్నది ఛందః ప్రయోగ విషయమున పూర్తిగాసార్థకము. 'స్రగ్విణి, యన్నయొక్క విశేష వృత్తమును, ఆదియు ఆశ్వాసాంతమున దప్ప, నన్నయగారుపయోగించని విశేషవృత్తమును దేనిని ఎఱ్ఱనఉపయోగించలేదు. అంతేకాదు నన్నయగారి తరువాత తనవరకు ఎవరును, దేశికవుల మనుకొన్నవారును కూడ ప్రయోగించని అక్కర పద్యములను, నన్నయగారుపయోగించినారన్న కారణముననే భారతారణ్యపర్వశేషమున నుపయోగించినారెఱ్ఱనగారు ఒక్క మధ్యాక్కరయందు యతిస్థానమును ఒకగణము ముందుకులాగుట యన్నది తప్ప మరియే పద్యమందును ఏమార్పును చేయలేదు. సీసపద్యమందు నన్నయగారు యతి, ప్రాసయతి

ప్రయోగముల విషయమున అనుసరించిన నియమములనే తప్పక యనుసరించినారు. తేటగీతి, ఆటవెలదుల యందును. యతి, ప్రాసయతి ప్రయోగమున నన్నయగారి నియమములను దాటలేదు. ఈ విధముగా పరిశీలించినచో. 'తత్ప్రచనయకా' - ననగా, నన్నయగారి రచనగానే, ఎఱ్ఱనగారు భారతారణ్యపర్వశేషమును పూరించినారు కాగా, కవిత్రయభారతమున ఛందఃప్రయోగ పరిశీలన మనగా, ప్రధానముగా నన్నయ, తిక్కనల పరిశీలనమే యని ఒకవిధముగా చెప్పవచ్చును. అయితే నన్నయ తిక్కనల నడిమికాలముకూడ తక్కువయేమియు గాదుమరి నన్నయగారే ఛందోమయమైన తెలుగు కావ్యరచనకాద్యుడు. ఆయన వేసిన. మార్గమునందే తనప్రతిభ వెలయించిన మనీషి తిక్కనగారు అందువలన మొదట తెలుగులో ఛందఃప్రయోగము విషయమున నన్నయగారు ఏరీతిని అవలంబించినది పరిశీలించుట యవసరము

ఇక్కడ నొక యంశము చెప్పుకొనవలసి యున్నది సంగీతమందు వ్యాప్తియందున్న మార్గ-దేశి యన్న పద్ధతులను కన్నడులు సాహిత్యమునందును ప్రవేశపెట్టినారు. ఆ ప్రవేశింపును గమనించి నన్నెచోడుడు, పాలకురికిసోమనాథుడు మొదలయినవారు తెలుగునందును వాటిని ప్రస్తావించినారు వారు ఆ ప్రస్తావన ఏ ఉద్దేశముతో చేసినది, చేసినదానిని ఎంతవరకు అనుసరించినది అట్లుండగా, ఈనాటికిని మార్గదేశి విషయ మొక వివాదాంశముగానే యున్నది. స్థూలముగా చెప్పికొన్నచో, సాహిత్యమునకు సంబంధించిన ఇతరాంశముల విషయ మందెట్లున్నను, ఛందస్సునకు సంబంధించినంతవరకు, మార్గచ్ఛందస్సు లనగా సంస్కృతమునకు సంబంధించినవని, దేశిచ్ఛందస్సులనగా దేశీయ, (ప్రాంతీయ) మైనభాష తెలుగుఛందస్సు లని చెప్పకొనవచ్చును. నన్నయగారు ఈమార్గ-దేశియన్న పద్ధతులను భావించినది, లేనిది ఖచ్చితముగా చెప్పుటకు వీలులేకున్నను, నన్నయగారు తాము రచించిన భారతభాగమునందు మాత్రము సంస్కృతీయ, దేశీయచ్ఛందస్సులను రెండు విభాగములకు చెందినవాటిని ప్రయోగించినారు. ఈ రెండింటిలో సంస్కృతీయములయిన ఛందస్సులను ప్రయోగించుటలో ప్రదర్శించిన తీరు మొదట గమనించవలయును

నన్నయగారి కన్న ముందే తెలుగులో సంస్కృతీయ వృత్తములు రెండు ప్రవేశించినవి. ప్రవేశించిన వనుటకు క్రీ శ. 1000 ప్రాంతమున విరియాల కామసాని వేయించిన గూడూరు శాసనము ప్రమాణము. ఈ శాసనమందు మూడు చంపకమాలాపద్యములు, రెండు ఉత్పలమాలా పద్యములు ఉన్నవి. అయితే, ఈ రెండింటికి సంస్కృతమున ప్రయోగము దాదాపుగా లేదనవచ్చును ఎనిమిది, తొమ్మిది శతాబ్దములకు చెందిన రాజశేఖరాదులు కొందరు కొంతవరకు చంపకోత్పలమాలలను సంస్కృతమునందు ప్రయోగించిరనగా, దానికి, వారికి ముందే కన్నడమున ఈ పద్యములకున్న ప్రయోగపు విరివియొక్క ప్రభావము కారణము కావచ్చును ఇదిట్లుండగా, కన్నడమున పై రెంటితోబాటు మత్తేభ-శార్దూల విక్రీడితములకును, స్రగ్ధరా మహాస్రగ్ధరలకును విరివిగా ప్రయోగమున్నది ఈ ఆరింటికి కన్నడము 'ఖ్యాతవృత్తము' లని వ్యవహారము అనగా వీటికి బహుళ ప్రయోగ మున్నదన్నమాట. మరి తెలుగునందు నన్నయగారికి ముందు మత్తేభ శార్దూల విక్రీడితములకు, స్రగ్ధరామహాస్రగ్ధరలకు ప్రయోగమున్నదనుటకు ప్రమాణము కనిపింపదు

కాగా, ఆయనయే వీటిని తెలుగులో మొదట ప్రయోగించి రనవలసియున్నది. ఇక్కడ గమనించవలసిన యొకయంశమున్నది "ఖ్యాతవృత్తము" లారింటిలో శార్దూలవిక్రీడిత, స్రగ్ధరామహాస్రగ్ధరలకు సంస్కృతమున విరివిగా ప్రయోగమున్నది. మత్తేభవిక్రీడితమునకు చాలతక్కువ చంపకోత్పల విషయముపైన చెప్పబడినది అయితే ఈ ఆరింటిలో సంస్కృతమునందు విశేష ప్రచారము లేని వాటినే తెలుగునందు ప్రచురములు చేయదలచినట్లు, ఆయాపద్యములు నన్నయగారు ప్రయోగించిన రీతిని బట్టి చెప్పవచ్చును ఆయన తనరచన మొత్తముమీద స్రగ్ధర నొకమారు, మహాస్రగ్ధరను రెండు మారులే ఉపయోగించినారు శార్దూలవిక్రీడితమును 1 మార్లు ప్రయోగించినారు మరి మత్తేభవిక్రీడితమును 61. కాగా చంపకమును 210 మారులు, ఉత్పలమును 194 మారు ప్రయోగించినారు. దీనిని చూడగా, నన్నయగారు చంపకోత్పల, మత్తేభవిక్రీడితములనే ప్రచుర వృత్తములుగా చేయదలచినట్లు కన్పించును ఈ మూడింటికిని సంస్కృతమున నేవిధమైన ప్రయోగమున్నదో చెప్పనేబడినది. శార్దూలవిక్రీడితము కన్న అధికముగా నన్నయగారు మత్తకోకిల, తరళములను (26-25) ఎక్కువ మార్లు ప్రయోగించుటచూడగా, వాటిని ప్రచురవృత్తములను చేయదలచినట్లు కన్పించును. ఈ రెండు కూడ, సంస్కృతమున అప్రసిద్ధములే. అయితే తరవాతి నన్నెచోడ, తిక్కన, ఎఱ్ఱనలు ఈ రెంటిని తక్కువగా ప్రయోగించుటచే, సహజముగా మత్తేభవిక్రీడితముతో, శార్దూలవిక్రీడితమున కున్న దగ్గరి సంబంధముచే శార్దూలవిక్రీడితముపై కొంత మొగ్గు హెచ్చయి, అది చంపకాదులవలె, మత్తేభవిక్రీడితమువలె ప్రచురమైనది. శార్దూలవిక్రీడిత పాదమందలి యాదిగురువు, రెండులఘువులయినచో మత్తేభవిక్రీడితము గదా! కాగా కవిత్రయము తరువాత చంపకోత్పల-మత్తేభ శార్దూలములు తెలుగునందు ప్రచుర వృత్తములయినవి వీటికే సామాన్యవృత్తములు, లేక పద్యములని వ్యవహారము.

ఇప్పటికి ప్రస్తావింపబడిన వృత్తములు గాక మరి 14 వృత్తములు నన్నయగారిచే ప్రయోగింపబడినవి, వీటిలో ఒక్కొక్క మారుపయోగింపబడినవి ఎనిమిది, రెండేసిమార్లు పయోగింపబడినవి మూడు. ఇకమాలిని ఏడు మార్లు, పృథ్వి ఐదుమార్లు, వసంతతిలక మూడు మార్లు ప్రయోగింపబడినది. (వివరములకు ఈ వ్యాసానుబంధము చూడవలెను). పరిశీలించినచో మాలిని, పృథ్వి వంటి యే రెండు మూడో తప్ప మిగిలినవన్నియు సంస్కృతమున అప్రసిద్ధములే కావున సంస్కృతమందు అప్రసిద్ధమైన వాటినే తెలుగునం దుపయోగించుట నన్నయగారి రీతియని చెప్పవచ్చును

ఇదిట్లుండగా, ఈయావృత్తములనే నన్నయగారు తెలుగున కెన్నుకొనుటలో ప్రత్యేకత ఏమిట్లున్నదియు కొంత విచారించవలసియున్నది.

ఈ పద్యముల నడకలను గమనించినచో వీటియందు కొంచమెక్కువ తక్కువగా దేశీయ చ్ఛందస్సుల నడకలు భాసించుచుండును. రగడలన్నవి విదేశీయచ్ఛందస్సులు వీటియందు మాత్రా సంఖ్యకు, లేదా మాత్రాసంఖ్యగణములకు ప్రాధాన్యము. 3,4,5మాత్రాసంఖ్యగలగణములు, ఒక్కొక్క

పాదమున నాల్గేసి, లేదా ఎనిమిదేసియుండుటవలన ఆరువిధములయిన రగడభేదములేర్పడును. ఏడేసి (8 + 4) మాత్రలగణములు పాదమునకురెండేసి, లేదా నాల్గేసియుండుటవలన రెండువిధముల రగడలు ఏర్పడును. ఈవిధముగా ఎనిమిదిరగడ భేదములు ఈరగడభేదముల నడకలు నన్నయగారు ప్రయోగించిన వృత్తములలోనెట్లు కొంచెమించుమించుగానమరునో ఉదాహరణమునకు కొన్నిచూడవచ్చును. 'మానిని'యన్న విశేషవృత్తమున్నది. దీనికి ప్రతిపాదమున ఏడు భగణములు, చివరనొకగురువుండును భగణము చతుర్మాత్రకగణము కాగా చతుర్మాత్రకగణములు పాదమున ఎనిమిదియుండు రగడభేదము (హరిగతి)నకు 'మానిని' నడక సన్నిహితముగా నుండును.

ఉదా:-

"తమ్ములు దానును ధర్మత నూజుఁడు తత్త్ర సంభృత సంభ్రమునై" (1-8-91),
4 4 4 4 4 4 4 2

చివర మరిరెండు లఘువులుగాని, మరొకగురువుగాని యున్నచో నిది పూర్తిగా హరిగతియే యయ్యెడిది ఈవిధముగ, మానినిమాదిరిగానే, 'కవిరాజవిరాజితము, గూడ హరిగతిరగడ గమనము గలదే 'మానిని'యొక్క పాదాదిగురువు రెండులఘువులయినచో, కవిరాజవిరాజితమగును అందువలన ఈరెండిటికి గమనములో మార్పుండదు. మరి 'లయగ్రాహి'యున్నది. ఇది పంచమాత్రకగణములు పాదమున ఎనిమిదేసియుండు రగడభేదము (విజయభద్ర)నకు సరిపోవును. తాకపోయిన, చివరకొక మాత్ర తగ్గును.

ఉదా:-

'చందనత మాలలత లందునగ రుద్రుమము
5 5 5 5

లందుగద జీవనము లందులన లీమా (1-5-189)
5 5 5 4

చివరి నాల్గుమాత్రలకు మరొకటి చేరినచో రగడసంపూర్ణమయ్యెడిది. ఇక 'మత్తకోకిల' యన్నది ఏడేసి మాత్రలగణములు పాదమునకు నాలుగేసియుండు రగడభేదము (హరిగణి) నకు సరిపోవును. కాని మత్తకోకిల చివర హరిణగతి కన్న రెండుమాత్రలు తగ్గును.

ఉదా:—

'ధారుణిధర ధర్మతత్త్వని ధానదానవ దరసం' (2-1-278)
7 (3 + 4) 7 (3 + 4) 7 (3 + 4) 5 (3 + 2)

తరళముకూడనిట్టిదే. మత్తకోకిల పాదాది గురువు రెండులఘువులయినచో తరళమగును. కావున నీరెంటికి గతిభేదము గలదు. ఇట్లే ఎనిమిదిమాత్రల (3 + 3 + 2) గణములు పాదమునకు రెండేసియున్న పద్యములు రథోద్ధతము, తోటకము, స్వాగతము. ఈచూపినవన్నియు స్థాలీపులాకన్యాయముగనే పరిశీలించినచో చాలావరకు నీవిధమైనవే. అయితే మాత్రాసంఖ్యాగణములవలె,

వైవిధ్యమునందలి అక్షరగణములు గురు లఘు క్రమమందు వైవిధ్యమును సమమాత్రాసంఖ్యతో కలిగియుండలేవు. కారణ మీ గణములే వీటికి నియతమగుట. అందువలన వాటిలోని వైవిధ్యము వీటి యందు రాకున్నను, ఒకే నియతగమనము వీటియందుండును ఈ విధముగా గమనించినచో దేశీయచ్ఛందస్సుల గమనస్ఫూర్తి యున్న వృత్తమునే నన్నయగారు తెలుగునకనువని యెన్నిక చేసినారని చెప్పవచ్చును

విశేషవృత్తములను ప్రయోగించుటలో నన్నయగారుచూపిన ఈదారినే తిక్కనగారును అనుసరించినారని చెప్పవచ్చును.నన్నయగారు ప్రయోగించిన విశేషవృత్తములలో పదునాల్గింటిని తిక్కనగారుపయోగించినారు అంతేగాక క్రొత్తగా మరి ౭౪వృత్తముల నుపయోగించినారు. వీటిలో పలు వృత్తములందు రగడల గమనస్ఫూర్తి యున్నది. దోదక, తోటకతోదకములు చతుర్మాత్రాగణములు పాదమునకు నాల్గుగా సాగు మధురగతి రగడవంటివి. స్రగ్విణి ఇదివరకుచెప్పిన రథోద్ధతమువంటిది 'ప్రహరణకలిత'యు నిట్టిదే. 'పణవము' నిట్టిదే. 'మణిగణనికరము' గూడ మధురగతియే. లయవిభాతి పైనచెప్పిన లయగ్రాహి నడక గలది. 'మంజులభాషిణి'యన్నవృత్తము అచ్చముగా ద్విపద వలె సాగును.

ఉదా.-

'ధనమంత యుంటొలియ దారుణం బుగా (11-1-68)

చివరి గురువు రెండులఘువు లయినచో మూడింద్రగణములు ఒకసూర్యగణముగానుండును. 'యుంటొలియ' అన్నది అచ్చముగా ఇంద్రగణముకాకున్నను, పంచమాత్రాగణము ఇంద్రగణములలో పంచమాత్రాగణము లున్నవికదా. 'నగ' ఇంద్రగణమే. ఇది తిరుగబడినచో 'భల మగును. తిక్కనగా రుపయోగించిన వాటిలోక్రౌంచపద, నరసిజ భాస్కర విలసితములు చిత్రమైనగమనము కలవి. వీటిలో ఒక్కొక్క పాదము రెండేసి దళములుగా విరుగును రెండుదళములందును నాల్గేసి యుండును. అయితే పూర్వదళములందు గురువర్ణబాహుళ్యము, ఉత్తరదళములందు లఘువర్ణబాహుళ్యము. దీనితో ఒకచిత్రమైననడక వాటికి సిద్ధించినది ఉదాహరణకు సరసిజపాదము —

శ్రీర మ్యంతం బారగ బెంపూ
రిత మృగ మణివిర చితమకు టము లన్ (11-2-87.)

క్రౌంచపదపాదము —

'కౌరవ సేనా వీరుల లావులం
గడిమియు జలమును గడకయె లర్చన్.(11-1-166.)

భాస్కరవిలసితపాదము-

'కౌరవ నృపతిత నూజశ తంబున్
గంటెవ వనసుతు పటుభుజ లీలా' (11-2-50)

ఈ విధముగా నన్నయగారును, తిక్కనగారును విశేషవృత్తములను ప్రయోగించుటలో నొకవిధమయినపద్ధతినే అవలంబినట్లు స్పష్టమగును. ఏదోయొక విశేషవృత్తమనిగాక, అంతో యింతో దేశీయచ్ఛందః స్ఫూర్తిని గలిగియున్నవాటినే ఇరువురును స్వీకరించిరి. ఎఱ్ఱనగారును నన్నయగారు ప్రయోగించివాటినే ప్రయోగించుటవలన, ఆయనయు ఈఅంశమును గమనించియే సాగినారని చెప్పవచ్చును.

యతిప్రయోగము దృష్ట్యా గమనించవలసిన యంశమేమనగా, నన్నయగారుస్రగ్ధర, మహాస్రగ్ధరయన్న రెండుతప్ప,పాదమునందు రెండేని,మూడేనియతులు చెల్లించుపద్యములనుగ్రహించలేదు ఈవిధముగా యతిచెల్లించవలసియున్న మానిని,కవిరాజవిరాజితమువంటివాటియందు నన్నయగారొకే స్థలమున యతిపాటించేవారు. తిక్కనగారు తాను రచించిన మూడు 'మానిని'వృత్తములలో రెండిట నన్నయగారినే అనుసరించినను, ఒకదానియందు మూడుచోట్లు యతి చెల్లించినారు. అట్లే రచించిన నాల్గుకవిరాజవిరాజితములలో మూడింట నన్నయగారివలె, ఒకదానియందుమాత్రము మూడు చోట్ల యతిచెల్లించినారు కవిజనాశ్రయకర్త చెప్పిన లక్ష్యలక్షణ ప్రభావము నన్నయగారినుండి ఒక్కొక్కపద్యమున తిక్కనగారు భేదించుటకు హేతువుకావచ్చును. ఇక క్రౌంచపద, నరసిజ, లాస్కరవిలసితములలో యతి ప్రయోగించుటలో నొకయంశము గమనించవలసియున్నది .క్రౌంచపద, నరసిజములలో పూర్వదళమందు ప్రాసయతి, ఉత్తరదళమందుసాధారణయతి. అయితే, ఈ సాధారణయతి ప్రయోగము దేశీయమైన సీసపద్యమందువలెగాక పూర్వదళాదివర్ణము ననుసరించి యుండును. (ఉదాహరణమున కింతకుముందు చూపిన ఈపద్యపాదములందు గమనించవచ్చును) మరిలాస్కరవిలసితముగూడ పైరెంటివంటిదే. కాకున్నచో, మాత్రాసంఖ్యదృష్ట్యాసమమే అయినను వర్ణసంఖ్యదృష్ట్యా వాటియందుకన్నదీనియందు ఒక్కవర్ణమెక్కువ. అయితేఇందులో పూర్వదళాదివర్ణమునకు ఉత్తరదళాదివర్ణమును సాధారణయతిగా చెల్లించుటేతప్ప, పూర్వదళమున ప్రాసయతిగాని, ఉత్తరదళమున సాధారణయతిగాని లేదు. ఇట్లు లేకుండుట, పైపద్యములం దట్లుండుట కవిజనాశ్రయము చెప్పినదే. తిక్కనగారు కవిజనాశ్రయమునే అనుసరించినారేమోకాని, లాస్కరవిలసితమందును పూర్వదళమున ప్రాసయతి. ఉ_రదళమున సాధారణయతియును నుపయోగించియుండవలసినది. ఎందుకనగా దాదాపుగా నీమూడింటి నడక ఒకేధోరణికి చెందినదిమరి

ఈ మూడింటియందు -ఇవి నన్నయగా రుపయోగించని విశేషవృత్తములు_యతి,ప్రాసయతి ప్రయోగ మెట్లున్నను, మిగిలినచోట్ల పద్యములందు యతిస్థాననిర్ణయ విషయమున తిక్కనగారు దాదాపుగా సర్వత్ర నన్నయగారినే అనుసరించినారని చెప్పవచ్చును. మాలిని, కవిరాజవిరాజితము స్థితిఈ చెప్పిన యంశమువైపే మొగ్గచూపును.

ఈవిధముగా దేశీయ చ్ఛందఃస్ఫూర్తినిఉద్దేశించి వృత్తప్రయోగమునెరపినను, ఆస్ఫూర్తికి మూలమయిన రగడలనుగాని, ద్విపదనుగాని, నన్నయగారేకాదు, తిక్కనగారును తమ రచనయందెచ్చటను ప్రయోగించలేదు. కన్నడముపద్ధతిలో చూచినచో తెలుగున దేశీయ చ్ఛందస్సులుచాలానే యున్నవి. వీటిలో నన్నయగారు ప్రచురముగా ప్రయోగించినవి నాలుగుమాత్రమే అవి ఇవి.

సీసము, ఆటవెలది, తేటగీతి, కందము. మరివిశేషములుగా ప్రయోగించినవికూడ నాలుగే.

తరువోజ,మధ్యాక్కర,మధురాక్కర,ఉత్సాహము ద్విపదను నన్నయగారుగాని,తిక్కనగారు గానిప్రయోగించలేదనిచెప్పబడినది. కాని ద్విపదకురెట్టింపయిన తరువోజను ఇరువురును ఉపయోగించి నారు నన్నయగారికన్న ముందే తరువోజకు ప్రయోగము తెలుగులో ఉన్నది. ఉన్న దనుటకు క్రీ శ 865 ప్రాంతమందలి అద్దంకిశాసనము ప్రమాణము. పరమమహేశ్వరుడు, సేనాపతి యగు పండరంగు గూర్చిన ప్రస్తుతి శాసనమున నున్నది. ఆయనవేయించిన దానశాసనమిది. ఇందులో నొకతరువోజ యున్నది నిజమునకు తరువోజ సహజమయిన పద్యముకాదు. రెండుద్విపదపాదము లను చేర్పగా తరువోజయందలి యొకపాద మగును. సామాన్యముగా దేశీయచందస్సులందు పాద మంతట దాదాపు సమగణములుండును అనగా ఒకేజాతికిచెందిన గణములుండును ఒకవేళఉన్నచో విజాతిగణములు పాదాంతమందుండును. అంతేకాని ఒకజాతి గణములమధ్య విజాతిగణ ముండదు. అట్లున్నచో ఏదోఒకమార్పువలన ఆవిధమయిన పద్యము రూపొందించబడినదని చెప్పవచ్చును. ద్విపదపాదమున వరుసగా మూడింద్రగణములు, చివర నొక సూర్యగణ ముండును. ఈ ద్విపద రెండుపాదముల నొకపాదముగా చేసినచో మూడు, మూడింద్రగణములమధ్య నొకసూర్యగణము, పాదాంతముననొక సూర్యగణము ఏర్పడును. అందువలన ఎంతచేసినను తరువోజపాదము, రెండు ద్విపదపాదములుగా కచ్చితముగా విరుగును అందువలన యీరెంటికి ఏకపాదత్వము కలిగించుటకు పూర్వదళమునననుసరించియే ఉత్తరదళమందును యతిప్రయోగింపబడును. పూర్వోత్తరదళములకు యతిభేదించక పోవుటచే, ఏకపద భ్రాంతికలుగును. మరియొక టేమి యనగా, ద్విపద రెండుపాద ముల పద్యము. ఈయంశమును దానిపేరే చెప్పుచున్నది. కాని తరువోజ నాల్గుపాదములది ఈ నాల్గు పాదములని సిద్ధారించుటకు ద్విపదయందైచ్ఛికమైన ఆది ప్రాసతరువోజయందు నియతము చేయబడి నది. ఈవిధముగా ఎనిమిది ద్విపదపాదములు, లేదానాలుగుద్విపదలు ఒకతరువోజ పద్యముగా రూపొందింపబడినది ఇదిఏనాడు రూపొందినదోగాని, తెలుగున మరియొకటి ఇట్టిదిలేదు (మధ్యాక్కరయందీపద్యస్ఫూర్తి కొంతయున్నది. అదితరువాత చెప్పబడును) తరువోజగా కన్న దీనిని ద్విపదగా నుపయోగించుకొనుటయే మేలు. కానిద్విపద రెండుపాదము లగుటవలన,నాలుగుపాదములు గలది పద్యమన్న యొకానొక సంప్రదాయమును దృష్టియం దుంచుకొని, నన్నయగారు ద్విపదను గాక తరువోజ నుపయోగించియుందురనిపించును, కాని ఆయనకుగాని, తిక్కన, ఎఱ్ఱనలకు కాని దీనియందెక్కువ ఆస్థయున్నట్టు కన్పించదు ఉన్నంతలో నన్నయగారికే కొంచెమధికము, వీరు ముప్వురు తరువోజను వరుసగా 12-6-2 మార్లు మాత్రమే ప్రయోగించిరి ఏదెట్లయినను ఒక విధముగా కవిత్రయము ద్విపదనుపయోగించినట్లే చెప్పవచ్చును.

'మధ్యాక్కర'యు ఒకవిధముగా తరువోజ వంటిదే తరువోజయందలి ఉభయదళముల నుండి ఒక్కొక్క ఇంద్రగణమును తగ్గించగా, అనగా, ఒక్కొక్క ఇంద్రగణము తగ్గిన ద్విపద పాదములను రెంటిని గూర్చగా- మధ్యాక్కర ఏర్పడినది అయితే మధ్యాక్కర పాదముగూడ 2 ఇంద్ర + 1సూర్య గణములతో రెండు దళములుగా విరిగినను, తరువోజ యందు వలె ద్విపద పాదములు స్ఫురించవు. కారణము ఒక్కొక్క ఇంద్రగణము తగ్గుట. అది ఈ రెంటికి ప్రధాన భేదము. మరియొక గమనించవలసిన యంశ మేమనగా, తరువోజలో పూర్వోత్త

ార్థములు కచ్చితముగా ద్విపదపాదము లగుటవలన గీతపదయందు వలెనే, రెండేసి గణముల కొకసారి యతి చెల్లింపబడినది కాని మధ్యాక్కరయందు ద్విపదస్ఫూర్తి లేకపోవుటచే రెండు దళములుగా పాదములను విడదీయకుండ ప్రథమగణాద్యక్షరమునకు ద్వితీయ దళమందలి రెండవగణాద్యక్షరమును యతిచెల్లించుపద్ధతి అవలంబించబడినది. అనగా మధ్యాక్కరపాదమున ఐదవగణాద్యక్షరము యతి చెల్లింపవలసినస్థానము ఈ పద్ధతి నన్నయగారికిముందే మధ్యాక్కరయందు ప్రవేశించినది. యుద్ధమల్లుని బెజవాడ శాసనము నన్నయగారికి ముందుదే అందుఐదు మధ్యాక్కర పద్యములన్నవి. వాటిననుసరించియే నన్నయగారు తాను రచించిన భారతభాగమున శిరమధ్యాక్కరలను ప్రయోగించినారు; నన్నయగారి ననుసరించి ఎఱ్ఱనగారును ఒకే ఒక మధ్యాక్కరను ప్రయోగించినారు, అయితే యతిస్థానమున భేదించినారు. మధ్యాక్కరను ఉభయదళములుగా భావించి, తరువోజయందువలె పూర్వోత్తరదళాద్యక్షరములకు యతి పాటించినారు మరి అక్కరను వాడుటయే, నన్నయగారిననుసరించికాగా, యతిప్రయోగవిషయమున నీయతిక్రమమెందుకు? దీనికి రెండుకారణములు చెప్పవచ్చును. నన్నయగారి తరువాత ఎఱ్ఱనగారిదాక ఎవరును మధ్యాక్కర నుపయోగించలేదు, కానికవిజనాశ్రయకర్తదీనికి లక్షణముచెప్పుచు గణక్రమమును చెప్పినాడుకాని, యతివిషయ మేమియు చెప్పలేదు. అయితే లక్ష్యమందు నాల్గవగణాద్యక్షరము యతి చెల్లింపబడినది. దీనిని ఎఱ్ఱనగారికి నన్నయగారినుండి భేదించుటలో నొకకారణముగా చెప్పవచ్చును మరియొకటి, నన్నయగారు తాము రచించిన 39 మధ్యాక్కరలలో 11 పాదములందు ఐదవగణాదియందు యతి చెల్లించుటతో బాటు నాల్గవగణాదియందును యతి చెల్లించినారు. ఆపాదము లివి

1. తడయక పుట్టినాఁడ తల్లిచేఁ దండ్రిచే విడువఁ. (ఆది. 4-102)
2. పరమ ధర్మాత్మకుఁడయిన పాండుభూపతి దొట్టినకల (సభా. 1-81)
3. ఇందుండు మీవని కృష్ణ మృగచర్మ కృతకుశాసనము (అర. 3-97)
4. నందుండఁ గాఁబనిచె ఋషి యను బుద్ధి నత్తన్విఁ ప్రీతి. (,,)
5. భూమికిఁ గురియించె వర్షములు సస్యముల్ వృద్ధి బొంద (అర 3-206)
6. వదలక వేపురు సుతుల బడయంగ వలతోవేపురకుఁ (అర 2-361)
7. మాయావిమాయాయుధములు మాకిచ్చి మాతోరణమ్ము (అర. 3 336)
8. తనరంగ బ్రహ్మ చర్యవ్రతస్థులై తగిలి నిత్యంబు (అర 4-40)
9. వినిన పుణ్యాత్ములును జదివిన వారు వినుమునూతేండ్లు (,,)
10. ప్రీతిని తచ్చరితంబు వినగ నభీష్ట మిందనిన (అర. 2-320)
11. కులజుండునీకు సేవ్యుండగు నతనిగొంచి యందుండు. (అర. 2-129)

ఈపాదములమొత్తము 39 మధ్యాక్కర పాదముల దృష్ట్యా తక్కువేకావచ్చును. కాని వీటి యందు నాల్గవ గణాదిని యతిచెల్లుట చూడగా ఈపద్ధతి నన్నయగారికి అసమ్మతము కాకాపో వచ్చుననియు, దీనికితగినట్లు కవిజనాశ్రయ కర్త లక్ష్యముంచుటయు, ఎఱ్ఱనగారు గమనించి యుందురు. కవిజనాశ్రయ కర్తమాత్రమిట్లు చతుర్థగణాదిని చెప్పుటకు కారణము, పైపాదముల

పరిశీలనము కావచ్చును. దానితోబాటు మధ్యాక్కరయన్న పేరునుబట్టి, తరువోజను బట్టి నడిమికి పాదమునువిరచి యతిచెల్లుట పద్యపాదమున కొక సమభారము కలిగించుననియు కావచ్చును. ఇది ఇట్లుండగా కవిజనాశ్రయకర్త లక్ష్యపద్యమందును, మూడవపాదమున, పై నన్నయగారి మధ్యాక్కర పాదములందువలె నాల్గవ, ఐదవగణాదులందు యతిచెల్లింప బడినది. అపాదమిది.

'విరచింపఁ బంపెఁ బ్రావళ్ల వెలయ, గవిజనాశ్రయందు' కవి-జాత్యాధి-(26).

అనగా, నన్నయగారనుసరించిన పద్ధతి కవిజనాశ్రయునకు అసమ్మతము గాదనుపించును. కాని తరువాతిలాక్షణికు లీయంశము లను గుర్తించక మధ్యాక్కరయందు చతుర్థగణాదియందే యతిచెప్పినారు.

దాదాపుగా లాక్షణికులందరును తమతమ గ్రంథములయందు అక్కరలకులక్షణములు చెప్పచునేవచ్చినను నన్నయగారితరువాత ఎఱ్ఱనగారుతప్ప మరియేకవియు మధ్యాక్కరను— అంతేకాదు- మరియేయక్కరను (అక్కరలుఐదువిధములు.నన్నయ ఎఱ్ఱనలు మధురాక్కరను గూడప్రయోగించినారు.దానిని గూర్చితరువాత ప్రస్తావింపబడును) ప్రయోగించలేదు. ఆధునికకాలమందు రాయదుర్గము నరసయ్యగారు తమ అభిజ్ఞానశాకుంతలమునందు మూడుమార్లు మధ్యాక్కరను (వీటిలో చతుర్థగణానేయతి) ఉపయోగించినారు. గాని ఎవరి దృష్టినవి యాకర్షించలేదు. ఆతరువాత శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు తమ శ్రీమద్రామాయణకల్పవృక్షమందు ఐదు అక్కరలను విరివిగాప్రయోగించినారు, అయితే మధ్యాక్కరలో యతిప్రయోగము ఇంతకుముం దుదహరించిన నన్నయగారి,కవిజనాశ్రయుని పాదములందువలె నాల్గవ, ఐదవగణాదిని-రెండుయతులను చెల్లించినారు. నన్నయ,ఎఱ్ఱనల రీతులకు సమన్వయము కలింగించుట కట్లు నియతముగా నుపయోగించియుందురు. అయితే, విశ్వనాథ మధ్యాకరలయందు మాత్రము నన్నయగారి పద్ధతిమాత్రమే అవలంబించబడినది శ్రీసత్యనారాయణ గారి మధ్యాక్కరల తరువాత పలుమంది ఆపద్యమును ఉపయోగించినారు.

ఇదంతయు నిట్లుండగా, నన్నయగారి మధ్యాక్కరలయందు గమనించవలసిన మరొక యంశమున్నది. మధ్యాక్కర ద్విపదపాదములలో కొంత మార్పువలన ఏర్పడినదని చెప్పబడినది కదా! కాని నన్నయగారి మధ్యాక్కరలలో ద్విపదగర్భితములైన పాదములు 44 దాక ఉన్నవి. వీనిలో కొన్ని సయతిక ద్విపదల గూడ గర్భించుకొన్నవి. ఉదాహరణమునకు-

'అవనరఙ్జుండయి వ్యాసుఁడేతెంచె' (సంతన త్తపని) (ఆది. 4-258)

'కపిల గడ్డంబును గపిలజటలును'(గవిలకన్నులును) ( ,, )

'ద్వాదశమాసిక వ్రతము నలుపుదు' (దరుణి మాయన్న) (ఆది. 8-188)

ఈవిధముగా గమనించవచ్చును. (కుండలీకరించిన భాగములను కలుపుకొన్నచో, నవి మధ్యాక్కరపదములు చివరిదానిలో ఉత్పలవు చెత్తుగరయున్నది)

నన్నయగారువయోగించిన మధ్యాక్కరలలో కొన్ని పాదములు ఉద్దిష్టమయిన లక్షణమునకు భిన్నముగా నున్నట్లు కీ.శే. గిడుగు సీతాపతిగారు ఉదహరించినారు. వాటికిలక్షణము సరిపుచ్చుటకు

పదిమంది పలుసూచనలు చేసినారు. కాని ఏఒక్కరి సూచనయు చూపబడిన పాదములన్నిటిని సంలక్షణము చేయలేనిదే. ఆఉదహరించిన పాదములలో లేఖక ప్రమాదమువలన కలిగిన అలక్షణత్వమే ఎక్కువ వానిలోనున్నది. వానినికొంచమటునిటుగా 'సవరించుకొన్నచో' దాదాపుగా నన్నియు సలక్షణములే యగును. అపాదము లిప్పటికి 19. అవి ఇవి.

1. తనుమధ్య లానొక్క కన్యక సురనదీ తటమునమున్ను (ఆది-4-141)
2. భూపాలనీకు నిక్కోమలియందుఁ బుట్టినసుతుఁడు (ఆది-4-176)
3. నీవరోక్షంబున రాజు గావలయు నెమ్మినిట్లగ. ( ,, )
4. తన దివ్యశక్తి నప్పాశములు విడిచి తన్మునినాథు (ఆది-7-122)
5. నంగురు కులహాని కరుదై ధారుణీ నాథ నీసుతుఁడు. (సభా-2-182)
6. అమరంగ ధర్మువు రక్షించుఁ బ్రీతి నని శత్రులందు (అర-1-225)
7. కలుగు దెలింగియు సాయపూర్వమున గడఁగి తత్సిద్ధి (అర-294)
8. చలితుడై నిజనాథు నిజానాథు నబగిన దాన చనియెనవ్వార్త (అర-2-149)
9. ఏమేను మున్ను పూజింతుము రుద్రునిందనివేద్క (అర-2-256)
10. వసుంధ్ర బోలెదు సుతుల సూర్వర బడయంగవలతో (అర-2-351)
11. వసుంధ్ర సూర్వర తెనయగు సుతుల బడయంగవలతో (,,)
12. అరుణ సరోరుహ దళమృదులంబు లైన యత్తరుణి (అర-3-299)
13. వెరగనాకారణమున నిట్టిదుఃఖ భారముదాల్చె ( ,, )
14. అరిగె నీశాను దిక్కునకు నీయనుజుఁ దనిలవేగమున (అర-3-378)
15. మాయ మార్గుడగు వాని గమనంబు మందయైయుండ (అర-3-3?8)
16. తోనేగె నుత్తరము మించి ధర్మనిత్యుఁడు ధర్మజుండు (అర-4-3)
17. అరంగ ననుదు నిషధదేశంబున కఱిగి యాహంస (అర-2-22)
18. భూమికి వర్షముల్ గురియించెను సస్యముల్ వృద్ధిబొంద (అర-3-206)
19. ఏనేఁడు లయ్యెను మనయర్జును దేఁగియుంత కేతెంచు (అర-4-3.)

(వీటిలో 1-2-3-15 దా దివాకర్ల వెంకటావధానిగారు చూపినవి 17-18-19 దేకుమళ్ల రాజగోపాల రావుగారు చూపినవి. మిగిలినవి గిడుగువారు చూపినవి) పై19 పదములలో క్రీకీరలుంచిన 21 చోట్ల గణభంగము జరిగినట్లు కనిపించుచున్నది. ఆయా తావులలో ప్రయోగింపబడవలసిన సూర్య-ఇంద్రగణములకు బదులు తద్విరుద్ధములు కనిపించుచున్నవి. అయితే, మొదటనే చెప్పినట్లు లేఖక ప్రమాదములవలన గణభంగముల పాలైన పాదములు కొన్నియున్నవి. అవి ఇవి. 1వ పాదమున 'కన్య' బదులు 'కన్యక' అని చివరికకారము ఎక్కువగుట,

3వ పాదమున 'గావలయురాజు' కుబదులు 'రాజుగావలయు' అని పదములు వెనుకముందు లగుట.

4వ పాదమున 'పాశము లుడిచి' కిబదులు 'పాశములు విడిచి అని 'వి' కారమధికమగుట,

5వ పాదమున 'నంగురుకులహాని కరుఁడు ధారుణీనాథ నీసుతుఁడు' ఇది కుదరదు. మూడవ స్థానమున సూర్యగణమురాదు.

7వ పాదమున 'పూర్వము' కుబదులు 'పూర్వమున' అని 'న' కారమధిక మగుటవలన.

8వ పాదమున 'దతిగి నందోన' కుబదులు 'దతిగినదోన' అని పూర్ణబిందువు తరుగుటవలన.

13వ పాదమున 'మననిట్లిదుఃఖ' కుబదులు 'మననిట్టిదుఃఖ' అని 'ట్లి' యన్నది 'ట్టి'అగుట వలన.

15వ పాదమున 'మాయ మార్గుండగు' కుబదులు 'మాయమార్గుడగు' అని పూర్ణబిందువు తరుగుటవలన.

16వ పాదమున 'నుత్తరమించి' కిబదులు 'నుత్తరముమించి' అని 'ము' కారమధిక మగుట వలన.

ఈపాదములందు గణభంగము సంభవించినట్లు స్పష్టమగును. ఇక సూర్యగణములుండవలసిన తావులలో కొన్నిచోట్ల- అనగాపై 6-13-17-18-19 పాదములలో నగణము, ఆరవ పాదమున గగముకన్పింపుచున్నవి. ఇవి సూర్యగణములు కావని సామాన్యముగా భావింపబడుచున్నవి. కాని సూర్య- ఇంద్రగణముల స్వరూపము విషయమున అనంతాదులకును, తత్పూర్వులైన కవిజనాశ్రయ కావ్యాలంకారచూడామణి కర్తలకును మతభేదముకలదు. వీరిరువురి మతమున గగ-సగణములు సూర్యగణములే. మనమీనాడు పాటించునది అనంతాదులమతము. అనంతాదులమతమున ఈ రెండును సూర్యగణములుకావు. (ఈగణముల విషయమున లాక్షణిక మతభేదమునుగూర్చి 'ద్విపద గణములు'(జూన్1969 భారతి) 'దేశీయగణములు: లాక్షణికమతభేదము'(నవంబరు 1978సాహితి) అనుసీవ్యాసములందు విపులముగా చర్చింపబడినది) మరి నన్నయగారివిషయమున అనంతాదులమతము కన్న కవిజనాశ్రయకర్త మతమును అన్వయింప జేయుట సమంజసము. కావున, పైపాదములందు సూర్యగణములకు గగ-సగణములు ప్రయోగింపబడినవి. సలక్షణములే యనిచెప్పవలెను. ఇట్లీ పాదము లన్నియు సమన్వితములు కాగా 2-9-10-11-12-14 అన్న ఆరు పాదములు మాత్రము అసమన్వితములుగా మిగులును. వీటిలో 10-11 పాదములందున్న 'పదుంద్ర'యన్న పదములు డా. అవధానిగారి సూచననుసరించి 'పదుగుర' యనుకొన్నచో అవియునమన్వితములై, నాల్గు మాత్రమే మిగులును. అవి ఈక్రింది విధముగా సవరింపబడవచ్చును

| ఉన్నపాఠము | | సవరింపబడినపాఠము |
|---|---|---|
| 2. | కోమలియందు | కోమలివలన |
| 9. | మున్ను పూజింతువురుద్రు | పూజింతుమనురుద్రుని |
| 12. | మృదులంబులైన | మృదులములైనట్టి |
| 14. | ఈశానుదిక్కునకున్నీ యనుజుండనిల | నీయనుజుండీశాను దిక్కునకనిల |

పైవాటిలో 2 వపాదమున నొక్కదాని యందు తప్పమిగిలిన వాటిలో పదాలువెనుక ముందు మారుటలు, తగ్గిన, హెచ్చిన అక్షరముల సవరింపులు మాత్రమే జరిగినట్లు చూడవచ్చును. ఈవిధముగా గణభంగమాభాసించిన ఈపాదములు సమన్వితమగును. ఉన్నపాఠములను ఏసవరింపులు,

చేయక సమన్వితములు చేయుటకుదరదు. ఎందుకనగా. 'ఉన్నపాఠము' లన్నివేవో నిర్ధారితములు కావు. తాళపత్రాల యందలివ్రాతలు ఎంతలేఖన ప్రమాదముతో నిండియున్నవో ఆయాతాళపత్ర గ్రంథ పరిశోధకులకు తెలియనిదిగాదు.

మరి ఈ పాదములను గూర్చి ఇంతగా చెప్పుకొనుట యెందుకనగా. నాటికి నేటికి ఇది ఒక అపూర్వమైన పద్యమగుట. అధునికకాలము అనాటి నన్నయగారి ఈ పద్యము లందిపుచ్చు కొనుటవలన.

అక్కర లైదును కన్నడమున ప్రసిద్ధములే కానితెలుగున ఒక్కమధ్యాక్కరనే నన్నయగారు అధికముగా ప్రయోగించినారు కాగా మిగిలిన నాలుగింటిలో ఒక్క మధురాక్కరను, అదియు ఒక్కసారి మాత్రమే ప్రయోగించినారు. ఎఱ్ఱనగారు మాత్రము రెండుమారులు ప్రయోగించినారు, ఒక్కమధ్యాక్కరయందు తప్ప మిగిలిన నాలుగింటియందును చంద్రగణముల ప్రయోగమున్నది. చంద్రగణమున్న ఏపద్యమును నన్నయగారు ఒక్క ఈమధ్యాక్కరలో తప్ప ఉపయోగించిలేదు. చంద్రగణములలో కనిపించు నధిక వైషమ్యమిందుకు కారణమేమో. ఇక తిక్కనగారు ఈఅక్కరల జోలకేపోలేదు.

'ఉత్సాహ' మును నాల్గుమారులు నన్నయగా రుపయోగించినారు అయితే రెండు ఆశ్వా సాంతము లందే యున్నవి రెండుమాత్రమే కథాశరీరమందున్నవి. తిక్కనగారేడుమారులు, ఎఱ్ఱన గారు రెండుమారు లుపయోగించినారు. చూడగా కవిత్రయమునకీ 'ఉత్సాహ' పద్య ప్రయోగమునం దుత్సాహము తక్కువే యనిపించును. వరుసగా ఏడు సూర్యగణములు + ఒకగురువు, ప్రతి పాదమందుండుట 'ఉత్సాహ' లక్షణము. అయితే ఈ పద్యమునందొక విచిత్రమున్నది. అన్నియు సూర్యగణములు 'గగ'ములనే ఉపయోగించినచో నది 'సుగంధి' వృత్తమగును. మరి 'న' గణములనే ఉపయోగించినచో 'విచికిలిత' వృత్తమగును. అయితే ఇది 'ఉత్సాహ'మగుటకు గల - నగణముల కలగలుపే యుండవలెననవలెను. గాని, ఈ కలగలుపు తప్పనిసరి యని యే లాక్షణికుడును చెప్ప లేదు. అయితే, సుగంధి, విచికిలితములు ప్రసిద్ధములు. నన్నయగారు ఉత్సాహమును ప్రయోగించిన రీతి ననుసరించియే గల- నగణముల కలగలుపు తరువాతివారు పాటించినారనవలెను.

పైనాల్గు దేశీయచ్ఛందస్సులు విశేష పద్యములుగా భావింపబడగా సీసము-ఆటవెలది-తేట గీతి-కందము అనువాటిని ప్రచురపద్యముల జేసినది నన్నయగారు. తిక్కన, ఎఱ్ఱనలేగాక సర్వాంధ్ర కవులును దీనినే అనుసరించినారు.

వీటిలో సీసపద్యమొక చిత్రమైనది ఒక విధముగా చెప్పినచో నిది తరువోజవంటిది. తరువోజపాదమున ఇంద్రగణముల మధ్యనొక సూర్యగణమున్నదిగదా! దానిని తీసుకవచ్చి పాదాంతమునచేర్చినచో సీసపాదమగును. దీనివలన తరువోజ పూర్వోత్తరదళముల యందున్న గణసమానత్వము సీసమునందు తప్పినది. ఇందుపాద పూర్వదళమున 4 ఇంద్రగణములు, ఉత్తరదళమున 2ఇం + 2సూ. గణములుండును. గణసంఖ్యసమానమైనను, వాటిస్వరూపస్థితి భిన్నము. తరువోజలో రెండు ద్విపదలను ఏకపాదముచేయుటకు, ఉత్తరదళమున యతిపూర్వ దళమ్మునన్ననుసరించి చెల్లించుట జరిగినది. కాని సీసమునందు ఆ నియమము కనిపించదు. ఏదళమున

కాదళమునకే యతి. మరి మొదటినుండి ఇట్లేయున్నదా? లేక యీస్థితి మధ్యలోకల్పితమైనదా? యన్నది విచారించవలసిన యంశము.

సీస పద్యము నన్నయగారికి ముందే శాసనములందు కన్పించుచున్నది. కందుకూరి శాసనమందొక సీసము, ధర్మవరము శాసనమందొక సీసపద్యమున్నది. ఇవి రెండును నన్నయగారికి పూర్వపువే. వీటిలో ధర్మవరశాసనపు సీసమున సర్వత్ర ప్రాసయతి, కందుకూరి శాసనమున కొన్నిపాదములలో ప్రాసయతి, కొన్నిటియందు సాధారణ యతి ఉపయోగింపబడినది. అయితే సాధారణయతి ప్రయుక్తమయిన పాదమున ఉత్తరదళము పూర్వదళము ననుసరించియున్నది.

ఉదా:

శ్రీనిరవద్యుణ్డు - చిత్రజాతసముణ్డు
శివపదవరరాజ్య - సేవితుణ్డు.

ఈవిధమయిన ప్రయోగమువలన ఉభయదళము లేకపాదత్వము సిద్ధించుచున్నది. కాని ప్రాసయతి ఉపయోగించిన ఈపద్యపు పాదములందు, ధర్మవరశాసనపద్యమందును, ఉభయదళములందు ప్రాసయతి భేదించుచున్నది.

కందుకూరి శాసనపద్యమున—

'ఖలుఞు నన్పతరిపుబలుడు దాహవరాహ
దణ్డమోద్యసి ఘూనసుణ్డ గణిత

ధర్మవరశాసనపద్యమున—

'త్రోఘాసనం బెక్కి రాహసునోడిచిన
వల్లభుకొల్పునవెల్ల నెఱుఁగ......'

ఈ స్థితినిబట్టి యొక యంశము గ్రహింపవచ్చును. సీసమందు సాధారణయతి నుపయోగించినచో ఉత్తరదళము పూర్వము ననుసరించవలెనని, ప్రాసయతి నుపయోగించినచో భేదించవచ్చునని యొక యభిప్రాయ మానా డుండియుండును. కాని సాధారణయతి విషయమున నున్న నియమమునే, ప్రాసయతి విషయమునకూడ ననుసరించుట సమంజసముగా నుండెడిది. ఇట్లు కాకుండుటచే ప్రాసయతి విషయమున వెసులుబాటుండి, సాధారణయతి విషయమున లేకపోవుచున్నది. అందువలన నన్నయగారు రెండిటి విషయమునను వెసులుబాటు కల్పించినారు. దీని వలన ఒక చిత్రమయిన పరిస్థితి ఏర్పడినది. పాదమందలి పూర్వోత్తరదళములు ఒకేపాదముగాక రెండుపాదములుగా రూపొంది నట్లయినవి. కాగా, నాలుగుపాదములుగా రూపొంది నట్లయినది. కాగా, నాలుగు పాదములు ఎనిమిదిపాదము లయినచో బేసిపాదము లొకవిధముగా, సరిపాదము లింకొక విధముగా నేర్పడినవి. ఇట్లు బేసి, సరిపాదములు భిన్నగణ క్రమముతోనుండుట ఆటవెలది పద్యమందున్నది (కందమందున్నను, దాని కారణమువేరు అది ముందుముందు ప్రస్తావింపబడును) అందుకనియే కావచ్చును, శాసనపద్యములందు ఈసీసపాదముల చివర ఆటవెలదియే చేర్పబడినది (కందుకూరి శాసనమందు సీసమునకు చేర్చబడిన గీత భాగము ఆద్యంతపాదము లలోని ఆద్యంతభాగము ఏకొంచెమో తప్ప మిగిలినది శిథిలమైనది. ఆ మిగిలిన భాగమును పరిశీలించినచో, అది ఆటవెలదియగుట స్పష్టము) మరి ఈ ఆటవెలదికి బదులు తేటగీతియు చేర్చుటయన్నది

నన్నయగారే మొదలుపెట్టినట్లు కన్పించును. ఈ పద్ధతి సూక్ష్మమగుట చేతనేకావచ్చు, నన్నయగారుపయోగించిన 251 సీసపద్యములలో 26 మాత్రమే తేటగీతి చేరిన సీసపద్యములు. మిగిలిన 225 సీసపద్యములును ఆటవెలదితోనేయున్నవి. దీర్ఘమయిన ఈ పద్యములో కొంచెము గతిభేదము కలిగించుటకు నన్నయగారు ఈ మార్పు ప్రవేశపెట్టియుందురు. మరియొకటేమనగా, సీసపాదములను ఒకవిధముగా-అనగా 1-2, 5-6వ ఇంద్రగణములకు నల-నలములనే ఉపయోగించినచో సీసపాదమందలి ఉభయదళములు ఆటవెలది రెండు పాదములగును. నల-నలములను వరుసగా నుంచినచో (IIII, IIUI) మూడు సూర్యగణములు (III, III, IU) అగును. ఆటవెలదికి మొదటి పాదమున 3సూ + 2ఇం. గణములును, రెండవపాదమున 5 సూర్యగణములుండునుగదా। పైన చెప్పినట్లు నల-నలములను ప్రయోగించినచో సీసపు నాల్గుపాదములు రెండు ఆటవెలదులగును. యతి చెల్లించు స్థానముకూడ మారదు. మరి ఇట్టిపాదములకు మరో ఆటవెలదికన్న, తేటగీతిని చేర్చుటతో ఈ 'చేర్పు' వలని ప్రయోజనము సమకూరును. ఈ దృష్టితో నన్నయగారుచేసిన ఈ ప్రయోగము, తరువాతి కాలమున, ఈనాటి వరకు చాల విరివిగా అనుసరించబడినది ఆటవెలది లేదా తేటగీతి చేర్చవచ్చునన్న వెసులుబాటుగూడా దీనివలన ఏర్పడినది.

ఇదిట్లుండగా, పైనచెప్పినట్లు సీసపాదము ఒక్కొక్కటి రెండు పాదములుగా మొత్తము ఎనిమిదిపాదములుగా ఏర్పడినను, నాల్గుపాదములనుటయే ఒకసంప్రదాయముగానున్నది, అయితే నన్నయగారు ఈ ఎనిమిది పాదములలోలేదా ఖండములలోయతి, ప్రాసయతులను ఉపయోగించుటలో నొకపద్ధతి ననుసరించినారు. ఒకబేసిపాదము (ఖండము) ఒక సరిపాదము (ఖండము) కలిపి ఒక మొత్తముగా ఈ పద్ధతిగమనించవలెను ఈపద్ధతిననుసరించి సీసపద్యము 16 భేదములతో నేర్పడును. అవిఇవి.

1. యతి/యతి
2. యతి/ప్రాస
3. యతి/ప్రాస
4. యతి/ప్రాస-యతి
5. ప్రాస/యతి
6. ప్రాస/ప్రాస
7. ప్రాస/యతి-ప్రాస
8. ప్రాస/ప్రాస-యతి
9. యతి-ప్రాస/యతి
10 యతి-ప్రాస/ప్రాస
11. యతి-ప్రాస/యతి- ప్రాస
12. యతి-ప్రాస/ప్రాస-యతి
13. ప్రాస- యతి/యతి
14 ప్రాస. యతి/ప్రాస
15 ప్రాస-యతి/యతి-ప్రాస
16. ప్రాస- యతి/ప్రాస- యతి

ప్రాస అనగా 'ప్రాసయతి' అని. యతి అనగా సాధారణయతి అని. ఇక, 'యతి/యతి' అనగా సీసపాదములందును, గీతపాదములందును సర్వత్రసాధారణ యతి ప్రయోగింపబడును. యతి-ప్రాస/యతి-ప్రాసఅనగా సీసపు బేసిపాదము (పూర్వదళము)లందుయతి, సరిపాదము(ఉత్తరదళము)లందు ప్రాసయతి, మరియుగీతపు బేసిపాదములయతి, సరిపాదముల ప్రాసయతి. ఈ విధముగా నన్నింటిని చూడవలెను. (నన్నయగారి ఈపద్ధతినితెలిపినవారు శ్రీ.శే. గిడుగుసీతాపతిగారు. అప్పకవీయమునకు వారువ్రాసిన పీఠికచూడవచ్చును)లెక్కకు ఈ విధముగా పదునారుభేదములేర్పడినను, 12-14-15

తరహాలకు చెందిన భేదములు నన్నయగారు ప్రయోగించలేదు. 12-15వ భేదములలో పైనుండు సీన పాదములందు, క్రింది గీతయందును యతి-ప్రాసయతుల నుపయోగించుటలో వ్యత్యాసమువచ్చును. సీనపుబేసిపాదాలలో యతియుండగా, గీతపు బేసిపాదములలో ప్రాసయతియుండును. ఇట్లే సరిపాదము లందును వ్యత్యాసము. ఈ కారణముగా ఈ రెండు తరహాలలో నన్నయగారి సీసములు వ్రాసి యుండకపోవచ్చును 3 వ భేదము ననుసరించి, 14 భేదము లుండవలసినదే, లేకపోవుట అను చితముగా జరిగియుండును. ఈవిధముయినయతి, ప్రాసయతి ఉపయోగమువలన ఆయాపాదములకు ఒక సాన్నిహిత్య మేర్పడినట్లు కన్పించును. అన్నిపద్యములకన్న దీర్ఘమయిన ఈ పద్యమందు ఈ సాన్నిహిత్య మొకవిధముగా అవసరమే. అయితే సీస గీత పాదాలన్నింటిలోను,సర్వత యతియో, లేనిచో ప్రాసయతియో మాత్రమే ప్రయోగించుట సహజము. అందుకనియే నన్నయగారు 153 పద్యములను సర్వత్రసాధారణయతితో, 30 పద్యములను సర్వత్ర ప్రాసయతితో ప్రయోగించి నారు ఇవి 1,3 తరహాలకు చెందినవి. వీటితరువాత 13వ భేదమునకు చెందినవి (21)9 తరహాకు చెందినవి (16) అధికముగానున్నవి. మిగిలిన 9 భేదములలో ఒకటినుండి ఐదువరకు సీన పద్యము లున్నవి.

అయితే నన్నయగారు ఇంతకచ్చితమయిన నియమములతో సీసపద్యము నుపయోగించినను- ఒక్క ఎఱ్ఱనగారే ఈ నియమములను అనుసరించినారు తప్ప, తిక్కనగారుగాని, మరియే తెలుగుకవి గాని పాటించలేదు. ప్రతిఖండమున యతియో, ప్రాసయతియో ఏదో ఒకటి ఉన్న చాలును. పద్యమంత ఒక పద్ధతిలో నుండవలెను. భావమెవరికిని లేకపోయినది. ఈ లేమియే తెలుగున సీసపద్యమున యతి-ప్రాసయత్యుపయోగమున ప్రాచుర్యము వహించినది.

మరి నన్నయగారు నైపద్ధతిని ఒక్కసీసపద్యమందే కాదు, దాని కనుబంధముగాగాక విడిగా ఆటవెలది. తేటగీతులను ప్రయోగించునప్పుడును, అనుబంధములుగాను నున్నప్పుడువలెనే యతి, ప్రాసయత్యుపయోగపద్ధతిననుసరించినారు. ఈ యనుసరించుట చూచినచో, నన్నయగారికి పూర్వము సీసపద్యమున కనుబంధముగాగాక, విడిగా ఆటవెలది, తేటగీతులకు ప్రయోగము లేదేమో యనవచ్చును. నన్నయగారికి ముందు వీటి ప్రయోగమునకు ప్రమాణములేదు. తేటగీతికి సీసపద్యానుబంధముగాకూడ ప్రయోగములేదు. అయినను, తేటగీతిని సీసమునకు ఆటవెలది ననుస రించి అనుబంధింపజేసిన నన్నయగారు ఉభయమందును ఒకేపద్ధతి ననుసరించినారు. ఈపద్ధతి ననుసరించి ఆటవెలది-తేటగీతి-ఒక్కొక్కటి ఆరేసిభేదములతో రూపొందినవి. అవి ఇవి

1. అన్నిపాదములయందు యతి
2 అన్నిపాదములయందు ప్రాసయతి.
3. బేసిపాదములయందు యతి, సరిపాదములయందు ప్రాసయతి
4. బేసిపాదములందు ప్రాసయతి, సరిపాదములయందు యతి.
5. పూర్వార్ధమున (బేసి + సరి) యతి, ఉత్తరార్ధమున ప్రాసయతి.
6. పూర్వార్ధమున ప్రాసయతి, ఉత్తరార్ధమున యతి.

లెక్కకు ఆరు ఉన్నను చివరి రెండు భేదములు నన్నయగారిలో లేవు. (అపవాదముగా ఆరవభేదమునకు చెంది ఒక ఆటవెలది మాత్రమే.(అరణ్య-2-173) మాత్రము కనిపించుచున్నది)

నన్నయగారి ననుసరించి ఎఱ్ఱనగారు తప్ప, సీసవిషయమునవలె ఈపద్యముల విషయము నను ఈ నియమములను తరువాతి కవులెవరును పాటించలేదు.

ప్రస్తుత ముద్రితప్రతులలో కనిపించు పాఠములలో ఈనియమము భంగమైనవి కొన్ని కని పించుచున్నవి. ఉదాహరణకు(అరణ్య-5-231)సీసపద్యము 'యతి-ప్రాస/యతి-ప్రాస తరహాకు చెందినది. కాని మూడవపాదము ఉత్తరదళమున ప్రాసయతికి బదులు సాధారణ యతియున్నది. ఆపాదమిది.

'సంపూర్ణ యౌవన సర్వలక్షణయుక్త'
గనియనురాగిల్లి-కమలనిలయ'

దీనికి పాఠాంతరముగూడ లేదు. ఇట్లే (అరణ్య. 4-234) తేటగీతి 'అన్నిపాదములందు సాధారణయతి' తరహాకు చెందినది కాని నాల్గవపాదమున ప్రాసయతియున్నది. ఆ పాదమిది.

'పురుషు(బ్రహ్మవిష్ణు( గృష్ణుని శరణుసొరుము'

దీనికిని పాఠాంతరములేదు. ఇట్లే ఇంకనుకొన్నియున్నవి. వీటిలో కొన్నింటికి పాఠాంతరము లింకను వెదుకవలసియేయున్నది. (పై పాఠములు సాహిత్యఅకాదమీ ప్రతియందును, ఉస్మానియా విశ్వవిద్యాలయ సంశోధితప్రతిలోను ఇట్లేయున్నవి )

మొత్తము భారతమున కందము తరువాత అత్యధికముగా కవిత్రయమువా రుపయోగించిన దేశీయపద్యము సీసము. ఆ తరువాత ఆటవెలదిని నన్నయగా రెక్కువగా ఉపయోగించగా తిక్కన, ఎఱ్ఱనలు తేటగీతి నెక్కువగా ప్రయోగించినారు. (ఎఱ్ఱనగారు మాత్రము సీసముకన్న తేటగీతిని 7మార్లెక్కువ ప్రయోగించిరి.

భారతము మొత్తము మీద అత్యధికముగా ప్రయోగింపబడినది కందము. నన్నయగారికి పూర్వమే కందపద్యమునకు తెలుగులో ప్రయోగమున్నదనుటకు 'అద్దంకి' శాసనము ప్రమా ణము. ఈ శాసనము సంస్కృతమయమయినను, తెలుగు నియమముల ననుసరించి సంస్కృత భాషలో వ్రాయబడిన కందపద్యమున్నది. తెలుగు నియమముల ననుసరించుట యనగా, యతి ప్రాసలతో నుండుట. ఒకపద్యమందే రెండును ఉండుట తెలుగు లక్షణమే. తెలుగులో( (ఆది) ప్రాసనియమములేని పద్యములున్నవి గాని, యతి నియమములేని పద్యములేదు. యతి యనగా తెలుగున విరామముకాదు, నియమితస్థానమున సమానాక్షర ప్రయోగము. ఆ కందపద్యమందు అది ప్రాస, సమానాక్షర యతిప్రయోగమున్నది. ఈనియమములతో కందపద్యము సంస్కృతమున వ్రాయబడినదనగా, దానికానాడు విరివియైన ప్రయోగ మున్నదనుకొనవలెను.

ఇదిట్లుండగా, సంస్కృతమున 'ఆర్య' అనియొక పద్యమున్నది. ఇది అయిదువిధములు. ఈ ఆర్యయే మరికొన్నిమార్పులతో నాల్గువిధములయిన గీతులుగా రూపొందినది. వీటిలో 'ఆర్యా గీతి' ఒకటి. ఈ ఆర్యాగీతియే తెలుగున కందముగా వ్యవహృతమగుచున్నది. అయితే సంస్కృత మున 'ఆర్య' లకున్న ప్రాచుర్యము గీతులకులేదు. ఆర్యాగీతికిదాదాపు ప్రయోగమేలేదేమో। ఏది

ఎట్లయినను, తనకుపూర్వమున్న కందమునకు నన్నయగారు కావలసినంత ప్రాచుర్యము తమ రచనలో సంపాదించి పెట్టినారు. ప్రాధాన్యము కల్పించినారు. ఎంతప్రాధాన్యమనగా, 'కందము చెప్పినవాడే కవి, యన్న నానుడి కలుగునంత.

కందపద్యమందు చతుర్మాత్రాగణములే ప్రయోగింపబడును. వీటిలో ఎదురునడక భాసింప జేయు జగణము కూడ నున్నది. ఈ పద్యమున బేసి పాదములు పొట్టివి, సరిపాదములు పొడుగువి, ఒక్కొక్క యర్థమందుండ వలసిన ఎనిమిది గణములలో బేసిగణము జగణముకారాదు కాని ఆరవ గణముమాత్రము జగణమో, నలమో, అగుట తప్పనిసరి. సరిపాదములు గుర్వంతములు కావలెను. ఇన్నినియమములు గల పద్యమునందు కవిత్రయమువారు ఎన్ని విధములైన గమనము లను ప్రదర్శించిరో- లెక్క లేదనవచ్చును.

ఇన్ని విధములయిన పద్యములను కవిత్రయము మహాభారతమున ప్రయోగించినను- గమనించవలసిన యంశ మొకటియున్నది. ప్రచురవృత్తములు లేదా పద్యములప్రయోగము సంఖ్యాబాహుళ్యము చేతనేగాక విషయముయొక్క ప్రత్యేకతనుగూడ దృష్టియందుంచుకొనక పోవుటచే నివిసామాన్యములయినవి. కాని విశేషపద్యములను ప్రయోగించు విషయమున మాత్రము ఒక ప్రత్యేకతయున్నది. నన్నయగారు ఏవిశేషపద్యమును ప్రయోగించినను, కథా విషయికమయిన ఏదో ఒక మలుపు, లేక ఒక అంశముయొక్క ప్రాధాన్యము, విశేషభావస్ఫూర్తి, ఇట్లే ఏదోఒక ప్రత్యేకత సర్వత్ర గమనింపవచ్చును అయితే ఫలానా అంశమునకై ఫలానా పద్యమన్ననియమము కచ్చితముగానేదియు లేదు. తిక్కనగారు రచించిన పదునేను పర్వములలో పదునాల్గింట విశేషవృత్తముల ప్రయోగములేదు. (స్రగ్ధరా- మహాస్రగ్ధర - తరువోజలకు తప్ప) కానిస్త్రీ పర్వమునందు మాత్రమువిశేషముగా విశేషపద్యముల గుప్పించినారు. ఇట్లుచేయుటకు స్థూలముగా నొకకారణము కనిపించును భారతము మొత్తమున నీపర్వమొక్కటియే అత్యంతము దుఃఖమయయినది. సౌప్తిక పర్వములో కురుపాండవుల వైరము, తత్ఫలముపూర్తియయినవి. కౌరవపాండవ మహావీరుల గణితముగ మరణించిరి. గడచిన యంశములను తలంచుకొని తలంచుకొని దుఃఖించుట, దుఃఖో పశమనమునకుకొందరు చెప్పు ఓదార్పుమాటలు, ఒక్కొక్క విషయమును తలుచు కొన్నప్పుడు కలుగు భావములు, ప్రవర్తనలు, కోప-పశ్చాత్తాపాదులు మొదలైన వైవిధ్య మిందిం తనరా నంశ యున్నది. ఈపర్వము ప్రధానముగా గాంధారిది. కౌరవపాండవు లిరువురును ఆమెకు కావలసినవారే. ఒక్కొక్కయంశమున పడెడు దుఃఖము, బాధ, కోపము మొదలైన ఒక్కొక్కవిధమైనవి. మనోగతమైన ఈదుఃఖ, బాధా, కోప, పశ్చాత్తాపాది బహువిషయములందలి వైవిధ్యమును ప్రదర్శించుటకే ఈ పర్వమునందింతగా విశేషవృత్తప్రయోగము చేసి నారనిచెప్పవలసియున్నది. ఆయాపద్యముల ఆయాభావస్ఫోరకతావిషయమట్లుండగా, వైవిధ్యమే ప్రధానముగా గమనించ వలసిన యంశము. ఇక ఎఱ్ఱనగారు విశేష వృత్త ప్రయోగవిషయమున నన్నయగారినే యను సరించినారు.

మహాభారతమున కవిత్రయమువారి ప్రచుర- పద్యప్రయోగ మీవిధముగానుండగా, తెలుగులో పద్యములకు ప్రధానములయిన యతిప్రాసలవిషయమును గూడ గమనింపవలసియున్నది.

నన్నయగారికి పూర్వశాసనములందలి యతులస్వరూపమునుగమనించినచో ఏయక్షరమున కాయక్షరమే యతిచెల్లించవలయుననన్న నియమమున్నట్లు కన్పించును. కాకపోయినచో వర్గముల లోని ప్రథమ ద్వితీయాక్షరములకు, తృతీయ చతుర్థాక్షరములకు మాత్రము యతి మైత్రిని నమ్ము తించినట్లు కన్పించును. అచ్చులలో అ ఆలకు, ఇ ఈ ఎ ఏలకు, ఉ ఊ ఒ ఓలకు మాత్రము మైత్రికన్పించును. అయితే, నన్నయగారు సాధారణముగా ఈ పద్ధతినే అవలంబించినను మరి కొంత వర్గమైత్రిలో విస్తృతిని కలిగించినారు. వర్గములందు ఏరెండేని అక్షరములకోగాక, వర్గ లందలి నాల్గువర్ణములకును మైత్రిసంపాదించినారు. ఇట్లే మరికొన్నిచ్ఛందోగ్రంథములు బాగా పెరిగి కవులప్రయోగములు బహుళమై తరువాత యతులకు పేర్లు, యతుల సంఖ్యయు చాల పెరిగినది. నన్నయగారు ప్రయోగించిన యతులను గూర్చి చెప్పవలెనన్నచో కవిజనాశ్రయమే ఎక్కువ ఉప యోగపడును. కవిజనాశ్రయకర్త 10 యతిభేదములను చెప్పినాడు, అవి యివి. 1. స్వరవడి, 2 వర్గవడి 3,సరసవడి. 4 ఎక్కటివడి, 5.సంయుక్తాక్షరవడి, 6.పోలికవడి (మువిభక్తియతి. 7 ప్రాదియతి, 8.బిందుయతి, 9 ప్లుతయతి, 10. అఖండయతి. వీటిలో ఏడు,ఎనిమిది, తొమ్మిదవ యతిభేదములు తప్ప మిగిలినవిమాత్రమే నన్నయగారుప్రయోగించినారు. అనగా చాలావరకు సరూపాక్షరయతినే ఉపయోగించినారు. కాని తరువాత, తరువాతకవుల ప్రయోగములను బట్టి యతులలో భేదములు,యతుల సంఖ్యలో ఆధిక్యమువచ్చినది. నిత్యసమాసములందును నన్నయగారు అక్కడ పదముల విరువుస్పష్టముగా స్ఫురించు నప్పుడు తప్ప హల్లుకే యతి చెల్లించుట గమనించ వలసిన యంశము కాని తరువాత వారికేవిధమైన పరిశీలన లేకపోయినది. ఉదాహరణకు'విశ్వామిత్ర' యన్న ఋషివాచకముతో విశ్వ + అమిత్ర అని విరుగనే విరుగదు. విశ్వమిత్ర యన్నప్పుడు ఋషి వాచకమైతే 'విశ్వ'లోని చివరి అకారము దీర్ఘమగును. అందువలన'విశ్వామిత్ర' అన్నప్పుడు అమిత్ర అన్న విరుపు,లేదా, దాని స్ఫూర్తిగానీ లేదు. కాని రంగనాథుడు తన రామాయణము (ద్విపద)న

'అవధారుదేవ విశ్వామిత్రవ మౌని' అనిఅచ్చుకు యతిచెల్లించినారు. ఈపరిశీలనలేమి యిట్లుండగా, ఇంక ననేకకారణములు- వ్యాకరణశాస్త్రము మొదలగునవి-యతులసంఖ్య పెరుగుటకు వీలయినవి. కాగా నన్నయగారి భాగమున నింత తక్కువగా యతి భేదములుండగా తిక్కన ఎఱ్ఱన లలో అప్పకవి చెప్పిన 40 యతులలోనివి చాలావరకున్నవి

ఇవన్నియు నిట్లుండగా, కవిత్రయము వారఖండయతిని ప్రయోగించినారా లేదా యన్నది నాటికినేటికి పెద్దచర్చావిషయమయి కూర్చుచున్నది. ఈచర్చకంతకు మూలము అఖండయతిని ప్రయోగించుట ఏదోయొక పెద్ద ఛందోదోషమునకు పాల్పడుటయన్న భ్రాంతి, దీనినెంతో పెద్దచేసి అందరి గుండెలనదురగొట్టిన వారు అప్పకవి దానిలో. కవిత్రయము వారే అఖండయతిని ప్రయో గించినారన్నచో గతియేమి? వారింతటి దోషమునకు పాల్పరుదురా? యనిపించినదనేకులకు, నిజము నకు కవిత్రయము వారఖండ యతని ప్రయోగించినారు. కాని ఈ ప్రయోగము లన్నియు 'లేఖ కాధముల' వలన సంభవించినవని అప్పకవీయుల ఉద్దేశ్యము, దీనితో పాఠముల దిద్దుబాటులు

ప్రారంభమైనవి. కవిత్రయమును అఖండయతిప్రయోగ దోషపంకమునుండి నముద్ధరించు త్వరలో వెనుక ముందులు చూచుకొనకుండ దిద్దుబాటులు జరిగినవి.

ఉదాహరణకు—

'అమరవరులందుఁ బురుషో
త్తముఁడెట్లు విశేషుఁ డట్ల ధరణింగలతీ
ర్థములందుఁ బుష్కరత్రిత
యముగరము విశేషమభిమతార్థప్రదమై'

(ఆరణ్య-2-248)

ఈ పాదమున 'పుష్కరత్రితయము' అనియున్నదికదా, కాని

తీర్థములందునఁ బుష్కరతీ
ర్థముగరము విశేషమభిమతార్థప్రదమై'

అన్న పాఠాంతరము 'నంశోధితప్రతి" (ఉ. విశ్వవిద్యాలయము) యందు అధోజ్ఞాపికగా చూపబడి నది. కూచిమంచి వేంకటరాయడు తన 'సుకవిమనోరంజన' మందు ఈ పాఠమునే చూపినాడు. కాని ఈ పాఠమందు అఖండయతి ఆపన్నమైనది అందువలన 'పుష్కరత్రితయము' అని పరిష్కరించి నన్నయగారిని తద్దోషముక్తులను చేయుట జరిగినది. కాని, ఈ పద్యమువెన్వెంటనే యున్న వచనము.

'పుష్కరంబునఁ బదియేండ్లు వసియించిన వారికి......అని'పుష్కరంబున' అనుపదముతో మొదలయి సాగుచున్నదిగాని, 'పుష్కరత్రితయంబున' అని సాగుటలేదు. పైపద్యమున 'పుష్కర త్రితయ' మని యున్నదన్నచో, ఈ వచనముగూడ అట్లే మొదలు కావలసియుండెడిది కాని, 'పుష్కరంబున' అనికాదు. కావున వచనమందు మార్పులకు గురికాని 'పుష్కరంబున' అను దానినిబట్టి పై పద్యమందును 'పుష్కరతీర్థము' అనియే యుండవలెనని నిశ్చయించుట సులభము ఇట్లున్నప్పుడే అక్కడి రచన సంగతమగును. ఇది గుర్తింపక, కేవలము అఖండయతిని తొల గించుటకు పైవిధమయిన అసంగతపాఠమును కల్పింపవలసి వచ్చినది. కవిత్రయ ప్రయోగము లెన్నో ఈ విధమయిన మార్పులకు గురియైనవి. కాని ఇంకను 'పరిష్కరింప'బడని పాఠములు అఖండ యతితో మిగిలియే యున్నవి. ఉదా:-

'నిక్కము సర్వదోషముల నీఁగిభజింతురు.........

(ఆరణ్య 6-160)

'ఈఁగి' అజాది. హలాది (నకారాది) కాదు. మరి 'నిక్కము' హలాది (నకారాది)యగుట నిక్కమే. అందువలన ఈ స్థలమందు అఖండయతి తప్పదు కూచిమంచి వేంకటరాయడు కవి త్రయమువారి అఖండయతి ప్రయోగములను 70 చూపించినాడు. వాటిలో కొన్ని సవరింపబడి ఈనాడు ముద్రితప్రతులందు కనిపించుచున్నవి. కొన్ని సవరింపబడక యథాతథముగానున్నవి. ఇంతకు కవిజనాశ్రయకర్తకు అఖండయతిని చెప్పుటకు ఆధారము నన్నయగారిలోనే యున్నదన

వచ్చును. (కవిజనాశ్రయమున చెప్పబడిన అఖండయతి ప్రక్షిప్తమన్నవాదమున్నది. అది వేరు విషయము) కాగా అఖండయతి కవిత్రయమునకు సమ్మతమే యనవచ్చును.

ఇక ప్రాసవిషయము చూచినచో, నన్నయగారు ప్రాసలలో భేదములేమియు నుపయోగించలేదనియే చెప్పవలెను సామాన్యముగా సర్వత్ర ప్రాసహల్ ప్రధానముగానే సాగినది. కాని ఒక్కచోట మాత్రము ఋకారమునకు రేఫప్రాస చెల్లింపబడినది.

'ఆ ఋషికుమారు గట్టిన
చీరను మృదులములు.........' (అరణ్య. 6-104)

ఇట్లే రేఫయుతమునకు, అయుతమునకును ప్రాసకన్పించును.

'క్షత్రియ క్షత్రియ రిత్రము ధాత్ర్యరక్షు.........' (ఆది. 2-176)

ఖండానుస్వారయుతమునకు, అయుతమునకు ప్రాసచెల్లించినట్లు చెప్పబడుచున్నది. కాని అరసున్న ఉనికిని గూర్చిన వివాదములనుబట్టి దీనిని నిశ్చయించుటకు వీలులేదు. ఇక వ, ధ లకు ద-ధ లకు ప్రాసలుచెల్లించిన స్థలములు, న-ణ లకు, ల-ళ లకు చెల్లించిన స్థలములు కొన్ని యున్నవి. ఇవి తప్ప నన్నయగారు మరే విధమయిన ప్రాసలు చెల్లింపలేదు. యతుల యందు వలె ప్రాసల యందు భేదము లధికములేవు. చాల తక్కువ.

ఇదిట్లుండగా, నన్నయగారు ద్విత్వమకారమునకు, బిందు పూర్వకబకారమునకు ప్రాస చెల్లించినారని —

ఇమ్ముగ సర్వలోకజను లెవ్వనియేని ముఖామృతాంశు బిం
బమ్మున నుద్భవంబయిన భారత వాగమృతంబు కర్ణరం
ధ్రమ్మను నంజలిం దవిలి ద్రావుదు రట్టిమునీంద్రలోకవం
ద్యుం బరముం బరాశరసుతుం బ్రణమిల్లి కరంబు భక్తితోన్. (ఆది. 1-77)

అన్న పద్యము చూపబడుచున్నది. ఎవరు చూపినను ఇదే పద్యము అయితే 'నన్నయ పదప్రయోగసూచికలో 'ఇమ్ము' మరియు 'ఇంబు' అను రెండు పదములకును ఇదే పద్యము "ఇమ్ముగ' అను పాఠముతో నొకసారి చూపబడినది, మరి ఈ పద్యమున 'ఇమ్ముగ' అని యున్నదా? లేక 'ఇంబుగ' అనియున్నదా? 'పంబి' అన్న పదమునకు 'పమ్మి' అని రూపాంతర మున్నది. 'పంబి' 'పమ్మి' అన్నరెండు రూపములను నన్నయగారు ప్రయోగించినారు (చూ. ఆది-1-44, ఆది-1-77) పంబి వినంబోలుదు, 'పమ్మినయట్టి కోపపరుపాలికి'- అయితే, ఇంబు ప్రయోగమీపద్యముపై నాధారపడియున్నది నాల్గవపాదమునప్రాసలో బిందుపూర్వక బకార ముండుటచే ఇక్కడ "ఇంబు"అని ఉన్నదనుటయే యుక్తము "బింబమ్మున, రంధ్రమ్మును" అనునవి ప్రథమావిభక్తివి, "బింబంబున రంధ్రమ్మును" అని యుండవచ్చును. ఈవిధముగా చూచినచో ఈ పద్యమున ప్రాస విశేషమేమియునుండదు. ఇదిగాక, ద్విత్వ మకారమునకు, బిందుపూర్వక మకారమునకు ధ్వనిసామ్యములేదు ఇది లేని ప్రాస నన్నయగారుపయోగించలేదు. కావున పైపద్యమున ఉన్నదనుకొనబడు ప్రాస ఉండుటకు వీలులేదు సంశోధితముద్రణమున "ఇంబుగ" అనియే గ్రహింపబడినది.

నన్నయగారి తరువాత పెరిగిన ప్రాసభేదములలో కొన్ని ఎఱ్ఱన తిక్కనలయందు కనిపించును. తిక్కనగారొక ప్రత్యేకమైన ప్రాసను ప్రయోగించినారు అది ఇది-

'ద్యూతక్రీడకు కొంటొక నేర్తున్'

ప్రథమపాదమున ఒక్కతకారముండగా, దానికి 'ర్త' ప్రాసచెల్లింపబడినది. అయితే 'నేర్తున్' అని ఈనాడు వ్రాయబడినట్లుగాక 'నేతున్' అని ప్రాచీనకాలమునుండి వ్రాయబడెడిదని, పై పద్యమున నట్లువ్రాసికొనగా, రేఫగుర్తు తకారమునకు ప్రక్కనుండుటచే, తకారము తకారముగానే కనబడుటచే పైవిధముగా తిక్కనగారు ప్రాసచెల్లించియుందురన్న యభిప్రాయమున్నది. కాని, ప్రాసనుపయోగించునప్పుడు ఉచ్చారణనుబట్టిచూచుకొందురుగాని వ్రాతనుబట్టికాదు. అదిగాక, తిక్కనాదులకు వారు పద్యములు చెప్పగా వ్రాసెడివారు వ్రాయసగాండ్రు. కాగా ఉచ్చారణబట్టియే తిక్కనగారిక్కడ ప్రాస చెల్లించియుండవలెను. మరి యిక్కడి ప్రాసకు గతి? కూచిమంచి తిమ్మనకవి 'నేర్చున్' నేర్చున్' అనువాటికి రేఫ లోపములను చెప్పి నేతున్, నేచున్' అనురూపములను సాధించినాడు. ఈ సాంధివు తిక్కనగారి రక్షింపునకే యేమోమరి. ఎందుకనగా, నేర్తు, నేర్చు'లకు బదులు 'నేతు' నేచు అను రూపాంతరములు వారి రచనలయందు అన్యత్ర-కన్పించవు. అందువలనే ఈ ప్రయోగమునకు ప్రమాణము అలభ్యము. మరి ఇట్టి ప్రాసప్రయోగము కూడ అన్యత్ర లేదు. రూపాంతరము లున్నవన్నచో వేచీయే లేదు. లేనిచో దీని నొక ప్రత్యేక ప్రాసవిశేషముగానే భావించవలెను.

ఈపద్యములు యతిప్రాసల ప్రయోగము లిట్లుండగా, నన్నయగారొక్కరే, 'దండక'మును ప్రయోగించినారు. అదియు నొక్కచోటనే, కిరాతార్జునుల యుద్ధము తరువాత కిరాతుడు శివుడుగా ప్రత్యక్షమైనప్పుడు అర్జునుడు చేసినస్తుతిరూపముననున్నది. దండకమొక చిత్రమయినది. పాదవిభజనలేదు కాబట్టి ఇది అటు పద్యవిభాగమున చేరదు. మరి గణముల ప్రయోగముండునుగాన ఇటు వచనవిభాగమున చేరదు. ఈ రెండువిధముల కిది యొక వారధివంటిది. నన్నయగారి ఈదండకమందు తగణ ప్రధాన్య మున్నది. మొత్తముదండక మాద్యంతము 186 తగణములు + చివర నొక గురువుతో నున్నది. మరి తిక్కనగారుగాని, నన్నయగారినే అనుసరించిన ఎఱ్ఱనగారుగాని ఈదండకమును ఉపయోగించలేదు.

అయితే ముగ్గురును వచనముల నుపయోగించినారు. సంస్కృతమున ఆద్యంతము పద్యమయమయిన కావ్యములకే ప్రాచుర్యము పద్యవచన సమ్మేళనముగల చంపూపద్ధతికి ప్రయోగము లేదనికాదు. కాని ప్రాచుర్యములేదు. ఈ చంపూపద్ధతిని తెలుగునకు ప్రసాదించినది నన్నయగారు. దాదాపుగా సర్వాంధ్రకావ్యప్రపంచము ఈ పద్ధతిలోనే యున్నదని చెప్పవచ్చును. ద్విపదకావ్యములు శతకములవంటివి దీనికపవాదములు. ద్విపదకావ్యాదులు ఏకచ్ఛందోమయములు వివిధఛందోమయమై, వచనరహితమయిన పద్ధతిని తిక్కనగారు తమ ఉత్తరరామాయణముతో ప్రారంభించినను, దానికి ప్రాచుర్యము కలుగలేదు ఇంతెందుకు, ఆయనయే భారతమును నన్నయగారి పద్ధతిలో చంపూకావ్యముగా దీర్చిరి. అయినను ఆయనకు నిర్వచన కావ్య

రచనపై అస్థ తీరలేదు. భారతము నంతయు చంపుగానే తీర్చిన, మౌనలపర్వమును మాత్రము నిర్వచనముగా తీర్చినారు ముద్రిత ప్రతులందు 84 వదిగా కన్పించు చిన్న వచనము నిరర్థకమేకాక అనర్థము కూడనై ప్రక్షిప్తమని విమర్శకులు నిర్ధారించుచున్నారు మరి యక్కడి రచనారీతిని గమనించిన నీ యంశముస్పష్టమగును.

కవిత్రయము వారి భారతమున వచనముల సంఖ్య చాలహెచ్చు. ఒకటి, రెండు, మూడు పదములతోడి మిక్కిలి చిన్నవచనములు గూడ నెన్నోయున్నవి. పూర్వోత్తరపద్యసంయోజకతకుమించి ఇట్టివాటి ప్రాధాన్యములేదు వర్ణనలందు, వట్టిగా విషయమును చెప్పుట యందును వచన ప్రయోగమున్నది

ఇంతవరకు చెప్పినది కవిత్రయము వారు మహాభారతమందుచేసిన ఛందస్సుల ప్రయోగము దానిని గూర్చిన మరికొన్ని ఇతరాంశములనుగూర్చి దిక్ప్రదర్శనముగ మాత్రమే.వివరించవలసిన యంశములు,వివరములు ఇంకను సూక్ష్మముగా పరిశీలించవలసినవి ఎన్నో ఉండనేఉన్నవి. కాగా కవిత్రయమువారి ఛందఃప్రయోగమును గూర్చిన రేఖాచిత్రమును ప్రస్తుతీకరించుటయే ప్రస్తుతోద్దేశము.మరియుఒడులుగా పందలుగా ప్రయోగింపబడిన వేరువేరు పద్యములకు కవిత్రయము వారు నేర్పిన నడకలు మొదలగు పద్య విద్య-లేక పద్య శిల్పమునకు సంబంధించిన పలువిషయములు ఈ వ్యాసపరిధికిరానివి ఆ విషయములలోనికిపోవుట చెరువునుండి సంద్రమునకు దూకుట.

## మహాభారతమున పద్యగద్యములు

### అ కా రా ది క్ర మ ము

### సంస్కృతీయ విశేషవృత్తములు

| | పద్యము పేరు | నన్నయ | తిక్కన | ఎఱ్ఱన |
|---|---|---|---|---|
| 1 | అంబురుహము | 1 | 1 | — |
| 2. | ఇంద్రవజ్ర | — | 1 | — |
| 3. | ఉపజాతి | — | 1 | — |
| 4. | ఉపేంద్రవజ్ర | — | 1 | — |
| 5. | కవిరాజ విరాజితము | 2 | 4 | — |
| 6. | క్రౌంచపదము | — | 1 | — |

| | | | | |
|---|---|---|---|---|
| 7. | జలధరము | — | 2 | — |
| 8. | తరళ | 25 | 5 | — |
| 9. | తోటకము | 1 | 3 | — |
| 10. | తోదకము | — | 1 | — |
| 11. | దోదకము | — | 2 | — |
| 12. | ద్రుతవిలంబితము | — | 1 | — |
| 13. | నర్కుటము | — | 2 | — |
| 14. | పణవము | — | 1 | — |
| 15. | పద్మకము | 1 | — | — |
| 16. | పృథ్వి | 5 | — | — |
| 17. | ప్రహరణకలితము | — | 1 | — |
| 18. | బంధురము | — | 1 | — |
| 19. | భాస్కరవిలసితము | — | 1 | — |
| 20 | భుజంగప్రయాతము | — | 2 | — |
| 21. | మంగళమహాశ్రీ | — | 1 | 1 |
| 22. | మంజుభాషిణి | — | 1 | — |
| 23. | మందాక్రాంత | — | 1 | — |
| 24. | మణిగణనికరము | — | 1 | — |
| 25. | మణిభూషణము | 1 | — | — |
| 26. | మణిమాల | — | 1 | — |
| 27. | మత్తకోకిల | 23 | 3 | 13 |
| 28. | మహాస్రగ్ధర | 2 | 16 | 2 |
| 29. | మానిని | 2 | 3 | — |
| 30. | మాలిని | 7 | 46 | 1 |
| 31. | మేదిని | — | 1 | — |
| 32. | రథోద్ధతము | 1 | — | — |
| 33. | లయగ్రాహి | 1 | 4 | — |
| 34. | లయవిభాతి | — | 2 | — |
| 35. | వనమయూరము | — | 2 | — |
| 36. | వసంతతిలక | 3 | 1 | — |
| 37. | శిఖరిణి | — | 1 | — |
| 38. | శుద్ధవిరాటి | — | 1 | — |
| 39. | సరసిజము | — | 1 | — |
| 40. | స్రగ్ధర | 1 | 9 | 2 |
| 41. | స్రగ్విణి | — | 1 | 1 |
| 42. | స్వాగతము | 2 | 1 | — |

| | | | | |
|---|---|---|---|---|
| 7. | జంధరము | — | 2 | — |
| 8. | తరళ | 26 | 5 | — |
| 9. | తోటకము | 1 | 3 | — |
| 10. | తోదకము | — | 1 | — |
| 11. | దోదకము | — | 2 | — |
| 12. | ద్రుతవిలంబితము | — | 1 | — |
| 13. | నర్కుటము | — | 2 | — |
| 14. | పణవము | — | 1 | — |
| 15. | పద్మకము | 1 | — | — |
| 16. | పృథ్వి | 5 | — | — |
| 17. | ప్రహరణకలితము | — | 1 | — |
| 18. | బంధురము | — | 1 | — |
| 19. | భాస్కరవిలసితము | — | 1 | — |
| 20 | భుజంగప్రయాతము | — | 2 | — |
| 21. | మంగళమహాశ్రీ | — | 1 | 1 |
| 22. | మంజుభాషిణి | — | 1 | — |
| 23. | మందాక్రాంత | — | 1 | — |
| 24. | మణిగణనికరము | — | 1 | — |
| 25. | మణిభూషణము | 1 | — | — |
| 26. | మణిమాల | — | 1 | — |
| 27. | మత్తకోకిల | 26 | 8 | 13 |
| 28. | మహాస్రగ్ధర | 2 | 16 | 2 |
| 29. | మానిని | 2 | 3 | — |
| 30. | మాలిని | 7 | 46 | 1 |
| 31. | మేదిని | — | 1 | — |
| 32. | రథోద్ధతము | 1 | — | — |
| 33. | లయగ్రాహి | 1 | 4 | — |
| 34. | లయవిభాతి | — | 2 | — |
| 35. | వనమయూరము | — | 2 | — |
| 36. | వసంతతిలక | 3 | 1 | — |
| 37. | శిఖరిణి | — | 1 | — |
| 38. | శుద్ధవిరాటి | — | 1 | — |
| 39. | సరసిజము | — | 1 | — |
| 40. | స్రగ్ధర | 1 | 9 | 2 |
| 41. | స్రగ్విణి | — | 1 | 1 |
| 42. | స్వాగతము | 2 | 1 | — |

# విషయసూచిక

— (౦) —

## అనుశాసనిక పర్వము - ప్రథమాశ్వాసము



## అనుశాసనిక పర్వము - ద్వితీయాశ్వాసము

## అనుశాసనికపర్వము - తృతీయాశ్వాసము

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఆనుశాసనికపర్వము - ప్రథమాశ్వాసము

—o—o—o—

1. క. [1]శ్రీమత్కటాక్షరోచి
స్తోమసముల్లాసవిహితసుస్థిరలక్ష్మీ
భూమానందితభక్త
వ్యామోహవిదూరయుక్త హరిహరనాథా

2. వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు [1]దివ్యజ్ఞాన
దేదీప్యమానుండైన దేవవ్రతుండు వివరింప వివిధంబులగు ధర్మంబు లాక
ర్ణించి యజాతశత్రుం డతనికి [2]సభక్తికప్రణామం బాచరించి వినయవిశేష
విభూషితుండై.

3. సీ. అనఘ నాదగుచిత్తమునకు శమంబు గా
వించుటకై నీవు వివిధ విశద
భంగులఁ బరమ కృపా[1]నిరతుండవై
సకలధర్మోపదేశములుఁ జేసి
తిమ్మెయిఁజెప్పఁగా నించుక [2]యేనియు
శమము లేకున్నది చలముకొని య

---

1. 1. ఈ పర్వమునకు సంస్కృత ప్రతులన్నిటిలోను "అనుశాసన పర్వము" అనియే వ్యవ
హారము పి. వి. యస్. శాస్త్రి ప్రతియందు 'అనుశాసన', ఆనుశాసనిక, అను రెండు
పేర్లును గలవు. నన్నయభట్టు ఆనుశాసనికమనియే వాడినాడు 1 - 1 - ౩౩ & ౬౦

2. 1. పరిజ్ఞానదేదీప్యమానసుండైన - శ; పరిజ్ఞానదేదీప్యమానుండైన - ఇ కొన్నిప్రతులు.
2. సద్భక్తిం బ్రణామంబు - మ. పి శ. ష స

3. 1. సమన్వితుడవై - ఐ. ఖ గ. వ 2 కేనియు నాకు శమము - మ. వ. స.

నేకబంధుల వధియించితి నది యొక్క
తలయు నీ కలిగిన దారుణత్వ

ఆ. యొక్కతలయు నైన యుగ్రకర్మంబులు
చిత్తవృత్తిఁ [3]దగిలి యుత్తలంబుఁ
జేయ శాంతి యెట్లు సిద్ధించు మునిమాన
నీయ యింక నేమిసేయువాఁడ.

వ. దుర్యోధనుం డతిలోభంబున నాతోఁ బంచి కుడువ నొడంబడండ యేనును నాగ్రహంబున నతనికిరాజ్యం బిచ్చి తొలంగి నిలువను మాయిద్దఱ కతంబున నింత పుట్టెం బశ్చాత్తాపం బెప్పాటనుం ద్రోపువడ దయ్యెడు.

-: గౌతమీ లుబ్ధక సర్ప మృత్యు కాల సంవాదము :-

సం. 13-1-9

చ. అనవుడు భీష్ముఁ డిట్టులను నాతనితో నకటా వధింపఁగా
మనుజుఁడు గర్త గాఁడు వినుమా యితిహాస మొకండు సెప్పెదన్
మనుజవరేణ్య గౌతమి యనంగ [1]శమాన్విత యొక్కభూసురాం
గన యురగంబుచే సుతుఁడు గాలవశత్వముఁ బొంది యుండఁగన్.

చ. వగచుచుఁ [1]జూడ నయ్యురగవల్లభు రజ్జునఁ గట్టి తెచ్చి య
మ్మగువకుఁ జూపి[2]దీనిఁ దల ద్రుంచఁగ మోఁదెదఁ గోల నొండె రెం
డుగ నెఱుగత్తి వ్రేసెదఁ గడుం జెడు గీపొడపాఁపపుర్వు నే
మిగతి వధింతు నంచు నొక మేటికిరాతుఁడు రోషదీప్తుఁడై.

క. [1]ఉన్నఁ గని యప్పుడఁతి యో
యన్న విడువు భుజగనాథు ననవుడు నతఁడీ
పిన్నాతని ప్రాణంబులు
గొన్నది యిది దీనియసుఁలు గొనియెద ననియెన్.

---

3. దివిరి - అ ఈ; గలంగి యుత్తలంబు - క

1. గుణాన్విత - డ

1. నుండ - ఎ. ఐ. ఖ. గ. మ. వ శ. ష. 2. దీనితల - కొన్ని ప్రతులు.

1. ఉన్నంగని పడతుక యోయన్న - అ క. మ. వ. పీ. శ. ష.

8\. వ. అనిన నక్కోమలి యక్కిరాతుం జూచి.

9\. క. విధివశమున వచ్చినకీ
డ్పడములు గొనియాడి [1]వెడగులై విపులశివాం
బుధి మునుఁగుదురు మునుంగరు
సద్ధర్ములగు నుత్తములు [2]ప్రశాంతిఁ జులుకనై

10\. వ. అదియునుం గాక.

11\. క. ఈపాముఁ జంప బ్రదుకునె
నా పుత్త్రుఁడు నిడుపు మర్జునక నావుడు వాఁ
డీ [1]పేదమాట లెల్లను
గోపవివశుఁడైన నాకుఁ గొలుపవు ముగ్ధా.

12\. ఉ. కావున నెట్లుఁ జంపుదున కాని భుజంగముఁ బోవ[1]నీను జూ
నావుడు నింతి యర్జునకనామము నీ కవదాతభంగికిం
గావలదే మహీసురులు గా దనుచొప్పునఁ దత్సహాయులుం
బోవరు గాదె యేల నినుబోఁటికిఁ గ్రూరత నాదుసన్నిధిన్.

13\. సీ. హింసకు నొడఁబడ నే నెట్లు ననవుడు
జనబాధకములైన జంతువులను
[1]జంపినఁ బాపంబు సమకూర దని పల్కె
బోయ వట్టినరిపుఁ బొరిగొనంగ
[2]వల దని చెప్పె నవ్వనిత వాఁ డహిఁ దెగఁ
జూచి జనంబులఁ గాచుటు [3]అదె
వృత్రుఁ జంపఁడె దేవవిభుఁడు యజ్ఞ
ధ్వంసనము సేయఁడే ఫాలనయనుఁ డట్లు

---

9\. 1. వెడగులై - ఓ. క. గ. ఱ. ట. మ. పీ. శ. ష. స; వికలులై - ఓ; వ్రేగులై - వా.
2\. ప్రశాంతింజులుకన్ - స.

11\. 1. పెర మాటలు వినగా - కొన్ని ప్రతులు.

12\. 1. నీఁ జూమీ - ఐ. ఘ. భ (వ్యతిరేకార్థక ప్రతీతి కలదా?)

13\. 1. వధియింప బాపంబు వచ్చునే యని - శ. ష. కొన్ని ప్రతులు. 2. అనదని - కొన్ని ప్రతులు 3. టరుదె - శ. ష. కొన్ని ప్రతులు

తే. [1]కావె ధర్మువు హింసలు నీవు దీని
కియ్యకొను మని తలఁచెద నక్లింత దలఁచి మి
నను దయావతివైన యన్నాతి పాప
మునకుఁ జొరదయ్యె బోయ కిట్లనియెఁ బాము.

14. క. ఏ నేమి తప్పు సేసితిఁ
గానవు నెఱి నీవు తెన్నఁగా మృత్యువరా
ధీనత బాలునిఁ గఱచితిఁ
గాని వినుము లేవు రోషకామాదు లెదన్.

15. వ. అనుటయు నతండు.

16. క. విను మృత్యువునకుఁ దగుసా
ధనమ వగుటఁ జేసి నిన్ను దండింపంగాఁ
జను నవవుడుఁ గుమ్మరికో
లను సాఱెం బోలితిం దలఁచి చూడు [1]మెడన్.

17. వ. ఈక్రియ నావశం బగునే యని పల్కినం బాముని కర్జునకుం డిట్లనియె.

18. తే. ఏయువాఁ డుండ న మ్మేమిసేయు ననక
యోపి తత్తండనముసేత పాప మంద్రె
యెవ్వరేఁ బంపఁ గఱతు గాకేమి క్రూరు
నిన్ను గీటడఁగించిన నింద రాదు.

19. తే. అదియుఁ గాక విశేషించి యరయ బుద్ధి
గలుగునట్టి సాధనములు గావె మీరు
మృత్యువున కట్లు గావున మెలఁగ మిడుక
నీక పొరిగొనవలయు మి మ్మెల్లభంగి.

20. వ. అనిన విని బోయకు భుజగం బిట్లనియె.

21. తే. బుద్ధి గల్గు సాధనములపో హవిస్సు
లరసి వేల్తురు ఋత్విజు లాఫలంబు

---

4. గాన నిట్టివి హింసలుగావు – శ. ష

16 1. మెడన్ – కొన్ని ప్రతులు

గాంచు నధ్వరకర్తయ కాక వారి
కేమి పని యనఁగా మృత్యు వేఁగుదెంచె.

22. క. చనుదెంచి పామునకు ని
ట్లను నిను నేఁ గోరి పనిచినట్టుల నన్నుం
బనిచెం గాలుం డీచా
వున కీవును నేను హేతువులుగా మనఘా.

23. క. ఇనశశిపావక [1]భూమిగ
గనజలపవనాది వస్తు [2]గతులెల్లను గా
లునియఱచేతి వనినఁ ద
క్కినపని సెప్పంగ నేటికిని భుజగేంద్రా.

24. క. విను మిట్లగు శేర్పడ నెఱిఁ
గిన నాపై నిడుదు వెట్లు కిల్బిషముం గా
లుని చెయిది నన్ను దూఱిన
నిను దూఱుట [1]యుఱదె నాదునిర్మాణమునన్.

25. ఆ. అనిన భుజగ మిట్టులను నీవలన నేను
గుణము సెప్ప దోషగణన సేయ
నన్నుఁ బనిచె నంటి నామీఁదిదోషంబుఁ
బాపికొనుట నాకుఁ బాడి గా[1]దె.

26. క. విను మటు కాలుని దెస నై
నను దోషము కలిమి లేమి [1]నా కాడంగాఁ
బని యేమి దోషగణించిం
తనభాషణములకు నేను దగుదునె యనఘా.

27. వ. అని పలికి పాము బోయమొగంబు సూచి.

---

23. 1 ధరణి గగన - మ. శ. 2 గణమెల్లను - క. వ. పీ. శ. ష.

24. 1. యరుదె - పెక్కు ప్రతులు

25. 1. ఈ పద్యము తరువాత ఉ మ. పీ. ష. ప్రతులలో 'అనిన మృత్యువు పామున కిట్ల
నియె' అను వచనము కలదు

26. 1. నాకారయగా - అ. ఈ.

28. క. వింటే మృత్యువుమాటలు
గంటే నా[1]మీఁదఁ దప్పు గలిగించెద వి
ట్లంటం గట్టం దగునే
యంటకు నగి బోయ యిట్టు లనియె నరేంద్రా

29. క. నీవును మృత్యువుఁ బాపస
మాదేశితమతుల [1]రొలఁగ నాడినయంతం
బోవునె మీపై దోషము
తే వెలితునె యిట్టు లనినయింతన మీకున్.

30. వ. అనిన మృత్యువునుం బామును.

31. క. ఘనుఁడగు కాలునివశమునఁ
జనియెడు మా కరయ దోషసంగతి గలదే
యనునెడఁ గాలుం డచటికిఁ
జనుదెంచెం బ్రీతి ధర్మసంశయ ముడుపన్.

32. వ. చనుదెంచి యర్జునకు నాలోకించి

33. క. పామును మృత్యువు నేనును
గా మీ[1]దారకుని మృతికిఁ గారణ మీతం
డేమేఁ గర్మముఁ జేసెం
దా మృతిఁ బొందించె నదియ తలకొని యితనిన్.

34. క. విను కర్మం బొనరించును
జననము మరణంబు నదియ సౌఖ్యము దుఃఖం
బును గావించుం దనచే
సినదానం బడకపోవ శివునకు వశమే.

35. వ. అని చెప్పి.

---

28. 1. వలన దప్పు - ఉ. ఎ. ఔ. ఖ. గ. ఛ వ

29 1. లుదొరగ నాడిన - అ. ఈ ఐ ఖ; లుదొలగ నాడిన - ఎ. గ. వ

33. 1. బాలకుని - పెక్కు ప్రతులు.

36. క. కావున నిందలు నుడుగుం
డీవాదం బనుడు బోయ కిట్లను ధరణీ
దేవాంగన దనయుని కయి
దేవాలాపములు నొక్క-తెరువై [1]యున్నన్.

37. ఆ. ఇట్టివనటఁ బొందునట్టిపాపముసేసి
[1]వనిత లిట్ల యగుదు రనఘ యిప్పి
థంబు మరణ మొందఁ దగుకిల్బిషంబున
బాలురిట్ల [2]పోదు రేల [3]కలఁగ.

38. వ. అని వెండియు

39. క. సకలజనంబులుఁ గర్మము
నకు ననుగుణమైన తెరువునం బోదురు దీ
నికి రోష విషాదము లే
టికి విడువుము పాము సంఘటింపుము శమమున్.

40. క. అన విని తెలిసి విడిచె న
ర్జునకుఁడు భుజగము నపాస్తరోషుం డగుచుం
జని రెలమిఁ బొంది కాలుం
డును మృత్యువుఁ గావునను విడువు మీపడలున్.

41. తే. కారు దుర్యోధనుఁడు నీవుఁ [1]గారణములు
బాంధవుల రణమరణ సంప్రాప్తి కనఘ
వారు దమతమ కర్మముల్ గారణములు
గాఁగ నిట్లయి రేల శోకంబు నీకు.

42. వ. గౌతమీలుబ్ధకభుజంగమృత్యుకాల సంవాదం [1]బను నియ్యితిహాసంబు తాత్పర్యంబు మనంబునం బట్టుకొలిపి యాపుట్టిన కలంకం [2]దొలంగ జడిసి

---

36. 1. యుండన్ - పీ. శ ష. కొన్ని ప్రతులు.

37. 1. యతివలిట్ల-మ. శ.ష; యవని నిట్ల-గ 2. యగుదురేల - న 3. వగవ - ఓ జ. ద

41. 1. కారణంబు - పెక్కు ప్రతులు.

42. 1 బగు నీయితి - అ. ఆ. క. ఖ గ. ల పీ 2. గంబెట్టి - ఆ. మ. పీ. శ. ష

శమంబున సుఖవిగమ్మనినం గౌంతేయాగ్రజుండు సంతసిల్లి శాంతనవునితో
నిట్లనియె

—: అగ్నిదేవుఁడు సుదర్శన యను కన్యకను వివాహంబు సేసికొనుట :—

సం. 13_2-12

43. చ. అనఘ గృహస్థధర్మమునయందుఁ జరించి నరుండు మృత్యు సం
జనితభయంబు వాపికొనఁ జాలునొ చాలఁడొ యన్న నాసరి
త్తనయుఁడు దానికిం దగువిధంబు దిరం బగు నేనిఁ జాలు న
య్యను [1]వాడగూడునట్టి యితిహాసము విన్ము నరేంద్ర చెప్పెదన్.

44. మ. మనువంశంబునఁ బుట్టి సర్వజనతామందారమై నేల యె
ల్లను బాలించి జగత్త్రయీప్రణుతలీలం బొల్చె దుర్యోధనుం
డను రా జవ్విభునొప్పు నర్మదకుఁ గామావేశముం జేసినన్
వనితారూపము దాల్చి పొందె నతనిన్ వైదగ్ధ్య హృద్యంబుగన్.

45. క. ఆరమణికి నతనికిఁ గ
న్యారత్నం బుద్భవించె నమరపురంధ్రీ
శ్రీరమణీయకము ని
స్సారంబ గునట్లు గాఁగ జగతీనాథా.

46. క. విను దానికిఁ బేరు సుద
ర్శన యన్నరనాయకుండు సంప్రీతిమెయిం
బనిచి తన యగ్నిహోత్రం
బున పరిచర్యలకుఁ బనిచె బుజ్జ [1]వ మొప్పన్.

47. వ. పనిచిన నప్పొలంతి యప్పనులవెంట మెలంగుచుండె నట్టియెడ.

---

43. 1. వానగూడునట్టి - ఓ. వ

46. 1. వమొప్పన్ - మ. వ పీ. శ ష. న; నముంతోన్ - వా. కొన్ని ప్రతులు.

48. సీ. [1]అర్చించునప్పు డయ్యంగనకెంగేలి
జిగిసొంపు చిత్తంబు దిగిచికొనఁగ
నరసి కన్గొనునప్పు డయ్యింతికనుఁగవ
పొలపంబు రాగంబు వొదలఁజేయ
నవ్వులఁ బని బంచునప్పు డమ్ముద్దియ
పలుకులతీపు గోర్కులఁ [2]గెరల్ప
నల్లన [3]యాఁడెడునప్పు డక్కొమ్మనా
తెఱతావి ధైర్యంబు ద్రిప్పుకొలుప
తే. మరుఁడు దోడ్తోడఁ దేఁకువమాలి కదిసి
తూపుగముల గ్రొవ్వాఁడిమి సూప నంత
కంత కగ్గల మగువలవంతఁ దూలి
పోయెఁ బావకుఁ డేమి సెప్పుదు నరేంద్ర.

49. వ. ఇట్లు మదనాగ్ని నదిలకొని యగ్నిదేవుం డక్కాంతతో నేకాంతంబున నిట్లనియె.

50. సీ. చిగురుటాకుల గాసిసేయు నీయడుగుల
చెలువంబు సూడ్కులఁ జేర్చికొనియె
మారేడుపండులగారాము సెఱచు నీ
యొలచన్నుఁగవ వేడుకలఁ దొనర్చె
నునుఁదీవఁ జీరికిఁ గొనిన నీ మైఁదీవ
మురిపంబు డెందంబు మరులుకొలిపె
నెఱచందురుని సిగ్గువఱుపంగఁ జాలు నీ
నెమ్మోము దాలిమి వమ్ముసేసె

---

48. 1. ఇచ్చట తిక్కన సోమయాజి చేసిన సుదర్శనా సౌందర్య వర్ణనకు మూలము చిత్రశాలా ప్రతియందు లేదు. అచ్చట మిక్కిలి సంగ్రహముగ ఈ వృత్తాంతము చెపబడినది. "తామగ్నిశ్చకమే సాక్షా ద్రాజకన్యాం సుదర్శనామ్" 19-2-21. భండార్కరు ప్రతియందును నిట్లే యున్నది కాని కుంభకోణ ప్రతియందు అగ్నిదేవుడు సుదర్శనా సౌందర్యవర్ణనమును విపులముగా చేసి నట్లున్నది. 19-2-21 నుండి 31 వరకు శ్లోకములు. పి. పి. యస్ శాస్త్రి ప్రతియందును ఈ ఘట్టము పెంపుదలతో నున్నది.
2. దెరల్ప—ఊ. బ. ఔ. ఖ చ. న 3. యాడెదు నప్పుడు — అ ఆ ఠ. ఊ. ఎ. ఏ. గ. చ. మ. ల పి శ ష.

తే. నాతి నీకు నై పెక్కు బన్నములు వడితి
నంగజునిచేత వల్లభ వగుము నాకు
నావుడును సిగ్గుగదిరి యాననము వాంచి
యలరిలియొఱఁగున నిట్లను నాలతాంగి.

51. క. కులకన్యకలకు వేడుకఁ
దల[1]పిదులఁ బరులతోడితగుమాటలకుం
దలకొనఁ దగునే గురుజన
ముల కా కర్తే లఁగువారు పురుషార్థనిధీ

52. వ. అనిన విని వాంఛఛవాఖలం డట్ల కాక యనియె నాసమయంబున.

53. ఉ. ఆనరనాయకుం డొకమహాధ్వర మెంతయు వేడ్కఁ జేయఁగాఁ
బూని మహీసురాసకికిఁ బూజ లొనర్పఁగఁ దాను బ్రాహ్మణుం
డై నయ మారఁగా నసలఁ డాతనిపాలికి వచ్చి నాకు నీ
వే నృప నీదుపుత్రిఁ గృపయేర్పడ దానము గాఁగ నావుడున్.

54. వ. అవ్విభుండు.

55. తే. అన్యవర్ణుండు దీనుఁ డీయనకు [1]నెట్లు
గూఁతు నీవచ్చు నని మదిఁ గుత్స పుట్టి
యీఁడ ప్రార్థన మఫల మై యేఁగి యజ్ఞ
సమయమున నగ్ని దనమూర్తి సంహరించె.

56. క. కని యజ్ఞపతి ఋత్విజు
లును దానును వెఱఁగుపడి విలోపము వాటి
ల్లెనొకో కర్మగతుల నని
మనమున నూహించి భవ్యమంత్రముఖ[1]రుతై.

51. 1. పీఁకున నరుల తోడి - న; పీఁకును పరునితోడి - ఇ ఉ. ఏ, ఓ. ల; నింద్లనుఁ బరుల - క

55. 1. గూతు నెట్లు లీవచ్చునని మది యెరగించి - ఊ. మ. ల. వ.

56. 1. రతై - పీ క. వ పెక్కు ప్రతులు, రుతై - వా, చూడు. బాల - క్రియ - 120

57. వ. పావకునిం బ్రస్తుతించు చుండ నద్దేవుం డాభూదేవతలకు నల్లన తనతెఱం గెఱింగించిన

58. తే. వార లానృపుతోఁ జెప్ప గారవంబు
సంతసముఁ దలకొనఁగ నయ్యింతిఁ బెండ్లి
సేసె విప్రకుమారుఁడై చెన్ను మెఱసి
యగ్ని వరియించె నచ్చెరువంద జనులు

59. వ. ఇట్లు సుదర్శనావివాహోత్సవం బనుభవించి విభావసుండు విప్రాభాస మానుండగుచు హుతంబులు పరిగ్రహింప దుర్యోధనుయాగంబును సుప్రయోగంబై చెల్లెఁ బదంపడి.

60. క. అనలునకు సుదర్శనకును
జనియించె నుదాత్తగుణవిశాలుఁడు సుద
ర్శననామధేయుఁ డానృపుఁ
డనూనధర్మమునఁ దాల్చె నవనీభరమున్.

61. వ. అసమయంబున.

62. ఆ. [1]అతని కోఘవంతుఁ డనువాఁడు [2]జనియించె
సుదితయశుఁడు వాని కోఘరథుఁడు
నోఘవతియు ననఁగ నుదయించి రయ్యోఘ
వతికి నాథుండు వరుని నరసి.

63. వ. ఒరుల మెచ్చక.

64. క. ఆలేమ సుదర్శనునకు
నాలిం గా నిచ్చె నద్దహననందనుఁడున్
లోలతఁ గైకొని పరిణయ
కేలి నడపి విమలబుద్ధిఁ గృతనిశ్చయుఁడై.

65. వ. గృహస్థధర్మానుష్ఠానంబునన మృత్యువు జయింతు నని ప్రతిజ్ఞ సేసి యోఘవతియునుం దానును గురుక్షేత్రంబునకుం జని యందు రమణీయ

---

62. 1. అధి పుఁడోఘ - స 2. ప్రభవించె - మ. ల. శ. ష. కొన్ని ప్రతులు.

ప్రదేశంబున విశాల మగుపర్ణశాల కావించుకొని యుండె నట్టియెడ నయ్యోలనాగతో నతం డిట్లనియె.

66. తే. అతిథిఁ బూజించు వేడ్క నా కగ్గలంబు
వెలఁది నీవును ననుకూలవృత్తిఁ దాల్చి
సొలయ కప్పని నడపఁగా వలయుఁ బూని
యే నిచట నున్న యప్పుడు లేనియపుడు.

67. క. అతిథిజనులు దమతమవాం
ఛితము లనుభవించునట్లు సేయం గనినం
గృతకృత్యతఁ బొందరె గృహ
పతియును గృహిణియును [1]ధర్మభారమువలనన్.

68. క. అతిథి నినుఁ [1]గోరెనేనియు
[2]మతిఁ గింకిరిపడక యోలమాసగొనక నీ
వతనికిఁ బ్రియంబు సల్పుము
సతికిం బతివనుపు సేయఁ జను [3]నెల్లదియున్.

-: సుదర్శనునింటికి ధర్మదేవత యతిథియై వచ్చుట :-

సం 13-2-48

69. క. అని యీఁది చెప్పి యొకనాఁ
డనఘు యతం [1]డిధ్మములకు నటవీస్థలికిం
జనినయెడ నతిథి యొక్కఁడు
సనుదెంచిన నాసనాదిసంభావనలన్.

70. క. అతివినయంబున సమ్మా
నితుఁ జేయఁగ నాలతాంగి నెమ్మోమునఁ బూ

67. 1 కర్మభా (ర) వము వలనన్ - అ. అ ఇ ఈ. క. ష. న కొన్ని ప్రతులు.

68. 1. వచ్చి వేడిన మతిగింకిరి - ఆసం 2. ఇచ్చట అఖండ యతి కాన్పించుచున్నది ఈ ప్రయోగము అఖండ యతిని అంగీకరించు వారికిని నిరాకరించు వారికిని వివాదాస్పదమైనది అప్పకవి యీ పద్యమును దేశ్యనిత్య సమాన విశ్రాంతికి ఉదాహరణముగా పేర్కొనెను 3-266 అ. క 3. నెల్లెడలన్ - కొన్ని ప్రతులు

69. 1. డింధ నార్థము - క. ష; డింధనములకు - కొన్ని ప్రతులు.

పతఁడు నిలిపి కామాతుర
మతి నైతిం బ్రియ మొనర్పు మానిని నాకున్.

71. వ. గృహస్థధర్మప్రకారంబు నీయెఱుంగని యదియే యని పలికిన నప్పరమ పతివ్రత పేర్కొండు దెఱంగుల నభ్యర్థనీయంబు అయినవస్తువు లుపన్యసించిన నతం డవి యెవ్వియు నొల్ల ననుటయు.

72. క. సతి దనపతివచనంబులు
మతిఁ దోనుపుం దెంపు మాను మాన వెఱచున
య్యతిథిపనుపు సేయక త్రో
చుతలం పలవఱుచుఁ జేయఁ జూచుం దలరున్.

73. తే. ఇట్టు లురియాడుచిత్తంబు నెట్టకేని
నాథుచెప్పినదర్మంబునకుఁ జొరంగ
నూలుకొల్పి నిర్ణయమునఁ గీలుకొన్న
లజ్జ వేఁగునఁబోలె వ్రాలంగ మోము.

74. క. తెఱవ యొడఁబాటుమాటం
బటివోయినగొంకుతోడ బ్రాహ్మణుఁ గొని క
[1]న్మయుఁ గగునెడకు నరిగె న
త్తఱి వచ్చె సుదర్శనుండు ధరణీనాథా.

75. ఆ. వచ్చి పర్ణశాలవాకిట నిల్చి య
త్తన్విఁ బిల్చె నతిథి దాని నల్ల
నూర కుండు మనియె నువిదయు భూసుర
శాపభీతి నెలుఁగు సూపకుండె.

76. సీ. పేర్కొని పలుమాఱుఁ బిలిచి యోయనుట లే
కున్న నయ్యింటిలోఁ గన్ను వఱపి
వల్లభుఁ గానక వహ్నితనూజుండు
దలఁ కొంది ప్రేముడిపలుకు వలుక

---

74. 1. న్మరువగు - కొన్నిప్రతులు.

నతని నుద్దేశించి యతిథి నా కాతిథ్య
మొనరించుచున్నది వనిత నీవు
గృహధర్మవిదుఁడవు కినియకు మయ్య[1]మ
మ్మనుఁడు నప్పరమపుణ్యాత్మకుండు

తే. నీదుకతమున నేను సమ్మోదమగ్న
మానసుఁడ నైతి నతిథులు మహితపూజ
నములు [2]గాంచినగృహములు విమలతరము
లండ్రు బుధు లింత యొఱుఁగుదు నట్ల నడతు

77. వ. అని పలికి వెండియు.

78. ఉ. నావచనంబు[1]నట్టుల మనంబును దీనికి సాతు లుర్వియుం
బావకుఁడున్ జలంబును నభంబును వాయువుఁ జంద్రసూర్యులున్
నావుడు మ్రోసె నాకసమునన్ విశదంబుగ దివ్యవాణి సం
భావితుఁ డీతఁ డీవిధునిపల్కు నిజం బని కౌరవేశ్వరా

79. ఆ. అప్పు డతిథి ప్రీతి నతనిసన్నిధి కేఁగు
దెంచి దుర్నిరీక్ష్యతేజ మడరఁ
దనదుమూర్తి యధికతరసమున్నతిఁ బోలు
పెసఁగ నిల్చి యతని కిట్టు లనియె.

80. సీ. ధర్మదేవత నేను దగ నీదుచిత్తంబు
నారయ వచ్చితి ననమ నీవు
నిశ్చలవ్రతుఁడవు నీప్రతిజ్ఞకు హాని
గలిగినఁ దెగఁజూడఁ దలఁచి తిరుగు
నెనువెంట మృత్యువు విను జయించితి దానిఁ
గామరోషాదివికారసహిత
ముగ నంతరంగంబు మున్న గెల్చితి భవ
త్సతియుఁ బవిత్ర యస్ఖలిత చరిత

---

78. 1. నుమ్మనుఁడు _ వా (1968) 2 గావించు _ గ. మ. వ. పీ. శ ష. కొన్ని ప్రతులు
78. 1 సత్యము శ

ఆ. యొడలితోడ నీకు నూర్ధ్వలోకమునకు
నరుగ వచ్చు నెప్పు డరుగుతలఁపు
దోఁచె నప్పు [1]డిదియుఁ దోడిద యై ప్రీతి
నరుగుదెంచు ననియెఁ గురువరేణ్య.

81. వ. అని వెండియు

82. చ. నరవర పొల్చు నోఘవతి నా నదియై జనపావనాకృతిం
బరమతపంబులోనిసగపాలను నియ్యము యున్న సామున
న్వైరవునఁ దొంటిమై నిలిచి నీకుఁ దగం బరిచర్య సేయు ని
చ్చరితము మీకు నిర్మలయశంబు నొనర్చుట కే నొనర్చితిన్.

83. వ. అని చెప్పి [1]ధర్ముండు ధవళహయసహస్రంబు పూనిన మానసీయరథంబునం జనియె నోఘవతి యుద్దేవునిచెప్పినట్ల వర్తిల్లె సుదర్శనుండు బరమసంతోష భరితుండయ్యెఁ పాండవాగ్రణీ నీమనంబున నెక్కొనుపు మిక్కుటపు యభి ప్రాయంబు.

84. ఆ. అతిథిపూజఁ గడచినట్టిధర్మువు గృహ
స్థులకు నొండు లేమి దెలుపు చున్న
యది సమస్తకిల్బిషాపహారియు తి
హాస మిచ్చు నెల్ల యతిమతములు.

85. క. అనినఁ బితామహునితో న
జ్జనపతి బ్రాహ్మణ్య మవులజాతులు మూఁటన్
జనియించినవానికి దొర
కొనునొకొ యతివిమలకర్మ గుణయోగమునన్.

86. వ. అని యడిగిన నతం డతని కిట్లనియె.

87. తే. బ్రాహ్మణత్వంబు గడు దుర్లభం బనేక
జన్మములఁ బొంది తిరుగంగ సంభవించి
నపుడు గనునది యున్నతమైనయప్ప
దంబు విను మెఱిఁగించెద దానితెఱఁగు.

---

80. 1. డింతి తోడిదియై - మ. పీ. శ. ష. స

83. 1. ధర్మదేవత - మ. పీ. శ. ష

-: ఇంద్రమతంగసంవాదం బనునితిహాసప్రకారము :-
సం. 13-3-8 (కుంభ)

88. వ. అది యింద్రమతంగసంవాదం బనునితిహాసం బాకర్ణించిన నెఱుంగ నగుం గావున నక్కథ యుపన్యసించెద నొక్కవిప్రునికొడుకు మతంగుం డనువాఁడు యజ్ఞార్థంబై ప్రపనికిం దండ్రిపనుపునం బోయి

89. క. మదమునఁ జెలుచన యొకగా
డిదకొదమం గోల గొని యడిచె నడిచిన [1]నా
వ్వాదవి తనతల్లిఁ జేరఁగ
నది సని న న్నీతఁ డడిచె నని చెప్పుటయున్.

90. వ. ఆగార్దభి దనకొదమతో వీఁడు చండాలుండు ప్రచండస్వభావుండు గాకుండునే యనినం బూర్వజన్మకర్మవిశేషంబునం దిర్యగ్జాతిభాషావిదుం డగుట నవ్విప్రపుత్రుం డప్పలుక్కులు విని యిది దూషణభాషణంబు గాదు నిరూపణాలాపంబై యున్నది యట్లు గావున మూలతనంబు గలుగ నేర్చు నని నిశ్చయించి యగ్గాఁడిదకడకుం బోయి.

91. క. తనకుం జండాలత వ
చ్చినకారణ మడిగి దానిచేతం గంద
ర్పునిచెయిది మంగలికి నిజ
జననికిఁ బొం దగుట విని విషాదముతోడన్.

92. వ. తనపోయెడుపనికిం బోవక మరలి సదనంబునకుం జని జనకున కత్తెఱం గెల్ల నెఱింగించి యతనితో శూద్రబీజంబున బ్రాహ్మణియందు జన్మించినవాఁడు చండాలుం డగుటకు సందియం బేమి గార్దభి శాపజాత గా నోపు నది యున్నరూప పలికె బ్రాహ్మణ్యంబు దపంబున సంపాదించెదం గాక యని [1]పల్కి పీడ్కొని వనంబునకుం బోయి.

93. క. పరమతప మాచరింపఁగ
సురపతి వొడచూపి యడుగు సువ్రత నీకుఁ

---

89. 1 నాప్పొదవి - కొన్ని ప్రతులు. ఇత్వసంధి
92. 1. చెప్పి - కొన్ని ప్రతులు.

వర మిచ్చెద ననిన ధరా
మరత్వ మి మ్మనియె నతఁడు మది ముద మొదవన్.

94. చ. అనవుడు బ్రాహ్మణత్వము మహత్త్వ మెఱుంగవ యన్యజాతి కం
దునె యది యొండు వేఁడు మది దోఁచిన మే లనియుక బలారి వాఁ
డనితరసాధ్యమైనతప మస్ఖలితంబుగఁ జేయు చుండెదం
జనుము మహాత్మ నీ వనిన సస్మితుఁడై యతఁ డేఁగె నేఁగినన్.

95. వ. మతంగుం డేకపాదంబున నూఱేండ్లు తపంబు సేసిన నింద్రుండు గ్రమ్మఱ
వచ్చి.

96. తె. ఏను వల దని చెప్పిన మాన వెటు
పరమదుర్లభపద మాసపడి కరంబు
మేలితప మాచరించె చండాలుఁ డిట్టి
దాన నశియించు నిది నీకుఁ దగదు విడువు.

97. వ. విను మిత్తెఱంగుతపంబునకుఁ బదిమడుంగులు సేసి చండాలుండు శూద్రుం
డగు నూఱుమడుంగు లనుష్ఠించి శూద్రుండు వైశ్యుండగు వేయిమడుంగు
[1]లాచరించి వైశ్యుండు క్షత్త్రియుం డగు నప్పుణ్యాచరణంబునకుఁ బదివేలు
మడుంగులు నిర్వర్తించి క్షత్త్రియుండు దుర్బ్రాహ్మణుం డగు నానియ
మంబునకు లక్షమడుంగులు సల్పి శమదమసత్యాహింసల నమాత్సర్యంబున
నార్య(బ్రాహ్మణవ్రా)దయంబులు సదయంబులు గావించి దుర్బ్రాహ్మణుండు
సద్బ్రాహ్మణుం డగు నిట్లు బ్రాహ్మణ్యం బలఁతులం బడయవచ్చునే పడ
సియు నది సెడకుండ నడప శక్యం బగునే యనేకజన్మంబుల నొకప్పుడు
బ్రాహ్మ[2]ణజన్మంబు నొందియుం గొందఱు ధనవాంఛావిషయలోల్యాదులం
దదాచారంబు దిగ విడిచి చెడుదు రిట్టిమహాపదంబు గోరి నిన్ను నీవ యేల
వినాశంబు నొందించుకొనియెద పీతపోనిష్ఠ సాలించి తగునది యొక్క-
వరంబు వేఁడు మనియె ననిన వాఁ డూరు కున్న నాఖండలుం డరిగె
వెండియు

98. క. అంగుష్ఠ మొకటి మోపి మ
తంగుడు నూఱేండ్లు సేసెఁ దపము నియతుఁడై

97. 1. లాచర్చి - అ అ ఇ. ఈ, గ. ట. జ. వ 2. ణ్యంబు నొందియు - న
2

సంగము[1]తో నస్త్రులతో
సంగతముగఁ దోఁప వెక్కసముగా శరముల్.

99. ఆ. ఇట్లు సేసి శక్తి యెల్లను గడచన్న
నతఁడు నేల వ్రాలె నతిరయమున
వచ్చి యమరఁ బట్టి వాసవుఁ డక్కట
నీకుఁ జెప్పనయ్యె నెమ్మి నేను.

100. వ. క్షత్త్రియాదులచేతనుం బట్టు వడని బ్రాహ్మ[1]ణశార్దూలంబుతోడి మేలంబు దక్కము నీకు నొక్కవరం బిచ్చెదం గైకొను మని పల్కుటయు నతం డొడంబడినం బరమాదరంబున.

101. ఆ. చండదేవుఁ డనఁ బ్రశస్తి వహించి సు
స్త్రీలు పూజనంబు సేయఁ గామ
రూపధారి వై నిరూపింప విహాగభా
వంబు గల్గి ప్రమదవర్తి వగుము

102. క. అని వర మిచ్చి మహేంద్రుఁడు
సనియె ననిన విని యజాతశత్త్రుఁడు గాంగే
యునితో బ్రాహ్మణ్యము వెలి
జనులకుఁ బొందంగ నిట్లశక్యం బనినన్.

-: *విశ్వామిత్రునకు బ్రాహ్మణ్యంబు గలిగినతెఱంగు* :-

సం. 13-3-1

103. వ. విశ్వామిత్రుం డెట్లు వొందె నత్తెఱం గెఱింగింపవే యని యడిగిన నన్నర దేవునకు దేవవ్రతుం డిట్లనియె.

104. సీ. బ్రాహ్మణీ దేవికి జనకుఁడై వెలసిన
జహ్నునీకులమున సంభవించె
గాధి నాఁ బ్రకటభూకాంతుఁడాతనిపుత్త్రి
యగుసత్యవతి దన కాలిఁ గాఁగ

98. 1. తోనస్త్రులతో - అ. ఆ. ఈ. మ పీ ష స
100. 1. ణ్యం బసాధ్యంబు, బ్రాహ్మణ్యంబను శార్దూలముతోడి - మ. పీ. శ. ష

నిమ్మని యర్థించె నమ్మహీశ్వరు ఋచీ
కుం డనుముని భృగుకులవరేణ్యుఁ
డతని కీ నొల్ల కప్పతి దనకూఁతున
కుంకువగాఁ జెప్పె నొక్కకర్ణ
తే. మసితమై తెలుపారెడువారులు వేయి
మానియై భార్గవుండు దేరఁ బూని వరుణుఁ
గానఁ జని యవ్విధముఘోటకముల వేఁడె
నాతఁ డిచ్చుట కొడఁబడి యతనితోడ

105. క. నీవలసినప్పు డట్టిహ
యావలి ప్రభవించు నెచటనైన ననవుడున్
దీవించి యరిగి యమ్మని
దేవతటినియుత్తరంపుఁదీరమునఁ దగన్

106. వ నియతుండై తలంచినతత్క్షణంబ గాధిచెప్పినచందం బగుగుఱ్ఱంబులు వేయునుం బుడమి పొలిచి నిలిచె దానం గన్యాకుబ్జంబున కనతిదూరం బగు తత్ప్రదేశం బశ్వతీర్థం [1]బనం బరఁగె నమ్మునికుమారుం డత్తురంగంబుల నిచ్చిన నచ్చెరువును సంతోషంబును శాపభయంబు[1]ను హృదయంబున ముప్పిరిగొనం దన పుత్త్రికి నుంకువగా నియ్యకొని.

107. తే. గాధి యమ్మునిపుత్త్రి శీఘ్రమునఁ బెండ్లి
సేసె నిట్లు వరించి ఋచీకుఁ డధిక
సమ్మదమున గృహస్థధర్మమ్ము నడపు
చుండి సంతానకాంక్ష నయ్యువిదతోడ.

108. వ. నీకుం బుత్త్రోత్పత్తి గావింపం జాలుచరవు సంపాదించెద ననియెఁ దొల్లి దానితల్లి దనయల్లునిమహానుభావం బెఱుఁగుటం జేసి యాసత్యవతితో నాకుం దనయుండు గలు[1]గ దయ సేయునట్లుగాఁ బుణ్యాకర్త యగునీభర్తం బ్రార్థింపు మనినయది గావున నమ్మాట యమ్ముద్దియ యతనికిం జెప్పిన నప్పరమ ధర్మపరుండు

---

106. 1. బననెగడె - కొన్ని ప్రతులు 2 ను హృదయంబున ముప్పిరి - కొన్ని ప్రతులు; ను ముప్పిరి - వా. పీ. శ. ష

108 1. గునట్లుగా దపంబు సేయుటకై పుణ్యా - మ శ ష

109. తే. రెండుచరువు లొనర్చి యొక్కండు బ్రాహ్మ
ణత్వ మత్యుజ్జ్వలముగ నొనర్చ నొకటి
రాజభావంబు నధికతీవ్రముగఁ జేయఁ
జాలునట్లుగ నిజతపశ్శక్తిఁ జేసె.

110. వ. ఇట్లు గావించి యారెంటిని సత్యవతికిం జూపి తత్ప్రభావంబు వేఱువేఱ యుపన్యసించి క్షాత్త్రం బయినచరువు మీతల్లి కిచ్చి [1]బ్రాహ్మం బయిన దాని నీవు పుచ్చికొనుము ఋతుకాలంబున నీతల్లి యశ్వత్థంబును నీ వుదుంబరంబును నాలింగనంబు సేసి భక్తితో మీమీ చరువు లుపయోగించు గించునది యని నియోగించె వారియుపయోగంబుసమయంబున విధివశం బునం జేసి.

111. క. చరువులు నమ్మౌని చెప్పిన
తరువులు పీడ్వడియె సుతకుఁ దల్లికి నట్ల
య్యిరువురు నుపయోగింపఁగఁ
గరువులు దత్తత్ప్రకార[1]కలితము లయ్యెన్.

112. వ. దివ్యబోధ మహానీయుండు గావున.

113. ఆ. చ్యవననందనుండు సత్యవతీగర్భ
భంగి సూచి యకట బ్రాహ్మణుండు
గాఁడు తరుణి నీదుకడుపులోపలిబిడ్డ
క్రూరుఁడై నరాచకొడుకు గాని.

114. వ. అని పల్కి చరుతరువ్యత్యాసంబున నట్లగుట దేటపడం జెప్పిన నబ్బోటి యత్యంతవిషాదవేదనాదూయమానమానసయై.

115. క. నీకుం బుట్టెడుకొడుకు వి
వేకనిధి బ్రాహ్మణత్వవిరహితుఁ డైనన్
లోకము మెచ్చునె యట్టులు
గా కుండఁగఁ జేయు తపముగౌరవ మొప్పన్.

116. తే. నాకు నివ్వర మిమ్మని నమ్ర యగుడు
వీఁడు బ్రాహ్మణుఁడగుఁ గాక వీనికొడుకు

---

110. 1. బ్రాహ్మణ్యంబైన - కొన్ని ప్రతులు
111. 1. గర్భములయ్యెన్ - ఐ

నందు రాజత్వసంపద యతిశయిల్లు
ననియెఁ గరుణార్ద్రచిత్తుఁడై యత్తపస్వి.

117. వ. అట్లమ్ముని యావ[1]హించుటకతంబున సత్యవతీపుత్త్రపౌత్త్రులై నజమ
దగ్నిపరశురాములు క్రమంబున బ్రహ్మక్షత్త్రతేజోవిరాజితులయిరి గాధి
భార్యకు జనియించి విశ్వామిత్రుండు.

118. క. నరనాథుం డై యుండియు
జరుతరుగుణసంక్రమమున సద్బ్రాహ్మణతా
స్ఫురణంబు వడసెఁ దపమును
గర మధికం బతనియందుఁ గలిగెఁ గుమారా.

*-: వీతహవ్యుం డనురాజునకు బ్రాహ్మణత్వంబు గలిగిన ప్రకారము :-*

సం. 13 - 8 - 1 (కుంభ)

119. వ. అనిన విని ధర్మజుండు వీతహవ్యుం డనురాజు బ్రాహ్మణత్వంబుఁ బడసె నని
వింద నత్తెఱం గెఱింగింపు మనవుడు నతనికి శంతననందనుం డిట్లనియె
మనుసంభవుడై న[1]శర్యాతియన్వయంబున హైహయుం డనునొక్కజనపతి
జనియించి వత్సదేశాధీశుం డయి పొలిచె నతనికి వీతహవ్యనామంబునుం
గలిగియుండుఁ దదీయభార్యలు పదుండ్రు వారలు వీరులుం బ్రబలులు నగు
పుత్త్రుల నూర్వురఁ గాంచి రమ్మహారథులు విక్రమకుతూహలంబున.

120. సీ. [1]హర్యశ్వుఁ గాశీశు నాజికిఁ బిలిపించి
యొక్కయుమ్మడి లావు నుక్కు మెఱయఁ
బోదివి చంపిరి వాని పుత్త్రుండు పట్టంబు
గట్టె సుదేవుండు క్రమ్మఱంగ

---

117 1 హించిన కతంబున - ఊ. ఓ. క చ వ. శ

119. 1. సంయాతి - శ. ష పెక్కు ప్రతులు; యయాతి - వ. భండార్కరు ప్రతియందును
చిత్రశాలా ప్రతియందును వీతహవ్యుని వృత్తాంతము లేదు. కుంభకోణ ప్రతియందును,
పి పి. యస్. శాస్త్రి ప్రతియందును మాత్రమే యీ వృత్తాంతము కన్పించుచున్నది.
పి. పి యస్ ప్రతియందు ప్రధాన పాఠమున శర్యాతిపేరు లేదు. పాదసూచికయందు
శయ్యాతి అని ఈయబడినది. కుంభకోణ ప్రతియందు శర్యాతి అనియే కలదు.
13-8-7 సంయాతి అను పేరునకు మూలము తెలియలేదు.

120 1 హరిదశ్వ - అ ఈ. ఊ. చ వ శ ష; హర్యశ్వు - ల.

నురవడి నరిగి యద్ధరణీశు ననిఁ దెగఁ
జూచి రా హైహాయసుతులు గడిమి
నాతనినందనుఁ డగుదివోదాసుండు
రాజైన నమ్మహీరమణుమీఁద
ఆ. నడచి వారు ఘనరణం బొనరించి సై
న్యంబుఁ ద్రుంచి రోడి యతఁడు వాఁటి
ప్రకటసంయమిని భరద్వాజమునిఁ గని
యధికభక్తి నతని నాశ్రయించి.

121. క. తనకులము వీతహవ్యుని
తనయులచేఁ ద్రుంపఁబడుట దగ నెఱిఁగింపన్
విని యతఁ డోడకు నీకొక
తనయునిఁ గల్పింతు రిపువిదారణనిపుణున్

122. వ. అని పుత్త్రకామేష్టి సేసినం బ్రభవించినపుత్త్రుం డప్పుడ పదుమూఁడేండ్ల ప్రాయంబువాఁ డయ్యెఁ బ్రతర్దననామధేయుం డగునక్కుమారుం డమ్మహాత్మునియనుగ్రహంబున వేదంబులు ధనుర్వేదంబును వేగంబ యధిగమించి.

123. చ. ముని కృప నావహింపఁగ సముజ్జ్వలతేజముఁ బొంది ప్రీతిమై
జనకుఁడు యౌవరాజ్యపదసంగతుఁ జేసినఁ జేర్చి యవ్విభుం
డనుమతి సేయ నెత్తి చని యాజిముఖంబున వీతహవ్యునం
దనతతి నెల్ల గీ టడఁచె దర్ప మెలర్పఁగ విక్రమంబునన్.

124. క. తనయులఁ దెగటార్చి పడిం
దనమీఁదం గవిసినం బ్రతర్దను[1] శౌర్యం
బున కలికి వీతహవ్యుం
డనయము వెసఁ బాఱె భృగువునాశ్రమమునకున్.

125. ఆ. పాఱి భీతి దోఁపఁ బల్కె నమ్మునిని తన
దైనశిష్యసమితి లోన మునిచె

124. 1. తేజంబున - శ ష

నతనిఁ గాశిరాజసుతుఁడును వెనువెంటఁ
దగిలి యచటి కరిగి తగువిధమున

126. క. మునిపతికిని వినయము సే
సిన నిట రాకకుఁ గతంబు సెప్పు మనియె న
జ్జనవంద్యుఁ డక్కుమారుం
డనఘా మధ్యస్థవృత్తినై వివరలయున్

127. వ. అని పలికి తమకులంబు వీతహవ్యునికొడుకులచేత నశించినవిధంబును దాను వారల నందఱ బ్రమందించుటయును వీతహవ్యుం డాహవంబునం దనకు నోడి పాఱుటయును జెప్పి మునీంద్రా యారా టిట వచ్చె నాతనిం బొలియించుటకై వచ్చితి ననిన సత్తపోధనసత్తముండు.

128. క. విను మిచ్చట నృపకులసం
జనితుఁడు లేఁ డింతయుం బ్రశస్తమహీదే
వనితాయమ కనుఁగొను మని
తనశిష్యప్రతతిఁ జూపె దయ చిగురొత్తన్.

129. వ. చూపినం జూచి

130. ఆ. అతఁడు నగుచు భృగునియడుగుల కెఱఁగి మ
హాత్మ దీన నేఁ గృతార్థవృత్తి
నైతిఁ బగతు నిట్లు జాతికిం బెడఁబాపి
గాసి గాఁగఁ జేయఁ గంటిఁ గాన.

131. క. కలుగునె యమోఘ మగునీ
పలుకున కన్యత్వ మేను బనివిని యెద న
న్నలఘుకృపఁ జూడు మని తగఁ
బలికిన ముని ప్రీతి నానృపతి వీడ్కొలిపెన్.

132. ఆ. వీతహవ్యుఁడును మహాతపస్సందీప్తుఁ
డై నయమ్మునీంద్రు నప్రతర్క్య
భంగి భాషణముల బ్రాహ్మణుఁడై గృత్స
మదసమాఖ్యుఁ గాంచె మహితసుతుని.

183. వ. తత్పుత్త్రపౌత్త్రక్రమంబున [1]సుతేజసుండును వర్చసుండును విహవ్యుం
డును వితత్యుండును సత్యుండును సంతుండును శ్రవసుండును దమసుం
డును ప్రకాశుండును వాగింద్రుండును [2]ప్రమతియును రురుండును [3]సము
దుండును శునకుండును శౌనకుండును నన మహాద్విజులు జన్మించి రిట్లు
విద్యావార్త్తికశ్రీవిశంశం బగు మునివంశంబునకు మూలం బయి యవ్వీత
హవ్యుండు భవ్య[4]కీర్త్తి నడసెఁ బాండవాగ్రజా యింక నెయ్యది యడిగెద
వడుగు మనుటయు నతండు దైవంబును బౌరుషంబును నను రెంటియందు
నెయ్యది యధికంబు సెప్పు మనిన నప్పురుషవరుండు దొల్లి యిట్ల వసిష్ఠుండు
బ్రహ్మ నడిగిన నమ్మహాత్ముం డుపదేశించిన వాక్యంబులయర్థంబు లుపన్య
సించెద నాకర్ణింపు మని యిట్లనియె.

*-: భీష్ముండు ధర్మరాజునకు దైవపౌరుషంబుల తెఱం గెఱింగించుట :-*

సం. 13-6-1

184. క. క్షేత్రంబు పురుషకారము
ధాత్రీ[1]శ్వర బీజ మరయ దైవము రెండున్
సూత్రపడఁ గూడెనేనిం
బాత్రం బగుఁ గర్మకరుఁడు ఫలమున కెందున్.

185. క. [1]విను పురుషుఁడు గావింపని
పనులకు దైవ మది యెట్లు ఫల మొనరించున్
జనములు గార్యము నడపఁగ
ననుకూలత నిచ్చుఁగాక యద్వైత్యఫలముల్.

186. తే. పౌరుషమ్ము దైవంబుతోడ్పాటు లేక
ఫలముఁ బొందంగ నేరదు పార్థివేంద్ర
విత్తు సహకారి గాకున్న రిత్తనేల
వంధ్య మగుఁ గాక తా ఫలవంత మగునె.

---

183. 1. వైనసుడు - కొన్నిప్రతులు 2. ప్రీతిమంతుండును - కొన్ని ప్రతులు 3. పెక్కు ప్రతులలో యీ పేరు లేదు 4. కీర్త్తి - పెక్కుప్రతులు, మూర్త్తి - వా

184. 1. వర - చ. వ

185 1. విను పురుషులుగావింపని. పనులను - స

137. తే. మేలు రెండులోకంబుల మేల తెచ్చు
గీడు సేసినఁ దప్పదు కీడ యగుట
కాన పురుషవర్తనమున కానుకూల్య
శీల మగుదైవ మది ఫలసిద్ధిఁ జేయు.

138. క. అనలం బించుక యైనఁ బ
వనుచే వెలుఁగొందుమాడ్కి వర్ధనముం బొం
దును సత్కర్మాచరణం
బున దైవము నానుకూల్యము గురుప్రవరా.

139. క. నేయి పాలు పఱిన దివియ
మాయుకరణిఁ గర్మ[1]శుద్ధి మలిఁగిన హీన
త్వాయత్తంబై తానును
మాయును దైవానుకూల్యమహిమ మహీశా.

140. తే. పరశురాముఁడు భృగుఁడును బలియు లోను
గాఁగ మహనీయపురుషులు గర్మసూత్ర
భంగిఁ గలుషితదైవప్రభావితాత్ము
లైరి కర్మంబు దైవంబు [1]నలఁతు లెట్లు.

141. క. విను పౌరుషమును దైవము
నన రెండును గార్యఫలము నందింపఁగ నె
ట్టన కారణములు గావున
జననాయక సదృశములు విచారింపంగన్.

142. వ. అనిన విని ధర్మతనయుండు సత్కర్మంబుల నయ్యైడుఫలంబులు విన వలతు
ననుటయు నక్కురుసత్తమునకు నక్కురుపితామహుం డిట్లనియె.

143. సీ. అధ్వపరిశ్రాంతుఁ డగువింతవానికి
నన్నం బిడినఫల మట్టి దిట్టి
దనఁ బెద్ద యగ్నిసమారాధనమునకుఁ
బౌరుషశ్రేష్ఠత భవ్యదాన

139. 1. సిద్ధి - అ. ఈ. ఖ. చ ట ల. పీ శ. ష. స. సూ
140. 1 నలఁతురెట్లు - అ. ఉ ఎ ఒ. ఓ. ఔ. క. వ శ.

ములకుఁ దత్తద్వస్తువులమహామహిమలు
మౌనంబునకుఁ బరిజ్ఞానశక్తి
యతులతపంబున కధిక భోగము లహిం
సకు రూపబలచిదైశ్వర్యసిద్ధి
ఆ. బ్రహ్మచర్యమునకుఁ బరమాయు వుపవాస
ములకు చిత్తశుద్ధి ఫలజలంబు
లాహరించి యునికి కాధిరాజ్యము పత్తి
భక్తతకు దివంబు ఫలము లధిప.

144. క. శ్రుతిపఠనమునకు నర్థ
ప్రతిబోధంబునకు వరుస ఫలములు సౌఖ్య
స్థితియును సుగతియు సత్య
వ్రతమునకు ఫలంబు ముక్తి వసుధాధీశా.

145. క. ద్రుమముల దళకుసుమఫలో
ద్గమములక్రియఁ గర్మముల నొదవుఁ దత్ఫలముల్
దమతమతఱిఁ గర్తకు భో
గ్యము [1]లై నియతిని శుభాశుభాకారములన్.

146. వ. అని చెప్పి.

147. చ. వినుము జరానుబంధమున వెండ్రుకతండముఁ బండ్లు వీనులుం
గనుఁగవయున్ జరం బొరయుఁ గాని యొకప్పుడుఁ దృష్ణ జీర్ణగా
దనయముఁ దెచ్చి ప్రాణముల నన్నక పోవ నిరోగ మల్పబు
ద్ధి నరులు ద్రోవ లే రది మదిం జొర నీరు సుఖార్థులై బుధుల్.

148. క. పాపంబుఁ బుణ్యమును దృ
ష్టాపరములకు దుఃఖసౌఖ్యసంపాదు లగున్
భూపాల వితృష్ణులు ని
ర్లేపు లగుట వారిఁ బొంద లే వాఫలముల్.

---

145 1 లనగ శుభాశుభముల కారణ మొప్పన్ - క

149. వ. అని పల్కినం బాండునందను లందఱుం [1]బ్రహ్మార్షోత్కర్షంబు నొందిరి గంగానందనుండు ధర్మనందను నుద్దేశించి యీయర్థజాతంబు మునిప్రణీతం బయి యధిగతం బైనది నీకు [2]నుపదేశించితి నీ వింక నేమి విన వల తనవుడు నాథూవల్లభుండు నిజాశ్రయంబున కాస్పదం బయినపురుషునెడ భక్తజనంబు చరితం బెట్టిది గావలయు నని యడిగిన నతం డతని కిట్లనియె.

—:భీష్ముఁడు ధర్మజున కాశ్రయం బెప్పుడు నపరిత్యాజ్యం బని చెప్పుట:—
సం 13-1-1 (కుంభ)

150. క. విను కాశీశ్వరుదేశం
బున నొకలుబ్ధకుఁడు వేఁటవోయినచోటన్
మనతరవిషదిగ్ధశరం
బున నేసిన మృగముఁ దప్పి భూజముఁ దాఁకెన్.

151. క. పూవులఁ గాయలఁ బెరిగిన
యావృక్షము శుష్కమయ్యె నవ్విధమున ధా
త్రీవర తదీయకోటర
మావాసము గాఁగ నొకమహాశుక ముండున్.

152. క. అది తరువువిడిచి పోవక
హృదయంబున భక్తిపేర్మి [1]నెండను గాలిన్
బెదరక ధృతిమై నయ్యెడఁ
గదలక యుండె నసుతీవిగౌరవ మెసఁగన్.

153. ఉ. దానియుదాత్తవృత్తము శతక్రతుఁ డాత్మ నెఱింగి వచ్చి యిం
తైనది యిమ్మహీజము మహాతరువుల్ ఫలవృద్ధి [1]నొంది యి
క్కాన ననేకముల్ గలుఁగగా నిటు లేటికి నిందు నిల్వ నో
మానితకీరమా యనియె మానుషభంగికరూప మొప్పఁగన్.

154. వ. అనిన విని యాశుకంబు.

---

149. 1. బ్రభూత హర్షోత్కర్షంబు - ఱు. చ. 2. నుపన్యసించితి - న
152. 1. నెప్పటి భంగిన్ - శ
153. 1. నొప్పి - పెక్కుప్రతులు.

155. చ. అనయముఁ బండు చుండునెడ నాశ్రయ మొప్పిన నిల్చియుండి పో
యినతఱిఁ బాసి పోక తగ వెట్లు కృతఘ్నత గాదె యివ్విధం
బనిమిషనాథ యన్న [1]నతఁ డచ్చెరు వంది పురాకృతోపసం
జనితవిశేష మీఖగము జానుగ నన్ను నెఱింగె దీనికిన్.

156. వ. మే లొనర్చెదం గాక.

157. క. అని తలఁచి నీదుపలుకులు
విని మెచ్చితి వరము గోరు విహగోత్తమ నీ
వనిన శుకంబు మహీజం
బునకుం బేరెలమి [1]వేఁడె భూపవరేణ్యా.

158. ఆ. అమరవల్లభుండు నమృతసేచనమున
భూజము నకుఁ దొంటిపొల్పుకంటె
మిగుల నెలమి సేసె మేలియాశ్రితు లిట్లు
మనుతు రధిపుఁ గురుకుమారవర్య.

—:విభులకు బాటింపవలయువారిని భీష్ముఁడు ధర్మజునకుఁ జెప్పుట:—
సం. 13.8.1

159. వ. అనిన నతం డెవ్వరిఁ బాటించుట విభులకు [1]వలయు నని యడిగిన నాభూ
పతికి భీష్ముం డిట్లనియె.

160. సీ జననాథ విను తపస్స్వాధ్యాయముఖకర్మ
కరణత నుభయలోకముల వఱగ
తములఁ జేయఁగఁ జాలుధాత్రీసురులు మన్న
నకుఁ బాత్రములు పతి నాతి కెట్లు
రాజనకును నట్లు బ్రాహ్మణుఁ డొడయుండు
బ్రాహ్మణుం డనుమాటపావనంబు
వార్షించి శుభముల నలిగి యాపదల నిం
ద్రునకైనఁ జేయు విప్రుండు నృపతి

155 1. విని యచ్చెరు వొంది – అ. ఈ. ఎ

157. 1. గోరె – కొన్ని ప్రతులు

159. 1. నర్హం బనియడిగిన – అ. ఈ

ఆ. గొడుకుఁబోలె నరయ గురుఁబోలెఁ గొలువంగ
నగ్నిఁబోలె నిష్ఠ నర్చితుఁడుగఁ
జేయ వలయు విప్రుఁ జెప్పెద వేదసం
వాద మేకబుద్ధి నాదరింపు

161. వ. వేదంబులు దమలోన గోష్ఠి సేయుచున్న సమయంబున

162. సీ. బ్రాహ్మణజాతికిఁ బరిభవం బొనరింప
మున్ను చేసిన పుణ్యములు నశించు
జపహోమముఖకర్మసంచయంబునకధి
కతరంబు విప్రముఖమున నిడుట
[1]భూసురార్చన మొకమాసంబు[2]సల్పినఁ
బాపంబు లెల్లను బాసి పోవు
వ[3]గ్రవర్ణులఁ గాంచి యాదరింపక యుండు
కంటెను గీ డొండు గలుగ దరయ
తే. నని క్రమంబున ఋగ్వేదమును యజుస్సు
సామము నథర్వణమ్మును సారభూత
భవ్యసంభాషణము [4]సేఁత దివ్యమునుల
వలన విందుము కౌరవకులపవిత్ర.

-: భీష్ముఁడు ధర్మజునకుఁ బరమ మైనధర్మంబు చెప్పుట :-
సం 13-18-1 (కుంభ)

163. సీ. అని చెప్పి భీష్ముఁ డమ్మనుజేంద్రుతోఁ బర
మశ్రేష్ఠమైనధర్మంబుఁ దెలియ
విను మని పల్కి యిట్లను మద్రనాథుండు
సత్యవతీపుత్రచరణములకు
నెఱఁగి కేలు మొగిడ్చి యొద్దాని నెఱుఁగుట
యెఱుకల కెల్లను నెక్కు డని స

162 1. భూసురారాధనమున నొక్క మాసంబు పాపంబులెల్ల - గ. చ. ట. న 2. నిల్పిన - శ ష 3 జన్ముల - ఎ 4. సేయ - వ

భక్తిక[1]సమ్మతిఁ బ్రార్థించి యడిగిన
నమ్మహాముని దయ నతనిఁ జూచి

ఆ. విష్ణు నెఱుఁగు టధికవిమలబోధము యజ్ఞ
మూర్తి యజ్ఞకర్తృమూర్తి యజ్ఞ
కలనమూర్తి యజ్ఞఫలమూర్తి విష్ణుఁ
డతండు కృష్ణుఁ డమలతరచరిత్ర

164. వ. అని పల్కి యమ్మహాత్ముండు వెండియు శల్యున కిట్లనుఁ గృష్ణుండు విను చుండఁ గొందఱు బ్రాహ్మణు లతని నుపలక్షించి నాతో నిట్లాలుండు యాదవుండైన వసుదేవునకుఁ గంసానుజయైన దేవకియందు జన్మించినవాఁ డితని నీవు క్రతుపురుషుం డని కొనియాడుటకుఁ గతం బేమి యని యడిగిన నన్నారాయణుండు నగుచు నన్నుఁ గన్గొని వీరలప్రశ్నంబునకు నుత్తరంబు దగ నిత్తు గాక యనిన నద్దేవునకుం బ్రణమిల్లి యే నిట్లంటి.

165. ఆ. వేదమయుఁడు వేదవేద్యుండు [1]వేదార్థ
విత్తమప్రియుండు విష్ణుఁ డీతఁ
[2]డిట్టిఁ డగుట యాత్మ నెఱుఁగుట యుత్తమ
బ్రాహ్మణత్వసిద్ధి భవ్యులార.

166. వ. అనిన విని వారలు దద్భావనం గృతకృత్యులై రని చెప్పిన మద్రవిభుండు మానసంబు మాలిన్యరహితంబును బ్రసాదసహితంబును నయి చరితార్థుం డయ్యెఁ బాండవాగ్రజా నీకు నీయర్థంబు విజ్ఞాతం బగుట యెఱుంగుదు నైనను బ్రజ్ఞా [1]విశుద్ధికరణం బాచరించితి నని చెప్పుటయు నతం డత్యంత సంతుష్టాంతరంగుం డయి గరుత్మంతుండు మహానుభావుం డని విందు నవ్వి హగవిభునివృత్తాంతంబు తెఱం గెఱుంగ విన వలతు వివరింపవే యనుటయు నతం డచ్యుతు నాలోకించి యానుపర్ణుండు నీవ కా విని యుండుదుం జెప్పెద ననవుడు నప్పుండరీకాక్షుండు వికచవదనుండై యట్లు చేయు

163. 1. నన్మతి - శ కొన్ని ప్రతులు.
165. 1. వేదాంతవిత్తమ - వీ. క. వ. 2. దిట్టి వాచ్యుఁడగుట - కొన్ని ప్రతులు.
166. 1. విశదకరణం - గ. ల. వ. వీ. శ వ. కొన్ని ప్రతులు.

మిక్కుఱుపతి కోర్కి దీర్చుట కర్తవ్యం బని పల్కిన నాదేవవ్రతుండు భూవల్లభున కిట్లనియె

-: భీష్ముఁడు ధర్మజునకు గరుత్మంతుని చరిత్రంబు చెప్పుట :-
సం. 13-19-1 (కుంభ)

167. సీ. [1]కశ్యపుభార్యలు కద్రువ వినత నాఁ
గల రాతపస్వి వారలకు వరము
గరుణ నిచ్చెద నన్నఁ గద్రువ వేవుర
వినత యిద్దఱ వేఁడికొనిరి సుతుల
మునియు నట్లగుఁగాక యనియెఁ బదంపడి
యండముల్ వేయును నండయుగము
వరుసన యాకద్రువకు వినతకుఁ బుట్టె
నవి కుండముల నిడి యరసి యుండి

తే. [2]రవిసహస్ర మేనూఱేండ్లు నంత నుదయ
మయ్యె నవ్వేయిభుగుడ్డుల నధికబలముఁ
దేజమును గల్గి యాసర్పరాజి యొప్పు
చుండె నారెండు[3]విరియక యుండె మఱియు.

168. క. తనసవతి యైనకద్రువఁ
గని వగపును మత్సరంబుఁ గదురెడుమదితో

167. 1. అ. ఇ. ప్రతులలో గరుత్మంతుని వృత్తాంతము అను రీతిని ఉపశీర్షిక కలదు. ఈ పర్వమునందు గరుత్మంతుని వృత్తాంతమునకు మూలము భండార్కరు ప్రతియందును, చిత్రశాలా ప్రతియందును కాన్పించుటలేదు. కుంభకోణ ప్రతి (13 - 19 - 1), పి పి యస్. శాస్త్రి ప్రతి (13 - 12 - 1) యందును కాన్పించుచున్నది. 2. రవి సహస్రమే నూరేండ్లు - అ ఏ. ఓ. క. జ. వ. శ, ఇచ్చట మూలమున ఐదు పందల సంవత్సరములనియే యున్నది.
"నిస్సరంతి తదండేభ్యః కద్రూపుత్రా భుజంగమాః"
పంచవర్ష శతేకాలే దృష్టాశ్చ సబలౌజసః - పి. పి. యస్. శాస్త్రి ప్రతి, రవి సహస్ర మే నూఱేడు లంతనుదయ-అను 'శ' పారమున 'రల' మైత్రియు అఖండ యతియు చూడవలెను. 3. నవియక - గ. చ. వ. శ. ష

వినత గడుఁ గ వేగిరపడి
[1]యనిలి నొకయండ మవియ నడిచె నరేంద్రా.

169. వ. అడిచిన నందు.

170. క. పులుఁ గొక్కఁడు పూర్వాంగము
గలిగి జనియించుటయు [1]వానిఁ గని యాసతి గ
న్నుల నశ్రుజలంబులు పె
ల్లొలుకఁగ శోకమున మునుఁగునుల్లముతోడన్.

171. వ. నివ్వెఱ[1]పడి యుండ నయ్యండజంబు[2]

172. చ. ఇరువుర మేము వుట్టుదు మహీనపుమేనులతో మహాబల
స్ఫురణ వెలుంగ నవ్వెనువుఁ బొందఁగ నీ కవియించి తిట్లు మ
త్సరమునఁ జాపలంబునను దత్ఫల మందుము నీసపత్నికిన్
వరవుడ వై చరింపు మని వారని నెవ్వఁగ శాపమిచ్చినన్.

173. క. [1]వెలువెలఁ బాఱుచు వడఁకుచు
[2]నలుకుచుఁ దన మోముఁ జూచునయ్యంగనన
వ్వులుఁగు కృపఁ జూచి తల్లీ
వలవ దడల నిది విధాతృవశోమయి వచ్చెన్

174. వ. అని వెండియు.

175. శా. ఏనూఱేండ్లకుఁ బుట్టు నాయనుజుఁ డిం కీయున్నయండంబు నె
త్తైనన్ ధైర్యము గల్గి కావును ప్రయత్నానక్తి మై వాఁడు ద
ర్పానూనుండు బలాభిరాముఁడు [1]మదీయస్ఫూర్తి మనూర్తి నీ
కానందంబుగ నీఁగు దాస్యము త్రిలోకాశ్చర్యసంపాదియై.

---

169. 1. యనియతినొక _ క వ. పీ. ష. న, యనయము నొక _ ¥
170. 1. దానిగని _ కొన్ని ప్రతులు
171. 1 గందియుండ _ కొన్ని ప్రతులు 2 బాతల్లి కిట్లనియె _ కొన్ని ప్రతులు.
173. 1. వెంవెల _ క. ఖ శ, ష. నూ కొన్ని ప్రతులు 2. నలయుచు _ కొన్ని ప్రతులు.
3. మునవచ్చెన్ _ వ. పీ. శ. ష. న
175. 1. మహీయస్ఫూర్తి _ అ. ఇ. ఈ. ఎ L. చ. ౦ న మహోగ్రస్ఫూర్తి _ ల. శ. ష.

176. వ. అనియె నిట్లు ప్రథమపుత్రుండు వికలాంగుం డగుటకును శాపప్రాప్తికిని
బరమని[1] ర్వేదనంబు నొంది వినతయు నవ్వివాగంబు నిర్దేశించినకాలంబు[2] ప్రతీ
క్షించి యయ్యండంబు రక్షించికొనియుండం దత్సమయసమయసమాగమంబున.

177. చ. ఘనతరకంధరుండు దృఢకాయుఁడు దీప్తముఖుండు రక్తలో
చనుఁడు మహోత్తమాంగకుఁడు చారుసుసంగతపక్షసారమం
డనుఁడు పరిస్ఫురద్ద్యుతివిడంబితబాలదివాకరుండు లో
కనయనపర్వనిర్వహణకారి సుపర్ణుఁడు పుట్టె భూవరా.

178. క. ఆసమయంబున నరుణో
ద్భాసితగాత్రుండు దొలుతపట్టి [1]యరుణుఁ డు
ల్లాసి యగుచు రవిపరిచ
ర్యాసుఖ మెదఁ గోరి చనియె నంబరవీథిన్.

179. మ. జనినం బొంపి [1]జనించునప్డ తనయిచ్చం బక్షినాథుండునుం
జని పద్మోద్భవకల్పితంబు లగుభోజ్యంబుల్ శరీరంబు వ
ర్ధన మొందింపఁగ సిద్ధసాధ్యగణముల్ దన్ ముద్దు సేయంగఁ గ్రీ
డనలోలత్వమునం జరించుఁ బరితుష్టస్వాంతుఁడై యొల్లెడన్

180. వ. అక్కాలంబున వినోదంబునకై యరిగి యొక్కయెడ.

181. సీ. చంచులఁ జిగురాకుఁ జించియాడుచు నలి
[1]నెలుఁగించుగండుఁగోయిలలసొంపు
నలరుఁదేనియ గ్రోలి[2] యున్న సోలంబుల
మఱియుఁ దేఁటులనును ద్రోఁతయింపుఁ

---

176. 1. ర్వేదంబు - కొన్ని ప్రతులు 2 నిరీక్షించి - ఐ ఖ, ఋపలక్షించి - క. వ.

178. 1. యనురు డుల్లాసి - ఐ. ఒ ఖ వ. అనూరుడు ప్రసిద్ధరూపము

179. 1. చరించునప్డు - ఉ. ఐ. ఔ. ఖ. ఙ. ళ

181. 1. నెలిగించు - ఎ. ఐ. క. ఖ ల; ఎలిగిచ్చు, ఎలుగిచ్చు - అనిపాఠములు. 2. యొలయు
సోలంబుల - పీ. ష. స. 3 దమిబండ్ల - క. వ. పీ. ష. స; దనవండ్ల - చ. వ.ళ

[3]దనిపంఙ్క్తరస మూని తమలోనఁ జెలఁగుచుఁ
బలికెడురాచిల్క[4]పదువురంగుఁ
గోలఁకుల కెలఁకులఁ గూడి క్రీడించు చుం
డెడునంచతండంబునడకెఁగుఁ

తే. దరఁగఁదేలుచు బూదివఁ దగులఁబడచు
వచ్చుచిఱుగాలిసోఁకును మెచ్చిమెచ్చి
తగిలి కొనియాడుచును వినతయును గద్రు
వయును మున్నిటిచేరువ వనమునందు.

182. వ. మెలఁగు చుండి రట్టియెడ

183. చ [1]కరువునఁ బోసిరో విధునికాంతి సుధాబ్ధితరంగఁ దెచ్చి గం
డరు వొనరించిరో హరుజటాస్థలికిం దొడ వైనయేటిపె
న్నురువునఁ జేసిరో యన మనోజ్ఞసితచ్ఛవి నుల్లసిల్లనుం
దరతురగోత్తమంబు దవుదవ్వులఁ గాంచిరి చారులోచనల్.

184. వ. నిజేచ్ఛమై వచ్చినయుచ్చైశ్శ్రవంబు ని ట్లాలోకించి.

185. క. వినత హయ మింతయొప్పనె
యనూనధవళప్రభాఢ్య మై యనిపలుకన్
విని కద్రువ యపరాంగం
బున నీలిమ దోఁచె ననియె భూపవరేణ్యా.

186. చ. అనవుడు నమ్మృగాక్షి యిటు లాడితి నవ్వుల కాడితో నిజం
బునకునో నీదుచూపునకుఁ బోలినభంగియె చెప్పు మన్న న
వ్వనిత దరస్మితస్ఫురితవక్త్రముతో నిది యేటిమాట న
[1]ల్లనియెడ గాన రాదె [2]తెరలం బలుకం బని యేమి నావుడున్.

187. వ. వినత దెలియం జూచి

4. పటురవంబు - ఐ ఔ. క ఖ. జ. వ.శ
183. 1. కరుగున - కొన్నిప్రతులు
186. 1 ల్లనయది - ఈ ఉ ఓ. ఔ. క వ. ష. 2. తెరలంబలుకం - క. వ, ష; మరలం బలుకం - గ. పీ. శ, తెమలంబలుకం - వా

188. ఉ. కాదని పూని పల్కుటయుఁ గద్రువ పన్నిద మేమి దీనికి
న్వా దిది యేల రిత్త యనినన్ విని యాసతి నిక్కమేని నీ
వేది పణంబుగాఁ దలఁచి యేర్పడఁ జెప్పితి దాని కేను సం
వాదము సేయుదాన గరువంబుగ నొక్కటి నిశ్చయింపుమా.

189. వ. అనిన విని కద్రువ వినతవదనంబునఁ జూడ్కి నిలిపి

190. తే. నీవు గెల్చిన దాస్యంబు నీకు నేను
జేయఁ గలదాన నేను గెల్చినను నీవు
[1]నాకుఁ జేయంగఁ గలదాన వీకడింది
పన్నిదము [2]సఱ మని తెగఁబాటి పలికె.

191. క. ఆపొలఁతి యట్లు వల్కిన
శాపముప్రేరేప నరుణజననికి నుత్సా
హోపేత మయ్యెఁ జిత్తం
బాపన్నిదమునకు నేమి యనఁగల దధిపా.

192. వ. ఇట్లు వినతయుం దెంపు సేసి యత్తెఱంగున కియ్యకొనియె నయ్యిరువురుఁ
బంచమహాభూతంబులు సాక్షులుగాఁ బల్కి పన్నిదంబు సఱచిరి కద్రువ
పతిపరిచర్యకుం గాల మయ్యె మఱి వచ్చి యశ్వంబు నాలోకింత మని నెపం
బిడి యప్పటికిం జూపు దప్పించె నవ్విధంబున [1]మగిడి యరుగుదెంచిరి తద
నంతరంబ

193. సీ. కుటిలంపుఁ[1]దలఁపునఁ గొడుకుల రావించి
కద్రువ యిట్లనుఁ గన్న నీరు
దొరఁగంగ వారలతో నద్ధిపొంతకు
వినతయు నేనును వేడ్క నరిగి
యచ్చ తెల్పునఁ గడునభిరామ మగునొక్క
యశ్వంబు గాంచితి మవ్వధూటి

---

190 1 నాకు దాస్యంబు సేయుము నాతియనుచు - శ 2. సరుమని - అ. ఆ. చఱుమని - ష. సూ.

192. 1 మగుడి - పెక్కుప్రతులు.

193. 1 దనమున - ఉ. ఊ. ఐ. ఒ. ఔ. ఖ. జ. వ

గేవలధవళంబు నా విని యొద్దార
మునకు నే నదె నల్లఁదనము గంటె

తే. వెనుకదెస నన్న వా దయ్యెఁ గనలి పన్ని
దంబు సఱచితి మోడిన దాస్యవృత్తి
వచ్చు సవతికి నే నెట్లు వరవుడంబు
సేయఁ దగుఁ దోఁక నల్లగాఁ జేయ[2]రయ్య.

194. చ. అన[1]పుడు వాసుకిప్రభృతు లక్కట [2]ధర్మువు గాదు నీవు సూ
చిన తెరు వట్టిగెల్పు శుభసిద్ధి యొనర్చునె యట్లుగాక య
వ్వనితయుఁ దల్లి గాదె గరువంపుఁ[3]దనంబునఁ జూడ మాకు ని
ట్లనఁ దగు[4]దమ్మ యెట్లయిన నయ్యెను బాపము సేయవచ్చునే.

195. క. ఈవిధ మెమ్మెయి నైనం
గావింపఁగ వలయు ననుట గల్గినఁ బరదే
శావాసుల మగుదుము మము
నీ వింకం దగదు తల్లి నిర్బంధింపన్

196. క. అని రట్టియెడం గొందఱు
జననిఁ దొలఁగి యెక్కడేనిఁ జని రాభంగిం
జనినతనూజులఁ జేర్కొని
నెనరు విడిచి యా[1]నెలంత నిష్ఠురమతియై.

-: కద్రువ తన కొడుకులకు జనమేజయునివలన నాశంబు గల్గునట్లు శపించుట :-

సం 18 - 23 - 1 (కుంభ)

197. చ అమృతకరాన్వయంబున మహాముని వేడ్క నరుండు పాండుభూ
రమణునిదేవి గొంతియుదరంబునఁ బుట్టి ధనంజయాదినా

---

2. రన్న - పెక్కుప్రతులు.

194. 1. విని - కొన్ని ప్రతులు 2. ధర్మము - అ. ఆ ఇ ఈ. కొన్ని ప్రతులు. 3.దలంపున - అ. ఈ ఊ, ఎ ఒ. ఓ. చ. జ. ల. పీ. శ. ష స 4 నమ్మ - పెక్కు ప్రతులు

195. 1. తగి (వి) లి - కొన్ని ప్రతులు.

196. 1 లతాంగి - శ. ష

మముల వెలుంగుఁ దత్సుతునిమన్మఁడు సంభృతధర్మమైన పే
ర్మి మెఱయ నేల యేలు జనమేజయనాముఁ డరా[1]త్యజయ్యుఁడై.

198. ఉ. అతఁడు సర్పయాగ మనునధ్వరముం గుపితాత్ముఁడై పితృ
ప్రీతిగఁ జేయఁ దద్దహనభీకరభూరిశిఖాప్రవేశసం
జాతదురంతతాపమునఁ జావఁ గలా రని శాప మిచ్చెఁ ద
త్పాతన వృత్తికిన్ వెఱచి తక్కటినాగము లాభుజంగితోన్.

199. తే. నల్లఁగాఁ జేయువార మే మెల్లభంగి
నాతురంగముపతివాల మని రయమునఁ
బోయి వాలధిరోమముల్ వొదివి నీల
రోమసంచయ మైరి కురుక్షితీశ.

200. క. కద్రువ గనొని సంతో
షద్రుతమతి యగుచుఁ బిలిచి సవతికిఁ జూపెన్
భద్రాత్మక యవ్వినతయుఁ
దద్రోహం బెఱుఁగ లేమి దైన్యము నొందెన్

201. క. నగుచుం గద్రువ వరవుడ
వగుమఁ విచారంబు విడచి యనుఁడు వినత య
ట్లగుఁగా కని లజ్జయుఁబెను
వగయుఁ దొలఁగఁ ద్రోచి చేసె వరవుడము దగన్.

202. వ. ఇట్లు కపటజయంబునఁ గద్రువ సత్యవినయాదిగుణవతి యయిన వినతం దనకు [1]దాసిం జేసికొని పరి[2]హీణంబు లయినపరిచారికాకృత్యంబుల నిత్యంబు నలంచు చుండెం బరంపడి యప్పరమసాధ్వి దనయగ్ర[3]తనయుం డాదేశించిన తెఱం [4]గూహించి రెండవయండంబున [5]జనియించెడుతనూజుం దలంచుచు నాసపాటు గదిరసహృదయంబుతో దాస్యం బనాలస్యంబున [6]నడుపుచుండ.

203. ఉ. యౌవనదర్ప మంది జవ మంతకు నంతకు నగ్గలింప మై
లా పధికంబు గాఁగ నుపలాలన సేయఁగఁ బద్మసంభవుం
డావిహగోత్తము ండు హృదయంబున గర్వ మెలర్ప నుద్ధతుం
డై విహరింపఁ జూచి యొకయప్పుడు నారదుఁ డల్లఁ జేరనన్.

---

197. 1. తి భీముఁడై - పెక్కు ప్రతులు

202. 1. దాసిగా జేసికొని - కొన్ని ప్రతులు. 2. హేయంబులైన - పీ. శ. ష 3. నందనుండావేశించి నతెరంగూహించి - ఇ. 4. గునసహించి - క 5. జనియించెడు - శ. ష; జనియించిన - వా. పెక్కు ప్రతులు. 6 జేయుచుండ - శ ష

204. వ. అతఁడు భక్తిం బ్రణమిల్లి నిల్చిన నప్పక్షిపుంగవునకు నమ్మునిపుంగవుం డిట్లనియె.

205. తే. దాసివై సవతాలికిఁ దల్లి[1]పనులు
సేసి నలఁగంగ నద్దెసఁ జింత వంత
లేక నీ విట్లు దిరుగుట లెస్స యగునె
యద్భుతోజ్జ్వలతేజ కశ్యపతనూజ.

206. చ. అనుడు విహంగనాథుఁడు మదంబకు దాస్యము రాకకుం గతం
బనఘవిచార యెద్ది తెలియన్ వినిపింపవె యన్నఁ జెప్పె న
మ్మునివరుఁ డున్నరూపు వాయముం గను టారిగఁ గల్లుకశ్యపాం
గనలచరిత్ర [1]మాతని కఖండపరిస్ఫుటభాషణంబులన్.

207. ఉ. చెప్పినఁ గోపమున్ వగపుఁ జిత్తమునం గదురంగ మేలు మే
లప్ప హితంబు సేసెఁ జెలియల్ మను చున్నది పెంపుతోడ నం
చప్పుడ వాయువేగమున నయ్యెడకుం జని మాట యెద్దియుం
జెప్పక తల్లికిం బ్రణతి సేసె విషాదభరార్తమూర్తియై.

208. వ. కద్రువపాలికిం బోయి.

209. చ. పరమవినీతిమై నెఱఁగి బాంధవ మారఁగ నల్ల నిట్లనున్
గరుడుఁడు దారితారి వగఁ గందుచు నీచెలియల్ చరించుని
వ్వరవుడపుంజరిత్రమున వచ్చునే నీ కొకపేర్మి యూసతిం
గరుణ యెలర్పఁగా [1]విడువ గౌరవసంపదఁ జేయు నెంతయున్.

210. ఉ. నీకును నేను బుత్రుఁడన నెమ్మిఁ దగన్ ననుఁ జూచియైనఁ ద
ల్లీ కృప సేఁత పెద్దయును లెస్స యధర్మము ధర్మ మన్వగల్
[1]నా కవి యేల దాస్యకృతి నాజనయిత్రికి నివ్విధంబున
న్నాకయు దైవకృత్యము మనంబునఁ బొంగుదు విడ్వ గల్గినన్.

---

205. 1. పనుపు సేసి నలఁగుచు నుండంగఁ జింత - స.
206. 1. మారటనంద - వ. శ ష
209. 1 విడుపు - పెక్కు ప్రతులు
210. 1. నాకది యేల - కొన్ని ప్రతులు

211. వ. అనిన విని మొగంబు [1]ముఱకటించుకొనుచుఁ గద్రువ గరుత్మంతున కిట్లనియె.

212. మ. బలవంతుడవు నేర్పుచందములఁ దెప్పం జాలి యీఱి త్తప
లుక్కలఁ దేర్పం బని లేదు తల్లికి మదిం గూర్తేని వే పోయి లో
కులు నిన్నుం బ్రణుతింపఁ దెమ్మమృతమున్ ఘోరంపుదాస్యంబు నేఁ
దొలఁగం బెట్టెద మీ కనంత మగుసంతోషంబు సంధిల్లఁగన్.

213. చ. అన విని దాని కియ్యకొని యప్డు సుపర్ణుఁడు పోయి కశ్యపుం
గని తనభాషణంబులును గద్రువపల్కులుఁ జెప్పి తెచ్చువాఁ
డ నమృత మెట్లు నే నని యొడంబడి వచ్చితి నన్న నాతఁ డ
త్తనయునిఁ జూచి యుల్లము ముదంబును నచ్చెరుపాటు నొందఁగన్.

214. క. అమృతంబు దుర్లభం బ
య్యమరుల [1]కేనియు నతిప్రయత్నంబున గు
ప్తము సేసి యుండు వాసవుఁ
డమలచరిత నీకు [2]నగునె యట్టిది దేరన్.

215. వ. వినుము

216. చ. ఉదకము రక్షకం బగుచు నుండఁగ నుజ్జ్వలవహ్ని[1]యందునుం
బొదువఁ గృపాణశక్తిముఖభూరితరాయుధహస్తులై బలో
న్నదులు మహోగ్రకోపులు ఘనస్థిరకాయు లనేకరాక్షసు
ల్పొదిగొని కావ [2]నిన్నవలలో నమృతంబు సురక్షితస్థితిన్.

217. క. ఉండు నన విని విహంగవి
భుం డల్లన నగుచు నీవు పుత్త్రస్నేహో
ద్యుం డవయి పలికి తే బలి
యుండ నుపాయజ్ఞుఁడను [1]మహోజ్జ్వల తేజా.

---

211. 1. మొరకటించు - ల

214. 1. కైనన్నతిప్ర - ల 2. నెట్టులది తేవచ్చున్ - వ: శ. ష కొన్ని ప్రతులు.

216 1. యెప్పుడున్ - పీ. శ. ష 2. విన్నలనిలో - ల. ష; నిశ్చలత బోయమృతంబు-పీ.శ.స.

217. 1. మహోన్నతతేజా - కొన్నిప్రతులు

218. మ. అనుమానం బది యేల యెత్తు నమృతం బన్నం గడుం బొంగి యా
తనిఁ దాఁ గౌఁగిటఁ జేర్చి కశ్యపుఁడు పుత్త్రా నిశ్చయం బట్లయే
ని నిభంబుం గమఠంబునుం గలవు వానిం దిన్న లావెక్కు నా
ఘనజంతుద్వితయంబు నీకు నెఱగాఁ గల్పించితిం బోవఁగా.

219. వ. అనుటయు సంతోషించి గరుత్మంతుం డాగజకచ్ఛపంబు లెచ్చట నుండు నెబ్భంగివి యని యడిగిన నమ్మునీంద్రుం డవ్విహగేంద్రున కిట్లనియె.

*-: కశ్యపుఁడు గరుడునకు గజకచ్ఛపంబుల తెఱం గెఱింగించుట :-*

సం. 19 - 26 - 1 (కుంభ)

220 సీ. ప్రాక్పయోనిధిపొంతఁ బర్వతం బొక్కటి
ఘనశృంగకబళితాకాశ మగుచు
సురగనామంబున నొప్పు నచ్చేరువ
వసియించు నొకమహావారణంబు
దానితటంబునఁ దామరకొలను నబ్ధి
ననుకరించుచు మధు[1]రాచ్ఛవారి
సంపద సొంపారు సమదలీలల నగ్గ
జం బానగంబుపై సంచరింప
తే. మిట్టుఁ బల్లంబు గట్టును మెట్టు నొక్క
మట్టమై యది ననుపార మహిత మైన
యక్కొలన నీకు ద్రావఁగా ననుదినంబు
నరుగు నంబ్యుత్థవల్లభుఁ డనఘచరిత.

221. ఉ అం దొకకచ్ఛపప్రవరుఁ డత్యధికం బగుకాయమున్ బలం
బుం దనరన్ వసించు జలముం గొనువాంఛ గజంబు వోయినం
జెందఁగ నీక సంగరముఁ జేయుఁ జెనంగుచు నీకు ద్రావు గా
రుం దెగి యుండు నిట్ల పగ రోష మెలర్పఁగ నాఁడునాఁటికిన్.

222. క. విను మధ్యు_టభు లనియెడు
దనుజేంద్రులు కచ్ఛపంబు దంతియు నై పు

---

220. 1. రామ్నతంబు సంపద - పి శ వ

ట్టినవారు దమ్మొలుంగమిఁ
తెనఁగుదు రొండొరులతోడ భీకరభంగిన్

223. క. ఒంటిమెయి నుండఁగా ను
క్కంటికి నాకిచ్ఛపంబు గౌరుం బట్టం
గంట యరిది [1]యొకపటి నా
రెంటిం బోదువంగ వలయు రే వెర వారన్.

224. వ. అనువుడు వైనతేయుండు

225. ఆ. ఒకటి గొలనిలోన నుండు నొక్కటి గొండ
మీఁద సంచరించు మీరు రెంటి
నడఁగ నొక్కమాట యడరి పట్టుట కృత్య
మనియెదరు వశంబె యట్లచేయ.

226. వ. అనిన నది యట్టిద యుపాయంబు సెప్పెద నాకర్ణింపు మని యమ్మునివరుండు

227. చ. కరిపతి నీకు ద్రావుటకుఁ గాఁ జనుదెంచిన గూర్మరాజు సం
గర మొనరించు చుండి తమకంబున నీళ్లులఁ దాసి పిఁకమై
దరి నడరంగఁ బట్టు నది తత్సమయంబున రెంటిఁ గూడ నీ
వెరవున నూఁది చిత్తమున వేగిర[1]పా టొకు లేక పొంచుమీ

228. వ. అని యుపదేశించిన వీడ్కొనుటకు వినతుం డయిన[1]తనయు నత్యాదరంబునం గనుంగొని యత్తపోధనసత్తముండు నీవు గజకచ్ఛపంబుల నాహారంబుగాఁ గొనిన నీకుం ద్రిదశాహారంబు వేర దొరకొనుటకు సందేహంబు లే దనుపల్కు వల్కి పరమాశీర్వాదంబు లిచ్చిన.

229. మ. విని యుత్సాహము [1]గందళింపఁగ వియద్వీథీగతుం డై విమా
ననికాయంబులు దూలఁ బక్షవితానస్ఫారదీప్తివ్రజం

---

223. 1. యొక్కపరిన రెంటిం - ల. శ. సూ; యొక్క పరియరెంటిం - పీ; యొక్కుమ్మడి రెంటిం - ఆ; యొక్కపీకన రెంటిం - అ. శ॰ యొకపరినారెంటిం - ష.

227. 1 పాటును లేకచఁపు మీ - ల

228. 1. తనయు - పీ. శ. ష కొన్ని ప్రతులు; తన్ను - వా కొన్ని ప్రతులు

229. 1 తొంగలింప, నందడింప - అనిపాఠములు.

బినరశ్మిప్రకరంబుఁ గీడ్వఁబుచుఁ బక్షీంద్రుండు [2]చంచద్గతిం
జనియెం దా నురగాభిధాన మగునా శైలంబు పెంపొప్పఁగన్.

230. క. చని యల్పశరీరుండై
తను నెఱుఁగక యుండ మెలఁగి దానో గ్రగజేం
ద్రునిఁగాంచి నీరి కది వో
యినయప్పుడు వెనుకఁ జనియె నెలిమి దలిర్పన్.

231. ఉ. దంతి సనంగ భూరిమదధారఁగాలి యెఱింగి కూర్మ మ
త్యంతసముద్ధతిం [1]గొలని కడ్డపడన్ వెస వచ్చె వచ్చినన్
దంతియు నీరువట్టున నుదగ్రపుఁగోపము సందడింప దు
ర్దాంతసముద్యమం బెసఁగ దానిపయిం గవిసెన్ మహోగ్రమై.

232. చ. కవిసి ఖరంబులైన [1]మునికాళ్లను వ్రేయఁగ సాము [2]సీరిలో
ను వెడల కుండి కూర్మ మతనుస్థిరతీవ్రనఖంబులం బదా
గ్రవిదళనంబు సేయఁగఁ గరంబున మోఁదఁగ వారణంబు దం
తవిహతి నొంపఁ గచ్ఛపము దారుణ మయ్యె రణంబు భూవరా.

233. ఉ. ఇమ్మెయిఁ బోరి పోరి మది నేపున గోపము నగ్గలింపఁ గూ
ర్మమ్ము గడంగి నీర్వెడలి మత్తకరిన్ వడి నాక్రమింపఁగా
గ్రమ్మన రెంటినిం బొదివి కచ్ఛపమున్ వలకాల వామపా
దమ్మున వారణంబును నుదమ్మునఁ [1]బట్టి తగిల్చె గోళ్ళులన్.

234. వ. ఇట్లు వినతపట్టి పట్టిన నవి దమయంగంబులు పొరలం బడ నడిచిపడుటయు
నతండు.

---

2. శుంభద్గతిన్ – ఇ. ఏ.న.

231. 1. గదిసి దాని నదంబున వచ్చి తాకినన్ – శ.

232. 1. మునుగాళ్ళను – న ; మునుగాళుల – అ ఈ. చ ఒ. ఓ. గ. చ. ష. 2. సీటిలో
–కొన్ని ప్రతులు

233 1 గోళ్ళతగిల్చి పట్టినన్ – కొన్ని ప్రతులు

235. మ. వెలుచన్ గోళుల నొత్తి యగ్గజముఁ దాఁబేటున్ [1]వసం బేచి మూ
ర్ఛల నొందన్ వేసవెత్తి మేఘయుగళీసక్త్రోల్లసద్గైరికా
చలమై వాయసకేలియో యన నభస్సంచారియై యుబ్బున
గ్గళికన్ దవ్వుగఁ బాఱి యొక్క ఘనవృక్షం బయ్యెడం దోఁచినన్

236. ఆ. దానిమీఁద నుండి వాని రెంటిని భుజిం
పంగ మదిఁ దలంచి పంచయోజ
నములు నిడుపు గల్గు రమణీయశాఖపై
గరుడుఁ డెలమి [1]నెఱఁగెఁ గురువరేణ్య.

237. క. ఎఱఁగినయప్పెను ప్రేఁగున
విఱుగుటయును శాఖ చూచి విహగేంద్రుఁడు గొం
దఱు మునుల నందుఁ గన్గొని
వెఱపున నాత్మీయచిత్తవృత్తిగలంగన్.

238. తే. అవనిఁ బడ నీక శాఖఁ జంచువునఁ [1]బట్టి
పట్టి వారలసుస్థితుల్ పల్లటిలక
యుండ వెరవున ధరియించి యొయ్య నెగయఁ
జూచి యవ్వాలఖిల్యులు చోద్య మంది.

239. వ. వైనతేయుం డగుట మనంబుల ననుసంధించి కరుణించి.

240. క. ఈతఁడు దక్కఁగ నొరులకు
నీతెఱఁగుబలంబు వెరవు నేల కలుగు నం
చాతరుశాఖ విడిచి చని
రాతని దీవించి యోగ్య మయ్యెడు నెడకున్.

241. వ. చనినన్ గరుత్మంతుడు సంతోషించెఁ దదనంతరంబ

242. ఆ. విపులశాఖ నిచట విడచిన నిప్పటి
జంతుకులము లెల్లఁ జచ్చు నింక

---

235. 1. పెసన్ బట్టి – ఉ. ఐ. ఖ. ల. శ.
236. 1. నొరగె, నొదిగె – అని పాఠములు.
238. 1. బిగియపట్టి – క. జ ల; బిట్టుపట్టి – ష

నేమి సేయువాఁడ నే నను నెవ్వగ
పుట్టె నవ్విహంగపుంగవునకు.

243. వ. అట్టియెడ.

244. తే. నిందితాచారయుత[1]ము క విందదేశ
మంబుధిప్రాంత మీశాఖయందు విడువు
మమరవరులపం పిది విహగాధినాథ
యను నెలుంగు నభంబునం దావహిల్లె

245. క. విని సత్వరముగ నటగొని
చని యద్దేశమునఁ గల్గుజనములు మృతిఁ బొం
దనతం డాచక్కటి నా
ఘనశాఖయు నెమ్మనంబు కలఁకయు [1]విడిచెన్.

246. వ. విడిచి [1]భరితలీలంబుగా నొక్కశైలంబువిశాలతటంబునకుం బోయి.

247. క. కరికచ్ఛపముల పెన్నె
త్తురుఁ గండలుఁ గ్రొవ్వు మెదడుఁ దుష్టిగఁ బక్షీ
శ్వరుఁ డాని యధికబలబం
ధురుఁ డై యమృతమున కేఁగె దుర్దాంతగతిన్.

248. వ. ఇవ్విధంబున.

249. క. చని దానిచుట్టు మండెడు
ననలంబును జూచి తన్మహత్తరజిహ్వాల్
దనిశిన నెఱకలు గమరునొ
యనుతలఁపున బ్రహ్మఁ గాన నరిగె రయము నన్.

244. 1. మగుని నిషధ దేశ – ఊ, చ; మగు వింధ్యదేశ – కొన్ని ప్రతులు, యతి చింత్యము, మూలము నందు 'కువిందదేశము' అని కలదు వైనతేయకువిందేషు సముద్రాంతే మహాబల పాత్యతాం శాఖినః శాధానహితే ధర్మ నిశ్చయాః'' 19 – 28 – 34 కుంభ కోణప్రతి 19 - 12 - 165 పి. పి. యస్. శాస్త్రిప్రతి ముపుళిందదేశము – వా కొన్ని ప్రతులు.

245. 1. విడిచెన్ – కొన్నిప్రతులు.

246. 1. నలీలంబుగా – ఓ క. పీ. శ. ష; భరిత శీలంబున నొక్క – చ.

250. వ. అరిగి తచ్చరణ పద్మంబులకుం బ్రణతుఁడై కేలు మొగిచి.

251. చ. వినతకు దాస్య [1]మొందె నొకవెంటఁ దదీయనిరాసహేతువై
యనఘవిచార నాకు నమృతాహరణంబు [2]విధేయ మయ్యె న
ప్పని మెయి నగ్నిచేత నగుఁబాటగు నవ్వెఱతో భవద్దయా
వననిధి నాశ్రయించుటకు వచ్చితి నార్తశరణ్య కావవే.

252. వ. అనుటయు

253. చ. అతనికి వత్సలుం డగుట నంబుజగర్భుఁడు వెన్న పైపయిన్
వితతము గాఁగ జిహ్వలకు వ్రేఁ గగునట్లుగఁ జాల వైచినం
బతగవరేణ్య [1]మక్కఁబడుఁ బావకుఁ డయ్యెడఁ దొచ్చి నీదువాం
ఛితము ఫలింప సత్వరతఁ జేకొను మయ్యమృతంబు నావుడున్.

254. ఆ. ఆత్మఁ బొంగి మ్రొక్కి యతఁ డాలమందలు
పరపులైన యెడల కరిగి యరిగి
కొండయంతవెన్న గూర్చి వేగమ కొని
పోయి యమ్మహాగ్నిఁ [1]బొదువవైచి.

*గరుడుఁ డింద్రుని జయించి యమృతంబు దెచ్చి కద్రువకుఁ జూపుట*

సం 13. 28 - 1 (కుంభ)

255. శా. నీకుం బాయఁగఁ జల్లి రాక్షసులయున్మేషంబు మర్దించి హ్రా
శ్వారోదారుఁ డయోమయం బయినయజ్ఞాలంబు వే వ్రచ్చి దు
ర్వార[1]స్వైరవిహార మొప్ప నమృతగ్రాహం బొడఁగూడుడుం
దారావీథి జనం దొడంగె మగుడన్ దర్పం బెసర్పన్ వడిన్.

256. వ. అంతయు నెఱింగి.

257. మ. అమరేంద్రుండు సముద్ధతిన్ వెఱి దేవానీకముల్ దోడ్పడన్
సమరక్రీడకుఁ దొచ్చి పక్షిపతిచే సైన్యంబు లెల్లన్ విధూ

---

251. 1 మయ్యె - కొన్ని ప్రతులు 2. విధేయమయ్యె - ట. చ. శ. ష.
గమనిక:- ఈరూపము పరిశీలింపదగినది
253. 1. మ్రగ్గబడు - గ ల పీ శ ష స; చక్కనగు - వ
254. 1 బొలియ వైచి - ఏ ఐ ఖ; పొదియవైచి - అ ఇ. ఈ ఉ ఔ క. చ. ల. శ.
255. 1. స్వైర విహార - క ప పీ ష స

తము లైనం గనుఁ[1]గ్రేవఁ గెంపెసఁగ రౌద్రంబైన చిత్తంబుతో
డ [2]మహోద్రగతిఁ బొల్చువజ్రము నవష్టంభోగ్రుఁడై వైచినన్.

258. క. అది యొకఁడుఁ జేయఁ జాలక
విదళితశైల మగుతనదువిలసన మచటం
గుదియుట దనకుం దెలిసిన
మద మఱి [1]గిరిభేదికడకు మగుడం జనియెన్

259. క. చేయునది లేక నిర్జర
నాయకుఁడును వెఱగుపాటునను మ్రాన్పడుచుం
బోయెం గ్రమ్మఱి ధరణీ
నాయక నిజపట్టణంబునకు దీనగతిన్.

260. చ. అజునియనుగ్రహంబున విహంగమవల్లభుఁ డట్లు సాల న
క్కజ మగుశౌర్యసంపద ప్రకాశతఁ బొందఁగఁ గేలి సల్పి యిం
ద్రజయమహోత్సవంబున నుదాత్తయశఃపరిపూరితంబు లై
త్రిజగములున్ వెలుంగ నలిఁ దెచ్చె సుధారసపూర్ణభాండమున్.

261. తే. తెచ్చి డించి కద్రువ ప్రీతిఁ దేలఁ జూపి
తల్లి చెఱ వాపికొని పొంగి చెల్లునాగ
డమున [1]మగుడ నయ్యమృతభాండంబు దాన
పుచ్చికొని యెడ గలుగంగఁ బోయి నిలిచి.

262. వ. తన్ను వెఱఁగుపడి చూచు చున్నకద్రువ నుద్దేశించి.

263. మ. జననీ నీ వమృతంబు దెమ్మనినయానత్యుక్తి వాటించి యేఁ
జని నానావిధకర్మకర్మఠుఁడ నై సాధించి వే తెచ్చితిఁ
విను నానీయొడఁబాటు [1]సెల్లె జనులన్ విన్పించితిం దెల్లగా
వినతం దొడ్కొని పోయెదన్ మనమునన్ విభ్రాంతి లేకుండుమీ.

---

257. 1 దోయి - ఒ వ ; 2. మహోగ్రాకృతి - ల. పీ. శ. ష న
258. 1. బలభేది - అ
261. 1 నగుచు - ఈ. ఊ. ఎ ఐ. ఓ. క గ జ ల
263 1. తెల్లజనులున్ - పీ శ ష న

264. మ. అని ధర్మస్థితితోఁప మాటవెర వేపారం దగం బల్కి నే
ర్పునకున్ లోకము మెచ్చఁ గద్రువకుఁ జెంపుం గీర్తియున్ మాయ సొం
పునఁ దల్లిం దనయింటి కన్పి యమృతంబుం గ్రమ్మఱన్ గ్రక్కునం
గొని పక్షీంద్రుఁడు వోయి యింద్రుఁ డెలమిం గూరంగ నిచ్చెం దగన్.

265. వ. ఇవ్విధంబున నౌచిత్యంబు సంస్తుత్యంబుగా నమృతం బమృతాశన పతికి నొసంగి యెనకం బెసంగు తేజంబున విరాజితుం డయి యావృత్రవైరిని సూరెల నున్న సురలను మునులను మునులను గలయం గనుంగొని,

266. చ. కొడుకులఁ బంచి తెల్పెసఁగుగుఱ్ఱమువాలమునందు నల్ల గ
ల్గెడుక్రియఁ దీర్చి పన్నిదము గెల్చినకద్రువ నేను మాటమై
నొడిచితిఁ దల్లి దాసి యగు టోర్వక తంద్రియనుజ్ఞ మీ కెదు
ర్పడిన[1]దురుద్ధతిన్ మఱచి బాంధవ [2]సత్కృతి నాదరింపుఁడీ,

267. వ. అని వెండియు,

268. క. వినుఁ డట్టులు పాపము సే
సినకద్రువసుతులఁ బొదివి చెండుదు మత్తుం
డనితాంతో గ్రవిహారం
బునఁ దంద్రియు మీరు ధర్మమును సాఘులుగన్

269. వ. అని పలికిన నతని నంచఱు నభినందించి రమ్మునులును సురలునుం బురందరుని తోడ నితనికి నొక్కవరం బొసంగ వలదే యనిన నతండు దలంచికొని దరహసితంబుతో వారల నాలోకించి మనవరంబునకు నాసపడి యెడుకొలంది వాఁడు గాఁడతండు సాక్షాద్విష్ణుండు కృష్ణుం డన భూరుఁ డనుయాదవ ధాత్రీశునకుఁ బౌత్త్రుండై లోకహితార్థంబుగాఁ జరియింపం గలవాఁ డీమూర్తియు పిడువండు వివిధవర్తనంబుల వినోదించుచుండునని యెఁ దదనంత రంబ సముచితప్రకారంబున నాజంభారిని వారలను దా నామంత్రితులం జేసి,

270. సీ. అజుఁ డుపలాలింప నర్దేవుకావించు
వరభోజనంబులఁ జెరిఁగె నితఁడె

---

266. 1. మదుద్ధతిన్-ఖ. వ. 2. సత్కృప - స

ఘనకాయ [1]జవసత్త్వగజకచ్ఛపముల నొ
క్కెత్తున లీలమై నెత్తె నితఁడె
విపులభూరుహశాఖ విఱిగిన మునిహితా
ర్థంబుగాఁ జంచున దాల్చె నితఁడె
సురసేనతోఁ బురందరుని నిర్జించి యు
ద్దీప్తుఁడై యమృతంబు దెచ్చె నితఁడె
తే. తల్లిదాస్యంబు దనబాస దప్ప కుండఁ
బాపి యాసుధ మరల నవ్వాకశాస
నునకు దయ నిచ్చె నీతఁడె యనుచు సిద్ధ
సాధ్యులగ్గింప [2]గరుడుఁడు సనియె మగిడి

271 వ. అని చెప్పి భీష్ముండు

272. క. మానవలోకకలితబహు
లానందకరంబు నిష్కలావ్యయసుఖ సో
పానము నగు సౌపర్ణా
ఖ్యానము విని పుణ్యతముఁడ వైతి నరేంద్రా.

273. వ. అనినం బాండవాగ్రజుండు సంతసించి విప్రున కెద్దియేనియు నిచ్చువాఁడుగా నొడంబడి యీనివాఁ డేమిగతిం బోవం గలవాఁ డని యడుగుటయు నతం డతనితో నొకనిదర్శనంబున నది యెఱింగించెద విను మని యిట్లనియె.

274. సీ. ఒక్కసృగాలంబు నొకవానరంబును
ప్రీతిమైఁ గూడి వర్తించుచుండు
[1]దొలుపుట్టువునమానవులును నెచ్చెలులునై
యుండుట గూర్చు నొండొంటికొక్క
యెడ నొకనాఁ డవ్వఱడుతోడ నాక్రోశి
గటకటా నీ కిట్లు గడును హేయ
మైన పీనుఁగునంజు డాహార మైనట్టి
భవము వాటిల్లు చేపాపముననొ

270. 1. జలసత్త్వ - కొన్నిప్రతులు 2 గరుడండు - ఐ. ఒ. ఓ. క. ఖ. ౦
274. 1. తొలిపుట్టువున - కొన్నిప్రతులు

275. వ అని తెలిపె నట్లగుటం జేసి యాస గొల్పి విప్రున [1]కియ్యకుని కొ యొప్ప దని చెప్పిన నప్పాండవాగ్రజుం డహీనగుణవర్ణనీయుం డయిన హీనవర్ణునకు మంత్రతంత్రాదు లుపదేశించుట ధర్మవిరుద్ధం బయియుండునో కో యని యడిగిన నయ్యనిమిషనదీనంద నుం డీప్రశ్నంబున కు త్తరం బగు నది యొక యితిహాసంబు గల దాకర్ణింపు మని యిట్లనియె.

—: బ్రాహ్మణుఁడు హీనవర్ణునకు వైదికమంత్రంబు లుపదేశింపఁ గూడదనుట :—

సం, 13 - 10 - 1

276. సీ. హిమగిరిమీఁద ననేకద్విజులు దప
మాచరింపంగ నయ్యాశ్రమమున
కొక్కశూద్రుండు ధర్మోపేతుఁ డేతెంచి
యమ్మునులకు గురుఁ డగుమునీంద్రుఁ
గని కృప నుపదేశ మొనరింపవే తపో
వృత్తికై నాకని వేఁడుటయును
జనదు వైదికము శూద్రున కుపదేశింప
నీవు శుశ్రూషమై నిలువు మనియె
తే. ననుడు వాఁడు శుశ్రూషకుఁ దై వసించె
గుడిసె యొకచెపఁ గావించికొని ముదమున
నతిథిసురపితృపూజ లత్యధికభక్తి
తోడఁ జేయుచు నొక్కింత కిడు లేక.

277. క. నియతియు వినయముఁ జూచిన
దయ పుట్టెడునట్లు గాఁగ ధర్మవిరూధ
క్రియ లొనరింపఁగ మునిపతి
ప్రియమునఁ గనుఁగొనుటకై యరిగె నచ్చటికిన్

278. ఆ. అరిగి యతనిచేయు నయ్యనుష్ఠానంబు
లోనఁ గానివాని మానఁ జెప్పి
యనఘ యిట్లు సేయు మని యుపదేశింపఁ
గరుణపేర్మిఁ బుణ్యకర్మగతులు

---

275. 1. కికునికి - కొన్నిప్రతులు.

279\. క. అతఁడు దానికి నతిసం
ప్రీతాత్ముం డగుచు నడపి పిదపం గాలం
బై తెగి యొకనృపునకు సం
జాతుం డయ్యెను సమస్తసద్గుణములతోన్.

280 క. మునిపతియుం దఱితోడన
తనువు విడిచి యరిగి యతనితండ్రి యగుడు వి
ప్రునకుం బుట్టెన్ వేదా
ద్యనుపమవిద్యలకు నెల్ల నావాసం బై

281\. చ. పదపడి యక్కుమారకుఁడు పట్టము గట్టి పురోహితత్వమున్
విదితవిభూతితో నొసఁగె విప్రునిపుత్త్రున కవ్విభుండు న
వ్వొదవెడుమోముతో నతని నోరలు వాఱఁగఁ జూచు నాతఁ డె
య్యది గతమొక్కొ నవ్వునకు నంచు మదిం దలపోయు భూవరా.

282\. వ ఒక్కనాఁ డవసరంబు గాంచి యప్పురోహితుం డాభూవరునితో దేవా
నన్నుం గనినప్పుడు నవ్వుదు నావలన నేమికీడు గల దది యెఱింగింపవే
యిదియ నాకు వరం బని వేఁడిన నజ్జనపతి దనకు జాతిస్మరత్వంబు గలుగు
టం జేసి పూర్వజన్మంబు దెలిపి యక్కాలంబునం దనయనుష్ఠానంబున నేమేని
విహితంబు లుపదేశించుట దేటపడం బలికి శూద్రవిషయోపదేశంబునం బరమ
గతి దప్పి యిప్పాట రాజసేవాత్మకం బైనపౌరోహిత్యంబు నడపుట కై
నీకుం బుట్టవలసె నేను బుట్టు వెఱింగి పుట్టినవాఁడ నగుటం జేసి యెఱింగి
నవ్వుదు నవ్వునకుఁ గతం బింతియ కాని నీ వొండుకల్మషంబు గలవాఁడవే
మహాధర్మపరుండవు గురుండ వాదుష్కర్మంబునకుఁ బ్రాయశ్చిత్తంబు సేసి
కొమ్మని యనేకగోవులం గనక[1]రాసులను నొసంగిన నాభూసురోత్తముండు
పురాతనజననకృతం బగు సుకృతంబునం జిత్తంబు నిర్మలం బై యుండు
కతంబున నారాజు సెప్పినంతవట్టునుం గలవో తెఁ దనకుఁ దోఁచి[2]నం దోషి
తుండై దానంబులం దీరస్నానంబుల మఱియు జపహోమాది పుణ్యావిధా
నంబులం బాపంబులు వాపికొని యాపుట్టుకొని నీఁగికొని సంయమిసంతాన
జాతుండై యెప్పటియాశ్రమంబునం దపం బాచరించి మహాపదంబు నొందెఁ

282\. 1 రాసులను ధాన్యా ద్యాదుల నొసంగిన - శ ష 2. నసంతోషితుండై - శ, ష; నిర్దోషితుండై - ఒ వ

గావున బ్రాహ్మణక్షత్రియవైశ్యులకుం దక్కఁ దక్కటివారికి నుపదేశించి బ్రాహ్మణుండు కల్మషభాజనం బగు[3] బ్రాహ్మణాదులకుం బరీక్షాపూర్వకం బుగా నుపదేశింప వలయునని చెప్పిన నప్పుడమిఱేఁడు లక్ష్మి యెట్టిజనంబుల[4]యందు వసియించు నని యడిగిన నాదేవవ్రతుం డతని కిట్లనియె.

—: లక్ష్మీనివాసస్థానములు :—

నం 13 - 11 - 1

283\. క. నారాయణాంకతలమున
(శ్రీ) రాజిల్లంగఁ జూచి చిత్తం బలరి
స్మేరం బై రుక్మిణి వి
స్తారరుచిరనయన యగుచు సంభావనతోన్

284\. వ. నీ వెట్టిపురుషులయందు నెట్టిభామలపాల వసియింతు వనిన నాదేవి మకర ధ్వజమాతకుం జెప్పినవాక్యంబుల యర్థంబు[1] లుపన్యసించెద దాన నీయడిగిన యది దేటపడు నాకర్ణింపుము

285\. వ. నిత్యసత్యులు శౌచనిరతులు గురుభక్తు
లప్రమత్తులు దక్షు[1]లమలమతులు
సత్కర్మపరులు విజ్ఞానముఁ దపము దా
నము బ్రహ్మచర్యంబు శమముఁ గల్గు
వారలు ప్రీతి నావసియించునిక్కలు
క్రూరు నాస్తికుఁ గృతఘ్నునిఁ గుబుద్ధి
వర్జింతు నెంగిలి వర్జించి యిలు[2]వాడి
ఘటశుద్ధి గలిగిన కాంతలందు

తే. నిల్తు వల్లభప్రతికూల నిష్ఠురాత్మ
నన్యమందిరగామిని నధికనిద్ర

---

3\. నుండగు - శ. ష. కొన్ని ప్రతులు 4. వలన వసించు - కొన్ని ప్రతులు.

284\. 1. యర్థంబు - కొన్ని ప్రతులు.

285\. 1. ల చలమతులు - శ. ష. కొన్ని ప్రతులు 2. వాడి - శ. ష. స పెక్కు ప్రతులు; వడి - వా పీ.

గమనిక :— ఈ శబ్దము ఇలు + పాడి - ఇంటి ధర్మము అను రీతిని ఏర్పడినట్లు తోచును. సూర్య రాయాంధ్ర నిఘంటువు నందిది 'ఇలువడి' అనియే గ్రహింప బడినది; ఇలువాని - ఏ.

స్త్రైనమానినిఁ దొఱఁగుదు [3]నఖిలనీత
టాకతరుషండపుష్పవాటముల నిలుతు.

286. వ. అని చెప్పెఁ దత్ప్రకారంబులు బుద్ధిగతంబులు సేసికొమ్మనినం గురుపతి పురుషుల పురంధ్రులసంగతియందు సంస్పర్శసుఖంబు నతిశయం బెవ్వరి[1]కిం గలుగు నని యడిగిన వియత్తటినీతనూజుం డివ్విషయంబున నొక్క యితిహాసంబు గలదు విను మని యిట్లనియె

—: భంగాస్వనుఁ డను రాజు స్త్రీయై కుమారులం గాంచినప్రకారము :—
సం. 13 - 12 - 1.

287. సీ. అనఘ భంగా[1]స్వనుం డనురాజు పుత్రార్థి
యై వహ్నికప్రియం బగుమఖంబు
సేసి పుత్రుల సవిశేషుల నూర్వురఁ
గని సంతసంబునఁ గ్రాలు చుండు
నాతఁడు వేటకై యరిగినచో [2]వహ్ని
దిగ్భ్రాంతి పుట్టించి తేరకాఁడు
సనునట్లు సేయ నజ్జనపతి యెక్కిన
తురగంబుతో నొంటి దూరమైన

ఆ. కానకేఁగి తృష్ణ గదిరిన నలగడ
నరసి యొక్కపద్మసరసి గాంచి
వెన్ను మునుఁగ హయము నన్నీర దిగిచిఁ తాఁ
[3]దనివుసొంపు మిగుల మునిఁగిలేచి

288. క. భూనాథుఁడు దృష్ణ సెడం
బానక్రియ యాచరించి భామిని యై తన్
దాన కనుంగొని విస్మయ
మూనెడుమదితోడ సరసి నొయ్యన వెడలెన్.

---

8. నఖిల బిల్వఫలిత తరు పుష్పవాటి సంపదల - ల
286. 1. కినగ్గలం బగు - పీ శ ష. స
287 1. శ్వనుండను - పెక్కు ప్రతులు 2. వహ్ని దిగ్భ్రమంబుట్టించి-పీ. శ. ష 8 దనువు సొంపు - శ. ష కొన్ని ప్రతులు

289\. సీ. వెడలి చింతించి యీయొడలితో నేభంగిఁ
దురగంబుఁ నెక్కుదు బురజనంబు
లేను బోయినఁ జూచి యే మని తలఁతురో
పొలఁతు లే మనువారొ పుత్త్రులేమి
గాఁగ నూహింతురో కానన యుండంగ
వచ్చునే పోవంగ వలయు నెట్టు
లని విచారించి పోయిన నెల్లవారును
నాశ్చర్య మందుచు నంత నంతఁ

ఆ. గనుఁగొనంగ మంత్రిగణము రావించి ది
గ్గ్రాంతిఁ దాను బోయి పద్మ[1]సరసి
యందు మునిఁగి వనిత యగుట యెఱింగించి
రాజ్యమునఁ దనూజరాజి నిలిపి.

290\. ఉ. కానకు నేఁగి తాపసులఁ గాంచి తపం బొనరింప నం దొకం
డానలినాక్షిఁ బొంది ప్రియుఁడై నడచెం గ్రమవృత్తి నందనుల్
దానికిఁ బుట్టి రిద్దలదర్పులు నూర్వురు వారిఁ గొంచు న
మ్మానిని పూర్వపుత్త్రికసమాజముపాలికిఁ బోయి నెమ్మితోన్.

291\. వ. తనకు నొక్కతాపసుండు ప్రియుం డగుటయు వానివలన నత్తనయశతంబు జనియించుటయు నెఱింగించి.

292\. క. మగతనమునాఁడు మీరు
న్మగువతనమునపుడు పీరు [1]నాయం దుదయం
బగుటను దోడంబుట్టువు
లగుదురు ధర పంచి కుడువుఁ డందఱు ననుడున్.

293\. క. భ్రాతృస్నేహము గల్గి య
రాతులు భయ మందఁగా ధరారాజ్యము సం
ప్రీతి ననుభవించిరి జను
లాతతహర్షమునఁ బొంద నందఱు నెమ్మిన్.

---

289\. 1. వనము నందు – శ. ష. స. పెక్కు ప్రతులు.

292\. 1. మఱి నా కుదయంబగుటను – శ. ష.

294. తే. [1]దానిఁ గని పాకశాసనుఁ డేను వీని
కహిత[2]ముగఁ జేయ నిది హితమై ఘటించె
నధికపుత్త్రసమృద్ధి రాజ్యాభివృద్ధి
నిమ్మహీపతి [3]సమ్మదం బినుమడించె.

295. వ. దీని విఘటింపం జేయుదు నని భూసురాకారుండై వచ్చి పూర్వులం గాంచి.

296. క ఆరాజకుమారుల[1]మతి
నీరసము జనించునట్టు లెక్కడిజనకుం
డేరికినేనియుఁ బుట్టిన
వారిం దోఁబుట్టువులుగ [2]వల్వం జనునే.

297. వ. అని మఱియు ననేకప్రకారంబులం జెప్పి వార లెఱుంగ కుండ నపరకుమా
రులకడకు నేఁగి [1]యితకరిమాటలమొత్తంబుల వారలచిత్తంబులను గలంచె.

298. క. అనిమిషవరుఁ డివ్విధమున
జనియింపఁగఁ జేసెఁ బగ యసంగతులై వా
రును చెగి యొండొరువులతో
నని బెట్టుగఁ జేసి చచ్చి రందఱు నధిపా

299. ఉ. చచ్చిన నత్తపస్విపతి సన్నులు మోమును మోఁదికొంచుఁ బై
వెచ్చనికన్నునీ రడర వీడిన[1]వేనలితోడఁ జెల్ప వా
పుచ్చి తనూజులం [2]బనుచఁ బొంచి కనుంగొని పోయి విప్రుఁడై
యచ్చటికిన్ సురాధిపతి యాతనిఁ జూచి లతాంగి వెక్కుచున్.

300. ఆ. కరుణ మొగమునందుఁ [1]గనుఁగొని తాను ము
న్నర్థివేఁటవోవు టాది గాఁగ

294. 1. దాని విని – అ ఆ ఖ. పీ శ. ష 2. మొనరింప నది – అ 3. సంపదయును –
ట. పీ శ. ష
296. 1. మది – కొన్ని ప్రతులు. 2 వ్రాల్పందగునే – ఇ. ఉ ఏ. ఐ; వాల్యందగునే –
శ; వాల్యంజనునే – స, వర్తిల జనునే – పీ ష స
297. 1. యితవరి – వ
299. 1 క్రొమ్ముడి – వ. శ. ష 2. బనవ – పీ. శ ష
300 1 గదకొన – అ ఈ

సకలసుతులు నాకుఁ జచ్చుట తుదియుగఁ
గలుగువర్తనంబు దెలియఁ బలికె.

301. క. విని యతఁడే నింద్రుఁడ నా
కనిష్ట మగుక్రతువుఁ జేసి తది హేతువు గా
నినుఁ బఱచితి ని త్తెఱఁగున
ననుటయు సంభ్రమసమేత మైనభయమునన్.

302. క. ఇలఁ జాఁగి మ్రొక్కి యటు తన
యులకై సమ్మూర్ధబుద్ధి నొనరించితిఁ ద
[1]ప్పలఘుదయఁ జూడు నీ కేఁ
జలమునకుం బాత్రమే విశాల[2]యశోర్థి.

303. వ. అని రామయై యున్న రాజన్యుండు దైన్యంబు దోఁపం బలికిన బలసూద
నుండు ప్రసన్నుండై.

*—: ఇంద్రుఁడు భంగాస్వనునకుఁ గోరినవరంబు లిచ్చి యనుగ్రహించుట :—*

సం. 13 - 12 - 33.

304. సీ. ఇచ్చెదఁ గొందఱ నెత్తఱఁ గాంచిన
తనయుల నొసఁగుదు ననిన నతఁడు
కాంతనై యుండియేఁ గనినవారల నిమ్ము
దేవ నావుఁడుఁ దొల్లి నీవు గన్న
ప్రజల [1]నే లడుగవు నిజము సెప్పుము నాకు
ననియెఁ బురందరుం డవ్విభుండు
వెడసిగ్గుపాటుతోఁ బడఁతుల కర్మిలి
బిడ్డలదెసఁ గడుఁ బెద్ద యనిన

ఆ. సత్యవాది వైతి సకలతనూజులు
బ్రదికి నెగడువారు భామినీత్వ

---

302. 1. ప్పలఘుదయ జూడు - ఇ ఉ. ఏ. ఐ. ఒ ఔ. ఖ 2. గుణాఢ్యా - క. ద;
యశస్కా - అ. ఈ

304. 1. నీవడుగవు - వ

దైన్య ముడిపి పురుషతయు నిత్తు నీ కని
పాకశాసనుండు పల్కె నధిప.

805. క. విని యజ్జగతీనాథుడు
దనయుల నందఱను నీదుదయఁ బడసితి నే
వనిత నయి యిట్ల యుండెద
ననఘా యివ్వరము నొసఁగు మని పల్కుటయున్.

806. వ. విస్మితుం డై యింద్రుండు దీనికిం గతం బేమి యని యడిగిన నా[1]భంగా
స్వనుం డిట్లనియె.

807. క. సురతంబునఁ గడు నెక్కుడు
పురుషులకంటెను సుఖంబు పొలఁతులకు సురే
శ్వర యట్లగుటను నాకీ
వెరవున రమియించి నిలువ వేడుక గలిగెన్.

808. ఆ. అనిన నట్టులేని నౌఁ గాక యిమ్మెయి
విపులసౌఖ్య మొంది విహరణంబు
సలిపి నిలువు మనుచు శక్రుండు సనియె భం
గాస్వనుండుఁ బ్రీతి నట్ల యుండె

809. వ. అని భీష్ముండు పాండవాగ్రజా దీన నీయడిగినయర్థంబు దెలిసికొమ్మనిన
నమ్మనుజపతి బహువిధము లగుధర్మంబులు భవత్ప్రసాదంబున వినుచున్న
వాఁడ నవి యెల్లను జన్మమరణాదిదుఃఖంబులం బాపం జాలునే యనేకజననీ
జనకులకుం బుట్టుచు సంసారచక్రంబునం దిరుగం జాల గర్భవాసం బన నరకం
బన భేదంబు గలదె సచరాచరం బైనయిజ్జగం బస్థిరం బట్లుం గాక దీని విషా
న్నంబు చందంబుగాఁ గనియెద భవ[1]మోచనం బగువైష్ణవధర్మం బుపదే
శింపవే యది యీయుగంబునం దిరోహితం బగుట కృష్ణద్వైపాయనుండు
సెప్పె మీయనుగ్రహంబుల నెఱింగెద భవదీయచరణంబులు శరణంబుగాఁ
బ్రపన్నుండ [2]నైతి నని ప్రార్థించిన నమ్మహాత్ముండు పగతురం దెగటార్చి
పేర్చి పూజ్యం బగుసామ్రాజ్యంబు గైకొని తదీయంబు లగుసుఖంబు

806. 1. భంగాశ్వనుండు, భంగాశ్వకుండు – అని పాఠములు
809. 1. మోక్షంబగు – కొన్ని ప్రతులు. 2. వగుమ యని – పీ. శ. ష పెక్కు ప్రతులు.

లనుభవించుచుండుట గీడుగాఁ జూడఁ గరుకులచూడామణి యగునీకుం జనుఁ
గాక యౌవనస్థు లగు రాజ్యపదస్థుల తలంపులచొప్పె యిది మిథిలాపతి
యగుజనకుండుంబోలెం బలికెద వని యుపలాలించి యమ్మహీపాలున
కిట్లనియె

310. క. పురు[1]షాతిగ మై తోఁచును
నిరూపణము సేయ నూఁది నిర్దేశింపన్
వెరపుపడక శాశ్వతసుఖ
భరితత నిర్వాణ మనఁగఁ బడుఁ బ్రకృతి నృపా.

311. క. ప్రకృతులు పె[1]క్కన్నింటికి
[2]నకృతి యనం జనినయదియ యాద్య మహీపా
లక పురుషరూపిణియు నై
వికృతిం బొరయదు వివేకవిజ్ఞాత యగున్.

312. క. విను సంసారపథమునకు
ననుయాపతఁ దోఁచుచుండ నన్యప్రకృతుల్
దనతోఁపు భవనిరాసం
బునకుం గారణము గామమునఁ [1]బిహిత మగున్

313. క. కావునఁ గామక్రోధము
లావిర్భూతములు గానియట్లుగఁ దత్ప్ర
[1]త్యావేశంబునఁ [2]దనుపుము
భావం బివిధము విష్ణుపరతఁ గుమారా.

314. క. నృప వైష్ణవధర్మము నీ
కుపదేశించితిఁ బ్రసాదయుతుఁడ వగుచు సా

310 1. షాధికయై - పెక్కుప్రతులు

311 1 క్కన్నిటికిని నకృతి - శ ష పెక్కుప్రతులు 2 నకృతతయనఁ 'జనిన' నకృత
యనంజనిన - స.

312 1. విహితమగున్ - అ. ఆ, ఇ. ఈ కొన్ని ప్రతులు, గ్రోదమగున్ - ట

313 1. త్యావేశంబున - చ. ల. 2 మాన్పుము - గ.ట. ల. స కొన్నిప్రతులు; నూన్పుము-
కొన్నిప్రతులు, మనుపుము -స

రపుఁ[1]దెసు వగు నిది [2]గనిగొని
యపగతసంసారభయుఁడ వై నడపు తగన్.

815. వ అనిన సంప్రీతుండై ధర్మజుండు భీష్మునితోఁ దత్త్వంబు లధ్యాత్మం
బులు నధిభూతంబులు నధిదైవంబులు ననుసర్వంబునకుం గర్తయు భర్తయు
హర్తయు నగుచు సకలభూతంబులుం దన్నుపజీవింపం జెంపారు వాని
నెఱింగింపవే[1] యని ధర్మజుం డడుగుటయు నతనికి నమ్మహాత్ముం డి
ట్లనియె.

816. క. సనకుఁడు [1]సనందనుండును
సనత్కుమారుఁడు సనత్సుజాతుఁడు నలువుర్
తనయులు బ్రహ్మకుఁ బంచముఁ
డును షష్ఠుండును వసిష్ఠుఁడును [2]శంకరుఁడున్.

817. ఆ. అనఘ విను మరీచి యనఁగ భృగుం డన
నంగిరసుఁ డనఁగ ననంతరంబ
యత్రి యనఁ బులస్త్యుఁ డనఁ బులహుం డనఁ
గ్రతు వనంగఁ బుట్టు సుతచయంబు.

818. వ. ఆసనత్సుజాతుం డంగుష్ఠప్రమాణమూర్తియుం బ్రజ్వలదనల[1]స్ఫూర్తియు
నయి లోకంబుల నెందునుం జరియించుచు నొక్కనాఁడు మేరుశిఖరంబున
నారదుండు సన్నిహితుం డగుటయుఁ దదీయసల్లాపసౌఖ్యం బనుభవించు
చున్న యెడ నిట్లపోలె నడిగిన నారదునకు నమ్మహాయోగీశ్వరుండు సెప్పిన
వాక్యంబు లితిహాసరూపంబునం జెల్లు నవి యుపన్యసించెద నవి భవత్ప్రశ్నం
బున కుత్తరం బగు నాకర్ణింపుము.

---

814 1. వెరవగు - అ. ఈ వ 2 గైకొని _ శ. ష

815 1. వేయని ధర్మజుండడుగుటయు నతనికి - శ ష, వేఁయనుటయు నితనికి _ వా. పెక్కు ప్రతులు

816 1. సనాతనుడు _ న.. కొన్నిప్రతులు 2. నారదుడున్ - ర, శ

818 1 మూర్తియునయి - క

-: సనత్సుజాతుండు నారదున కుపదేశించినతత్త్వప్రకారము :-
సం. 19 - 88 - 1 (కుంభ)

319. క. దశకల్ప సహస్రంబులు
[1]నిశ యింతియ దివస [2]మిది సునిద్రారతికిన్
విశదప్రబోధమునకు
న్వశగతకాలములు విష్ణునకు విమలమతీ.

320 క. అవ్యక్తం బనఁగా దన
దివ్యాత్మన కలిగి యుండు ధీసారనిధీ
భవ్యాత్ము లభేదస్థితి
నవ్యాహతదృష్టిఁ గాంతు రయ్యమళమ్మున్

321. వ. అప్పరమేశ్వరుండు.

322. క రే నిద్రించుప్రభాతం
బై నరమేల్కని సృజించు నంబువులఁ దగం
దా నం దిడుఁ దనవీర్యము
దాన మహాండ మగు హేమభాస్ఫురితంబై.

323 వ. తదనంతరంబ

324. తే. బ్రహ్మఁ గల్పించి దానికిఁ [1]బతిఁగఁ జేయ
నమ్మహాత్ముఁ డహంకార మావహించి
మనసుఁ బదియింద్రియములు బుద్ధిని ఘటించి
చదలు మొదలగుభూతపంచకముఁ జేయు

325. వ అయ్యాకాశపవనాగ్నిజలభూము లగుభూతంబు లేనింటికి గుణంబులుగా శబ్దస్పర్శరూపరసగంధంబు లావహించుం గ్రమంబున దేవమునిదానవ గంధర్వకిన్నరనరజాతిజంతుజాలంబులం గల్పించు నన్నియు నహంకార వ్యాప్తంబు లయి యవ్యక్తసాగరంబున మగ్నోన్మగ్నంబు లగు చుండు.

---

319 1. నిశి - అ ఈ, ఐ, ఓ, ఔ, క, ఖ, గ చ, ఠ, వ, శ
2. మునకు - శ

324 1 ప్రతిగ - శ

326. క. విభుఁ డావిష్ణుం డేత
త్ప్రభవస్థితివిలయముల శుభము నశుభంబుం
బ్రభు వై తగఁ గాంచి నడపి
విభవోజ్జ్వలకేలి సలు\ ఁ వినుము మహాత్మా

327. తే. అంబరాదిభూతములు శబ్దాదిగుణము
లింద్రియంబు లహంకార మిద్ధతేజ
మనము బుద్ధి యవ్యక్తంబు మహితవేద
వేద్యతత్త్వంబు లీచతుర్వింశతియును.

328. వ. అధ్యాత్మాదులు సెప్పెర నాకర్ణింపుము.

329. సీ. శ్రోత్ర మధ్యాత్మంబు సూవె శబ్దం బధి
భూతంబు [1]దిక్కులు పురుషముఖ్య
యధి[2]దైవముల్ చర్మ మధ్యాత్మ మందలి
[3]సంస్పర్శ మధిభూతసంజ్ఞకంబు
దానికి నధిదైవతంబు [4]మరుత్తు నే
త్రంబు దా నధ్యాత్మకంబు రూప
మధిభూత మాదిత్యుఁ డధిదైవతము జిహ్వ
యధ్యాత్మకము రస మారయంగ
తే. దానియధిభూత[5]ముదకము దదధిదైవ
తంబు ఘ్రాణ మధ్యాత్మంబు దలఁప గంధ
మనఘ యధిభూత మగుఁ దదీయాధిదైవ
తంబు మేదిని యండ్రు విద్వజ్జనమ్ము.

330. వ. ఇది బుద్ధీంద్రియప్రపంచంబు.

---

329 1. వాయువు – శ ష. న. పెక్కుప్రతులు; దివియును – స. ఇచ్చట మూలమిట్లున్నది. 'ఆకాశం ప్రథమం భూతంశ్రోత్రమధ్యాత్మం శబ్దోధి భూతందిశోధి దైవతం" 13_33 _ 29 కుంభకోణప్రతి. 2. దైవతము – శ.ష. కొన్నిప్రతులు. 3 స్పర్శ మధిభూత స. 4 విద్యుత్తు – ల. శ ష స పెక్కుప్రతులు. 5. ముదుపతితదధి దైవతంబు – ల. శ. ష. స పెక్కుప్రతులు, మప్పులదధి – స ఇచ్చట మూలము "ఆపశ్చతుర్థంభూతం జిహ్వాధ్యాత్మం రసోధిభూతం వరుణోధిదైవతం స్యాత్." 18 – 33. _ 22 కుంభకోణప్రతి.

331. సీ. పాదపాయూపస్థ పాణివాగ్వర్గంబు
గర్మేంద్రియము లివి నిర్మలాత్మ
యధ్యాత్మములు వాని కగు నధిభూతముల్
గంతవ్యమును విసర్గంబు [1]నోలి
నానందమును విను మనఘ క_ర్తవ్యవ
_క్తవ్యంబు లన నధిదైవతములు
[2]వాసుమి_త్రి ప్రజాపతిశక్రవహ్నులు
మఱి యహంకారంబు మనసు బుద్ధి
తే. పూఁజితాధ్యాత్మకము లధిభూతవృ_త్తి
వెలయు నభిమానమంతవ్యములును నిశ్చ
యంబు నధిదైవములు మేధ యమృతకరుఁడు
బ్రహ్మ మిది వేదవాక్యనిర యవిధంబు.

332. క. ఇవి యెల్ల విష్ణునం దు
ద్భవము లయముఁ బొందుచుండు బహువిచిక ల
ర్ణవమునఁ బొడమి యడఁగుమా
డ్కి విశేషము గల్గ దతని[1]కిఁ విభుఁ డగుటన్.

333. క విను మవ్య_క్తం బనఁగాఁ
జను మూలప్రకృతి పురుషచైతన్యము నె
క్కొనినం జేతన యగుచు భు
వనతంత్రం బెల్ల నడపు వైభవ మెసఁగన్.

334 ఆ. [1]అట్లు లోకక_ర్త యగునంబుజాక్షుండు
పట్టుఁగొమ్మ భావభవహరుండు

331 1. నోలినానందమును - ఏ. శ. ష న. పెక్కుప్రతులు. నోల్మనానందము - వా.
2 విష్ణుండు కాలుండు విధి శక్రవహ్నులు - గ; ఖానుమిత్ర - శ. ష. పెక్కుప్రతులు
బ్రహ్మమిత్ర - వ పాద సంపుటికి "విష్ణుడు" అధిదైవతమని కుంభకోణప్రతి, వాసు.
Name of Vishnu Aptes Dictionary. 3. వేధ - కొన్నిప్రతులు.

332. 1. కి విభవమగుటన్ - ల

334. 1 ఈ పద్యము పెక్కు తాళపత్ర ప్రతులలో లేదు.

హరునియనుమతమున నఖిలాంబుజాండంబు
లట్లు పుట్టఁ జేసి యడఁచుచుండు.

335. వ. ఇట్లు సెప్పి సనత్సుజాతుండు నారదుం జరితార్థుం జేసె ననిచెప్పి భీష్ముండు భీమాగ్రజుతో వెండియు

336. ఉ. ఇంతకు మూలమై[1] యిరువదేనగుతత్త్వ మనంగ వేదవే
దాంతపురాణవేద్యుఁ డగునప్పురుషుండు వెలుంగు వాఁడ కా
లాంతకుఁ డై నయచ్యుతుఁ డనంతుఁడు యోగిజనాంతరంగవి
శ్రాంతుఁడు విష్ణుఁ డవ్యయుఁ డసంగుఁడు గౌరవవంశదీపకా.

337 వ అనిన విని యజాతశత్రుండు సరిత్పుత్త్రునితో నియతు లయి యగ్నులు దమయందు సమాహితంబులు సేసికొని మహాత్ములు నిజాత్మల నప్పర మాత్ము నెట్టివానిం గా భావింతు రెఱింగింపవే యనుటయు నతనికి భీష్ముం డిట్లనియె.

338. క. అమృతోత్పత్తిసమయమున
నమరులకును దానవులకు నని వాటిలె నం
దమరులు దప్పిం జెడ్పడి
కమలభవుని నాశ్రయింపఁ గా నియతిమెయిన్

339. వ. అతండు నారాయణు నాత్మయందు నిలిపి.

340. తే. భక్తవత్సల పరమాత్మ పద్మనేత్ర
సర్వభూతమహేశ ఋక్సామయజురు
పాస్య సాధుసంరక్షణ పరవిహార
సురలు రిపులచే [1]నలఁగిరి శరణ మగుము.

341. వ అని సంస్తుతిపూర్వకంబుగాఁ బ్రార్థించె నట్టియెడ.

342. క. జలదస్వనసన్నిభమై
యెలుఁ గొక్కటి సదలఁ దెలఁగె నే నిదె మిమ్మున్

---

336. 1. మైనహరి యెప్పుడు నీకు విధేయుడైన వేదాంత — శ ష

340. 1. నలిగిరి — కొన్నిప్రతులు.

గెలిపింపఁగ [1]వచ్చితి నను
విలసద్వర్ణములు గాథవిశదంబులు గాన్.

943. వ. తదనంతరంబ యకుంఠితవిక్రముం డగువైకుంఠుండు.

944. క. గరుడారోహణలీలా
సరభసుఁడై చక్రగదలు శార్ఙ్గముఁ ఖంచ
త్కరముల వెలుంగ నదరి య
సురగణములఁ ద్రుంచె సురలు చోద్యం బందన్.

945 వ. ఇట్లు [1]నిర్జించి తత్క్షణంబ యతం డంతర్ధానంబు నొందిన సంతసంబును నచ్చెరువును బెనంగొనుచెందంబులతో బృందారకబృందంబు లిమ్మహాత్ముం డెవ్వం డేమిభంగివాఁ డెఱింగింపవే యని యడిగిన నజుం డితండు విష్ణుండు వైకుంఠాభిధానంబగు మూర్తివిశేషంబున విహరించె విష్ణునివిధం బిట్టి దని యెఱుంగను నెఱింగింపను శక్యం బగునే యయిన నొక్క తెఱంగునం దెలిపెడునట్టియితిహాసంబు గలదు వినుం డని పలికి వినిపించె ధర్మనందనా యానిర్మలవాక్యంబు లుపన్యసించెద దాన నీ యడిగినయర్థంబు దేటపడు నాకర్ణింపుము

-: గరుత్మంతుండు మునులకు విష్ణుదేవుని మహిమాతిశయంబు సెప్పుట :-
(సం. 13-40-1 కుంభ)

946. సీ. హిమగిరిమీఁద ననేకమునీంద్రులు
సిద్ధులుఁ గూడి గోష్ఠీసుఖంబు
ననుభవింపఁగ లీల నచటికి వచ్చి సు
పర్ణుండు వారికిఁ [1]బ్రణతుఁ [2]డగుడు
వా రభినందించి గారవంబున సుఖా
సీనుఁ గావించి యర్చించి ప్రీతి

---

942 1. వచ్చెద - ఊ పి. శ. ష

945. 1. వినోదించి - అ ఆ. ఇ. ఈ. చ ల. కొన్నిప్రతులు.

946. 1. ప్రణతిజేయ - ఇ 2. డగుచు - కొన్నిప్రతులు.

నతనితో సల్లాప మాచరించుచు నుండి
[3]యొక్కటి యడిగెద ముజ్జ్వలాత్మ

తే. యనిన నాతండు ధన్యుండ నైతి మీర
లెద్ది యడిగెద రేను నాయెఱింగినంత
యతులమతులార చెప్పెద ననుడు వార
లెలమి నవ్విహగేంద్రున కిట్టు లనిరి

847. క. ప్రియభక్తుం[1]డవు భక్త
ప్రియుఁడును విష్ణుండు నీవు ప్రియుఁడై భక్తుం
డయి వర్తింతా విభుకడ
దయఁ దెలియఁగఁ జెప్పవే యతనితెఱఁ గెల్లన్.

848. వ. అని యడిగిన నతండు వారల కిట్లనియె.

849. క. స్థూలప్రకార[1]మున నీ
త్రైలోక్యము గా[2]వఁ బూని దయ చిగురొత్తన్
లీ[3]లఁ బ్రవర్తింపఁగ మన
మాలోకింతు మది గనుట యన వచ్చునొకో.

850. ఉ. ఏనును మీరు నేల మఱి యెవ్వరు యతులు విష్ణుచందముం
బూని యెఱుం[1]గ నవ్విభుఁడు భూరిదయారతి నాకు నేర్పడం
దాను మహోద్ధృతంపుఁ జరితంబులు చూపుచు భాషణామృతం
బానఁగఁ జేసె [2]నాచెవుల నవ్విధముం దెలియంగఁ జెప్పెదన్.

851. సీ. అమరేంద్రు నిర్జించి యమృతంబు గొనిపోవు
నప్పుడు వీతెంచె నాకసమున

---

3 యొక్కటి — కొన్నిప్రతులు

847 1. డు ను — కొన్నిప్రతులు.

849. 1. మగుని త్రైలోక్య — శ. ష. 2 వనతడు — అ ఆ. ఇ. ఈ కొన్నిప్రతులు.
3. ల వినోదింపగ — శ. ష.

850 1. గరావిభుడు — వ 2 వీనులకు నవ్విధముం — గ.

మెచ్చితి విహగేంద్ర యిచ్చెద వరము నీ
కనుమాట యది విని హర్ష మెసఁగ
నెవ్వరో [1]యెఱుఁగ ని న్నెఱిఁగించి మఱి వర
మిమ్మంటి దానికి నెలమి నగుచు
గాలంబుతోఁ గూడఁగా నెఱింగెదవు వా
హనమవు గమ్ము నాకనుచుఁ బురుషుఁ
తే. డొక్కఁ డుజ్జ్వలతేజోమయుండు దోఁచి
జరయు మరణంబు లేక యసురుల సురల
నోర్వఁ జాలినబలముతో నుల్లసిల్లు
మని వరం బిచ్చె నిచ్చిన నధికభక్తి

౩౫౨. వ. [1]విను దండప్రణామం బాచరించి.

౩౫౩. క. నీవాహన మయ్యెద రథ
మీ వెక్కినఁ గేతు వై వహింతుఁ [1]జెనుపు నా
కీవరము నిచ్చి మనుపము
నావుడు నవుఁ గాక యని మనఃప్రియ మెసఁగన్.

౩౫౪. వ పలికి యంతర్హితుం డయ్యె నంత సంతసంబు నచ్చెరువునున్ బెరయుమనంబుతో మదీయజనకునిపాలికిం జని యీవృత్తాంతం బెఱింగించిన నతఁడు వికసిల్లుచు నావదనంబు వీక్షించి ధన్యుండ వైతి వమ్మహాత్ముండు నారాయణుండు నీవలనియనుగ్రహంబున సల్లాపసౌఖ్యంబుఁ బ్రసాదించెఁ దపంబున నేకయోగసమాధి నవలంబించి యేను దన్నెఱుంగుటం గోరి యారాధించిన నాకు నీలశ్వేతపీతారుణ[1]పింగళంబును బహూదరపాదపాణిశిరోనేత్రంబును నైనదివ్యగాత్రంబు సూపి సంగంబు గలయంతరంగంబున నన్నెఱుంగ వచ్చునే నిస్సంగుండవై యెఱింగెదవుగాక యనియె నట్టియవ్విశ్వరూపునకు శాశ్వతపరిచర్య సేయంగలవాఁడ వగుటం గృతార్థతం

---

౩౫౧. 1. మిమ్ము నా కెఱిగించి - పీ. శ ష.

౩౫౨. 1. ఏనుం బ్రాణాయామం బాచరించి - అ.

౩౫౩. 1. నెలమి - కొన్ని ప్రతులు.

౩౫౪. 1. పిశంగంబును - ఎ

బొందితి బదరికాశ్రమంబున కరిగి యచ్చట సకలలోకసేవ్యుం డగునాథ వ్యమూర్తి సేవింపు మని యానతిచ్చిన నయ్యెడకు ముదంబునం బొదలు చుంబోయి.

355. సీ. అచట నారాయణు నచ్యుతు హరిఁ బుండ
రీకాక్షు గోవిందు లోకజనకుఁ
గని భక్తిఁ బ్రణమిల్లి వినుతి సేయంగఁ బీ
తాంబరకలితమై యష్టభుజము
శంఖచక్రగదాసిశార్ఙ్గధరంబు[1]ను
నై నరూపము దాల్చి యవ్విభుండు
సిఱునవ్వుతోడ వచ్చితి మేలు సేసితి
రమ్మంచుఁ దా నుత్తరంపుఁదూర్పు
తే. దెసకు నల్లన పోవఁ బెంపెసఁగఁ గడఁగి
పాఱవలయు నా కెమ్మెయి బహు సహస్ర
[2]యోజనంబులు నని వితతోజ్జ్వలాగ్ని
యద్భుతముగ ననింధన[3]మై వెలుంగ

356 వ కని యప్పావకుం బావకద్యుతి యగునమ్మహాయోగి ప్రవేశించి యందు శివాసహితుండై శివుఁడు దపంబు[1]సేయఁ దదీయ[2]సంవిత్సౌఖ్యం బనుభవించి యయ్యనలంబు గడచి యరుగుచుండ నేనును [3]బథిశ్రమాభిభూతుండ నగుచు విడువక వెనుకఁ బోవుచుండితి నిట్లు మఱియునుం బెద్దయు దవ్వు నని యద్దేవుండు భాస్కరకిరణంబులకుం బ్రవేశంబు లేనిమహాతమంబు సొచ్చె నచ్చటం జూడ్కి సెడి మూఢత్వంబు నొంది

357. క. ఆదేవుఁ జిత్తమున నిడి
యాదిపురుష కరుణ నన్ను నరయు మెచటి[1]కో

---

355 1 లునభయహస్తము - శ. ష. 2 యోజనములని చని - న. 3. మయ్యు వెలుగ - కొన్నిప్రతులు
356 1 సేయునట్లు దోఁచెఁ దదీయ సందర్శన సౌఖ్యం బనుభవించి యమ్మనలంబు - శ.ష.
2. సందర్శన సౌఖ్యంబు - ఊ. పీ 3 బథిశ్రమాభిభూతుండ - ట శ. ష. కొన్ని ప్రతులు
357 1. కింబోరు గతి యెద్దియనఁగా - పీ శ ష వ కొన్నిప్రతులు.

ఁయేది గతియొ నా కనఁగా
నీదెస రమ్మనుచుఁ దీపుతెలుఁగుం జూపెన్.

358 క. మది ఖేదము మై డప్పియుఁ
గదిరిన నే శరణు వేఁడఁగాఁ దమ మెల్లం
దుది వోయి లేక తక్కను
హృదయానందకర మైనయెడయై యుండెన్.

359. తే. వట్టపగలింటిసూర్యుని[1]పగిది నతఁడు
దోఁచె, సూర్యేందుతారకద్యుతుల కచటు
గోచరము గాదు దేవతాకోటి యాది
యైనజంతువులకు నగమ్యస్థలంబు.

360 క. దుందుభినిస్వనములు నా
నందనమృదుమధురగీతనాదములుఁ జెవిం
బొందె మకరందబిందు
స్యంది[1]కమలసుభగ[2]నదులు నచ్చటఁ దోఁచెన్.

361. క. సురలకు నిమ్మెయిఁ [1]దేజ
స్స్ఫురణము లే దన్న యట్టిపొలుపున వెలుఁగన్
నరులం గొందఱఁ గాంచితిఁ
దరుణులనుం గంటి నద్భుత[2]తమాకృతులన్.

362. తే. వారు పూజ లొనర్పంగ గారవంపుఁ
జూడ్కి నర్దేవుఁ డొందఱఁ జూచు చరిగె
మఱియు నట తత్ప్రదేశంబు మహితవహ్ని
మయతఁ జేసి భయంకర మయి వెలింగె.

363. వ. అచ్చట నే నతనిం గానక.

---

359. 1 భంగి - అ. ఉ. బొ. వ

360. 1. త కమలాకరములు నచ్చట దోచెన్ - శ. 2. సరసులచ్చటఁ దోఁచెన్ - పీ. ష.

361 1 జేతస్స్ఫురణము - వీ శ ష స. 2. రమాకృతులన్ - అ. ఆ. ఇ. ఈ. ఎ. క. గ జ ట. వ. శ

౩౬౪ క. భ్రమ గొని యద్దేవునిఁ జి
త్తమునం దిడి శరణు శరణు దయఁ గావుము న
న్నమిత్రైశ్వర్య యనుడు శి
తమధురలలితాక్షరముగఁ దా నిట్లనియెన్.

౩౬౫. క. నిను నే మఱతునె నీ దగు
జనకునిచే నన్ను విని సు[1]సంగతమతి వై
చనుదెంచు టే నెఱుంగనె
వినతాసుత యిందు రమ్ము విడువుము భయమున్.

౩౬౬. వ. నన్నుం గానమికిం [1]గలంక వలవదు.

౩౬౭ క మమకారాహంకారము
ల మతిం బొరసిక నిశ్చలం బగు[1]చూడ్కిన్
[2]సమవేతరూప నన్నున్
శమభరితాత్మకులుం గం(?)దురు సారవిచారా

౩౬౮. తే. నీవు నామీఁదివేడుక నెఱయ నిష్ఠ
తోడఁ దలఁచుట మామకస్థూలరూప
దర్శివై యుండు దని నన్ను దయ దల్పిర
గారవించిన ననలంబు గ్రందు వాసె.

౩౬౯ వ. ఇవ్విధంబున సుఖం జేసి ననుం గెలిపించుకొని మఱియు దవ్వు సని యాకా
శంబున కెగసిన నేనుం [1]దోన తగిలి పోవ నంతర్ధానంబు సేసె నిట రమ్మను
నెఱుంగ యాధారంబుగా నాచక్కటికిం బోయి.

౩౭౦. క. కమనీయహంసకులసం
గమశోభిత మైనయొక్కకమలాకరముం
బ్రమదమున దాన నవగా
హము సేయుచు నున్నతన్ను నచటం గంటిన్

౩౬౫ 1. సంయుతమతివై - ఊ. ట. ల వ
౩౬౬ 1. వగ్గవ వలదు - కొన్ని ప్రతులు.
౩౬౭ 1. దృష్టిన్ - పీ. శ. ష 2 సముపేతరూపు - పీ శ. వ.
౩౬౯ 1 తోడన - కొన్నిప్రతులు.

371. క. నాదిక్కు గనుంగొని తా
నాదమురనఁ బిల్చె నేను నచటికిఁ జని యం
దా దేవునిఁ గానమికి వి
షా[1]దం బందుమదితోడఁ జంచలదృష్టిన్.

372 చ. కలయఁగఁ జూడ నద్భుతము గాఁగ ననేక[1]శతాగ్నిహోత్రముల్
వెలుఁగుట గాన వచ్చె బహువేదరవంబులు వింటిఁ దత్ప్రవ
ర్తకులఁ బొడగాన నట్టియెడ దారుణరూపసుపర్ణసంఘముల్
బలువిడి నాపయిం గవిసె భ్రాంతుఁడ నైతి భయంబు పెంపునన్.

373 ఆ. అట్లు భయముఁ బొంది యచ్యుత శివ సహ
స్రాక్ష వేదమయ యనాదినిధన
త్రిభువనైకనాథ త్రినయన గోవింద
పద్మనాభ హర కృపావిధేయ.

374. క. అని మఱియుఁ బెక్కు పేళ్లన్
వినుతించుచు శరణు వేఁడి వినతశిరస్కుం
డును ముకుళీకృతహస్తుం
[1]డును నై యే నుండ దేవుఁడు ప్రసాదమునన్.

375 క తనుఁ [1]జూపి యొండ కోడకు
వినతాసుత యనియె నపుడు వినుఁడే మొదలం
గనిన బదరికాశ్రమ మ
య్యె నచటు విష్ణుప్రభావ మే మనవచ్చున్.

376. ఉ. అప్పరమేశ్వరుండు లలితాష్టభుజం బగురూపు దాల్చి తా
నెప్పటియట్ల పిల్చెఁ గని యేను మనంబున నద్భుతంబుతో
ముప్పిరియైనకౌతుకము మోదము నెక్కొన నాకు సత్కృపం
జెప్పెడుఁ గాక యెట్లు నని చేరితి నంజలి ఫాలిఁ జేర్చుచున్.

---

371. 1 దముగల మనసుతోడ జంచల - పీ. శ. ష

372 1 హుతాగ్ని - వ.

374. 1. దనునై,.....దతిశయకరుణన్ - పీ. శ. ష. న.

375. 1. ననుజూచి — పీ. శ. ష. న. కొన్నిప్రతులు.

877. వ. చేరి వినయావనతుండ నయి దేవా యేను భవత్పాదభక్తుండ నేని నీదయకు [1]భాజనంబ నేని నాకు వినం దగు నేని దురధిగమసారం బైనభవదీయ ప్రకారం బిట్టి దని యెఱుంగునట్లుగాఁ[2]జెప్పవే యనిన నాసర్వలోకశర ణ్యుండు గారుణ్యామృతమయం బైనచూడ్కి నామీఁద నొలయ నిట్లనియె.

-: విష్ణుదేవుఁడు గరుత్మంతున కుపదేశించినయాత్మతత్త్వ ప్రకారము :-

సం 18 - 48 - 1. (కుంభ)

878. సీ. అనిమిషగంధర్వదనుజు లాదిగ నెవ్వ
రును విను నాయున్నరూపెఱుంగ
రఖిలభూతములు నాయం దుద్భవించు వ
ర్తించు లయించు వర్తింప నేను
వానివశంబున [1]వసియింతు సర్వంబు
నందును నాతత్త్వ మధిగమింప
నగు నగ్నియాత్మ సమాహితంబుగఁ జేయఁ
గామవర్జిత మహంకారవిముఖ
తే. మజడ మపరిగ్రహం బహింసాను మోది
క్రోధరహితంబు నిర్మలబోధయుతము
నిత్యతృప్తంబు శాంతంబు సత్యభక్తి
యైనచిత్తంబు గలనియతాత్మకులకు.

879. వ సాంఖ్యయోగయుక్తులు బహిర్దర్శనులై నిశ్చయరహితులై రేని నస్మదీయ తత్త్వంబు గాన నేర రది మోహపంకమగ్నులగువారికి నుపవాసంబుల నియమంబుల వ్రతంబుల నెఱుఁగ శక్యంబు గా దేకాంతికధ్యానపరుల కెఱుంగుట గలుగు రజస్తమోదూషితంబు గాక కేవలసత్త్వాధిష్ఠితం బయిన జ్ఞానంబున న న్నవలంబించునది సూక్ష్మసరణి వాసుదేవసంకర్షణ ప్రద్యు మ్నానిరుద్ధనామంబులం జతుర్విధంబుల విభక్తుండనై ప్రాణులయం దాత్మ బుద్ధ్యహంకారమనోరూపవ్యాపకత్వంబు నొంది యుండుదు నిట్టిది మదీయ

---

877 1 భాజనుండనేని, పాత్రుండనేని - అని పాఠములు 2. ప్రసాదింపవే యనిన - పీ శ. ష. స

878 1. వర్తింతు - న.

స్థూలప్రకారంబు గశ్యపనందనా నీవు మన్మనస్కుండవు మద్భక్తుండవు మత్ప
రాయణుండవునై మత్స్వరూపవేది వగు మనియె నని చెప్పి సుపర్ణుండు.

౩౮౦ క. పురుషవరులార యద్భుత
చరమగు హరిదివ్యచేష్టితము నాకుం ద
క్కరుణం దోఁచినయట్టిది
పరిపాటిని మీకుఁ దేటపఱిచితి భక్తిన్.

౩౮౧ వ. అనిన విని యమ్మునిసిద్ధజనంబులు పరమాదరంబున నప్పక్షిదేవు దీవించి యామంత్రణంబు సేసి హర్షోత్కర్షంబునం జిత్తంబులు జొత్తిల్లఁ దమలోన

౩౮౨. సీ. అక్కజం బగుచున్న యిక్కథ యితనిచే
విని కృతార్థుల మైతి మనిరి మఱియుఁ
బుణ్యమాయుష్యంబు భూతిప్రదము భక్తి
వినినవిప్రుఁడు వేదవిద్యపెంపు
నృపవైశ్యశూద్రు లనుపమానజయధన
సౌఖ్యంబులను గంద్రు సర్వజనుల
కిహపరసిద్ధుల కిది సాధనం బగు
నని పల్కి యాత్రేచ్ఛఁ జనిరి దీని

తే. బ్రహ్మ సురలకుఁ జెప్పినభంగి వసువు
లవనిసురు లయి వచ్చి మాయమ్మపాల
నున్ననా డర్థిఁ జెప్పి రయ్యున్నరూపు
నీకుఁ జెప్పితిఁ గురుకులనృపవరేణ్య.

౩౮౩. వ అని చెప్పి దేవవ్రతుండు వెండియు నిట్లనుఁ బాండవాగ్రజా వైకుంఠసుపర్ణ సంవాదం బగునీయాఖ్యానంబునకు నభిప్రాయం బాకర్ణింపుము.

౩౮౪. తే. వివిధసంకల్పయుఙ్మనముల్ విడిచి యాత్మ
యందు నిష్ఠమై వగ్ని సమాహితముగఁ
జేసి నిస్స్పృహుండై విష్ణుఁ జిత్తవృత్తిఁ
జేర్చువాఁ డవ్యయస్థితిఁ జేరనేర్చు.

౩౮౫ వ. అని యిట్లు భీష్ముండు విష్ణుస్వరూపజ్ఞానప్రకారం బితిహాసరూపంబున ధర్మజునకుం జెప్పె నని చెప్పిన నప్పురుషవరులయడుగుటలును జెప్పుటలును

లోకహితంబులై యింత యొప్పి యుండునే యట మీఁదిసంభాషణవిశేషం
బులు సెప్పు మని యడుగుటయు.

386. చ. మునిహృదయాబ్జ[1]శాంతిమధుమోదవినోదిమరాళ [2]గాథచ
క్రనిహతశూలనిర్మథితరాక్షసయూథ నితాంతభ_క్తిభా
వనరమణీయ వేదపరి[3]వారనిరర్గళసేవనీయ ని
త్యనిరుపమాననిర్మలనిరంజనఖేలన [4]ధర్మపాలనా.

387. క. సదయాపాంగా పరిణా
మదశాసంగమునిరాస మధురతమాంగా
మదశోకరహితచేత
స్సదనా సంజనితసముపసంహృతమదనా.

388. మాలిని గరుడవృషపతాకా కల్పితాశేషలోకా
సురపరిషదుపాస్యా శుద్ధసంవిద్వికాస్యా
పరమమహిమసీమా భవ్యకారుణ్యధామా
నిరతిశయగుణాలీ నిష్కళానందశాలీ.

*గద్యము:-* ఇది శ్రీమదుభయకవిమిత్త్రి కొమ్మనామాత్యపుత్త్రి బుధారాధనవిరాజి
తిక్కనసోమయాజిప్రణీతంబైన శ్రీమహాభారతంబున నానుశాసనికపర్వం
బునందుఁ బ్రథమాశ్వాసము.

---

386. 1. భృంగ - శ. ష; సంగ - వ. 2. నాథ - ఆ. ఇ. ఈ. చ ణ. ట ల వ. శ. ష.
కొన్నిప్రతులు. 3 పాల, వార - అని పాఠములు 4. భక్త - కొన్నిప్రతులు.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆనుశాసనిక పర్వము - ద్వితీయాశ్వాసము

—o—o—

1. క. శ్రీమద్యువతు స్థ్సలగా
రీమయవా సూర్ధ్వ బంధురీకృతసౌంద
ర్యామృతరసిక్తనవి
ద్యామయ నిగమాంత[1]వేద్య హరిహరనాథా.

### అష్టావక్రుం డను మునికుమారు చరిత్రము

సం 13-19-10

2. వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు నారాయణ స్వరూపనిరూపణప్రకారంబు విని యజాతశత్రుండు సంజాత[1]ప్రీతుండై పితామహుతోఁ గన్యాదానంబునకు వరుం డెట్టివాఁడు గావలయు నను టయు నక్కురువంశవరున కివిషయంబున నొక్క యితిహాసంబు గలదు విను మని యమ్మానవపతి యాననం బాలోకించి.

3 సీ. అనఘ యష్టావక్రుఁ డను బ్రహ్మచారి స
త్తముఁడు వదాన్యుఁ డన్తాపసోత్త
మునికూఁతు సుప్రభ యనుకన్యఁ బెండ్లి గాఁ
గోరి యాతని నడుగుటయు నతఁడు
నీవు యోగ్యుండవు నీ కిత్తు నాపుత్రి
నంతకు నుత్తర మరిగి రమ్ము

---

1. 1. వాక్య - అ. ఆ ఇ. ఈ. కొన్నిప్రతులు; భవ్య - క.

2. 1. ప్రీతియై - కొన్నిప్రతులు

నావుడు సంయమినందనుం డెందుల
కరుగుదు నేపని యాచరింతుఁ

తే. అనుపు మనుడు వదాన్యుండు ధనదుపురము
గడచి హిమగిరి కరుగుము మృడునిఁ గొలిచి
గిరిజ తప మొనరించె నగ్గిరితటమునఁ
దత్ప్రదేశంబు పుణ్యంబు దానియందు.

4. క. ఆడుచుఁ బాడుచు గుణములు
గూడి [1]చరింపంగ గిరిజకుం బ్రియముగఁ దా
వేడుక నమ్మృడుఁ డెప్పుడుఁ
గ్రీడించుచు నుండు మునులు కీర్తింపంగన్.

5. ఆ. అది పవిత్రదేశ [1]మచ్చటు సూచుచుఁ
గడచి చనఁగ నీపకాననంబు
గానవచ్చు నందుఁ [2]గట్టిప్రాయము [3]నది
పుణ్యమూర్తి యమలబుద్ధి యోర్తు.

6. క. వసియించు నమ్ముదితఁ బ్రియ
మన లారఁగఁ గాంచి వచ్చునప్పుడ ప్రమదం
బెసఁగంగఁ బెండ్లి సేసెద
నసదృశరూపగుణవర్తనాన్వయవిద్యా.

7. సీ. అనిన నష్టావక్రుఁ డట్ల కాకని చని
బాహుదాతీరభూభాగవర్తి
యై రాత్రి గడిపి ధనాధీశుప్రోలికి
నరుగంగ నతఁ డమ్మహాత్ము రాక
విని యెదురేతెంచి వినయంబుతోడఁ దో
డ్కొనిపోయి మహితపూజన మొనర్చి
యూర్వశి రంభ తిలోత్తమ మొదలగు
నప్సరోవ[1]నితలయాటపాట

---

4. 1. వినోదింప - అ ఈ.

5. 1 మచ్చోటు - అ ఏ. శ ష నూ, 2. కఠిది ప్రాయము - ఐ. ఓ. ఛ. ఙ. ట; కఠిమ ప్రాయము - ఏ. 8. నతి - ఇ; గ౦ - ఐ. ఔ. ఛ ష.

7. 1 గణముల - ఆ. ఇ. ఏ.

తే. లాదిగాఁ గలవివిధవినోదకృతుల
ననుదినంబు నారాధింప నందు నిల్చె
నమ్మునీంద్రుండు దగులు లే కధికుతప్ర
వర్తనంబుల నొక్కసంవత్సరంబు

8. వ. కదంపడి ధనదుండు నీకేమి సేయవలయుం జేసెదం జెప్పు మనిన నతండును సర్వంబును సంపన్నంబ నీవు నిత్యసంపద నున్నతుండవై యుండు మే నొక్క మునిపతి సెప్పినపనికై పోయెద నీతోడి వేడుక నిల్చితి నింతియ కాని నాకభ్యర్థనీయం బొండు లేదని పల్కి యట వోయి.

9. సీ. హిమశైలతట మెక్కి యీశ్వరక్రీడన
స్థలిఁ గాంచి మ్రొక్కి ప్రదక్షిణముగఁ
జని యట యరుగంగ మునివరు చెప్పిన
[1]కడిమిలేమ్రాఁకులయడవి దోఁచె
దానిఁ బ్రవేశింపఁ గా నందు మణిహేమ
మయచిత్రరమ్యహర్మ్యము లనేక
ములు గానవచ్చె నుజ్జ్వలసమున్నతరమ్య
హర్మ్యంబు వానిలో నధికవిభవ
తే. సారమై యున్నఁ జూచి తద్ద్వారభూమిఁ
జేరి [2]లోనికిఁ దనపేరు సెప్పి పుచ్చఁ
గన్యకలు [3]పఱతెంచిరి కాంతిరూప
విలసనము లొప్పఁ గొందఱు వినయ మెసఁగ.

10. వ. పఱతెంచి పర[1]మాదరంబునం దోడ్కొని పోవునప్పు డప్పొలంతులయొప్పు సూడ్కులకుం జిత్తంబునకు వేడ్కలు సేయం జాలినను లోలత్వరాహిత్యంబున నత్యుదాత్తుం డగుచుం జని యభ్యంతర మందిరంబున వివిధరత్న రశ్మివిరాజితంబై నపర్యంకంబున నార్యమూర్తియు ధవళవసనాంగరాగయు రుచిరాభరణభూషితయుఁ బ్రౌఢవయస్కయు నగునొక్కవనితం గని

9. 1. కదనీవమ్రాకుల యడవి - ఉ. పీ. శ. ష (నమానము పరిశీలింపదగినది); కద వమ్రాకుల పేరు టడవి - పీ. న; కడవ పెన్మ్రాకుల - ఊ. ఓ. క. చ. 2. నాంతి కొన్నిప్రతులు. 3. పాఱుతెంచిరి - పీ శ ష

10. 1. మానందంబున - పీ. శ. ష.

మే[2]లయ్యెడు [3]మనుచు నిలిచిన నయ్యిందువదన యిందు [4]రం డని పలు
కుచుం బ్రత్యుత్థానంబు సేసి.

11 క. [1]అమ్మునివరు నాపర్యం
కమ్మునయిం బ్రీతి నునిచి గారవమునఁ దా
ద్యమ్మును నర్ఘ్యము శ్రుతివిహి
తమ్మైనవిధమున నిచ్చి [2]తత్పార్శ్వమునన్.

12. వ [1]తానును వేత్రాక్కసెజ్జం గూర్చుండె నమ్ముని గలయం గనుంగొని [2]యకక్క
న్నియల విభ్రమవికారంబులు దనలోచనంబులకు గోచరంబు లగుటకు నొల్లక
యిమ్మదవతీజనంబు లిచ్చట నేల యనిన నక్కాంత యక్కన్యల నెల్లం
బోవం బనిచి సముచితసల్లాపంబులు సేయుచుండి రాత్రి యగుటయు.

– ఉత్తరదిశ యష్టావక్రుని చిత్తశుద్ధిఁ బరీక్షించుట :–
సం 13 – 20 – 50

13. క. [1]సీతయ్యె ననుచు నల్లన
యాతనిశయనమున కరిగి యతఁ డెర యీఁగా
నాతల్పంబున నొకదెసఁ
బ్రీ[2]తహృదయయై శయించెఁ బృథ్వీనాథా

14. క. పదపడి నయమున మెయిమెయిఁ
గదియించి లతాంగి చిక్కఁ గౌఁగిటఁ జేర్పం
గదలనిచిత్తము [1]గలిగియు
మద మేఖియు లేక యతఁడు బ్రహ్మానై యుండెన్.

---

2. లయ్యెడమనుచు – కొన్నిప్రతులు. 3 మనుచు దీవించి నిలిచి – కొన్నిప్రతులు.
4 రమ్మని–కొన్నిప్రతులు

11. 1. అమ్మద్దియముని పర్యంకమ్ము – ఒ. క. వ 2 తాత్పర్యమునన్ – ఏ ఓ పి.
శ. ష. న

12. 1. తానును వేత్రాక – పెక్కుప్రతులు, వేత్రాక్క – వా. 2 తోడికన్నియల –
పి శ. వ

13. 1. శీతశ్యోననుచు – ఒ. క. 2. తిన్ శయనించియుండె – వ శ ష.

14. 1. తోడుతమద – కొన్నిప్రతులు, కలియని – ఆ

15. ఆ. అట్టు లున్నఁ జూచి యత్తన్వి మగవారు
భోగపరులు వార్ధి బొలఁతులందుఁ
గలుగు నవ్విధంబు గాక యేఁ గోరంగ
ననుభవింప కునికి [1]యగునె నీకు.

16. క. సంపదయు దివ్యభోగము
లింపారఁ బరిగ్రహింపుఁ డే మీధన మై
పం బొనరించెద ననుఁ గా
రింపక కైకొని [1]వరింపరే యిచ్చోటన్.

17. సీ. అనిన నష్టావక్రుఁ డతిదూష్య మగుపర
దా[1]రాభిగమనంబు దగదు శూద్ర
సతియైన నధికదోషంబు బ్రాహ్మణపత్ని
యగునేనిఁ బాతక మప్రమేయ
మదియును గాక నే నస్ఖలితబ్రహ్మ
చర్యంబునందుండి భార్యఁ గోరి
యున్నాఁడ ననుడు నీయొప్పునఁ దగిలితి
వనితలు గామార్తివశతఁ బొంది

తే. వంశహాని దలంపరు వరున కలుక
రాత్మజులఁ జూడ రగ్రజు ననుజుఁ గొనరు
పురుషశతకంబుసంగమంబునను దృప్తి
సనరు దీని విచారింపు మనియె నువిద

18. వ. అనిన నమ్మునివరుండు.

19. క. ఇది యేటికార్యముగ నా
మది కెక్కఁగఁ జెప్పి దిట్టిమాటలఁ గలపే
మదవృత్తి మాను మేఁ బో
యెద నావుడు నామృగాక్షి యెలన వ్వొలయన్.

---

15 1. యకట తగునె, యనఘ తగునె - అని పాఠములు; తగునె నీకు-వ (యతి తప్పినది) నాథ తగునె - శ (అఖండయతిగా సమన్వయింపవలెను).

16. 1. వసింపరే; వసింపవే, సుఖింపరే - అని పాఠములు.

17. 1. రదర్శనమును - అ ఈ. ఒ. ట; రమర్శనమును - ఉ ఐ. ఔ. ఖ. చ.

20 తే. కార్య మగుట[1]యు నరిగెదుగాక పిదప
నిల్వు మంతకు ననుటయు నీవు నన్నుఁ
గదియ కుండెదవేని నిల్చెద సధర్మ
వృత్తివగు మని వారించె న త్తపస్వి

21. వ. ఇట్లు వారించి యిది శాపంబున [1]ముదురుఁదనంబు నొందినబృందారకసుందరి గావలయు నట్లయ్యెం గాక ండె దీనితెఱంగు నాకెఱుంగన్ జాలిం బడనేల యని యాత్మ నూహించి యూరకుండె నంతఁ బ్రభాతంబై నంగాలోచిత కృత్యంబులు దీర్పు మని పలికి యప్పొలంతి యు త్తమ[2]స్నానీయద్రవ్యంబులు దెచ్చి య మ్మునియనుజ్ఞ వడసి మృదుకరతలంబుల మేను దొడసి కృతస్నానుం జేసి యతండు సంధ్యావందనాగ్నికార్యంబు లాచరించిన నమృతోపమానంబులగు నన్నపానంబుల నశనిం దృప్తునిం గావించి యుచితసంభాషణంబులం బ్రౌఢువుచ్చి నిశాసమయం బగుటయు శయనీయంబు నకుఁ బిలిచిన నాసుశ్లోకుండు రాకున్న నేనుం గన్యక నస్ఖలితబ్రహ్మచర్యంబునన చూవె పరిణతవయస్క నయితి స్వతంత్ర నై యుండుదుం బాణిగ్రహణమహోత్సవం బనుభవింపు మని పలికిన నమ్మహాత్ముం డిట్లనియె.

22. తే. బాల్యమునఁ దండ్రి యౌవనప్రాప్తి మగఁడు
వార్ధకంబునఁ దనయుఁడు వామనయన
నరసి [1]నడపన కాకెందు నంగనలకు
వలసినట్టులు సేయఁగా వచ్చు నెట్లు

23. వ. కావున నీవు ని న్నిచ్చినం బరిగ్రహించుట పాడిగా దనుసమయంబునం బూనఁ బూడ నచ్చేడియ సుభగయౌవనసుందరాంగియు మనోహరవిలాస భంగిము నయ్యె నై నను దానియందుఁ దగులనిచి త్తంబుతో న త్తపోధన కుమారుండు

---

20. 1. యెఱింగెదుగాక – శ. కొన్నిప్రతులు
21. 1 ముదుకుఁదనంబు – ఔ. న. 2 స్నానపానీయ – ల శ ష. 8 న తలంబునకు– కొన్ని ప్రతులు
22. 1. రక్షించువా రెందు నంగనలకు – ఐ ఓ ఔ క. ఖ. జ. వ, నరుపగా నెందును నంగ్గనలకు – శ వ; నరుపుటగా కెందునంగనలకు – ఆ.

24 క. ఈ[1]యనృతవర్తనము తే
లా యున్న నిజంబు నీతలంపును నిన్నుం
దోయజలోచన చెప్పుము
పోయెదఁ బనులు గల వనిచి పుచ్చుమ నన్నున్.

25. సీ. అనవుడుఁ బ్రీతయై యనఘ నిన్నారయు
తలఁపునఁ జూచె వదాన్యుఁ డిందుఁ
బుత్తెంచె నేను నీయుత్తరదిశఁ జొచ్చి
నీనిష్ఠఁ గాంచితి దీన నతఁడు
నిను మెచ్చు నాదెస మనమునఁ బ్రియ మొందు
మరుగుము సుప్రభాపరిణయమున
కనిన నద్దేవికి వినతుఁడై వీడ్కొని
యరిగి యమ్ముని[1]పతి యాత్మఁ గనియుఁ

తే. దన్ను నడుగంగ సకలవృత్తంబుఁ జెప్పి
యతనిపుత్త్రికఁ బెండ్లియై యతులధర్మ
భోగగౌరవ[2]కీర్తులఁ బొంది జగతి
నతిశయిల్లె నష్టావక్రుఁ డధిపముఖ్య

26 వ అని యష్టావక్రదిశాసంవాదంబు సెప్పిన విని యప్పాండవాగ్రజుండు మునులవలన శూద్రజాతిభావులయందుఁ బ్రభవించిన వారికి బ్రహ్మర్షిత్వంబు గల్గుట యది యెట్లొకో యని వితర్కింతు నత్తెఱంగు నా కెఱింగింపవే యని యనిమిషనదీనందను నడుగుటయు నక్కురుపతికిఁ గురుపితామహుం డిట్లనియె.

27 సీ. నాలుగుజాతులనాథులు విప్రున
కాంద్రుగాఁ గైకొన నగు నృపునకుఁ
దనకులంబున నట తక్కువ కులములు
రెంటను బరిణయశ్రీ [1]వహింపఁ

---

24. 1. యధమవర్తన - అ.

25. 1. వరుడాత్మ - కొన్నిప్రతులు. 2. దీప్తులు - ఐ. ఔ ఱ. గ

27. 1 వరింప - ఏ. శ. ష. స.

జను వైశ్యునకు నాత్మజాతి శూద్రాన్వయం
బునఁ బెండ్లిగాఁ దగు భూపవర్య
శూద్రున కర్హంబు శూద్ర[2]కన్యకఁ బెండ్లి
యగుటయు నిది వివాహప్రకార

ఆ. కథితధర్మ మిట్టిగతిఁ దప్పి ప్రతిలోమ
సరణియైనఁ గల్గు సంకరంబు
తల్లి[3]యెట్టికులము దానికులంబ యో
సన్నుతానులోమసంభవునకు

28. వ. అది సకలజనసామాన్యం బయినతెఱంగు విశేషించి మునిసత్తములయుత్తమ తపోజ్ఞానవిద్యాప్రభావంబులం జేసి తదీయబీజసంజాతులు యోని యెద్ది యైనను బ్రాహ్మణుల యగుదురు మహోత్కృష్టక్షత్త్రియులు ననులోమవృత్తి నాత్మ ప్రభావంబు[1]లం జేసి నిజబీజసంజనితులఁ దమకులంబ కలిగింపం జాలుదురు [2]నీవు వియోనిజాతు లని శంకించి యడిగితివి వారల [3]యేల పశుయోని జాతులు నయోనిజాతులును లోనుగా సద్విజులును రాజవరులు నగుట గన్నది గాదె కావున ముని[4]వరుల నృపవరులవలనం గలిగినజన్మంబు లెల్లను బీజప్రధానంబులై యతిశయిల్లు వినుము వసిష్ఠుండు ఋశ్యశృంగుం డగ స్త్యుండు సత్య[5]వత్పుత్రుపుం డగుకృష్ణద్వైపాయనుండు మందపాలనందనులు మఱియు ద్రోణకృపాదులుం బ్రభవించినభంగులు వినుము కాదె వార లెట్టెట్టివారయి రెఱుంగవే యివ్విషయంబున మనువాక్యంబు గల దాకర్ణింపుము

29. క. మునిజనుల నదుల సిద్ధుల
జననంబులు బుద్ధివృత్తిఁ జర్చింపఁగ నె
వ్వని[1]కిన్ వశంబుగా వవి
తనతనయైనట్ల యై యుదాత్తతఁ బొందున్

---

2. కన్యకసతియగుట-కొన్నిప్రతులు 3. కేదికులము-వీ. శ. ష. న కొన్నిప్రతులు.

28. 1 లంజేసినిజ – కొన్నిప్రతులు, లనిజ- వా. కొన్నిప్రతులు 2 నీవు శూద్రాదివియోని- వీ. 3. యేలయోనిజాతులు – శ ప న 4 పతుల – కొన్నిప్రతులు. 5 వతి తత్సోదరుండగు కృష్ణ – కొన్నిప్రతులు. సత్యవతికి కృష్ణద్వైపాయనుడు సోదరు డనుటకు ఆకరము లేదు.

29 1. కిందలంబు – వీ శ ష.

80. వ. అనిన విని యుధిష్ఠిరుండు.

81. ఆ. అనఘ దానపాత్ర మగుట విప్రుఁడు లింగి
యైననో యలింగుఁడై చరించు
టనో యెఱుంగఁ జెప్పు మనవుడు గాంగేయుఁ
డిట్టు లనియె నమ్మహీశ్వరునకు.

-: భీష్ముఁడు ధర్మరాజునకు దానపాత్రభూతులతెఱం గెఱిఁగించుట :-

సం 13. 23 - 1

82. క. విను సద్ద్విజుండు నిజవ
ర్తనమునఁ జరియించుచున్న దానార్హత్వం
బున [1]వెలుఁగు లింగియైనను
మనుజేంద్ర యలింగవృత్తి మహితుం జేసెన్.

83. వ. అనుటయుఁ బాండవాగ్రజుండు.

84. తే. శ్రద్ధ సాలంగఁ గల్గినజనము లిచ్చు
భూరిదానముల్ దురితంబుఁ [1]బొంద నేర
వేయెడల నని తలఁచెద నేను బుద్ధి
ననుడు నాతని కతఁ డిట్టు లను నృపాల.

85. క. నగవక [1]దుర్దాంతు లయినఁ
బరిపూతులు శ్రద్ధ గల్గు భవ్యులుఁ దారా
దర మొప్ప నిచ్చుదానము
దురితహారమ కాక కీడు దొడరునె యెందున్.

86. సీ. అనుడు ధర్మాత్మజుఁ డతనితో దైవకా
ర్యమునప్డు విప్రుని నలిపరీక్షి
తునిఁ జేయ వలయునే యనఘ పైతృకమువి
ధంబున నన్న నాతండు నీవు

---

82. 1. వెలయు - వీ ళ వ. న

94 1. బొరయనేర - ఓ. లొ వ.

85. 1. యుదాత్తులైనన్ - వ

దలఁచినయట్టిద తగవు నావుడు నాన్వ
పాలుం డపూర్వసంబంధిసూరి
యాజితపోనిత్యులందు సత్పాత్రము
లెవ్వార లనుటయు నింతవట్టు

తే. వారు సత్పాత్రముల వంశవర్య ధర్మ
భాషణము కాని తత్క్రియాపరత లేని
యట్టివానికి నరుఁడు హేమాదు లిచ్చి
ఘోరయుఁ బడియేండ్లు నరకానుభూతి ననియె.

37. వ. అని భీష్ముండు వెండియు.

38. క. ధర[1]ణియుఁ గాశ్యపవై శ్యా
నరమార్కండేయు లోలిన జగద్ధిత వా
క్పరులై రొక్కడ వారొక
మరి గోష్ఠినిరతి నుండి మనుజాధీశా.

39. వ. అవ్వాక్యంబు లాకర్ణింపుము

40. క. ఘనతర మగు[1]హ్రీగౌరవ
మున మునిఁగినఁ బాప మఖిలమును రూపుసెడుం
దెనుపునయగ్గలికఁ బొగడు
గనినపయోరాశిఁ [2]బడ్డగడ్డయుఁబోలెన్.

41. తే. సత్కులంబునఁ బుట్టుట సకలవేద
ములుఁ బురాణంబులును శాస్త్రములును జదువు
టయును సద్గతిఁ జేయఁ బ్రౌఢములు గావు
శీలసామగ్రి లేని దుశ్చేష్టితునకు.

42. ఆ. పలుసదువులు సదివి పండిత[1]మానియై
తనదువిద్య నొరుల ఘనయశంబుఁ

---

38. 1. ణింగాశ్యప – ఉ. క. గ. చ. ల. వీ శ. శర. ష. స. సూ

40. 1. హ్న్యాద్గౌరవమున – అ. ఈ. ఎ. ఓ. క గ జ. ట. ల 2. బడిన – కొన్ని ప్రతులు.

42. 1. మాన్యుడై – ఆ. ఐ. ఓ; ఔ. ఫ.

[2]దూఱపుచ్చునట్టి దుష్టాత్మకుని బ్రహ్మ
హత్య వొందు సందియంబు లేదు.

43. తే. వాజిమేధముల్ వే యొక్కవలనఁ బెట్టి
యలఘుసత్యంబు దక్కటివలనియందు
నిల్పి తులఁగూఁపఁగాఁ సత్మనిష్ఠలోని
యర్ధమున కెత్తు వచ్చె నయ్యధ్వరములు.

44 వ. అని యిట్లు వర్తిల్లునాలుగువాక్యంబులుం జెప్పిం.

45. తే. బ్రహ్మచర్యంబుకంటెను బరము మద్య
మాంసములు రెండు నుడుగుట మనుజనాథ
లోకయాత్ర వాటించు చలోలు[1]పతయు
శమముఁ గల్గి వర్తించుట శౌచవిధము.

46 వ. అనిన విని యజాతశత్రుండు ధర్మంబు నర్థంబును గామంబును నాచరించు
కాలంబు లెఱింగింపవే యనుటయు నాపా[1]గేయుం డతని కిట్లనియె.

47. తే. రేపకడయును బగలును మాపు వరుస
నర్థధర్మకామంబుల నాచరింప
వలయు వానియం దాసక్తి వలదు సక్తుఁ
డయ్యెనేనియు ధర్మాభి[1]నిరతి.

48. వ. అని మఱియును.

49. క. విను గురుపూజనవిప్రా
ర్చనము లధికపుణ్యములు ధరావల్లభ వి
ప్రుని నిందించుటయును న.
గ్నని వేదము విడచుటయును గిల్బిషతమముల్.

---

2. దూఱునట్లు సేయుదుష్టాత్మునకు - ఆ. ఇ ఉ. ఏ. కొన్ని ప్రతులు.

45 1. పత్యశమము గల్గి - శ. ష. న. పెక్కు ప్రతులు.

46 1. గాతన యుండిట్లనియె - పెక్కు ప్రతులు.

47. 1 నిరతి - ఉ. ఔ ప. పీ. శ. న, రతిని - వా.

50. సీ. అనుటయు ధర్మనందనుఁడు దానంబుల
కెవ్వరు పాత్రంబు [1]తేర్పరింపు
మనిన సద్ధర్ములు నక్రోధనులు సత్య
రతులు దాంతులును ధీరత్వయుతులు
నిజకర్మనిరతులు విజితేంద్రియులు సర్వ
భూతహితులు నలబ్ధులును శుచులు
దానపాత్రములు వేదంబు సాంగంబుగాఁ
[2]జదివి షట్కర్మనిష్ఠలఁ [3]దొడంగి

తే. తత్త్వవిదు లైన బ్రాహ్మణోత్తముల కిగి
విను సహస్రగుణంబగు విశ్రుతత్వ
తంబుఁ బ్రజ్ఞయు శీలవృత్తములుఁ గలుగు
వారి కిచ్చుట వంశవిస్తారకంబు.

51. వ. అని నిర్దేశించి భీష్ముండు వెండియు.

52. ఆ. యోగ్యుఁ డైనవిప్రుఁడొకరుండు సంతృప్తిఁ
బొంద నధికతృప్తిఁ బొందు దేవ
వితతి మునిసమూహపితృసమాజములు న
ట్లగుట వెదకి తెచ్చునది విశిష్టు.

53. వ. అనిన విని కౌంతేయాగ్రజుం డతనితో దేవపితృమనుష్యపూ[1]జలకాలంబు
తెలియింగింపవే యనుటయు నతండు.

54. క. నృపవర పూర్వాహ్ణంబును
నపరాహ్ణము దేవపితృసమారాధనవి
ధ్యుపదిష్టకాలములు మ
ధ్యపుసమయము మానుషార్చనార్హం [1]బరయన్.

55. వ. అని చెప్పి మఱియు నట్లనియె.

---

50. 1. తెలుఁగ జెప్పు – పీ. శ ష. 2. జదివియుసత్కర్మనమితి దగిలి– క 3. జరించి– వ పీ; జరించు – శ. ష.

53. 1. జనకాలంబు – పెక్కు ప్రతులు.

54. 1. బెండున్ – కొన్ని ప్రతులు.

56. సీ. నరనాథ కాలహీనంబును నశుచిసం
స్పృష్టంబుఁ బరిభుక్తశేషమును న
మంత్రకంబును బీతతంత్రంబుఁ గీటకే
శప్రదుష్టంబు రాక్షసులు గొంద్రు
మాననీయద్రవ్యమేనియు సుర పితృ
క్రియల దురాత్మకు లయినవారు
గుడిచిన నట్ల యక్కుడుపులఁ జొనుపక
మత్తుని జడుని సున్మత్తుఁ బతితుఁ
తే. [1]క్లీబుఁ గుష్ఠి దేవలకుఁ జికిత్సకుని[2]ని
వీతనియము నపస్మారి శ్విత్రి రాజ
యక్ష్మయుతుని నర్తకుని గాయకుని సోమ
విక్రయుని వేదవిక్రయి విడువవలయు.

57. ఆ. వడ్డి కిచ్చి కుడుచువాఁడు ననగ్నియుఁ
[1]ప్రాణివిక్రయమున బ్రదుకు నతఁడు
దైవపిత్ర్యములకుఁ దగరు సంధ్యోపాస
నములు లేనివారు నరవరేణ్య.

58. వ. అనిన విని ధర్మనందనుండు శంతనునందనునితో దైవపిత్ర్యంబులగుదానంబులకు నుత్తమపాత్రంబు లెవ్వ రెఱింగింపవే యనియడుగుటయు నతం డతని కిట్లనియె.

-: *దైవపిత్ర్యంబు లగుదానంబులకుఁ బాత్రభూతుల నిరూపించుట* :-

సం. 18 - 24 - 40

59. సీ. భోజనార్థులఁ [1]దుష్టిఁ బొందించునతఁడును
దెరువాటువలనఁ దస్కరులచేతఁ

---

56. 1. గుష్ఠగ్లీబుని దేవలకుని చికిత్స కుని నపస్మారిఖలుగ్రత ఘ్నునినిరాజ - పి. శ. ష. న.
2 నశీకనియము - ఉ. ఖ.` ఈ పాఠమున యతి సమన్వయమగుట లేదు. మూలము నందు ఇట్లున్నది "చికిత్సకా దేవలకా వృథానియమధారిణః" 18 - 28 - 14. చిత్ర శాలాప్రతి.

57. 1. బాడి యమ్ముకొనుచు బ్రతుకు నతడు - క; బాడి విక్రయమున బ్రతుకునతడు - ఎ.

59. 1. దృప్తి బొందించునతఁడు - అ. ఈ. ఎ ఇ. గ.

ణే టొంది ధనము వాంఛించునతండు వ్ర
తంబున కుద్యాపనంబు సేయఁ
దలఁచి యర్థించునతండును గురుఁ దల్లి
దండ్రుల [2]సంక్లిష్టదారపుత్రు
లను బ్రోవఁ బడునతండును మహావ్యాధిని
రాసంబు సేయంగ నాసచేయు

తే. నతఁడు నిష్పాపుఁ డైనధరామరుండు
నెపుడు భిక్షయ బ్రదుకగునేని నట్టి
యతఁడు దైవపిత్ర్యములకు నతిశయంబు
గల్గు పాత్రంబులగుదురు కౌరవేంద్ర.

60. వ. అని చెప్పి మఱియు నిట్లనియె

61. సీ. సత్రంబు పాలయుఁ జలిపందిరియు రచ్చ
కొట్టము వ్రచ్చుట గురుజనముల
నిందించు టాగమనిందదదీయ వి
క్రయవిధి దద్విలేఖనము గొండి
యము సంధిభేదన మన్య కర్మోపజీ
వన మకృతజ్ఞత [1]పారదార
వృత్తిమంత్రసుశాస్త్రవిధ్వంసనము మద
లోల ననాథను బాల వృద్ధఁ

తే. దాపసిని భీతి వంచనఁ దలరఁ జేయు
టతిథిపుత్రభృత్యులకు నాహారకలన
మాచరింపక కుడుచుట యార్యకోటి
నిరయ హేతువులుగఁ జెప్పు నృపవరేణ్య.

62. సీ. విషశస్త్రకేశముల్ విక్రయించుట శస్త్ర
ములచేత కన్యాజనులను విప్ర

2 సంశ్లిష్ట - వ. 3. నాశంబు సేయంగ నాససేయు - ఱ (ఇచ్చట అఖండ యతి చూడవలెను); నిరూపంబు - వా. నిరాసంబు - అ ఇ. ఎ. ఏ. ఔ గ. ఙ. ట. వ శ ష.

61 1 పారదార - శ ష స కొన్ని. ప్రతులు; వానదార - వా. కొన్ని ప్రతులు.

తలిని గోగణమును దలిసి పోవుట యుపా
ధ్యాయు సతక్తికుం దైనభృత్యు
విడుపుమార్గముఁ గ్రంపనడిచి కొయ్యలుప్రాఁతి
చెఱుచుట నరకంబుసేయు నండ్రు
నేరమి లేఁయు నెప మిడి యర్థంబు
గొనురాజుఁ బ్రజరతు విసికి గలిగి
తే. యాచరింపనివిభుఁడును నప్పనంబు
పలుకుబడి దప్పి కొనియెడుపతియు గోవు
ముక్కుఁ [1]గుట్టెడువాఁడుఁ దన్మ్రమ్కఘాతి
యగునతండు నధోగతి కరుగువారు.

63. సీ. ధర్మంబు భయమున దారిద్ర్యసంబాధ
మున రోగమును బాపములఁ దొఱంగఁ
జేఁతకునైనఁ జేసిన దేవకార్యార్థ
పశుహింసనంబును బరమతపము
శుశ్రూషయును గల్గి శ్రుతము సంపాదించి
యప్రతిగ్రాహకుఁ డైన మద్య
మాంసపరస్త్రీసమాగమవైముఖ్య
మున నాశ్రమస్థులఁ దనకులంబు
తే. వారి భరియించినను హేమవస్త్రమంది
రాన్నపానంబు లొసంగిన నాశ్రయంబు
దీనులకు నిచ్చినను హింస మానినను స
మంచితస్వర్గలక్ష్మి సిద్ధించు నండ్రు.

64. సీ. రచ్చకొట్టంబు నారామంబుఁ గూపంబుఁ
బ్రపయుఁ గావించుట భయభరార్త
కోటి గాచుట కన్య గోవు వాహనము దా
సుని దాసి నిచ్చుట దనకుఁ గీడు
సేసిన సైఁచుట చెలులఁ జుట్టంబులఁ
బ్రోచుట పెక్కండ్ర [1]పొంచెఁ గార్య

---

62. 1. గట్టెడువాడు – వ
64 1. పొగుడు – పీ. న.

మునఁ బరాక్రమమున ధనమునఁ దా నల
జడిపాటు దుష్కర్మసరణిఁ బొరయ
ఆ. కునికి నాకలోకము నకు నిచ్చెన లగు
నెక్కుడమునఁ బుట్టిరేని బహుసు
తుండు నతకృపాన్వితుండు వేయునెలలపై
బ్రతికినతఁడుఁ గంద్రు త్రిదశపదము.

65. వ. అని నిర్దేశించి.

66. ఆ. నరకవాసకారణము నెఱింగించితిఁ
బుణ్యలోకహేతుభూతములును
దేటపడఁగఁ జెప్పితిని గురుసంతతి
శ్రేష్ఠ యింక నేమి సెప్పవలయు.

67. వ. అడుగు మనినం గాంగేయపూర్వజుండు శాంతనవుతో బ్రహ్మహత్యాస
మంబు లని కొందఱు గొన్నికర్మంబు లుగ్గడింతురు హింస లేకయు నట్ల
య్యెడునవి యెయ్యవి వాని నేర్పడ నెఱింగింపవే యనుటయు నతండతని
కిట్లనియె.

68. సీ. దివ్యలోకాధ్యు వేదవ్యాసముని[1]నాథు
నడిగితి నొక్కనాఁ డధికభక్తి
నిట్లని యాసంయమీంద్రుండు గృప నాకు
నెఱిఁగించె ననఘ నాయెఱిఁగినట్టి
విధము లెఱింగింతు వినుము విప్రునిఁ గృశు
నామంత్రితునిఁ జేసి యతఁడు గుడువ
వచ్చినఁ బెట్టమి వరకులంబును సార
విద్యయుఁ గలవిప్రువృత్తి గొనుట
తే. నీరు ద్రావంగ గోవు లేతేర విఘ్న
మాచరించుట బధిరపంగ్వంధధనము
లపహరించుట వేదశాస్త్రాదినింద
బ్రహ్మహత్య లెట్టట్టుల పౌరవేంద్ర.

69. తే. అలుకఁ బురి నూర వనమున నగ్ని యిడుట
పాపశీలతమై బొంకి బ్రాహ్మణునకు

68 1. వరు - కొన్ని ప్రతులు

నధికతర మగుశోకంబు [1] నావహించు
టంచితాచార బ్రహ్మహత్యాసమములు.

70. తే. రూపగుణశీలముల ననురూపుఁడైన
వరుని కీక కన్నియఁ దన[1]వలసినట్లు
తగనివానికి నిచ్చుట ధర్మదేవ
తాతనూభవ బహ్మహత్యాసమంబు.

-: భీష్ముఁడు ధర్మరాజునకుఁ బుణ్యతీర్థవిశేషంబుల నెఱింగించుట :-

సం. 19 - 26 - 1

71. వ. అనిన విని యజాతశత్రుండు గంగాపుత్త్రుతోఁ బుణ్యతీర్థవిశేషంబులు విన వలతుం జెప్పవే యనుటయు నమ్మహీపతికి నమ్మహాత్ముం డిట్లనియెఁ దొల్లి గౌతముం డడుగ [1]నంగిరసుండు దీర్థంబులు గొన్నింటిప్రకారంబు సెప్పె నప్పరిపాటి సెప్పెద నాకర్ణింపుము.

72. సీ. [1]సప్తదినంబులు చంద్రభాగను విత
స్తను నూర్మిమాలినిఁ దగ వసించి
యాహారవిరహితుం డై యుండ మునిసమా
నుం డగుఁ గాశ్మీరమండలమున
నదులు గొన్ని మహానదము సొచ్చి పాఱు ది
వంబు సిద్ధించుఁ దదంబుసేనఁ
బుష్కరమ్ముఁ బ్రభాసమును నైమిశము నింద్ర
మార్గంబు దేవికాస్వర్గబిందు

తే. లును సమవగాహనంబున జనుల నప్స
రస్సమేతవిమానవర్తనులఁ జేయు
నవనినాథ హిరణ్యబిందువుఁ గుశేశ
యంబు నెల్ల పాపంబుల నపనయించు

---

69. 1. నాచరించుట - అ ఏ; నాపహించుదంచితాచార - కొన్ని ప్రతులు
70 1. వలచినట్లు - కొన్ని ప్రతులు; తలచినట్లు - ౧,
71. 1. నంగీరసుండు - ల పెక్కుతాళపత్ర ప్రతులు కాని దీని సాధుత్వము విచార్యము.
72 1. ఈ పుణ్యతీర్థములను గూర్చి టంజావూరుప్రతి చిత్రశాలప్రతి, కుంభకోణప్రతి, వి. వి. యస్ శాస్త్రి ప్రతి వీనియందు పెక్కు భేదములు కన్పించుచున్నవి

73. వ. గంధమాదన [1]సంగత యైనయింద్రతోయయుం [2]గురంగదేశగత యగుకర తోయయుం ద్రిరాత్రోపవాసోపేతస్నాతకులకు నశ్వమేధఫలంబు గలుగం జేయు.

74. తే. కనఖలమున గంగాద్వారమునను నీల
భూధరమునఁ [1]గుశావర్తమునను బిల్వ
కమున సుస్నాతుఁడై పాతకములు దొఱఁగి
నాకలోకవిహారంబు నరుఁడు వొందు.

75 క. భాగీరథి యొచట నుర
గ్యాగమునకు శివుని నెలవుప్రాంతమునఁ జనున్
ధీగణ్యా యచట నెలకు స
మాగతు లగుసురలుఁ గంద్రనాహారవిధిన్

76. సీ. ఆహార ముడిగి [1]మహాశ్రమంబున నగ్ని
హోత్రియై యొకమాస ముండి నరుఁడు
సకలసిద్ధులు మహైశ్వర్యంబుగాఁ గను
జననాథ భృగుతుంగ మనుమహాహ్ర
దమ్మున వాసరత్రయ ముపవాసియై
బ్రహ్మవధంబు పాపంబుఁ దొఱఁగు
వినుము కన్యా[2]కూపమున [3]సాగ్నిహోత్రత
నున్నఁ గీర్తితుఁ డగు నుభయలోక

తే. ములను [4]సుందరికాహ్రదంబునను దగఁగ
సకృదుపస్పర్శనము చేసి చారుమూర్తి
యై జనించు వైమానిక మనఁగఁ బరఁగు
భవ్యతీర్థంబు సేవించి పడయు దివము.

77. తే. కృత్తికాంగారసంసేవ గిల్బిషములఁ
బాపి నాకంబుఁ జేర్చు విపాశఁ ద్రిదివ

---

73. 1. శైలసంకలితమైన - వ శ. ష. 2 కుళింద, కళింద కళింగ - అని పాఠములు.
74. 1. కుశాపర్వమునను - ఒ వ
76 1. బింబాశ్రమంబున - శ ష. స కొన్ని ప్రతులు. 2 కుబ్జమున - ఈ. ఊ ఒ ఓ. క. చ జ. వ శ. ష 3. నగ్నిహోత్రత - గ. ల. కొన్ని ప్రతులు 4 పుండరికాహ్రదంబున - వ

తే. నియతి నాచరితస్నానుఁ డయి విముక్తి
తెరువు గాంచు నైవస్వతతీర్థసేవఁ
దీర్ఘభూతత్వ మొందు విధేయచిత్త
వృత్తిఁ గౌరవవంశపవిత్రచరిత

83. ఆ. విను ప్రయాగమునకుఁ జనుదెంచు గోటిత్ర
యంబు దశసహస్రకంబుఁ దీర్థ
ములు నరేంద్రదర్శనమున నందునెలనాళ్లు
లున్ననరుఁడు ముక్తి కోడయఁ డంద్రు.

84. క. విను గంగను బ్రహ్మశిరం
బనుతీర్థమునందు నెల నిరాహారతమై
ననికిని మర్త్యుం డమృతాం
శుని[1]లోకంబున మహాయశుం డై యుండున్.

85. సీ. అనఘ యష్టావక్రమును [1]గలవింకము
దేవహ్రదము బ్రహ్మభావ మొసఁగు
నాచరితస్నానుఁ డగుమర్త్యునకు నుర్వ
యోగసిద్ధకీర్తి
యైన[2]తాహిత్యంబునందు సుస్నాతుఁడై
పుండరీకాధ్వరమున ఫలంబుఁ
బొందు రామహ్రదంబున నిరాహారుఁడై
పండ్రెండుదినములు భరితనియతి

తే. నున్న సకలకల్మషములు నుజ్జగించి
నరుఁడు నిరోభ్యజనత నెలనాళ్లు దా మ
హాహ్రదావాసియై జమదగ్ని గన్న
పుణ్యలోకంబుఁ గను మునిగణ్యుఁ డగుచు.

---

84. 1. లోకమునందు బొందు సుస్థిరయశుడై – ఖ జొ ఖ

85 1 కపోతంబును – శ ష పెక్కుప్రతులు 2. కార్తికేయంబునందు – అ. ఉ. ఎ. ఐ.
జొ ఖ; సాంభోజ్యంబునందు – ల.

86 క. విను వింధ్యంబున నొకనెల
తనుతాపము నోర్చి చేయుతపమున జనరం
జన సర్వప్రాయశ్చి
త్తనిరూఢిం బొంది నరుఁడు ధర్మజ్ఞుఁ డగున్.

87. సీ. నర్మద నాడి భూనాథనందనుఁడగు
జంబుమార్గంబున సంయతాత్ముఁ
డై మాసములు మూఁడు నట యొక్కనాఁడును
నిలిచిన సర్వసిద్ధులను బొందుఁ
గోకాముఖము నీరఁ గ్రుంకి తండులికా
శ్రమమునకుఁ జని వల్కలము ధరించి
శాకభోజనుఁ డయి శాంతిమై నున్నన
న్నెలవున నున్నకన్నెలు పదుండ్ర

తే. కథిపుఁ డై యజరామరుం డయి సుఖంచుఁ
గుల్యయందుఁ ద్రిరాత్రమ్ము గుడుపు దక్కి
శాచి యై యఘమర్షణజపము సేసి
యశ్వమేధఫలముఁ బొందు ననఘ నరుఁడు.

88. వ. ఆర్ష్టిసేనాశ్రమంబున నుజ్జానకస్నాతుండై మర్త్యుం డఖిలపాపంబులం దొలంగుఁ బిండారకంబున నేకరాత్రంబు నిలిచి యగ్నిష్టోమఫలంబుం బడయు ధర్మారణ్యంబున బ్రహ్మసరస్సు సేవించి పౌండరీకఫలప్రాప్తిఁ గాంచు.

89. చ. జనకుఁడు గౌరికిన్ వినుము శంకరుమామ హిమాద్రి సర్వర
త్ననికరవిశ్వపుణ్యభవనంబు ప్రశాంతత నందు నిల్చి స
న్మునిగణసేవనంబుఁ దపమున్ నడపంగ నరుండు సిద్ధుఁడై
వినుతికి నెక్కుఁ బొందు నరవిందభవాంతికవాససంపదన్.

90. క. విను తీర్థసేవ గామం
బును గ్రోధము మదము లోభమును జేరనినె
మ్మనము గలిగి నడప వలయు
ననఘా ఫలసిద్ధి దాన నగుఁ బురుషునకున్.

91\. క. [1]దమమును దపము నహింసయు
శమమును దీర్థముల వాన శౌచాతిశయం
బమలగుణ కల్గు రిత్తజ
లములం దోఁగిన శుచిత్వలాభము గలదే.

92\. క. దొరకొననివానిఁ గోరక
దొరకొనినందున మమత్వతుష్టహృదయతం
బొరయక విగతస్పృహు లగు
పురుషులు శుచు లెల తీర్థములు వారలకున్.

93\. ఆ. అరయ దుర్గమములు నతివిషమంబులు
నైనతీర్థములు ధరాధినాథ
యధికభక్తియుక్తి నాత్మఁ దలంచినఁ
జాలు నరులకల్మషములు వాయు

94\. క. జనవరతీర్థవిధానం
బన మగునీపుణ్యవాక్యచయము పవిత్రం
బనుపమము మాననీయం
బనిమిషపదవీప్రదము రహస్యము సుమ్మీ.

95\. క. అనుగతుఁ డగుశిష్యునకుం
దనసుతునకుఁ జుట్టమునకు ధరణీసురము
ఖ్యనియతి[1]పదద్విజాతుల
కను దగ నెఱిఁగించునది యకుంఠితకరుణన్.

96\. క. నరవర గౌతమునకు నం
గిరసుఁడు సెప్పినది యిది యకిల్బిషబుద్ధిం
బరిపాటిఁ బఠించినఁ ద
త్పరత వినిన నపుడ పాయుఁ బాపము లెల్లన్.

97\. క. మునులకు జప్యం బిది స
ద్వినుతముఁ బఠించు విమలాత్ములకున్

---

91 1. 91, 92 పద్యములు కొన్ని తాళపత్ర ప్రతులలో విడువబడినవి కాని వీనికి మూల మున్నది "కామంక్రోధంచ లోభంచ యోజిత్వా తీర్థమావసేత్ నతేన కించిన్న ప్రాప్తంతీర్థాభిగమనా ద్భవేత్''

95\. 1. వరద్విజాతులకును – కొన్నిప్రతులు

విను జాతిస్మరణముతో
జననం బతిపుణ్యపురుషసంతతిఁ గలుగున్.

-: అత్రిప్రముఖమహర్షులు శరతల్పగతుఁ డైనభీష్ముఁ జూడ వచ్చుట :-
సం 18 - 27 - 1

98. వ. అని చెప్పె నయ్యవసరంబునం బుణ్యవిశేషగణ్యుం డైనయగ్గాంగేయుం డట్లు గాండీవిశరంబులు శయ్యగా వీరశయనంబున నునికి నతని వీక్షింప నత్రియు వసిష్ఠుండును భృగుండును బులహుండును బులస్త్యుండును గ్రతువు నంగిరసుండును నగస్త్యుండును గణ్వుండును గౌతముండును విశ్వామిత్రుం డును జమదగ్నియు మొద లయినమహామునులు శిష్యవ్రాతంబుతో నేతెంచి తమ ప్రభావస్ఫురితప్రభాపూరంబు భూనభోంతరంబున సంతతంబు లగుచుండ నిలిచి యద్దేవవ్రతునియున్న తెఱంగు గలయం గనుంగొనిరి పాండవు లాశ్చర్య భరితచిత్తు లగుచు నత్తపోధనవర్యులం బ్రస్తుతించుచుం బ్రణమిల్లి రప్పు డప్ప రమసంయము లంతర్ధానంబుసేసి రక్కౌరవులు నక్కురుపితామహుండును దారును వారలమాహాత్మ్యంబు లుగ్గడించుచుఁ దద్విషయం బైనసంభాషణం బొనర్చిరి తదనంతరంబ.

99. తే. తాతపాదపద్మములు మస్తకము సోఁక
వినతుఁ డై ధర్మతనయుఁ డే జనపదంబు
లేనగంబు లేనదులు పుణ్యానుభావ
సమధికత్వంబు గలయవి జనవరేణ్య.

100. వ. అని యడుగుటయు.

-: భీష్ముఁడు ధర్మజునకు గంగాప్రభావంబు సెప్పుట :-
సం. 18-27-10

101. సీ. అతనికి నాతఁ డిట్లను నివ్విషయమునఁ
గల దితిహాస మొకండు దాని
వివరింతు నీకుంఛవృత్తిపరుం డగు
నొకవిప్రునింటికి నొక్క సిద్ధుఁ
డతిథి యై వచ్చిన నాతిథ్య మొకరించి

యతనితో సల్లాప మాచరింప
నమ్మహో[1]త్తమ్ముండు నీయడిగినయట్టుల
యాసిద్ధు నడిగిన నతఁడు సెప్పె

తే. యనఘ యెవ్వానినడుమ గా నరిగెఁ బావ
నాంబుపూర భాగీరథి యట్టిదేశ
భూధరాదిపదార్థముల్ పుణ్యతమము
లట్లు గాకయు గంగ[2]మహత్త్వ వినుము.

102. తే. త్రిపథగాసేవనమున సిద్ధించునట్టి
గతి జనములకు నియతకల్పితము లయ్యు
నధ్వరంబును బ్రహ్మచర్యంబుఁ దపము
సంపరిత్యాగమును జేయఁ జాల వనఘ.

108. క. మే నించుక సోఁకిన గం
గానదితోయములు జనులకల్మషకోటిం
బో నడిచి పురందరలో
కానందముఁ బొందఁ జేయు నాగమవేది.

104. క. మును పాపము లెన్ని యొన
ర్చినఁ బిదపను గంగ నాడఁ జీఁకటి రవి దోఁ
చిన విరియుగతి విరియు న
య్యనఘుఁ డిలాతలము [1]దొఱఁగి యమరత నొందున్.

105. తే. ఎన్ని యేఁడులు మనుజుని యెమ్ము గంగ
వారియం దుండు నన్ని వేల్వత్సరములు
నాకలోకమహాసుఖశ్రీకి నాత
[1]డుక్కుఁడై యుండు నిర్మలచిత్తవృత్తి.

108. సీ. అనఘ సోమము లేనియధ్వరంబును శశి
లేనిరాత్రియు రవి లేనినభము

101. 1 ద్విజుఁడుని - పెక్కుప్రతులు. 2 మహత్తు - కొన్నిప్రతులు.

104. 1. విడిచి - పెక్కుప్రతులు

105 1. తుక్కుడెయుంతు - ఆ ఉ ఎ. ఏ ఐ ఓ. క ఖ ల. స; దత్తియుందును - చ. వ వీ. ష. స; దుత్తుడె యుందును - వా

నాత్మధర్మము లేనియాశ్రమంబును బుష్ప
సంపద లేని భూజమును బోలె
హీనత నొందు గంగానది లేనిదే
శంబు చాంద్రాయణశతము లైన
గంగాపయఃపానకరణంబు గావించు
నిర్మలత్వముఁ జేయనేర దగ్ని

ఆ. యందుఁ బడినదూది యట్లగు గంగావ
గాహనమునఁ బాతకంబు లఖిల
భూతములకు దుఃఖములు[1] వాపికొనుటకు
నేవిధములు గంగ కీడు గావు.

107. క. శరణంబు లేనిజనులకుఁ
బరమశరణ మండ్రు మునులు భాగీరథి ని
ర్జరులకు నమృతము పట్టుల
నరులకు గంగాజలం బనఁగ నే వింటన్.

108. క. తలపై జాహ్నవివాలుక
యలఁదికొనిన ఫాలతటిఁ దమంతర్మృత్స్నం
గలితముఁ జేసినఁ బాపం
బులు దొలఁగు సుపర్ణుఁ గనినభుజగములక్రియన్.

109. క. గంగాతరంగశీకర
సంగత మగుమారుతమున నద్యస్పర్శం
బంగీకరించు నెవ్వఁడు
భంగించు నతఁడు ఘోరపాపచయంబున్.

110. తే. ఆవుల నేడుదరంబుల నవుల నేడు
దరములను బిత్రువర్గంబు నగుఁడు గంగ
నాడి శుచిఁ జేయుఁ జూచిన యంతమాత్రఁ
జాచు వాఙ్మనఃకాయజపాపతతుల

111. తే. వినిన వేడుక నేసినఁ గనినఁ జేత
నంటినను రెండుకులములయందుఁ గలుగు

---

106 1 లదాపికొనుట, లటారికొనుట - అని పాఠములు.

పితృగణంబుల నెల్ల సద్గతికిఁ బుచ్చు
గంగ యెట్టు సేయునో యవగాహనమున.

112. క. విను గంగ గంగ యను కీ
ర్తనములతో నొండునీటఁ దగ మునిఁగినయ
జ్జనులు దురితములఁ దొలఁగుదు
రని యార్యులు సెప్ప విందు నంచితచరితా.

113. సీ. అనఘ చూడ సమర్థుఁ డగువాఁడు జాహ్నవిఁ
జూడకయున్నఁ బటుప్రతిముఁడు
నంధసమానుండు నగు నింద్రుఁ డాదిగా
సురలు గోరెడుగంగ నరుల గోర
వలదె చేకుఱునపవర్గ ముత్క్రమణకా
లంబున గంగఁ దలంచి రేని
రాజభయంబుఁ జోరభయంబుఁ బాపభ
యంబును భూతభయంబు లోను

ఆ. గాఁగఁ గలుగు భయనికాయంబు గంగాప్ర
శంసనమునఁ బాయు శంభుఁ డర్థి
నతులపుణ్య యైనయద్దేవి దివినుండి
రా ధరింపఁడే శిరస్స్థలమున.

114. తే. మూఁడుపథములఁ జని లోకములకు మూఁటి
నుజ్జ్వలాలంకృతియుఁ బెంపు నొసఁగినట్టి
యమలతరమూర్తి యగుదేవి నాశ్రయించు
వాఁడు కృతకృత్యుఁ డిది నిక్కువము [1]కృతాత్మ.

115. క. జనులకు నింద్రుఁడు గ్రహముల
కినుఁడును [1]దారలకు నోషధీశుఁడపోలెన్
మనుజోత్తమ కడు నెక్కుడు
వినుము నదులకెల్ల జాహ్నవి మహత్త్వమునన్.

---

114. 1. మహాత్మ - పెక్కుప్రతులు

115. 1. దారలకు నోష - పీ శ ష. పెక్కుప్రతులు; బితరులకు నోష - వా. పీ.

116. ఆ. సగరనృపతిపుత్త్రిచయము మునీంద్రశా
పమున భస్మమై యపారదురిత
[1]కల్మషంబుఁ బొందఁగా గంగ నిజజల
సేక మొసఁగి యనిచె నాకమునకు.

117. ఆ. దేవతలఁ జిత్రతపమునఁ దెలిచి గంగఁ
బ్రచురపౌరుషుఁ డగుభగీరథుఁడు దనదు
పూర్వులైన సగరనృపపుత్త్రులకు ను
దాత్తగతికయి తెచ్చె సిద్ధగణి కనఘ.

118. ఆ. విష్ణుపదమువలన విధునివలన సూర్యు
వలన మేరురూపకలితుఁడైన
విష్ణువలనఁ ద్రిపురవిజయిమౌళివలన
నుండి హిమనగమున నొలసె గంగ.

119. క. విను తత్ప్రభావంబున
[1]మనంబు నిశ్చలత వొంద మనుజుఁడు శరణం
బని యాశ్రయింప జాహ్నవి
సనాతనసదోపలబ్ధిసంపద నొసఁగున్.

120. వ. అని చెప్పి సిద్ధుండు వెండియు.

121. క. ఏ నెఱిఁగినంత సెప్పితిఁ
గాని [1]యనంతమహిమంబు గంగాగుణసం
తానంబు శతానందను
ఖానిమిషప్రవరకీర్త్య మనఘచరిత్రా.

122. క. మేరువుమణులును వారిధి
వారి కణంబులును నెన్న వశ వగు గంగా
స్ఫారగుణంబులు తగుసం
ఖ్యారూఢంబులుగఁ జేఁత [1]యతులవివేకా.

---

116. 1. కశ్మలంబు - కొన్నిప్రతులు
119. 1 మనమున - కొన్నిప్రతులు.
121. 1. యమేయంపుమహిమ - పీ. త. ష.
122. 1 యలవడదనఘా - అ ఈ.

123 వ. అని పలికి యిట్లనియె.

124. ఆ. వేడ్క నీకు నేను వివరించినట్టియా
జాహ్నవీగుణములు సంతతంబు
మనసు వాక్కుఁ దనువు ననఁ గలసాధన
ముల భజింపు భక్తిపూర్వకముగ.

125. తే. అట్టులైన గంగాప్రసాదాతిశయము
వలన సిద్ధుండ వై త్రిభువనములందు
నర్చనీయసంక్రీడ[1]న మవిహతముగ
సంచరించు మా[2]హాత్మ్యంబు సంభవించు.

126. క నిజధర్మనిరతుఁ డై తను
భజించుసజ్జనునిచిత్తపద్మము గృపఁ దా
భజియింప గంగ యతనిం
బ్రజనితచిరసౌఖ్యుఁ జేయుఁ బావనచరితా.

127. వ. అని యిట్లు గంగాగుణంబు లమ్మహాద్విజునకు వివరించి యాసిద్ధుండు గగన
గమనంబునం జనియె నవ్విప్రోత్తముండు నియతచిత్తుం డై గంగాసేవనం
బాచరించి యనన్య[1]సులభ యగుసిద్ధిం బడసెఁ బాండవాగ్రజా నీవును గంగా
భజనంబునం బరమశుభంబు నొందుము.

128. క. అని చెప్పి శాంతనవుఁ డి
ట్లను గంగాస్తోత్రసహిత మై పరఁగినయి
వ్వినుతేతిహాసముఁ బఠిం
చిన వినినను రుజలు వాయుఁ [1]జెంద వఘంబుల్

129. క. అనిన విని యన్నరేంద్రుం
డనుజనసహితముగఁ బ్రభూతహర్షసమన్వి
లనకలనా[1]సంసేవిత
మనస్కుఁ డై యాతనికి నమస్కృతి సేసెన్

125. 1. నమసహితముగ – ఉ. ఏ వ. శ. ష. 2. హత్త్వంబు – ఈ ఓ వ.
127. 1. సులభంబగు అ. ఈ ఎ.
128. 1. జెందు శుభంబుల్ – వీ శ. ష కొన్నిప్రతులు
129 1 సంసేవిత – ఉ. వ

180. వ. ఇట్లు పరమహర్షంబునం బ్రణతుండై ధర్మజుండు మందాకినీతనయుతో
నెవ్వఁడు సర్వజనపూజ్యుఁ డెఱింగింపవే భవద్వచనామృతంబునం దృప్తిసనక
యడిగెద ననిన నమ్మహాత్ముండు వాసుదేవనారదసంవాదం [1]బనునితిహాసంబు
వినుము నీయడిగినయర్థంబు దానం దేటపడియెడు ననిపలికి యతనికిట్లనియె.

-. *వాసుదేవ నారద సంవాదప్రకారము :-*

సం. 13 _ 03 _ 1 కుంభ

181. క. తనకడకు నారదుఁడువ
చ్చిన సత్కారము దగంగఁ జేసి ముకుందుం
డును సమధికబహుమానం
బున నెవ్వారలకు నీవు మ్రొక్కుదు చెపుమా.

182. వ. అనిన నద్దేవముని యద్దేవకీనందనున కిట్లనియె.

183. సీ. వరుణు సమీరణుఁ దరణిఁ బర్జన్యుని
సప్తార్చి నీశాను షణ్ముఖుని మ
హాలక్ష్మి విష్ణుని నజు బృహస్పతిఁ జంద్రు
జలములఁ భూమి నెజ్జనము లెపుడు
నతిభక్తి సేవింతు రట్టివారలకు నే
మ్రొక్కుదు వేదపరులఁ దపోధ
నులు దేవతాపూజనులు భూమిధనధాన్య
గోదానశీలురు నాదరంబు

ఆ. గల్గి యతిథిపూజ గావించువారలఁ
బితృసమర్చకులను భిక్షితాన్న
పూతశాంతభావములు గలవారు స
త్యవ్రతులను బూజ్యు లనఘ నాకు.

184. క. వినుత త్రివర్గనిరతులు
ననహంకారమమకారు లగుజనులు సువ
ర్తన[1]యుతులు నశోలురు బో
ధనులు నమస్కార్యు లరిధర విను నాకున్.

---

180 1. బగు నితిహాసంబు - కొన్నిప్రతులు.

184. 1. నియతులును నశోలురు ననసూయులు వందనీయులగుదురు (నాకున్) పీ.శ.ష.న.

135. క. నీవును మత్సంపూజ్యుజ
నావలిఁ జిత్తమున నెఱిఁగి యర్చనమును సం
సేవనము నడువ భూరిశు
భావహ మగు నవ్విధము యాపదసింహా.

136. వ. అనియెం గావునఁ గుంతీ
తనయాగ్రజ నీవు నివ్విధము[1]ల జనములం
గొనియాడుము వారలు శో
భనము లొసంగుదు రఘంబుఁ బాపుదురు కృపన్.

137. వ. అనిన విని యమ్మహీశ్వరుం డమ్మహాత్మున కిట్లనియె.

138. క. జనపతులకుఁ గర్తవ్యము
లనేకములు గలవు వానియన్నిటిలోనన్
వినుతప్రధానకృత్యం
బనఘచరిత చెప్పవే దయం దెలియంగన్.

139. క. అనుటయు నతనికి నతఁ డి
ట్లను సామ్రాజ్యాభిషిక్తుఁ డై న నృపతికిన్
విను కర్తవ్యతమం బగు
పని బ్రాహ్మణపూజనంబు భవ్యవిచారా.

140. క. భూనాథ విప్రులు సమా
ధానంబున నున్నఁ బొదలు ధరణి శుభముల్
మానస్థు లగుట వారికి
మానన లేకున్న న[1]డఁగు మనుజాధీశా.

141. క. దైవంబు నదైవముఁగ న
దైవము దైవముగఁ జేయ ధరణీదివిజుల్
భూవర శక్తులు విను వా
రేవానికిఁ గూర్తు రతఁ డధికత నొందున్.

---

136 1. జనుల దగం - కొన్ని ప్రతులు

140. 1. నలుకమనుజా - శ. ష.

142. క. కోపమునఁ బ్రసాదంబున
¹నాపదయును సంపదయును నప్పుడ తే వా
రోపుదు రింద్రున కైనను
శాపానుగ్రహము లాసుచరితులలీలన్

143. క. ద్రవిడ కళింగ గాళీనర
యవన శక పుళింద నృపతు లవనిసురపరా
భవమునఁ గాదే ధరణీ
ధవ పొందిరి తొల్లి శూద్రతాదైన్యంబున్.

144. క. సోమాత్మకు లీశ్వరతా
శ్రీమహితులు సర్వసౌఖ్య¹సిద్ధికరులు గో
త్రామరులు వారి నెప్పుడు
భూమీశ్వర పూజనములఁ ²బోషింపు తగన్.

145. క. వినుశాచారుం డగువి
ప్రునకు సభక్తికము గాఁగ భోజన మిడినన్
విను దేవపితృసమూహము
లనూనపరితృప్తిఁ బొందు ¹నతులచరిత్రా.

-: వాసుదేవ నారద సంవాదప్రకారము :-

సం. 13 - 66 - 1 (కుంభ)

146. వ. అని చెప్పి భీష్ముం డాభూపతితోఁ వెండియు నిట్లను భూసురవిషయం బై
వాసుదేవునకుం బృథివికి సంవాదంబు గలిగె నది యితిహాసరూపంబునఁ
జెల్లు దానిఁ జెప్పెద నాకర్ణింపుము వాసుదేవుం డొక్కసమయంబునం
బృథ్వి నాలోకించి.

147 క. లోకజనని వగుటన్ నిను
నోకాశ్యపి యడుగవలయు నొక్కటి తెలియన్

---

142. 1. నాపత్సంపదలు రెండునప్పుడ – పీ. శ. ష

144. 1. సిద్ధి.రులు - వా 2. లొందింపు తగన్ – కొన్నిప్రతులు.

145. 1. నమలవివేకా - వ.

నాకుం జెపునూ పాపము
లేకృత్యము సేసి గెలుతు రెల్లజనములున్.

148. ఆ. అనినఁ బృథివి యిట్టు లను విప్రసేవను
విప్రపూజనమున విప్రహితవి
ధానమునను శాశతి నోర్చు మానవ
ప్రతతి యెందు నివి నృపాలుపనులు

149. ఆ అమరవిభుని భగసహస్రచిహ్నునిఁగాఁగఁ
జేసినదియు నేత్రభాసురుండు
గా నొనర్చినదియుఁ గమలాక్ష విప్రున
ల్కయుఁ బ్రసాదసంపదయును గావె

150. క. అనిన విని మెచ్చి పృథివిం
గొనియాడె రథాంగపాణి గురునృపవర నీ
వనిశంబు మిగుల నతిమ
న్ననలను విప్రులకుఁ బ్రియ మొనర్పుము కృపతోన్.

151. క. అని మఱియు శాంతనవుఁ డి
ట్లను జననంబునన విప్రు నధిప మహాభా
గునిఁ గాఁ జెప్పుదు రార్యులు
జనులకు వంద్యంబు లతనిచరణాంబుజముల్.

152. వ. బ్రాహ్మణుల సృజియించి బ్రహ్మ వారలతోఁ జెప్పినవిధం బాకర్ణింపుము.

153. ఆ. అనయ మీకుఁ గృత్య మన్యంబు లే దాత్మ
కర్మ మూఁది [1]యుక్తధర్మనిరతి
బ్రహ్మగోపనంబుఁ బాటింపుఁ డవ్విధ
మధికశోభనంబు నావహించు

154. వ. బ్రాహ్మణ్యం బెల్ల [1]వర్ణంబులకుఁ[2] దారకంబు బ్రాహ్మణయైనశ్రీఁ దపస్స్వా ధ్యాయంబుల వెలుఁగం జేయుం డనియె నట్లు గావున రాజులకు బ్రహ్మ వచనపరిపాలనంబు ప్రధానకర్తవ్యంబని చెప్పి వెండియు.

---

153. 1. నిత్యధర్మనిరతి - ఆ క వ.

154. 1. బ్రహ్మంబులకు - న. 2. కునుర్తారకంబు - కొన్ని ప్రతులు.

55. ఆ. అగ్ని నంట హిమవదచలంబుఁ గదలుప
గంగఁ గట్ట నచ్చుఁ గాని విప్ర
రాజిఁ బరభవింప రాదు విప్రులకొల్వు
కల్పవృక్షసేవకరణి యధిప.

56. వ. ఏతద్విషయం బైన నది శక్రశంబరసంవాదం బను నితిహాసంబు గలదు వినుము శక్రుండు జటాసునందనుం డై శంబరు కడకుం బోయి తదీయగోష్ఠి నుండి యతనితో నీ వేమిట నున్నతిం బొంది యుండు దనిన నతం డతని కిట్లనియె.

157. క. అలుకయు నసూయయును వి
ప్రులయెడ[1]లే వనఘ వారిఁ బ్రోతుం గాతున్
సొలయఁ దదీయారాధన
ముల కట్టులు గావునన్ విభూతి వహింతున్

158. వ. దేవాసురయుద్ధ బున విప్రానుగ్రహంబు దేవతల గెలిపించుట గని మజ్జనకుండు సోమునితో భూమిసురులు మహానుభావులు గదే యనుటయు నమ్మహితాత్ముం డతని కిట్లను వారలు తపస్స్వాధ్యాయసిద్ధులై యుండుదురు వారి తెఱం గాకర్ణింపుము

159. ఆ. అస్త్రవాసి యైనయవనీసురుని యుద్ధ
శాలి గాని ధరణిపాలు నురగ
ముల బిలాంధకారమున నడంచినయట్లు
మెఱయ నీక భూమి మ్రింగు నండ్రు.

160. క. దాని నెఱింగి స్పృహ బున
మానిత మగుచదువునందు మనసు గొలుప కెం
దేనిఁ జని చదువుదురు శ్రుతు
లా[1]నంత్యమునకుఁ దపస్సు లగుదురు విప్రుల్.

161. వ. కావున వారలు సర్వాధికులు వారలయెడ బహుమానావమానంబు లెట్టి వారికి శుభాశుభంబుల నొందించుటకు నగదియంబు[1]లే దనిన సోమునివాక్యం

---

157. 1 లేదనఘ _ కొన్ని ప్రతులు
160 1. నందంబున - పీ శ. ష
161 1 వలవదనిన _ ఒ.

బులు[2] వాటించి మజ్జనకుండు విప్రజనంబులం బూజించి [3]తేజిష్ఠుం డయ్యె నేనుం దనాచారంబునం బెంపు వడసితి నని పలుకటయు నయ్యసురేంద్రుని వచనంబులాఁది సురేంద్రుండు [4]భూసురులకుం బరితోషంబుగావించి సవిశేషసమున్నతిం బొందె నని చెప్పిన విని గాంగేయునితోఁ గౌంతేయాగ్రజుం డపూర్వచిరసమాశ్రితదూరాగతులలోన నధికతమం బగుపాత్రం బెవ్వరని యడిగిన నప్పుడమితేనికి నప్పురుషవరుం డిట్లనియె.

162. క. చెలులుం [1]జుట్టలు సంబం
ధులు ఋత్విజులును బురోహితులుఁ దగుపాత్రం
బులు హింసాక్రోధేర్ష్యా
దులు లేనిజనంబు లైన దురితవిదూరా.

163. క. దూరాగతులు నపూర్వులుఁ
గౌరవకులముఖ్య పూజఁ గనుటకు నర్హుల్
సారాచారము విద్యా
గౌరవముం గలుగఁ [1]జూపు కరణీయ మగున్.

164. క. ఈమూఁడు తెఱంగులజను
[1]లామెయిఁ జూచినను నశుచు లైనను బాత్ర
శ్రీమహితుల నిజభృత్య
స్తోమము జీవనము నడపి చుమ్మీ యాగుల్.

165. క. అనిన విని ధర్మసుతుఁ డి
ట్లను శంతనుసుతునితోడ నఘకోటికి నె
ల్లను మూలము వనితల య
జ్ఞనము లతెఱఁ గెఱుఁగఁ జెప్పు చాతుర్యనిధీ.

---

2 లాదరించి _ ఒ. క 3 తేజస్వియయ్యె - అ ఈ, తేజ స్కుండు _ ఒ. క వ. 4 భూసురేంద్రులకు - కొన్నిప్రతులు; భూసురులకుం _ పీ, శ ష; భూవరులకుం _ వా.

162. 1. జుట్టంబులు విందులు _ ఉ ఎ ఔ. ఖ.

163. 1. పూజకర - ఐ ఒ. క. ఖ వ

164 1. లెమెయి జూచినను నశుచులేనియు_శ. ష.

నారదపంచచూడాసంవాదం బనునితిహాసము

సం 13 - 38 - 1.

166. వ. అనుటయు నతం డతని కిట్లనియె వనితల నీచెప్పినట్టివార దీనికి నారదపంచచూడాసంవాదం బనం బరఁగు నితిహాసంబు గలదు వనితాస్వభావవిషయం బయి యుండు దాని నాకర్ణింపుము దేవమునివరుం డగు నారదుం డొకనాఁడు చరించుచుండి పంచచూడ యను నచ్చరలేమ నొక్కెడం గాంచి.

167. క. ఏ నొక్కటి యడిగెదఁ జెపు
మా నళినదళాక్షి యనుడు మాకొలఁదులప
లై క్కన సదుత్తర మిచ్చెద
నానతి యి మ్మనియె నది ప్రియం [1]బెసఁగంగన్.

168. వ. [1]అనుటయు నతండు.

169. క. వనితాస్వభావ మిట్టిది
యని తెలియం జెప్పు మనుడు నల్లనగుచు న
వ్వనిత తగునయ్య వనితకు
వనితలదుశ్చేష్టితములు వాక్రువ్వంగన్.

170. క. అనిన విని నిక్క మాడిన
విను తప్పించుకయు లేదు వివరింపు నిజం
బని ముని పల్కిన నయ్యం
గన యతనికి నిట్లు లనియెఁ గౌరవముఖ్యా.

171 వ. స్త్రీస్వభావంబులు నీ వెఱుంగనియవి లేవైనను జెప్పెద నవధరింపుము

172. క కులమును సమ్మాన్యతయును
గలిగి యెయోనిభార్య లై సగౌరవలీలన్
మెలఁగుచు వెలిఁ జరియించు
న లన వలసినట్ల యే మనం గల దనఘా.

---

167 1 బెసలారన్ - కొన్ని ప్రతులు

168. 1. అనుటయు నారదమహాముని యిట్లనియె - త. ష; అనుటయు నతండు - పెక్కు ప్రతులు, అనుటయు - వా. పి.

173. వ. అని పల్కి వెండియు

174. సీ. యోషిజ్జనంబులు దోషంబులకు నెల్ల
మూలంబు వారల నేల చెప్ప
నడిగితి గానఁ గన్నంత సెప్పెద విను
పురుషులమేలిమి పోలఁతు లెఱుఁగ
రది గాక నిర్లజ్జలై కుత్సితుల భజి
యింతురు కదిసినయంతఁ జేసి
వర్జనీయులు లేరు వారల కెవ్వరు
దండభీతిన పాడి దప్పకునికి

ఆ. యగ్ని కాష్ఠముల మహాంబుధి యేఱుల
నంతకుండు భూతసంతతులను
వనజముఖులు పురుషులను దృప్తిఁ బొందుట
గలుగ దండ్రు కోవిదులు మునీంద్ర.

175. క. కల దొకరహస్య[1]గోపన
మలఘుమతీ వినుము పురుషు నన్యుం గనినం
బోలఁతులకు నేమి సెప్పుదుఁ
గలుగుఁ బదనుతోడికళలు గానుగృహమునన్

176. వ. అని వెండియు

177. క. కడుచుట కట్టుట పూయుట
తొడుగుటయును వివిధధనతతులు గూడుట యె
క్కుడు వేడ్క సేయఁ జాలవు
పడఁతికి బరపురుషుఁ గవయఁ జాలుటవోలెన్.

178. వ. అని చెప్పిన విని నారదుండు నిజంబు పల్కి తని పంచచూడ ననిపి నిజేచ్ఛం జనియె నని చెప్పిన విని ధర్మజుండు సుందరీజనంబులఁ గాచు తెఱం గెఱిం గింపవే యని యడిగిన నాపగాతనూజుం డతని కిట్లను వారు మయశంబరాది రాక్షసులమాయలం గడచినమతకంబులు గలిగి నిరూపింప రాక యుండుదు రదియునుంగాక వేఱొక్కవిశేషం బాకర్ణింపుము.

---

175. 1. దోషమమల – కొన్నిప్రతులు.

179. తే. తొల్లి నిర్దోషచిత్తత నెల్లజనులు
[1]వలచినప్పుడ దేవత్వమై భవంబు
నొందఁ జాలి యుండుదురు మాయోపయుక్తి
వనితలకు లేక సాధ్వులై యునికిఁ జేసి.

180. వ. దానికి దివిజు లసూయాగ్రస్తులై కమలయోనిం గానం జని నిజచిత్తప్రకా
రం బెఱింగించిన నతం డతివల మాయావతులం గావించి వారికిఁ గామం
బగ్గలంబుగాఁ జేసినం బురుషులు వారిచిక్కులం బడి రోషాదిదుర్గుణదూషితు
లగుటం జేసి విగతానుభావులై రి దేవతలును బ్రియం బంది రట్లు గావున.

181. క. వనితలు మాయావిను లై
యనిరూపితచిత్తవృత్తి నంచితరతిం
బనుపడ కుండదు రైనను
వినినది కథ యొకటి నీకు [1]వినిపింతుఁ దగన్.

## దేవశర్మ యనుమునివరుభార్య రుచియనుదానిచరిత్రము

సం. 13 - 40 - 1.

182. వ. దేవశర్మ యనుమునిభార్య రుచి యనునంగన సర్వాంగసుందరియై యుండుఁ
దదీయరూపాతిశయంబు దేవగంధర్వాదులకు[1]ను లోచనీయంబు.

183. క. అతఁ డొకనాఁ డొకయెడ కొక
క్రతువున కుపదర్శనంబు గావింపఁగఁ బో
వుతలంపు పుట్టి వికస
న్మతి యగుతనశిష్యు విపులనామకునిఁ దగన్.

184. వ. పిలిచి యేకాంతంబున నతని కిట్లనియె.

185 క. రుచి నెపుడు నేచిటియగును
శచీవిభుఁడు దాని నెఱిఁగి సంరతుఁడా మే

179. 1, వలసినప్పుడ - కొన్నిప్రతులు
181. 1, వినుపింతు - పెక్కుప్రతులు
182. 1, ననుభావనీయంబు - కొన్నిప్రతులు.

సుళితంబుగ నొనరింతు వి
కచకమలనిభాస్యఁ జేరఁ [1]గానఁ డతండున్.

186. తే. నాకుఁ గ్రతువు సేయింపఁ జనంగ వలసి
యున్నయది పర[1]దారసముత్సుకుండు
శక్రుఁ డటు గాన రుచికి రక్షావిధాన
మాచరింపుము నీవు దృఢావధాన

187. క. అనిన విని యట్లు సేసెద
నని విపులుఁడు గురునితోడ నమరవిభుం డే
యనువునఁ జొచ్చునొకో పర
వనితాహరణమున కనియె వసుధాధీశా.

188. క. అనుటయు ననేకమాయలు
వొనరుపఁగా నేర్చు రూపములు పెక్కులు గై
కొనుఁ బక్షిమృగాదిత్వము
లొనరఁగ నవి నియతి నరసి యుండఁగ వలయున్.

189. క. రుచిమీఁదం గన్నిడి యా
శచీవిభుఁడు దిరుగు విను మసంశయము సుమీ
యిచటికి నాతఁడు వచ్చుట
యచలిత[1]మతి నమ్మృగాక్షి నరయఁగ వలయున్.

190. క. అని యప్పగించి యాగం
బున కమ్ముని సనియె నవ్విపులుఁడును జిత్తం
బున నవధానము దృఢముగ
వనితం గానికొని యుండె వసుధాధీశా.

191 వ. అట్లుండి యెక్క[1]యనువు విచారించుకొని.

---

185. 1 గాసంతతరున్ - శ. ష కొన్నిప్రతులు
186 1. దారాసముత్సుకుండు - ఇ. బి క. వ శ వ.
(దారాసంగ్రహంబుధరణీశరతిపుత్ర) నన్నయ - సభాపర్వము.
189. 1. మతి వైమృగాక్షి, - ఒ. క. వ
191. 1. వెరవు, తెరగు - అనిపాఠములు

192. క. ఆవేశించెద యోగ
ప్రావీణ్యంబున మునీంద్రుభార్యం దప్పే
యావిప్రుతాత్మమనమున
కీవిజ్ఞానంబు దోఁచు నేవెఱ పేలా.

193. వ. అని వితర్కించి యమ్మునిచాతుర్యకారుణ్యంబు లూఁది శంక దక్కి యక్కొమ్మ కింత నంత నాసీనుండై యుచితకథ లొక్కింతసేపు సల్లించి యోగమాయాబలంబునం జేసి నడపుటయు.

194. ఆ. పవనుఁ డాకసమునఁ బరఁగువిధంబున
నమ్మృగాక్షితనువునందుఁ గలయ
విపులునాత్మ దగఁ బ్రవేశించె నవ్వధూ
రత్నమునకు నెఱుఁగ రాకయుండ.

195. వ. ఇట్లు ప్రవేశించి యయ్యోగివరునాత్మ యన్నాతిచైతన్యంబు జడంబుగాఁ జేసికొని యుండె నట్టియెడఁ బురందరుం డతిసుందరం బగునాకారంబు దాల్చి యచ్చటికి వచ్చి విపులునిశరీరంబు సూచి నిద్రితునింగాఁ దలచుచు నున్మదుం డగుటం జేసి యొండు పరికింపక మునిపత్నిం జేర వచ్చి.

196. క. నీవు కతంబుగ నా దగు
భావంబును భావభవుఁడు వఱచుట యరయం
గావలదే యని పలికిన
భూవర యప్పొలఁతి మూఢబుద్ధిత్వమునన్.

197. క. సముచితముగఁ బ్రత్యుత్థా
నము సేయను దగినపలుకునకుఁ దొరఁగను నే
రమి నూర కున్ననుం దమ
కము పెంపున నతఁడు మఱియుఁ గమలాననతోన్.

198. క. ఏ నమరేంద్రుఁడ నాదగు
మానముఁ [1]గామశిఖ గ్రాఁచె మానిని దడయం
గా నేల నన్నుఁ దగ స
మ్మానింపుము నీకు సిగ్గుమాలిం కేలా.

---

198. 1. గామాగ్ని గ్రాచె – ఆ ఉ ఎ ఐ ఔ ఖ.

199\. వ. అనుటయు నత్తన్వితనువున నున్న విపులుండు దనయోగమాయం జేసి యవ్వనిత వాసవునితో నీకు నిందు రాఁ బని యేమి యని పలికి పరవశ యగునట్లుగాఁ జేసినం జూచి యతండు వ్రీడాభయభరితచిత్తుం డయ్యె నయ్యవసరంబున.

200\. ఉ. అమ్మునిశిష్యుఁ డయ్యువిదయంగము వాసి నిజాంగవర్తియై
యమ్మరుదీశుతో మఱచి తా మును మూఁడినయబ్జగాంకిత
త్వ మ్మొక్కభంగి నీఁగు టిది దైవతసంయమిసేవనీయభా
వమ్మె గలట్టినీకుఁ దగవా యిసి[1]రో యని పల్కె వెండియున్.

201\. తే. అవిజితేంద్రియబల కుత్సితాత్మ నీచ
యెట్లు పాపంబు దొడరుట కియ్యకొంటి
నాదుగురునికోపాగ్నిచే నీదుదేవ
గణవిభుత్వమహోన్నతి గ్రాఁగిపోదె.

202\. వ. అనిన విని దివ్యబోధంబున విపులునియోగబలంబు తెఱం గెఱింగి వెలవెలం బాఱునబ్బలవైరి నాలోకించి యత్తపోధ[1]నుండు.

203 క. ఏ నొల్లఁ గాక భస్మము
గా నిన్నుం జూతునే వికారీ యనుడుం
దా నెదురుపలుక కంత
ర్ధానము వెసఁ జేసె నతఁడు ధరణీనాథా.

204\. వ. తదనంతరంబ విపులుండు రుచిం బ్రబుద్ధం జేసెఁ బదంపడి దేవశర్మ వచ్చిన నాశిష్యోత్తముండు వినయాచారంబు నడిపి యేకాంతంబున నమ్మునితోడ.

205\. తే. నాకపతి యిచ్చటికి వచ్చి నాకతమునఁ
జిక్కువడి మది భయమును సిగ్గు గదురఁ
జనియె ననవుడు నాతఁడు సంతసిల్లి
యభిమతం బగువర మిచ్చె నధిపవర్య.

---

200\. 1. పొమ్మని - ఔ క. ఖ. స.

202\. 1. నవర్యుండు, ననత్రముండు - అనిపాఠములు

206. వ. ఇచ్చినం బ్రీతుండై యవ్విపులుండు విపులతపం బాచ[1]రించె దేవశర్మయు దేవేంద్రునివలనిశంక దక్కి సుఖం బుండె నొక్కనాఁ డయ్యాశ్రమంబు చక్కటిచదల దేవాంగన యోర్తు వోవ దానిచేతనుండి ప్రిదిలి భూరిపుష్ప దామంబు.

207. ఆ. దివ్యపరిమళంబు నవ్యవికాసంబు
నుల్లసిల్ల వచ్చి యుర్విఁ బడినఁ
గాంచి రుచి యుదీర్ణకౌతుకచిత్తయై
దానిఁ బుచ్చికొనియె మానవేంద్ర

208. ఆ. తదవ[1]సరంబున నంగాధీశ్వరుం డగుచిత్రరథుం డయ్యాశ్రమంబున కరుగు దెంచె నతనిదేవియు రుచియుఁ దోడంబుట్టువు లగుటం జేసి నిజగృహంబునం గలిగిన యుత్సవంబున కతండు రుచిసహితంబుగా దేవశర్మం బ్రార్థించి పిలి చినఁ జంపానగరంబున కరుగుచుండి రుచి గైసేసి యద్దివ్యకుసుమదామం బునం గేశకలాపంబలంకరించుకొనినం దత్సమాగమసమాచారంబు నడపి తద్భగిని దరీయకుసుమపరిమళంబునకు నచ్చెరు వంది.

209. వ. ఇట్టిసౌరభంబు నెన్నఁడు నెఱుఁగ ని
ప్పువ్వు లెచటఁ గలిగెఁ బువ్వుఁ[1]బోఁడి
యనినఁ గలిగె నస్మదాశ్రమంబున నని
పలికి దేవశర్మపాలి కరిగి.

210. వ. రుచి యప్పువ్వులకుం దనచెలియలు వేడుకపడుట యెఱింగించిన నమ్మ హానుభావుండు విపులుని రావించి యత్తెఱంగు దేటపడం బలికి యిట్టికుసు మంబులు గొని రావలయు నని పలికిన నతం డప్పువ్వులు గనినచోటు రుచి నడిగి చెప్పించుకొని గురుప్రభావంబును నిజశక్తియు నూఁది యప్పని పూని చనియె దైవికం బయి యచ్చట నెప్పటిచందంబు ఫుష్పదామం బున్నం బుచ్చికొని వచ్చునప్పు డొక్కయెడ నారీపురుషులొండురుల చెట్టలు పట్టికొని చక్రభ్రమణభంగిఁ దిరుగుచుండి యొక శ్లోకల్లగతి యొప్ప దని పలికి కాలుదొడరితి కడువేగ తిరిగి తని వివాదంబు పుట్ట యం దొకం

208. 1. రింపుచువరించె - కొన్నిప్రతులు.
208. 1. నంతరంబున - కొన్నిప్రతులు.
209. 1. బోఁడి - కొన్నిప్రతులు.

దేనట్లు సేసితినేనిం బరలోకంబున విపులునిచన్నగతికిం జనుదు నని శపథంబు సేసిన నమ్మాట వినుచు విపులుం డట సనం జన మఱియు మార్గంబున నార్వురు జూదం బాడుచుండ వారైన నొకం డట్ల [1]యొట్టిడిన నప్పలుకు నాకర్ణించి యత్తపోధనుండు చిత్తంబున విషాదంబు గదుర నేమిదోషంబు సేసితినొకో యని విచారించి రుచిశరీరంబునందుఁ బ్రవేశించుట గురునకు నెఱింగింపమి గా నోపునని తలంచుచు నరుగుదెంచి యక్కుసుమమాలిక యొప్పించినం గైకొని యమ్మునివరుండు మఱందలి కొసంగి [2]సంతోషం బొలయించెఁ దదనంతరంబ తమయంత నున్నయవసరంబున నగ్గురుం డాశిష్యునితో నిట్లనియె.

211. క. తెరువున నొకమిథునము జూ
దరులను గనుఁగొంటి నీ వధర్మము నీయం
దరసి కనినవారై పలి
కిరి వారల నెఱుఁగుదే యకల్మషచరితా.

212. తే. నీవు రుచిఁగాచునప్పటినిపుణవృత్తి
నాకు నెఱిఁగింపకునికి యన్యాయముగఁ ద
లంచిరో కాక దానిఁ గల్మషము గాఁగ
నేను దలఁచిన శాప మీనెట్లు నీకు

213. వ. అప్పని [1]పాపంబు గాకుండ వరం బిచ్చితి నది మఱవు మమ్మిథునం బహో రాత్రంబు లయ్యార్వురు ఋతువు లని పలికిన గురునిబోధంబునకు నాశ్చర్యంబును బ్రసాదంబునకుఁ బ్రమోదంబునుం బొందుశిష్యునితో నతండు వెండియు.

214. తే. దినము రాత్రియు ఋతువులు మనుజచేయు
సుకృతమును దుష్కృతంబును జూచు చుండు
గాని యెంతరహస్యపుఁ గార్యమైన
నొరు లెఱుంగరు నన్నని యునికి [1]మోస.

---

210. 1. సుడివిన – ఎ. పీ శ ష ,యొద్దాడిన, యొద్దిన – అనిపారములు.
2. సంతసంబొనర్చె శ. ష.
213. 1. దోషంబు – పీ. శ. ష.
214 1. దగదు – ం పీ. ష.

215. వ. అని మఱియును

216 క. స్త్రీరతు సూత్మ్మ మీ వ
స్త్రైణూపునసై న వంశహీనత మమ్ముం
బోక యుండం దగఁ బరి
హారము సేసి తది యేల యనగుణ మయ్యెన్.

217. వ. దానితెఱంగు నాకెఱింగింప కున్న నేమి యనుపలుకు వలికి దేవశర్మ విపులు నుల్లం [1]బూఅడిల్లం జేసె నవ్వధూవరులను విపులుందును బుణ్య లోకంబులు వడసిరి పాండవాగ్రజా తెఱవలతెఱం గెఱింగించితి వారి రక్షించుటయు నిట్లరిదియై యుండు నని చెప్పి భీష్ముండు.

218. క. వలవుగు క్రీడింతుకు భూ
వలయాధిప యరయ మంచివారును గల ర
క్కులశర్మ [1]వతులకతమున
నిల [2]నిరపాయత్వ మొంది యెసకం బెసఁగున్.

219. క. ప్రాతివ్రత్యము గలిగిన
నాతి యనఁగ దైవ మన జనస్తుత వేతే
యాతతధర్మార్థసుఖ
ఖ్యాతులు సద్భార్యవలనఁ గాదే కలుగున్.

-: భీష్ముఁడు ధర్మజునకు గాంధర్వాదివివాహంబులతెఱఁ గెఱిఁగించుట :-

సం 13-44-1

220. వ. అనిన విని యజ్ఞపతి జాహ్నవీనందనుతోఁ గన్యావరణప్రకారంబు విచార ణీయం బై నకృత్యంబు దానితెఱం గెఱిఁగింపవే యనుటయు నతం డతని కిట్లనియె.

221. క. కులమును శీలము విద్యయుఁ
గలవానిం బిలిచి ప్రీతిఁ గన్నియ నీఁగా

217. 1. బుల్లసిల్లంజేసె - ఒ క. వ.

218. 1. సరుల - కొన్నిప్రతులు 2 యనపాయత్వమొంది - ఒ క

వలయు నుదక[1]ప్రదానా
కలితంబుగ [2]బ్రాహ్మకర్మగతి యిది యధిపా.

222. ఆ. క్షాత్త్రమండ్రు బుధులు గన్య పురుషుఁ గోర
నతఁడుఁ గన్యమీఁద నాససేయ
నచ్చు మగుపరస్పరానురాగము గని
ప్రమద మెసఁగఁ జేయుపరిణయంబు.

223. క. కన్య మనంబును దనిసినఁ
గన్నియ యెవ్వానిఁ గోరు గాంధర్వం బా
యన్న నతని కిచ్చుట వెల
వన్నుట యాసురము సూవె పౌరవముఖ్యా.

224. క. బలిమి మెయి వరుఁడు గన్నె కుఁ
గలవారిం బొడిచి కరము క్రౌర్యంబున న
బ్బాలఁతుక దుఃఖింపగఁ దా
రలు వొగులఁగఁ దెచ్చికొనుట రాక్షసము నృపా.

225. వ. ఇట్లు సెప్పంబడునట్టి.

226. ఆ. అయిదుదెఱఁగులందు నారయ మూఁడువి
ధము లు ధర్మకృతులు ధర్మపుత్ర
యాసురంబు రాక్షసాహ్వయంబును ధర్మ
దూరసంవిధాన దూషితములు

227 తే. మాతృపితృహీన యైనను భ్రాతృరహిత
భావ మొందిన నబ్బాల పరిణయార్థ
వరణమున కర్త్ర గా దని కురుకులాగ్ర
గణ్య చెప్పుదురు పరిణయకల్పవిదులు.

228 ఆ. ఆత్మజాతియందు నవులజాతులు రెంటఁ
గ్రమవివాహ మొప్పు బ్రాహ్మణునకు
ననఘ శూద్ర[1]వనితయందు నాతని కప
త్యంబు గలిమి పాప మనియుఁ గలదు

---

221. 1. ప్రధారాకలితంబుగా – శ. ష. కొన్నిప్రతులు. 2. బ్రాహ్మ్య – ల శ. ష. కొన్ని ప్రతులు.

228. 1. సతివలన నాతనికినవ – పెక్కుప్రతులు

229. తే. రాజునకు రాజవంశజరమణి యైన
వెనుక వైశ్య వరించుట విహితవిధము
వైశ్యునకు శూద్రునకుఁ దమవంశమువలన
పరిణయంబు గాఁ దగు [1]నరపాలవర్య.

230. వ. రాజునకు వైశ్యునకును శూద్రకన్యావరణంబు సేయుటయును గలిగియుండు నని చెప్పిన విని యకౌంతేయాగ్రజుండు శాంతనవుతో బ్రాహ్మణునకు శూద్రజాతియందు భార్యాపరిగ్రహంబు సేయం దగు నని విందు నతనికి భార్యలు మువ్వు రని నిర్దేశించితి రది యెట్లొకో యనుటయు నతం డమ్మహీపతి కిట్లనియె.

231. ఆ. అనఘ విషమ మైనయట్టికార్యంబు వా
టిలినఁ జూచి పెద్ద వలచి యైన
లోభమునను శూద్రఁ దా భార్యఁ గాఁ గొను
విప్రుఁ డధికపాపవృత్తిగామి.

232. వ. అవ్విధంబు నొక్కొక్కయెడం గల్గి దూష్యంబు గాక చెల్లు నని చెప్పి వెండియు

233. క. ధరణీసురరాజవణి
క్తరుణులకను విప్రువలనఁ గల్గినతనయుల్
కురునాథా ద్విజు లనఁగాఁ
బరఁగుదు రది లేదు శూద్రభామ[1]సుతులకున్.

234. వ. అనవుడు ధర్మపుత్త్రుండు భూసురునివలన నాలుగుజాతుల[1]నాతులకును బ్రసూతులైనసుతులకును నతనిధనంబునందు భాగం బెట్లుండు నని యడిగిన.

235 సీ. విను జనమేజయమనుజేంద్ర యమ్మేది
నీశ్వరుతో భీష్ముఁ డిట్టు లనియె
బ్రాహ్మణునర్థంబు పదిపాళ్లుగాఁ జేయ
నాలుగు [1]బ్రాహ్మణీనందనుండు

---

229. 1. నంద్రు వరమమునులు-శ. ష
233. 1. సుతుకునన్-కొన్నిప్రతులు
234. 1. కాంతులకును - కొన్నిప్రతులు.
235. 1. బ్రాహ్మణీనంద - ఎ వీ ష. సూ

క్షత్రియాత్మజుఁడు భాగములు మూఁడును వైశ్య
తనయుండు రెండు శూద్రాతనూజుఁ
డొకపాలు గొనుటకు నొడయులు తుదివాఁడు
[2]వలఁచి పెట్టఁగఁ గొనువాఁడు గాని
ఆ. తండ్రితోడఁ ద్రివిధతనయులతోడను
దనదుభాగమునకుఁ జెనఁగి కొనఁగఁ
దగదు వారలకును దగదు నిర్ధయతఁ ద
ద్ధనముభాగ మీక తార కుడువ.

236. వ. అనిన విని పాండవాగ్రజుండు దక్షిణవర్ణంబులవారిధనంబు లెట్లుగాఁగలు యవి సెప్ప మనుటయు ననిమిషనదీనందనుం డతని కిట్లనియె.

237. సీ. క్షత్రియుధనము భాగము లెనిమిది సేయ
భూపాలవైశ్యుల పుత్రికలకు
శూద్రపుత్రికకును సుతులై నయట్టివా
రోలి నాలుగు మూఁడు నొక్కటియును
గొనువారు [1]పాళ్లు కురుముఖ్య వైశ్యుని
సొమ్మైన వైశ్యకు సూనుఁడైన
యతఁడు నాలుగును శూద్రాత్మజుఁ డొకటియుఁ
గాఁగ నైదుగ నంశకములుగొండ్రు
ఆ. పెనఁగి కొనఁగఁ దగమి విను శూద్రకొడుకున
కెందుఁ గలదు వాని కీక కుడువఁ
గామియును సమంబ యేమిజాతులవారి
కయిన నిట్లు దెలియు మంశకృతులు.

238. తే. అలు నిజజాతియందు శూద్రాలి కెల్ల
సమములుగఁ బంచికొండ్రు భాగముల శూద్ర
తనయు లెందఱు గల్గినఁ దండ్రిధనము
ధర్మసంగ్రహతత్పర ధర్మకనయ

2 పంచిపెట్టగ - ఊ. ఐ ౙె. ఖ శ
237. 1. పాళ్ళగామరు - కొన్నిప్రతులు

239. వ. అని నిర్దేశించి వెండియు.

240. క. విను హవ్యకవ్యములు మ
జ్జనభోజనములును విప్రజాతివనిత దాఁ
బనిసేయ నడపునది య
ప్పనులకుఁ బెఱపతులు గామి బ్రాహ్మణుఁడు నృపా.

*-: భీష్ముఁడు ధర్మజున కౌరసాదిపుత్త్రభేదంబు తెఱంగు సెప్పుట :-*

సం 13-49-1

241 వ. అనిన విని యుధిష్ఠిరుండు

242. క. కొడుకులు బహువిధు[1]లని యె
ప్పుడు విందును వారితెఱఁగు పురుషవరా యే
ర్పడఁ జెప్పవలయు నాకని
యడిగిన గాంగేయుఁ డిట్టు లను నాతనితోన్.

243. తే. పరమసంస్కృత యగునాత్మ భార్యయందు
ధర్మవిధిఁ గలిగించిన తనయుఁ డనఁగఁ
దాన యౌరసుఁ డనునభిధాన మొప్పఁ
బరఁగు నుత్తముఁ డాతఁడు ప్రథముఁ డధిప.

244. తే. తగినవరునకు నిచ్చిన తనదుదుహితఁ
గనినపుత్త్రు నయ్యిరువురు వినఁగ నియ్య
కొనఁగ వీఁడు నాకొడుకనఁ గొడుకు వాని
పేరు పుత్త్రికాపుత్త్రుండు పౌరవేంద్ర.

245. తే. ధర్మపథమునఁ బనిచినఁ దనదుపత్ని
యన్యపురుషసంగతిఁ గన్నయాత్మజుండు
క్షేత్రజుం డనఁగా నిజపుత్త్రభావ
మొందు ధర్మప్రపంచాభినందితాత్మ.

246. క. జననీజనకు లుదకదా
ననిరూఢము గాఁగ నిచ్చినం బడసినసం

---

242. 1. లగుటెప్పుడు - ఉ. ఊ. ఐ. ఒ. గ. కొన్నిప్రతులు.

దనుపేరు [1]దత్రిముం డని
మునిజనములు సెప్పుదురు విమోహవిదూరా.

247. ఆ. తల్లిఁ దండ్రిఁ బాసి తనయంత నెచ్చట
నేనిఁ దిరుగునట్టివానిఁ జూచి
యాత్మసదృశుఁ డైనయాత్మజుఁ జేసికొ
నంగఁ గృత్రిముం డనంగఁ బరఁగు

248 తే. ఎవ్వనికిఁ బుట్టెనేనియు నెఱుఁగకుండ
నొక్కనికిఁ బరభార్యయం దుదయమైన
సూనుఁ డాభార్యగలవానిసుతుఁడు వాని
పేరు గూఢజుఁ డన[1]బడుఁ గౌరవేంద్ర.

249. క. విను తల్లిదండ్రు లొల్లక
తనయుని విడిచిన నొరుండు దనకుఁ దనయుఁ గాఁ
గొని నెమ్మి నడప నపవి
ద్ధనాముఁ డగు వాఁడు విమలధర్మప్రవణా.

250. ఆ. పెండ్లి గాక మున్నపితృగృహంబునఁ గన్య
సూనుఁ గనిన వినుము దానిఁ జేసి
కొనినయతని కతఁడుగొడు కగుఁ గానీన
నామకమునఁ బరఁగు నరవరేణ్య.

251. క. విను గర్భిణి యగు టెఱుఁగక
యును నెఱిఁగియుఁ బెండ్లియైన నుదయించిననం
దనుఁ డావరునకుఁ గొడు కగు
జననాథ [1]సహోఢుఁ డనఁగఁ జను నండ్రు బుధుల్.

252. తే. విభునిఁ దాను దొఱంగిన వెలఁది విభుఁడు
విడిచి నట్టిసుమధ్యమ విధవ యతు

---

246. 1. దత్త్రకుండని - చ వ. శ ష స కొన్నిప్రతులు దత్రిముడు అనగా "మాతా పితా వాదద్యాతాంయమద్భిః పుత్రమాపదిసదృశంప్రీతిసం యుక్తం సజ్ఞేయోదత్రిమః" మను స్మృతి(చూ ఆక్షేనిఘంటువు)

248. 1. దగు,జను - అనిపాఠములు

251. 1. సహేతుడఁన - శ

శాత్వదళ నెవ్వనికిగనఁ దనయుఁ డాతఁ
డతనికొడుకు పౌనర్భవుం డనఁగఁ బరఁగు.

253. క. జననీజనకులు లేకు
న్నను వారలు దన్ను విడచినం దాన తనుఁ
దనయుఁడుగ నొరుల కిచ్చిన
ననఘా యాతండు సను స్వయందత్తుఁ డనన్.

254. ఆ. తల్లిదండ్రు లమ్మఁ దనయుఁగా నొక్కరుఁ
డాత్మసదృశజన్ముఁడై నవాని
విలిచికొనినఁ బాండు[1]వేయమహా త్తర
యక్కుమారుఁ గ్రీతుఁ డండ్రు బుధులు.

255. క. అని భీష్ముఁడు వెండియు ని
ట్లను నాపన్నిరువురును ధరాధిప యోగ్య
త్వనిరూఢ లెల్లకర్మం
బున కౌరసుఁడందులోన ముఖ్యుం డరయన్.

256. ఉ. వానిన పోలు నండ్రు బుధవర్యులు కౌరవనాథ పుత్రికా
సూనునిఁ దక్కనీ వినినసూనులు యోగ్యత గాంతు రుత్తమం
బై నకులద్వయంబును సమాగత మై విధి వత్ప్రయోగతా
నూనత గల్గెనేని నిగమోదితకర్మకలాపయుక్తికిన్.

—: చ్యవన నహుష సంవాదం బనునితిహాసము :—

సం. 13 50-1

257. వ. అనిన విని ధర్మజుండు [1]సంవాసంబునను దర్శనంబునను బుట్టెడి స్నేహంబు లెట్టివి వానిని గోవులమాహాత్మ్యంబును నెఱుంగ వలతుం జెప్పవే యని యడిగిన నప్పుడమిఱేనికి భీష్ముం డిట్లనియె.

258. సీ. చ్యవనుని నహుషుని సంవాద మితిహాస
మై చెల్లు జగమున ననమ నీకుఁ

---

254. 1. వేయాగ్రసంజాత - పీ శ ష.
257 1. సహవాసంబునను - పెక్కు ప్రతులు

దానిఁ జెప్పెద విను దాన నీయడిగిన
యర్థముల్ దెలియు మహాత్ముఁ డైన
భార్గవచ్యవనుండు భాగీరథీయను
నలు [1]గూడినెడ కేఁగి యంభుమధ్యఁ
గ్రుంకి సుస్థిరుఁ డయి కూర్చుండి యతులస
మాధిపరుం డయి మత్స్యకులము

ఆ. దనదు చుట్టు మెలఁగఁ దనపునఁ జెందంగ
మూఁగుకొనఁగఁ గృపయు ముదముఁ గదుర
భావవృత్తితోడఁ బండ్రెండువర్షము
లుండె నట్టు లుండ నొక్కనాఁడు

259. క. జాలరుల వలల నచ్చటి
మీలఁ దిరుగుచుండి యయ్యమేయోగ్రతప
శ్శీలునిఁ గూడఁగఁ దిగిచి భ
యాలోలమనస్కు లగుచు నమ్మునిపతిఁన్.

260. ఆ. [1]చాఁగి మ్రొక్కి తప్పు[2] సైఁపు మెఱుంగమి
నింత పుట్టె సంయమీంద్ర మమ్ముఁ
బరమకరుణఁ జూచి పనుపుము దీనికి
నేమి సేయువార మింక ననుడు.

261. క. జలచరములపై నర్మిలి
గలిగెడుమదిఁ దాల్చి చేర్చి కారుణ్యము తో
యలమీఁద నించు కేసియు
నలుక వొడమ నీక యుండె నతఁ డవిక్రతుఁడై.

262. వ. పట్టిదరికిం దిగువంబడినమీలదెస వారికిఁ జూపి వారితోడ.

263. తే. వీనితోడిసంవాసంబు మానసమునఁ
జాల నర్మిలిఁ జెనిచె నిమ్మీలతోడఁ
గూడఁ బ్రాణంబు విడచుట గూడదండ్రె
జనులు గావున నటు సేయుఁ డనఘులారా.

---

258. 1 గూడనెడ - క. ష పెక్కుప్రతులు.
260. 1. సాగిమ్రొక్కి - క ష. పెక్కుప్రతులు. 2. సైరింపు మెరుగమ - కొన్నిప్రతులు.

264. వ. తగినతెఱంగు సెప్పెద వినుండు.

265. క. ఇమ్ములను నన్నును మీ
రిమ్మికొనుఁడు సేయువెలల కనుటయుఁ గడుసం
భ్రమమున నహుషుకడకుఁ జని
యమ్ముని తెఱఁగెల్ల జెప్పి రలుకుచు బోయల్.

266. వ. చెప్పిన భయంబును సంభ్రమంబును జెనంగొన నమ్మనుజపతి మంత్రి పురోహితసహితంబుగా నప్పరమమునిపాలికిం జనుదెంచి సాష్టాంగదండప్రణామంబు సేసి బోయలు సేసినయపరాధంబు నేమిభంగి నీఁగువాఁడ నని విన్నవించిన నద్దయాళుం డిట్లనియె.

267. క. బోయలు నిజకులధర్మము
సేయుట యపరాధ మగునె చెప్పెద విను వీ
రాయాసపడిరి వీరికి
నాయెడలికిఁ దగినవెల జనస్తుత యీవే.

268. క. అనుటయు మునివరుమనమునఁ
గను[1]క యొకింతయును లేమికిం బ్రీతుండై
జనపతి కిరాతులకు నిం
డని పనిచెను [2]వేయుమాడ లాత్మసచివులన్.

269. వ. పనిచిన యప్పలుకులు విని యమ్ముని యమ్మనుజవిభునితోఁ దగ నెఱిఁగి యిత్తుగా కనవుడు నప్పుడమితేఁడు పదివేలు సెప్పిన నప్పరమసంయమి యప్పటిమాటయ యాడిన నారాజు లక్ష యుగ్గడించె దానికిం దపస్వి ముందటిపలుక పలికిన నతండు కోటి [1]యిమ్మనియె నమ్మాటకు నమ్మహాత్ముండు,

270. క. [1]తలవిసరి వెలదగఁగ బో
యల కీ వెలదయ్య యనిన నన్నరపతి వా
రల కిల సగ మిచ్చెద నని
పలికిన నప్పలుకు ద్రోపు వడ ముని పల్కెన్.

---

268. 1 కొకయించుకయు – కొన్నిప్రతులు. 2 వేయిమాడ – ల. సూ.

269 1 యింతనియె – అ. ఈ. ఉ. ఐ. ఔ. ల.

270 1. తలచివెస – వ

271. ఆ. రాజు దనదుసకలరాజ్యంబు గోయల
నిత్తు ననుఁడు నమ్మునీశ్వరుండు
నీవు మంత్రివరులు నెయ్యురఁ దలపోసి
యుచితమైన మూల్య మొసఁగు మనియె.

272. వ. అనిన విని విషాదంబుతో నహుషుం డవ్వలం జని సచివులుం దానును నింక నేమి సేయు[1]వాఁడ నని చింతిల్లుచున్నసమయంబున నయ్యెడకు గవిజాతుం డనుసంయమి సనుదెంచి వారలతో మీరు చింత విడువుఁ డే నిమ్మునిపతి మూల్యంబు నిశ్చయించెద ననుటయు నయ్యవనీవిభుం డప్పరివారం బింత టితో నాపత్ప్రయోధి మునుంగ కుండునట్లుగా నన్నుం గావవే యనుపలుకు పలికిన నతం డతని కిట్లనియె.

273. తే. గోవునకు బ్రాహ్మణులకును గుల మొకండ
కమలజుఁడు రెండుదెఱఁగులు గా నొనర్చె
హవికిఁ బూర్వంబు గారణ మఖిలమంత్ర
ముల కధిష్ఠాన మపరంబు భూపవర్య.

274. క. వివిధాగమాశ్రయం బగు
నవనీదేవునకు మూల్యమని వాక్రువ్వన్
శివునకును [1]గాదు ధరణీ
ధవ గోవును నట్టిదగుటఁ దగునది యొసఁగన్.

275. తే. అనినఁ బ్రియ మంది నృపతి సంయమిసమీప
మునకు వచ్చి మహాభాగ ననుఁ గృపార్ద్ర
దృష్టిఁ జూడుము భవదీయదేహమునకు
నింతవెల యన వచ్చునే [1]యేరికైన.

276. క. మునినాథ గోవు నిచ్చెద
ననవుడు వికచముఖుఁడగుచు ననుగుణమూల్యం
బున సంప్రీతిం బొందితి
నని భృగుకులముఖ్యుఁ డిట్టులను నహుషునితోన్.

---

272. 1. వారమని - శ. ష. కొన్నిప్రతులు.
274. 1. రాదు - శ. ష. పెక్కుప్రతులు.
275. 1. యెవ్వరికిని - కొన్నిప్రతులు

277. క. గో వగ్నిమయ మమృతమయ
మోవసుధాధీశ వినుము హోమవిధాన
శ్రీవాహిని [1]నిచ్చెన త్రిద
శావాసంబునకుఁ బూజ్య మమరుల కైనన్.

278. చ. అని యిటు తేర్పడం బలికి యాతలఁ బెంతయు మేలు గోవు ని
మ్మనఘుచరిత్ర యన్న విభుఁ డట్టుల చేసిన బోయ లప్డు నె
మ్మనములు మోద మంద గరిమంబున భార్గవుఁ జేరి మమ్ముఁ గ
న్గొనినది యాదిగాఁ గరుణ గూరెద వొక్కటి విన్నవింతుమే.

279. క. అని ప్రీతిఁ బలికి యమ్ముని
యనుజ్ఞఁ గొని మమ్ముఁ గావు మక్కటికమునం
గొన వయ్య గోవు మాచే
నన విని మొగమాట మనము నార్ద్రితఁ జెనుపన్.

280 తే. వేఁడి [1]కొనినట్టికృపణుపై వాఁడిచూడ్కి
యరయ నాశీవిషము చూపునట్ల కాన
చేయఁ బ్రార్థనా[2]భంగంబు మీయభీష్ట
మాచరించెద నని గోవు నతఁడు గొనియె.

281. వ. కొని యంత నిలువక.

282. తే. దర్శనప్రీతి వారిపైఁ దగుల మీల
వలసి యర్మిలి మనము[1]న దళముకొనఁగ
మీరు మీలును సమ్మోద మార దివికి
నేఁగుఁ డని పల్కె భావుగ్గండెల్ల వినఁగ.

283. వ. పలికిన దత్క్షణంబ.

284. తే. మీనములు[1]ఁ దారుఁ దనువులతోన నెగసి
నాకలోకంబునకుఁ బోవ నహుషనృపతి

---

277 1 నిచ్చినత్రిదశ – వ. శ. ష. కొన్నిప్రతులు.
280. 1 కాననికృపణుపై – అ. ఇ. ఈ. క. గ. శ, కొన్నిప్రతులు. 2. భావంబు – శ. ష.
282. 1. నందలము కొనగ – పీ. శ. ష. పెక్కుప్రతులు.
284 1 లువారుదనువుల – కొన్నిప్రతులు

సపరివారంబుఁ గాంగ నాశ్చర్యపూర
మగ్నమానసుఁ డయి యుండె మానవేంద్ర.

285 వ. అప్పుడు.

286. క. చ్యవనుఁడు గవిజాతుఁడు న
య్యవనీశ్వరుఁ బిల్చి వరము లడుగుము రెండీఁ
దివిరితి మనుఁడు నతఁడు మీ
యవిరళసం[1]ప్రీతికంటె నర్థము గలదే

287. తే. అనిన విని యగ్గలంబైన యాదరమున
వారు ధర్మపరత్వంబు వాసవాభ
వైభవము [1]నయ్యెడును నీకు వంశపావ
నాత్మ యనుచు నంతర్హితులైరి వత్స.

288. క. మది నద్భుతంబుఁ బ్రమదముఁ
బొరయఁగ నమ్మునులమహిమఁ బొగడుచుఁ జనియెం
దదనంతరంబ పతి నిజ
సదనమునకు నెల్లజనులు సమ్మద మందన్.

289. వ. అని చెప్పి భీష్ముండు.

290. క. వినిపించితి సంవాసం
బున దర్శనమునను జిత్తమున నధికస్నే
హానిరూఢి గల్గుటయు గో
వునందుఁ గలగౌరవముఁ జెవుల కింపెసఁగన్.

—: చ్యవన కుశిక సంవాదం బను నితిహాసము :—

సం. 13 - 12 - 1

291. వ. అనిన విని యక్కురువంశవర్యుం డాధర్మదుర్యునితో నాకు నొక్కటి విను
టకుం గుతూహలం బెప్పుడుం గల్గి యుండు నుదాత్త[1]బ్రాహ్మనిధి యైన

286. 1. ప్రియముకంటెనన్యముకలదే - స, ప్రియముకంటెనర్థముకలదే - అ ఈ ఉ ఓ ల.
287. 1. నయ్యెద (ము) మనీకు - ఈ ఓ. ల. కొన్నిప్రతులు
291. 1 బ్రహ్మనిధియైన - పెక్కుప్రతులు

భార్గవాన్వయంబునం జిత్రతర[2]క్షాత్త్రచరిత్రుం డగుపరశురాముండు జని
యించుటయు నుత్తమక్షత్త్రియత్వమహోజ్జ్వలం బైనకుశికకులంబునం
బరమబ్రాహ్మణ్యావిష్కృతుం డైనవిశ్వామిత్రుం డుదయించుటయును నది
యెట్లొకో యనుచుండుదుఁ దొల్లియుఁ గొంత వింటి నిస్సంశయంబు గాదు
మహాత్మా మదీయచిత్తాయత్తంబుగా నత్తెఱం గెఱింగింపవే యనుటయు
నయ్యనిమిషనదీనందనుండు గుంతీనందనాగ్రజుతోడం జ్యవనకుశికసంవాదం
బనునితిహాసంబు వినుము దాన భవత్సంశయంబు వాయుఁ జ్యవనుండు నిజ
వంశంబునకుం గుశికకులంబు గారణంబుగా సంకరంబు గలుగఁ గలయది
యని యెఱింగి యక్కుశికకులంబునకు నుత్పాతం బాపాదింపం గోరి కుశిక
భూపాలుపాలికిం జనిన నతండు.

292. క. భార్యాసహితముగా న
య్యార్యవరుని కనుగుణంపుటర్చన విధివ
[1]చ్చర్యాపూర్వముగ వినయ
ధుర్యత వెలయంగఁ జేసె దోహల [2]మమరన్.

293. క. పూజితునిఁ జేసి యతనికి
రాజపదం బిట్టు లనియె రాజ్యవిభుత్వ
భ్రాజిష్ణుఁడవై భృత్యుని
యోజను నను నడిపి యేలు ముర్వి మునీంద్రా.

294. క. పసును భార్యయు బంధులు
నానా[1]జనసహితముగ సనాథతఁ గని య
త్యైనం బెంపుం బోరయం
గా నీకుఁ బ్రమోద మొందఁ గైకొను మమ్మున్.

295. చ. అన విని యమ్మునిప్రవరుఁ డాతని కిట్లను రాజ్యకాంక్ష నా
మనమున లేదు సద్వ్రతము మానితవృత్తిఁ జరించువాఁడ నై
జనవర వచ్చినాఁడఁ బరి[1]చారము నీవును నీకుపత్నియున్
గొనకొని చేయఁగా వలయుఁ గోరిక యింతియ తీర్పు మోపినన్.

---

2 క్షత్రమహిమాచరితుండగు - జల. శ. ష. కొన్ని ప్రతులు.

292. 1. ల్కార్యాపూర్వముగ - ఈ. ఈ చ. ల. 2. మలరన్ - కొన్ని ప్రతులు.

294. 1 ధన, విధ -అనిపాఠములు.

295. 1. చర్యలు - అ. ఈ.

296. వ. అనిన విని యాదంపతులు [1]ముదమ్మునం బొదలి యట్ల చేయువార మనిరి తదనంతరంబ

297. క. అమ్ముని నభ్యంతరసద
నమ్మునకుం గొని విభుండు నాతియుఁ దానున్
సమ్మోదమ్మునఁ జని హృ
ద్యమ్మగు నొకచోటు సూపి యాతనితోడన్

298. ఆ. అనఘ యిచట నుండు మని పల్కి మృదులత
ల్పంబు నంచితాసనంబు నచటఁ
బెట్టఁ బనిచి యేము ప్రీతి నొనర్చెద
మిష్టభంగిఁ బనుపుఁ జెప్పి యైన.

299. వ. అనియె నంత నినుం డపరగిరి [1]గడచనినం గాలోచితకృత్యంబు లాచరించి యమ్మహాత్ముం డాహారం బడిగిన నమ్మహీపతి మహితభోజనంబున నతనిం దృప్తునిం గావించిన.

300. ఆ. అతఁడు సెజ్జఁ జేరి యధిపుతో నియ్యెడ
నిద్రవోదు నేను నృపవరేణ్య
మీరు నిదుర దక్కి మెలపున నాచర
ణంబు లొత్తు చునికి నాకుఁ బ్రియము.

301. క. ఏ నైన మేల్కనునంతకుఁ
భూనాయకవర్య నన్ను బోధింపకుఁ డీ
మానినియు నీవు నని ని
ద్రానిరతుం డయ్యెఁ బారుఁ దద్దయుశక్తిన్.

302. తే. కుడుపు నిదురయు వర్జించి యడుగు లొత్తు
చుండి రమ్మునివల్లభుఁ డొక్కప్రక్క
నచలగాత్రుఁ డై నిద్రింప నద్భుతముగ
దినము లిరువదియొక్కటి సనియె నధిప.

---

296. 1. ముదంబునం - పెక్కుప్రతులు

299 1. గడచినం - కొన్నిప్రతులు.

803. వ. ఆరువదిరెండవనాఁ డమ్మునివరుండు దనయంతన మేల్కొని.

804. క. ఇలు వెడలిపోయె నేమియుఁ
బలుకక యాదంపతులును బరమశ్రాంతా
త్ములగుచు వెనుకన చనిర
క్కులపతి యించుకయు నరకు గొనఁ డవ్విధమున్.

805. ఆ. అట్లు వారివలన నాదరరహితుఁడై
పురవరంబు వెడలి పోయి పోయి
యతఁడు సూడఁజూడ నంతర్హితుం[1]డై నఁ
బతియుఁ సతియు మూర్ఛపాలువడిరి.

806. క. కొంతవడికిఁ దెప్పిటి[1]యొద
నెంతయు వగ నూనఁ బురికి నేతెంచి గృహా
భ్యంతరము సొచ్చి కని ర
య్యింతియును విభుండు నమ్మునీశ్వరు నెజ్జన్.

807. వ. మును నిద్రించుప్రక్క దక్క యొండుప్రక్క నిద్రించుభార్గవు నట్లు గాంచి సంతోషించి పరిశ్రాంతి [1]దిగఁద్రావి యొప్పటిచొప్పున నడుగు లొత్తుచుండ మఱియు దినంబు లిరువదియొక్కటి ననినం బ్రబుద్ధుండై.

803. సీ. అతఁడు తైలాభ్యంగ మడిగినఁ బతి
కమ్మనూనియ దెప్పించి మేను శిరము
నభ్యక్తములు సేయ నమ్ముని నెడ నాడి
యంతర్హితుం డయ్యె నపరఘటికఁ
దోఁచి వికారంబు దొడరక యున్న
రాజును దేవులను గని సుముఖుఁడగుచు
నాచరితస్నానుఁ డగుటయు వారు
మహార్హ ములగు వివిధాన్నపాన

805 1 దయ్యె - కొన్నిప్రతులు

806 1. యొదలెంతయు - ఇ. శా. ఏ. బ, యెడలెంతయు - శ. ష.

807. 1 డిగ్గద్రావి - కొన్నిప్రతులు

ఆ. ములు ఘటించి కుడువఁ బిలిచినఁ జని వాని
నెల్లఁ గాంచి యొక్కఁడేనిఁ బోయె
వార [1]లడలు గదుర నూరక యుండి రా
పగలు రేయుఁ గురునృపాలవర్య.

809. వ. అభృగువంశవరుండు

810. సీ. వేగినఁ దోడనూపి వేగంబ యరదంబు
వన్నింపు నీవు నీభామినియు వ
హింపఁగా రథికత యొసఁగఁ గాంచనరత్న
గోహయముల యాచకులకు నిచ్చు
చును జనవలయు నాకనుడు భూపతి తేరు
సమకట్టి దావట[1]ఁ జామ దాను
వలపటఁ బూని యావస్తువు లెల్లను
గొని వచ్చి యా మంత్రి జనులఁ బనుప
తే. నెక్కి వారల నాసంయమీశ్వరుండు
నిశితతర మగు మునికోల నెత్తు శిరోలుక
మోపుచును దీనకోటికి నాపదార్థ
చయము నెడ నెడ నొసఁగుచుఁ జనుచునుండె.

811. వ. పెక్కుదినంబు లాహారనిద్రలు [1]లేమి డప్పిఁదూలు నమ్మహీపాలు నమ్మ
హిషి నమ్ముని మునికోలపోట్ల నట్లు పూచినమోదువులచందంబు నొం
దింపఁ జూచి జనంబు లల్లన తమలోన నిట్టితపోమహిమయుం గలదేయిది
యన్యాయ్యం బని యలుగను దగవు వలుకను దేటిచూడను రా దయ్యెడు
నీదంపతుల ధీరత్వంబును నిష్ఠాపరత్వంబును నింత యొప్పునే దుర్వహం
బగుభారంబు నిర్వికారులయి వహించుచున్నవా రనుచు నుమ్మలించుచుఁ
బరివేష్టించి చనం జ్యవనుండు పురంబు వెడలి వారిమనంబుల వికారంబులు
గానక యచ్చెరువును మెచ్చును బెనంగొను హృదయంబుతో నరదంబు

---

808. 1. లడరు – అ. ఈ. ఏ ఖ. గ; లదరు క
810. 1 టనతియు – ఇ. ఏ. ఙ. ల. పి శ ష న 2. రుచుల – న
811 1 లేమింజేసి దప్పితూలు – అ ఆ. శ. ష. పెక్కువ్రతులు

డిగ్గి వారలశిరంబులం గట్టిన పగ్గంబులు విడిచి శరీరంబులు కరంబున [2]సంస్పర్శించి యజ్ఞపతి యాననం బాలోకించి [3]దస్సితిగదే వరం బిచ్చెద వగపు దక్కి పురంబునకుం [4]జను మేను గంగాతీరవనంబున వ్రతచర్యావేశంబు నిర్వహించెద నీవు మహిషీసహితంబుగా నెల్లి నాకడకుం జనుదెమ్మని పలుకు టయు నాకు వగపెక్కడి [5]దని పలికి యవ్విభుండు.

812. క. తనతనువు వనితమేనును
గనుఁగొని యచ్చెరువు ముదముఁ గడలుకొనఁగ న
మ్మునితో భవత్ప్రభావముఁ
గొనియాడఁగఁ దరమె మాకు గురుతరకరుణా.

813. వ. అని వెండియు.

814. తే. శ్రమము లేదు ప్రతోదవ్రణములు లేవు
నాతియును నేను నెలజవ్వనంబుఁ గంటి
మిది మహాద్భుతతర మందుమే భవన్మ
హోను భా[1]వత్వ మేమి సేయుదు మునీంద్ర.

815 వ. అని సవినయంబుగాఁ దానును దేవియు దండప్రణామంబులు సేసి యాసం యమివరు వీడ్కొని సాద్భుతచిత్తులైన సకలజనులుం బరివేష్టింపఁ బురంబుఁ బ్రవేశించి ప్రమోదమయమూర్తులగుచు దివస[1]వర్తనంబును రాత్రి చర్యయుం గడపి సూర్యోదయం బగుటయు.

816. క. వారలు ప్రాతస్సమయా
చారంబులు నడపి భక్తిసంపద [1]లొదవన్
గారవమున మునినిర్ది
ష్టారణ్యమ్మునకుఁ బోయి రవనీనాథా.

817. ఆ. అచట మణిమయంబు నతిసుందరము దివ్య
సదననిభమునగు విశాలరమ్య
హర్మ్యమున్నఁ జూచి యచ్చెరువందుచి
త్తములతోడఁ జనఁగ దానిచుట్టు.

---

2. సప్పశించి - ఐ ఔ. ఖ. 3. దస్సితిరిగదే - కొన్నిప్రతులు 4. జనుండేను - కొన్నిప్రతులు 5. యదియని - కొన్నిప్రతులు

814 1. వంబుసేమననగు _ అ ఇ ఈ ఏ. పీ. శ ష. న

815. 1. సార్థంబునురాత్రి _ ఉ. ఐ. ఔ. ఖ.

816 1. పొదలన్. లారయన్ _ అనిపాఠములు.

-: వ్యాసుఁడు తనయోగబలంబునఁ గుంతికిని నాకలోకంబు చూపుట :-

నం 13-54-1

318. సీ. స్వాధ్యాయసంగీతసాహిత్యవర్తన
మాననీయము లగుమండపములు
కోకిలశుకభృంగకులనాదముల నభి
రామంబు లైన యారామములును
హంససారసరవాత్యంతమనోజ్ఞంబు
లై సొంపుమిగులుపద్మాకరములుఁ
జారుమయూరకేకారుతకలితంబు
లగుచు నొప్పారు క్రీడాచలములు
తే. వీనులకుఁ జూడ్కులకు నింపు వెల్లిగొల్ప
నేర్పుగలిగిన విభవంబు నెఱయ మెఱయఁ
గరము విలసిల్లు చునికి నాకంబు వేడ్క
నయ్యెడకుఁ గాపువచ్చిన యట్టులుండె.

319. క. సురలును గంధర్వులు న
ప్సరోనికాయములు వివిధ సరసవిహారా
దరలీలల నం దెడనెడఁ
జరించుచుండిరి నితాంత సమ్మోదమునన్.

320. తే. అవ్విధంబున నారాజు నంగనయును
మనము లద్భుతరసమున మునుఁగుచుండ
గలయొకో యిది నిక్కమ కానినాఁడు
మిగుల ననుభవగోచర మగునె యిట్లు.

321. వ. అని వెండియు.

322. క. ఉత్తరకురుభూమియొ లో
కోత్తర మగునట్టినాక మొకొ తనువులతో
నిత్తాపసవరునికరుణ
నిత్తెఱఁగున సంభవించె నిచ్చోటు సాఁకన్.

323. వ. అనుచు నమ్మహనీయహర్మ్యంబు సొచ్చి యందు మణిమయపర్యంకంబునం బవ్వళించి యున్న యప్పరమమునిం గని యపరక్షణంబున నతం డంతర్ధానంబు

నేసె నతనితోడన యామేడయు మున్నుగన్న యశేషవిశేషంబులును నదృశ్యంబు లయ్యె నయ్యిరువురు నిట్టట్టు మెఱంగి యక్కాన నొక్కెడ [1]గోశబ్బసీసమాసీనుండును జపపరుండును నైన యాసంయమివరు నాలోకించి రట్లు గావించి భూవిభుండు భార్యతో నిట్లనియె.

824. తే. ఉవిద మునియోగబల మిట్టు లుండునేయ
మానరాజ్యంబు సుఖంబు మానవులకు
బ్రాహ్మణత్వంబుఁ దపము దుర్లభము తపము
కలిమిఁ జేయుచు నున్నాఁడు వలసినట్లు.

825. చ. అనునెడ నిందు రం డని సమాదర మొప్పఁగ వారిఁ బిల్చె న
మ్ముని [1]నరనాథుఁడుఁ సతియు మోడ్చినచేతులతోడఁ జేరఁగాఁ
జని ధరఁ జాఁగి మ్రొక్కుటయు సంయమి దీవన లిచ్చి రాజునా
ననమున సుప్రసన్ననయనప్రభ పర్వఁగ నెమ్మి నిట్లనున్.

826. ఆ. మనసు నింద్రియములు మనుజేంద్ర యింత వ
శ్యంబులగునె నీకు నరయఁ గీడొ
కింతయైన లేదు సంతస మందితి
నిత్తు వరము వేఁడు మెద్దియైన.

827. క. అనిన విని యగ్నికల్పుఁడ
వనఁ జను నీమది ప్రసన్న మగునట్టులుగా
మునిజనవంద్యా కోల్వం
గనుకంటెను మిగుల [1]మేలు గలదే కోరన్.

828. వ. అని పలికి కుశికుండు వెండియు.

829. తే. ఒకటి యడిగెదఁ గృప చిగు రొత్తఁ జెప్ప
వలయు మీరు మాయింటికి వచ్చి యొక్క
ప్రక్కక్రిందుగ నిరువదియొక్కదినము
లనఘ నిద్రించి తది మొద లైననీకు.

---

823. 1. గోశేచ్చల్బనేసమా - ఆ ఇ జ ల. శ. కొన్నిప్రతులు.

825. 1. యవనీశుదున్ - పీ. శ ష. స.

827. 1. పరముకలదే - పీ. శ ష. స.

380. క. చరితం బద్భుతముముని
శ్వర దీనికిఁ గారణము విచారమున కగో
చర మెఱిఁగింపు మనుడు నా
ధరణీవల్లభునితో [1]నతం డిట్లనియెన్.

381. వ. సురలు మునులు సురజ్యేష్ఠుం గొలిచి యుండం బ్రసంగవశంబున నప్పరమేష్ఠి వారలతో భృగుకుశికవంశంబులకు బ్రహ్మక్షత్త్రియంబులు తడంబడి సంకరంబు వాటిల్లు నని చెప్పె నప్పు డే నచ్చటనుండి వినుటం జేసి యాసంకరంబున కోర్వక మీయన్వయంబు నిర్మూలంబు సేయువాఁడ నయి వ్రతంబు నెపం బిడి భవద్గృహంబు సొచ్చి యున్నిపోకలం బోయితి నలసి డస్సి యెప్పు డేని మీర లడ్డమాడుదు రప్పుడ శపింతు నిట్టిద నాయెత్తికోలు మీయందు ధైర్య హానియు శోకంబును గోపంబును లేమిని మెచ్చి వరం బిచ్చియుం దనివి సనక తనువులతోడన మీరు నాకలోకం బాలోకించునట్లుగా నీగంగాతీరంబున సంఘటించితి దానిం గని నరేంద్రత్వంబు దెస నుదాసీనభావంబు నొంది బ్రాహ్మణ్యంబునందు సస్పృహుండవై తది యెఱుఁగుదు నీకు మూఁడవవాఁడు బ్రహ్మతేజోదీప్తుం డయి జనియించు వరంబు వేఁడు మనుటయు నమ్మానవపతి దీనికం టెను గడచినవరంబును గలదే మదీయసంతానంబు బ్రహ్మత్వప్రాప్తమహత్త్వనిరూఢంబును గాఢధర్మతత్పరంబునుం గా ననుగ్రహింపు మనిన నమ్మౌని యట్ల యయ్యెడు మూఁడుము నీదుమనుమండు త్రిలోకపూజనీయుం డని పల్కిన నప్పతి వాఁ డేనికతంబున బ్రాహ్మణుం డగు నత్తెఱం గెఱింగింపవే యనవుడు నత్తాపసోత్తముండు విను మస్మద్వంశంబున [1]ఋచీకుం డనువాఁడు జన్మించి నీతనయుం డైన గాధియనియెడు వాని పుత్త్రి భార్యగాఁ బరిగ్రహించు నత్తపోధనుండు తననందనుం డగు జమదగ్నియందు సమస్తధనుర్వేదంబును నావహించు నవ్విశేషంబు తత్పుత్త్రునందు ఫలియించు నదియంతయు సకలక్షత్త్రియక్షయకారి యైన దైవంబు కృత్యంబు దానివలన ఋచీకగాధివధూజనానుష్ఠానపరివర్తనంబు గలుగు నదికారణంబుగా నుగ్రక్షత్త్రధర్ముం డగు పరశురాముండు జమదగ్నికిం బరమబ్రాహ్మణ్యగణ్యుం డయిన విశ్వామిత్త్రుండు గాధికి జని

---

380 1. దఁదానిట్లనియెన్ పి ఠ. ష

381. 1. ఋచీకుండనువాడు – ఠ ష. పెక్కుప్రతులు

యింతురు బ్రహ్మాపలుకు సత్యంబ యుష్మదన్వయంబు భార్గవకులసంబంధం బున జనశ్లాఘనీయం బయి వెలయం గలయది యేను దీర్ఘంబునకుం జనియెద నీవు సుఖివై యుండుమని చెప్పుటయు నప్పుడమిఱేఁడు భార్యాసహితం బుగ సవిశేషవినయం బగువందనం బాచరించి వీడ్కొని చనియెఁ జ్యవ నుండును నిజేచ్ఛం జనియె నిది పరశురామవిశ్వామిత్ర జన్మప్రకారంబు.

—: *భీష్ముఁడు ధర్మజునకు దానవిశేషముల నెఱింగించుట* :—

సం 13-92-28 (కుంభ)

882. క. అని కురుపితామహుఁడు సె
ప్పిన విని ధర్మాత్మజుండు ప్రియమందుచు నా
తనితో దానవిశేషము
లనఘా యెఱిఁగింపుమనుడు నతఁ డిట్లనియెన్.

883. సీ. కాంస్యోపదోహయుఁ గాంచనచారుశృం
గయు ధవళాంబరకలితయును స
దక్షిణయును నయి తగుగోవుఁ బాత్రత్వ
భవ్యవిప్రునకు సద్భక్తితోడ
నిచ్చినదానికి నెన్నిరోమములన్ని
దివ్యవత్సరములుఁ ద్రిదశలోక
మున వసింతురు కులంబున యేడుతరముల
జనముల సుగతికి ననుతు రధిప

ఆ. కన్యభూమిగృహము కనక మన్నము జల
మంబరంబు శయన మాసనంబు
వాహనంబు విప్రునకు నీగి లో
కములు రెంట సౌఖ్యకారి యండ్రు.

884. క. అనిన విని పాండవాగ్రజుఁ
డనఘా యిన్నింటికంటె నధికంబగుదా
ని నెఱింగింపు మనుడు న
జ్జనపతి కిట్లను నతఁడు ప్రసన్నాత్మకుఁడై

835. తే. అర్థి గోరినవస్తువు లర్థితోడ
నీఁగి యెల్లదానములకు నెక్కుడరయ
నఖిలభూతమ్ములకు నభయంబు నిచ్చు
టంతకంటెను మేలందు రార్యజనులు

836. వ. అని చెప్పి విను మని మఱియు నిట్లనియె.

837. తే. వీరశయనంబు మేలండ్రు వీనికంటె
మఱియుఁ గొన్నింటికంటెను మనుజనాథ
దానముల కావు వెదకిన దానిఁ బోల
లేవు పుణ్యకర్మములలో నేవియైన.

838. వ. అనుటయు ధర్మజుండు తమ్ములదెసం గనుంగొనిన వార లతని చిత్తం బెఱింగి రణమరణస్తుతి సేయ నతండు సమరంబునం జచ్చిన బంధుమిత్రజ్ఞాతిజనంబుల వలనిశోకంబు వదలి వాహినీనందను వాక్యంబు లభినందించె నా దేవవ్రతుండు వెండియు.

839 క. అరియైన దీనుఁడై తను
శరణంబని వేఁడినం బ్రసన్నాత్మత న
ప్పురుషునికోరిక దీర్చినఁ
బురుషోత్తముఁ డందు రతనిఁ బురువవరేణ్యా.

840. క. అడుగక యున్నను నాలిం
గొడుకుల రక్షింప లేక కుతిలపడుచు నె
ప్పుడుఁ జేవతనము గలనరు
నెడ రుడుచఁగ వలయునది మహితగుణ మనఘా.

841. క. నిజదారపరులు సంతత
యజనరతుల్ గామరోషహంతలు నగున
ద్విజుల నరసి ధనమిచ్చుట
త్రిజగత్ప్రాజ్య మగునండ్రు ధీరవిచారా.

842. వ. అనినం బాండవాగ్రజుండు యాచనాయాచనంబులలో నెయ్యది దానార్హం బగునని యడిగిన నతనికిఁ బితామహుం డిట్లనియె

843. చ. అడిగిన నిచ్చుకంటెను నయాచకుఁ గాఁగ నెఱింగి యిచ్చు టె
క్కుడు ఫల మిచ్చు దానవిధికోవిద వేఁడుట సావు వేఁడగాఁ

బడుటది పెద్దసావు దగు బ్రార్థన పూర్ణము సేయునాతఁ డా
యడిగినవానిఁ దన్నును దయారతిఁ గావఁగఁ జాలువాఁ డగున్.

844. వ. అనిన విని యుధిష్ఠిరుం డతని కిట్లనియె.

845. క. దానము యజ్ఞక్రియ నాఁ
గా నతులితధర్మవిధులు గల వందు ధరి
త్రీనాథోత్తమ యధికఫ
లానూనం బై వెలుంగు నది యెయ్యదియో.

846. వ. విన వలతుం జెప్పవే యని యడిగిన నయ్యనిమిషనదీనందనుం డప్పాండు
నందనాగ్రజున కిట్లనియె

847. ఉ. భూసురకోటికిన్ వినయపూర్వముగా ధనధాన్యగోమణి
క్ష్మావిలాన్న ముఖ్యములు సమ్మతి నీగి సుయజ్ఞ మానసో
ద్భాసిత [1]సత్క్రియన్ నడపుభవ్యుఁడు యజ్ఞములుందతంబులుం
జేసినపుణ్యముం బడయుఁ జేయును దానము లోపి నిత్యమున్.

848. క. అనవుడు నాతనితో ని
ట్లను గుంతీతనయముఖ్యు డనఘా పెక్కుల్
వినఁబడు దానము లధికం
బునఁ దగియెడు దాన మెద్ది యన్నిటిలోనన్.

849. వ. అని యడిగిన నయ్యాపగాసూనుం డమ్మానవపతి కిట్లనియె.

—: భూదానమహిమాభివర్ణనము :—

నం. 13-61-1

850. క. దానము లన్నిటికినిభూ
దానం బెక్కుడు సమస్త ధాన్యములుఁ బ్రభూ
తానేక వస్త్రధనర
త్నానూనత్వమును భూమి [1]నవుటకతమునన్.

851. క. కనకము రజతము వస్త్రం
బును ధాన్యము వివిధరత్నములు నిచ్చినయ

847. 1. సత్క్రియల్ - కొన్నిప్రతులు.

850. 1. నగుట - పెక్కుప్రతులు.

ర్విను తఫలంబుల నెల్లను
గను నుత్తమభూమిదానకర్త నరేంద్రా

952. సీ. భూమి కెంతాయువు భూదానకర్తయు
నంతకాలము సుఖమందుచుండు
నమరలోకంబున నల్పమైనను భూమి
యిచ్చిన బహుభూమి యేలు నతఁడు
రాజు విశేషించి రణమృతి యొందెను
భూదాన కర్తృత్వ పుణ్య మొందెఁ
బడయంగ వలయుఁ జూపఁగ నోపు
బ్రహ్మహత్యాది పాతకములనైన భూమి
తే. దాన మెంత పాపాత్ముచే నైన భూమి
గొనినఁ గల్మష మొందదు వినుము మహిత
మైన భూదాన విధియును నశ్వమేధ
యాగ[1]మును సదృశంబు లం డ్రాదిమునులు.

953. క. దారిద్ర్యముచేఁ గుందుచు
నేరని నడుగంగఁ బోవ కెంతయుఁ గృశతం
గూరిన విప్రున కుర్వర
వారిని దయ [1]నీగిఫలము వాగ్గోచరమే

954. తే. యాగకర్తయు శాంతుండు నైన యట్టి
విప్రుఁ బ్రార్థించియైన నుర్వీప్రతిగ్ర
హంబు సేయించు టత్యధికంబు భూమి
దానవిదివిశేషంబులలోన నెల్ల.

955. క. విను మర్త్యుఁడైన విప్రున
కనఘా [1]గోచర్మమాత్ర యగు మేదిని ని
చ్చినఁ బోనియట్టిపాపము
నినుపొడువునఁ జెడనితమము నెందును [2]గలవే.

---

952. 1 మునకునసదృశమంచు రాదిమునులు – ఒ. శ ష. న
953. 1. నిచ్చుఫలము – అ
955 1. గోచరణమాత్రయగు _ అ ఈ. ఐ ఖ. 2. గలదే – పెక్కుప్రతులు.

౮౫౬. క. ఆజిపాప్రభృతులుగురు
పూజకులును మఱియు నెట్టి పుణ్యాత్మకులున్
రాజోత్తమ భూదాన
భ్రాజిష్ణునిఁ బోల రంద్రు పరమమునీంద్రుల్.

౮౫౭. వ. అని చెప్పి భీష్ముండు వెండియు నిట్లను భూదేవి జనులకు హితంబుగా నానతిచ్చిన వాక్యంబులు [1]భూగీత లనంబరఁగు వాని విని పరశురాముండు భూదానపరుం డయ్యె నని విందుము పాండవాగ్రజా యవి నీ వాకర్ణింపుము

౮౫౮. క. నను నిందు రెండులోకము
లను జెడని యశస్సుఖంబులం బడయఁగఁ గో
రినయట్లయినను దీనికి
[1]నెన శేవు సుఁడీ తలంప నేధర్మములున్

౮౫౯. చ. ఇతరులదాన[1]మేనిఁ దను యీఁగియ యేనిని నన్ను మార్తురే
మఱి నరకాధివాసగతి మాన్పఁ దలంచుట గల్గినఁ సమం
చితముగ భక్తినిచ్చుట కుశీలత మూర్చుట నాకు హర్షభా
సితయుఁ బరాభవవ్యథయుఁ జేఁత సుఁడీ యిదె చాటిచెప్పెదన్.

౮౬౦. క. వినుఁ డుభయలోకముల మే
లొనరింతుం గీడొకింతయును నిలువఁగ నీ
క నిరాసంబు నొనర్తును
నను నిచ్చిన నెట్టిదుర్జనములకు నైనన్.

౮౬౧. వ. అనియె నని యవ్వాక్యంబు లుపన్యసించి దేవవ్రతుం డన్నరదేవోత్తము నకు మఱియుం జెప్పు నవ్విషయంబున నింద్రుం డడుగ బృహస్పతి సెప్పిన వచనంబులు వినుము చెప్పెద.

౮౬౨. ఆ. భూమి రత్నగర్భ పురుహూత యటుగాన
కలుగు భూమిదాన కర్తయైన
వాని కశ్వహస్తిపనితాది సర్వర
త్నములు [1]నిచ్చునట్టి యమితఫలము.

---

౮౫౭. 1. భూమిగీతంబులు – పెక్కుప్రతులు

౮౫౮ 1 నెనయవుసుండీతలంపనేధర్మంబుల్ - ఎ. ఔ. ఖ; నెనగావు – వ

౮౫౯. 1 మైన – కొన్నిప్రతులు.

౮౬౨ 1. నిచ్చినట్టి – కొన్ని ప్రతులు

౮౬౩. క. వసుదాయిని యైనవసుధ
నొసఁగి నతనిఁ దన్నుతన్ను నొసఁగె ననుచు సం
తసపడు భూతము లన్నియు
నసమానము భూమిదాన మమరాధీశా.

౮౬౪. క. విను రాజులకు నవశ్యం
బును జేయఁగవలయు నధికభూదానము రా
జునవాఁ డఘముల[1]కాకర
మనఘా యిది దక్కనొంట నది [2]వ్యయమగునే.

౮౬౫. ఆ. పూర్వదత్తయైన భూమి నెవ్వఁడు పుచ్చి
కొనియె నతఁడు తనదు కులమువారి
నిరువదొక్కతరము నరకవాసులఁ జేయు
దాను [1]నడుము గాఁగ ధర్మ[2]నిరత

౮౬౬. క. మును దా విప్రున కిచ్చెద
నని భువి యీకుండుకంటె నధికపుఁ బాపం
బును నడుగ కిచ్చుటకు మిగి
లిన పుణ్యము నెందు నరయలే వండ్రు బుధుల్.

౮౬౭. వ. అనిన విని యజాతశత్రుండు సురనదీపుత్త్రుతో దానపరులయినమానవు
లకు దాతవ్యంబు లగువానివిశేషంబు తెలియింపవే యనుటయు నతం డన్న
కనకపానీయప్రముఖంబు లైనపదార్థంబుల విశేషంబులు గల వవి యెఱిం
గించెద నొక్కనాఁ డన్నంబువిషయం బైనదానంబు ప్రకారంబు.

౮౬౮. క. ఏ నడుగఁగ నారదముని
మానితముగఁ జెప్పినట్టి మాటలు సువ్య
క్తానూనవృత్తిఁ జెప్పెద
భూనాయక [1]యేకచిత్తమున వినువానిన్

---

౮౬౪. 1. ప్రోవగుననఘా - శ ష. 2. వ్రయమగునె - కొన్నిప్రతులు.

౮౬౫. 1. మున్నుగాగ - అ. ఇ. ఈ వ శ. ష. స. 'దశపూర్వేషామ్ - దశాపరేషామ్' అను వాక్యమున్నదికాన "నడుముగాగ" అనుపాఠమే సమీచీనముగా నున్నది. 2. తనయ - కొన్నిప్రతులు.

౮౬౮. 1. నియత చిత్తమున - ఊ. చ.

869. క. మునులును దివిజులు నన్నము
వినుతింతురు లోకతంత్రవిధి గ్రతువులఁ ద
క్కను గల సర్వము నన్నం
బున నడచుం గాన యన్నము విశిష్ట మిలన్

870. ఆ. అన్నదానసదృశ మగుదాన మెందు
నెన్నఁడును లేదు గావునను విధేయ
మన్నదాన మధికయత్న[1]పూతంబుగా
బూని దానిచేఁత పుణ్య[2]తమము

871. సీ. ప్రాణంబులకు [1]విధారక మన్న మింటి జ
నంబున కుడిగి యైనను సుభక్తి
నతిథికిఁ బెట్టుట యధికపుణ్యము శ్రాంతు
వృద్ధుఁ దాపసు బాలు వికలు వనితఁ
గడపఁగా రాకఁలి గదిరి యర్థించిన
గృహమేధి [2]కవమతి గినుక దగదు
కాలంబుతోఁ గుక్క మాలఁడు దుది గాఁగ
నాఁకొని వచ్చిన ననుగుణముగ

ఆ. నాచరింపవలయు నాహారకల్పన
మునుల దేవపితృసముత్కరముల
నన్నదాన విధుల నాదరంబుగఁ బ్రియ
మొందఁ జేఁత లోల వొండు విధులు.

872. క. కులమును విద్యయు వృత్తము
నలఘుమతీ యన్నమిడుటకై యడుగంగా
వలవదు విప్రుని [1]నాదర
మలరంగా నిడుట తెప్ప యడిగినమాత్రన్

873. వ. అని వెండియు

---

870. 1. పూర్వంబుగ - ల 2 మనఘ - కొన్నిప్రతులు.

871 1. సుధారక - కొన్నిప్రతులు 2 వారితోఁగినియదగదు - ఉ. ల

872. 1. సుదరంబలరంగా - స

874. తే. అజుఁడు కల్పాదియం దన్న మమృత మనియె
నన్నమౌని బలాధికునైన దుర్బ
లాత్ముఁగాఁ జేయుఁ గావున నన్న భుక్తి
సకలధాతు వృద్ధికి నయి జనము గోరు.

875 క. అని యతఁడు వల్కె నని యును
విని యన్నము నవినయముగ విప్రాదులకున్
మనుజేశ యిడుదు నీవును
మన మలరఁగఁ బెట్టుమీ సమస్తజనులకున్

876. ఆ. అన్నమిడిన మణిమయావాసశయ్యాస
నములు నమృతభోజనంబు వ్యాద్య
మాల్యలేపనములు మహనీయ మహిళాను
భవముఁ జిరత నొందు దివమునందు

*-: నక్షత్రదాన మహిమాతిశయ నిరూపణము :-*

సం. 13-63-1

877. వ. అనిన విని యుధిష్ఠిరుండు నక్షత్రవిషయంబులైన దానంబుల తెఱంగెఱిం గింపవే యనుటయు నిట్లు దేవకీదేవి యడుగ నన్నారీరత్నంబునకు నార దుండు సెప్పిన వాక్యంబులయర్థంబు లుపన్యసించెద నాకర్ణింపుము.

878. సీ. [1]కార్తెఁ బాయసమున్ఘృతయుక్తనిశాకర మా
మములు మాంసమ్ము నంజంగఁ గలుగు
నన్నంబు శశితారయందు గోవార్ధ్రి న
దిలి తారఁబులగంబు దీపుగలయు
నట్టులు గురుతార నధిప సువర్ణ మా
శ్లేషఁ రూప్యము మఖఁ జెల్లు నువ్వు
తిలలు భగుం డధిదేవతయగుతారఁ
జెఱకుఁ దేనియ నుపాసి క్తమైన

878. 1. కర్త్యబాయన - ఉ తూ. వ పీ న 2 రౌప్యము - కొన్నిప్రతులు

తే. భ క్తము త్తరఫల్గునిఁ బాలతోడ
షాష్టికాన్నంబు రవితార సకరి రథము
చి త్తనాఁడు శ్రీగంధపుఁ జెక్క స్వాతిఁ
దనకుఁ బ్రియమైన యది మేలు దానమునకు

379. సీ. అనఘ విశాఖ నెద్దనురాధఁ జై చీర
వినుజ్యేష్ఠఁదగఁ గలివేముగూర్చి
మూల్లంగి మూల సమూలఫలంబుఁ బూ
ర్వాషాఢఁ[1] బెరువు త్తరాఖ్యయైన
యాషాఢ మాఁడికార్ద్రాన్నంబు హరివసు
జలతారకములఁ గంబళము గుజ్జు
లమరినబండియు యవలఁ బూర్వో త్తరా
భా ద్ర[2]పౌష్ణాశ్వినీభరణులందు

తే. గ్రోవ్వగలమేకనంజుడు గొఱియయొఱచి
కంచుకుండతో మొద వళ్వకలితశకట
మతులతిలధేను [3]లీఁ బాడి యఖలతార
కముల నీగులు నూర్ధ్వలోకములఁ జేయు.

380. వ. అని యెఱింగించి యమ్మానవపతితో నమ్మానసీయుం డిట్లనియె.

381. క. అలఘుతరసకలకామ్యం
బుల నిచ్చినయట్టిమహిత పుణ్యంబై తా
వెలుఁగుఁ గనక మిచ్చుట యని
పలికెం గర్మజ్ఞుఁ డత్రి పరహితచరితా.

382. తే. కనక మాయుఃప్రదంబు పావనము భావ
శుద్ధి నొనరించు దాతకు సువ్రతమున
వేడ్కతో దాని నిచ్చుట వేఱపొగడ
నేల యనియె హరిశ్చంద్రుఁ డిద్ధతేజ.

383. క. పానీయదాన ముత్తమ
దానంబని యఖిలధర్మ త త్త్వద్రష్టపరి

379 1. బెరుగు -కొనిప్రతులు 2 పూషాశ్వినీ - పీ శ ష. పెక్కుప్రతులు. 3.పీడగునలిల - శ

జ్ఞానానూనుం డగుమను
మానవపతిసెప్పె నృపసమాజవరేణ్యా.

884\. క. కావునఁ జెఱువులు సూతులు
బావులుఁ గొలఁకులును నెపుడుఁ బౌరవవర్యా
కావింపవలయు నవి గడుఁ
బావనములు పుణ్యలోకభాగిత నిచ్చున్

885\. క. అనఘా యెవ్వనికావిం
చిన సలిలాశయమునందుఁ జెలఁగుచు గోవుల్
గొనునీరాతనివంశం
బున కవి గావించు నూర్ధ్వభువనప్రాప్తిన్.

886\. తే. ఆఁక లేక యెవ్వానిజలాశయమున
మందువేసవియందును మనుజకోటి
యవభృథస్నానపానంబు లాచరించు
నతఁడు వొందఁడు విభిను[1]దుర్గ్గాదిగతులు

887\. క. యాగాదికర్మముల కుప
యోగింపబడుటఁ జేసి యుత్తమము ఘృతం
బాగురువస్తువునిచ్చుట
యాగములకు నగ్నికిం బ్రియంబై యుండున్.

888\. తే. గరగ లొసఁగిననరుడు భూసురు లొనర్చు
నాచమనముఖ కర్మంబులందు వష్ఠ
భాగఫల మొందు నెగడికిఁ బాచనమున
కింధనము లిచ్చి ధనముల నెసక మెసఁగు

889\. ఆ. ఛత్త్రమిచ్చికాంచుఁ బుత్త్రిలఁ బురుషుండు
సకలకామ్యదానసమము శకట
మిచ్చు టనఘ చెప్పులిచ్చినఁ గంటకు
లైన రిపులఁద్రొక్కి [1]యతఁడు దిరుగు

---

886\. 1. దుర్గాది గతులు – పెక్కుప్రతులు

889 1. యడచి తిరుగు – కొన్నిప్రతులు

౩౯౦ క. తిలలు పితృభోజ్యములుగా
జలజభవుఁడు సేసెఁ బితృనిచయ మలరఁ గడుం
దిల లిచ్చిన ఋచు లగుదురు
దొలఁగుం బర్వసురతాది దోషములెల్లన్.

౩౯౧. తే. దివ్యముని యగుకాశ్యపుభవ్యగాత్ర
ములఁ జనించి [1]భవ్యంబులై తిలలు వెలయు
నట్లుగావునఁ దత్కృతయజన ముఖల
వస్తుయజనంబుతోఁ సరివచ్చు నండ్రు.

౩౯౨ క. తిలదాన మఖిలదానం
బులకంటె విశిష్ట మెల్లమునులును నియతిం
దిల లర్హము లగుపాత్రం
బుల కిచ్చియ కాదె పెంపు వొందిరి వత్సా.

౩౯౩. వ. అని చెప్పి యాపగాతనయుం డొకవిశేషంబు విని[1]పింపవలసి ధర్మజున కిట్లనియె

౩౯౪. ఉ. దానము లాగిగాఁ గలుగుధర్మము లెల్లను జేసెదున్ నిజా
ధీనపుఁజోటు గావలయు దేవతలన్ మునులుం జతుర్ముఖుం
గానఁగఁ బోయి యజ్ఞముఖకర్మసమాచరణార్థమై తదీ
యానుమతిం దగం బడసి యయ్యయిచోటుల నాచరింపరే.

౩౯౫. క. కాననము గిరులు నదులును
నానాతీర్థములు భూజనంబుల కెల్లన్
భూనుత సాధారణములు
వానను ధర్మములుసేయవచ్చు నిజేచ్ఛన్.

౩౯౬. ఆ. అధిప వామనమునయందుఁ దోఁచినయది
యాచరింపవలయు నర్థమగుటఁ
జేసి దీని నీకుఁ జెప్పితి గోదాన
శస్తమహిమ వినుము విస్తరింతు.

---

౩౯౧. 1 దివ్యంబులై - కొన్నిప్రతులు.

౩౯౩. 1 పింపందలంచి - కొన్నిప్రతులు

397. సీ. గోవులెక్కుడు తపోభావితాత్మకం బె
నని దద్గౌరవంబునకు మేర
గలదె సత్యాఖ్యలోకంబున నవిసోమ
సంగతత్వంబున సంచరించు
వినుతహోమములకెల్లను పాలుఁ బెరుగు నే
యును నిచ్చుఁ [1]గర్సనంబునకు నోదవుఁ
దోలు శృంగంబులు వాలంబు రోమచ
యము శకృన్మూత్రము లఖిలవర్త

ఆ. నముల కుపచరించు శ్రమము శీతాతప
వ్యథయు లేమి నెపుడు నతిభరంపుఁ
బనులు సేయు గోవు బ్రాహ్మణుఁ డన నేక
తత్త్వ మగుటఁ బరపదంబుఁగాంచు.

398. క. గోవుల విప్రుల కిచ్చిన
నేవిషమపుగతులఁ బొరయ కేరికి నరుగం
గా వశము గానిలోకము
లావాసంబులుగ నిలుతు రతిసుఖవృత్తిన్.

399. క. గోవులపా లమృతంబని
దేవేంద్రుఁడు సెప్పెఁ గాన ధీరత్వనిధీ
గోవు నొసఁగ నమృతము స
ద్భావంబున నిచ్చినట్టి ఫల [1]మొదఁగూడున్

400 తే. అనఘ గోవులు ప్రాణంబులని సమస్త
మునులు సెప్పుదు రట్లుగావునఁ దలంపఁ
బ్రాణదానవిధాన సంప్రాప్తమైన
ఫలము గోదానకర్తకుఁ గలుగుఁ జూవె.

401. క. క్రూరునకు నాస్తికునకు దు
రాకంథున కిచ్చినం బరమదుఃఖమునుం

397. 1. గర్శనంబు - పెక్కుప్రతులు.

399. 1. మొనగూడున్ - పెక్కుప్రతులు.

గూడను గోవది దాతను
నారకిఁ [1]జేయుం బరీక్షణము గడు వలయున్.

402. ఆ. గొడ్డు బడుగుఁ దెవులుగొంటుఁ గ్రేపెడలిన
దాని నెచ్చుచేసి నూనమైన
యట్టిదాని నొకట నాయాసపడియున్న
దాని నీఁగ గోప్రదానవిదులు.

403. క. విను పుణ్యలోకముల [1]కా
వనఘా విప్రులకు గోచయంబులఁ బెక్కి-
చ్చిన యవి దాతకు మాతృం
బును జేయఁగఁ జాలు నండ్రు పూర్వాచార్యుల్.

404. వ. అని చెప్పి గాంగేయుం డన్నపానీయదాన ఫలాతిశయంబులు వెండియు వినిపింప వేడ్కసేసి యవ్విభున కిట్లనియె.

405. సీ. అధిప యింకను విను మన్నంబు జలమును
నిచ్చుట [1]యీవులకెల్ల నెక్కు-
డగుట నేఁ జెప్పెద నమృతసుధా[2]స్వధా
నామముల్ సురలందు నాగకులము
నందును బితృకోటియందును వర్తిల్లు
నన్నంబునకు నోలినట్లుఁ గాక
యది ప్రాణ మండ్రు మహాత్ములు గావున
దానిఁ బెట్టుట ప్రాణదాన సమము
తే. విను విశేషించి [3]తత్పాకమునకు జలము
పాశ్రయము చంద్రునకుఁ బుట్టఁ బట్టునయ్యె
జలము చంద్రుండుగాఁదె యోషధులఁ బ్రోచుఁ
గాన యుత్తమ మన్నంబుకంటె జలము.

406. వ. అని పలికి మఱియును.

407. క. తనకుఁ గలయట్టి యన్నము
నన సురపితృపూజనములు నరునకు నడపం

---

401 1 జేయ పరీక్షణముగడు - ఎ. వ.

403 1 కాదనఘా, కాకనఘా - అనిపాఠములు.

405. 1 యీగులకెల్ల - పెక్కుప్రతులు 2. ద్వయనామము లే - ఋ.ఖ. 3. తద్దానమునకు జ.

జను నతిథితర్పణము దా
నన తగ నొనరించువాఁడు నరవరముఖ్యా

408. వ. అని నిర్దేశించి తిలదానం బత్యాదరణీయం బని ప్రసంగించి యది యెనినది
యైనను నేమి తద్విషయంబున నొక్కయితిహాసంబు గలదు చెప్పెద విను
మని పలికి యనిమిషనదీనందనుండు కుంతీనందనాగ్రజుతో నిట్లనియె.

—: తిలదానవిషయక యమబ్రాహ్మణ సంవాదము :—

సం 13-67-1

409. సీ. మధ్యదేశమున గ్రామంబు విద్వజ్జన
[1]బహులమై యొక్కటి పర్ణశాల
యనుపేర నొప్పారు నందుల విప్రుని
శర్మనామునిఁ బ్రీతి జముఁడు పిలువఁ
బనిచి దానములకెల్లను దిలదాన మె
క్కుడు తిలలకుఁ బితృకోటి వేడ్క
సేయుఁ బాపంబులు సెందవు తిలభక్తిఁ
బుణ్యాకృత్యంబు బుద్ధిఁ గోరు

తే. దేనిఁ దిల లెప్డు విప్రుల కిమ్ము భక్తి
ననియె వస్త్రప్రదీపము లీగి యతులదాన
మనఘ చీరల దివియల నమర పితృస
మర్చనము సేఁత పరమధర్మ మని చెప్పె.

410. వ. అని యిట్లు యమబ్రాహ్మణ సంవాదంబు వినిపించి శాంతనవుం డమ్మ
హీకాంతు నాననంబు సవిశేషాదరంబున నాలోకించి.

411. క. విను పృథివియును సరస్వతి
యును గోవును దానవిధికి నొక్కంతలుగా
విని యుండుదు వీనిం బో
లినదాతవ్యములు నొండు లేవని వింధున్.

---

409. 1 భరితమై - కొన్నిప్రతులు.

412\. ఆ. రాజముఖ్య తగు సరస్వతి శిష్యున
కొసఁగ భూమిదాన మూర్జితముగఁ
జేసినట్టి ఫలము సిద్ధించు ధేనువు
నిచ్చుటయును భూమి నిచ్చినట్ల

413\. క. అనయము గొంచెపువెలకుం
గొనవచ్చును సారభూత గోవును దానం
బున ఫల మధికము దానము
గొనినాతఁడు సుఖము దాన గొనుఁ జేసేతన్.

414\. ఆ దేవపితృసమర్చనావాసములు గోశ
కృత్ప్రలేపనమునఁ గీర్తనీయ
శుచితఁ బడయు నవిన సువ్రత గోవుల
భూరిమహిమ వేఱ పొగడ నేల

415\. తే కుడుపునకు [1]ముంద రొడ్డుల గోవునకు స
మంచితగ్రాసముష్టి నిత్యంబు నేఁడు
గాల మిచ్చిన నతఁ డెల్ల కామ్యములును
బ్రాహ్మణుల కర్థి నొసఁగిన ఫలము వడయు.

416 క. గోదాన [1]విధము సుపథగ
మై దాతకు నెల్ల మేలు నాపాదించున్
వేదప్రియ యది దురితో
త్పాదక మగు నాతనికి విపథగత మైనన్.

—: నృగచరిత్రము :—

సం. 13-69-1

417\. తే. దుష్టమైన గోదానంబు గష్టవృత్తిఁ
దెచ్చె నృగనాముఁడగు జగతీవిభునకు
న త్తెఱం గితిహాసమై యవనిఁ బరఁగు
వినుము సెప్పెద దాని వివేకధుర్య.

---

415\. 1 ముందరొక్కండ్ల - కొన్నిప్రతులు.

416\. 1. ఫలము -వ. పీ. ష.

418. క. ద్వారవతి నొక్క నూతం
దోరపుఁదను వక్కజ మగు తొండ నొకటి న
చ్చేరువ మెలఁగు జనులు గని
నీ రిది గలఁగించు నిట్లు నిలిచెన యేనిన్.

419. క. అని బలుమ్రోకులు వేగమ
కొని వచ్చి తగిల్చి లావు గొని [1]తిగువఁగ నా
ఘనజంతు వచలితంబై
యునికికి విస్మయము నొందు నుల్లంబులతోన్.

420. తే. కృష్ణుపాలికిఁ బోయి యక్కట మున్న
తెఱఁగు సెప్పినఁ జని దానిఁ దిగిచె వెడల
నమ్మహాత్ముఁ డెఱింగియు నర్థితోడ
నడుగ నది యేను నృగుఁడఁ జుమ్మనియె ననఘ

421. వ. అనిన విని యద్దేవుండు నీ వనేక గోసహస్రంబుల విప్రజనంబుల కిచ్చితని
విందు మిట్టి [1]దుర్జన్మంబు నీ కేల వాటిల్లె ననుటయు నమ్మనుజవల్లభుండు.

422. సీ. ఉత్తమ బ్రాహ్మణుం డొకనికి నొక్కనాఁ
డొక గోవు నిచ్చితి నుల్ల మలర
నతఁడును గొనిపోయె నది మేఁత కర్థిమా
కదుపులలోపలఁ గలసి వచ్చె
గోవుల మఱియును గోపాలకులు దాన
విధికినై తెచ్చుచో విధివశమున
వానిలో నదియును వచ్చి[1]న నెఱుఁగక
దానంబు సేసితి దాని మున్ను

ఆ. గొనిన యతఁడు దడవి కని యిది నాదుగో
వనియెఁ బిదపఁ గొనిన యతఁడు పెనఁగి
నాకు నృపతి యొసఁగె నా నిద్దఱకు వా
దైన నన్నుఁ గాన వరుగుదెంచి.

---

419. 1. త్రివ్వగ, త్రివ్వగ - అనిపాఠములు.
421. 1. దుర్దశంబు - ఒ క. వ
422. 1. నగొనక - శ ష.

423. వ. తమ ముందటిజెఱం గెఱింగించి.

424. క. ఇచ్చినవారల కోనఁగా
వచ్చిన నద్గంబు గలదె వసుధాధిప యం
చిచ్చఁ గడు నొచ్చి పలికిరి
వెచ్చని నిట్టూర్పు [1]లడర విప్రు లిరువురున్.

425. వ. మఱియుం గోడనుమాటల నమ్మోదవుపోకడ నాకుఁ దెల్లంబగుటయు.

426 ఉ. దానికి నేను చిత్తమునఁ దాపము నొందుచు మున్ను గొన్నయ
మ్మానితవిప్రు వేఁడికొని మంచివి గోవులు నీకు నూఱువే
యైనను నిచ్చెదన్ [1]విడువవయ్య మహీసురవర్య నెమ్మి న
ద్ధేనువు నన్న నాస్యమున దీనత దోఁపఁగ నాతఁ డిట్లనున్.

427 తే. పాలు గడుఁజెక్కు దాని సభాము తెప్ప
పెయ్య కర్మిలి గలదు మత్ప్రియసుతుండు
పాల కేడ్చినయపుడ చన్నట్టనిచ్చు
నేది ప్రొద్దైన నట్టిగో వెందుఁగలదు.

428. క. శ్రీవోలె నింటిలో నా
గోవుండఁగఁ జూతుఁగాని కోటిమొదవులుం
గావు సరి దాని కని భూ
దేవుఁడు వోవుటయు నేను దీనత దోఁపన్

429. చ. కనకము ధేనువుల్ మణినికాయము లిచ్చెద నేమిటైనఁ ద
క్కనను మది కిష్టమైనయది గోరుము గోవున కంచుఁ జేరి త
క్కిన ధరణీసుపర్వునకుఁ గీడ్పడి యెమ్మెయి వేఁడికొన్న నేఁ
గొన భవదీయరాజ్యమును కుత్సితవృత్తికి నియ్యకొందునే.

430. తే. అనియెఁ గాని నామాట కై కొనఁడ యాతఁ
డట్టియెడఁ గాలవశగతి యావహిల్లి
యమునికడ కేఁగ నాతోడ నతఁడు వికచ
నలినలోచన యిట్లని పలికెఁ బ్రీతి.

---

424. 1. గదుర, నిగుడ, తెనగ - అనిపాఠములు.
426. 1. విడువుమయ్య - క. ష. కొన్నిప్రతులు.

481. చ. జనవర పుణ్యకర్మము లసంఖ్యము లీవొనరించి తొక్క వి
ప్రునిధన మజ్ఞతం గొనుటఁ బొందె సకల్బిష భావ మల్ప మి
ట్లొనరిన రెంట నయ్యెడు మహోన్నతి దుర్గతులందు మున్ను నీ
చనునెడ యెద్ది నావుడు [1]నసౌఖ్యపుంజో టసి సమ్మతించితిన్.

482. ఆ. అట్టు లియ్యకొనిన యాక్షణమాత్ర మ
స్తకము క్రిందుగాఁగ ధరణిఁ బడఁగ
వలసె నపుడు వింటి నలఘుకృపార్ద్ర వ[1]
ర్ణాలికలిత మైనయముని పలుకు.

483. వ. అది యెయ్యది యంటేని.

484. తే. వాసుదేవుఁ డనేక సంవత్సరముల
కధిప నీ యున్నచోటికి నరుగుదెంచి
యుద్ధరించు నిన్నట నిత్యసిద్ధసౌఖ్య
మైన లోకమునకుఁ జను దనఘ నీవు.

485. వ. ఇట్లు వినుచు నిలాతలంబునం బడి కృకలాసత్వంబు నొంది చరియించుచుండి నేఁడు దైవదత్తం బయిన చిత్తవర్తనంబునం జేసి యిక్కూపంబునకు వచ్చిన యపరక్షణంబునం గృకలాసంబులకు లేని మేని [1]పెం పాహివల్లిన నుల్లంబు సవిస్మయం బగుచునుండ యమప్రసాదంబున నెప్పుడును మాయని పరిజ్ఞానంబు వర్తిల్ల నున్నంగం బరమయోగీంద్ర భావ్యం బగునీ భవ్య సన్నిధి దొరకొనియె నని పలికె నప్పు డప్పురమి తేనికిఁ బూర్వాచరిత పుణ్యకర్మానురూపం బగురూపం బావిర్భవించిన దానికిం బ్రమోదభరితుం డై యతండు.

—: నృగుఁడు శ్రీకృష్ణు వలనఁ బాపవిముక్తుఁడై పుణ్యలోకమునకుఁ బోవుట :—
సం. 19-69-29

486. తే. దేవ నీ దగుకారుణ్యదృష్టి యమృత
పూరమును బోలె నామీఁద [1]ప్రొలయుటయును

---

481. 1 తొరయుట, మెదలుట – అనిపాఠములు.
481. 1. నసహ్యపు జోటని సమ్మతించితిన్ – క
482. 1. వర్ణావలిత యైన యముని – అ. ఈ.
485. 1. సొంపావహిల్లిన – ఇ పీ శ. ష.

దీనదశ వాసె భవదనుజ్ఞానిరూఢి
నేను జనియెద ²నంచితస్థానమునకు.

437. క. అని సవినయప్రణామం
బున నారాధించి వృష్ణిపుంగవుఁ దగ వీ
డ్కొని యానృగుఁడు విమానం
బున నుత్తమలోకమునకుఁ బోయె నరేంద్రా

438. వ. ఇవ్విధంబున.

439. క. భరితానందుఁ డగుచు నృగుఁ
డరిగిన లోకహితకారియై కృష్ణుఁడు ని
ర్భరమధుర ¹తాతిహృద్యా
క్షరంబుఁగా నిట్టు లనియెఁ గౌరవముఖ్యా

440. క. ధరణీసుర ధనహరణము
దురితతమము నృపున కధికదోషము నృగగో
¹హరణక్రియ విప్రస్వా
హరణము భూపాలవరున కాపదఁ దెచ్చున్.

441. వ. అనియె నివ్వాక్యంబులు నీకుం జెప్పవలవ దైన నితిహాసావసానవర్తి యగుటం జేసి వినిపించితి నని చెప్పి యప్పాండవాగ్రజుతో భీష్ముండు వెండియు.

442. క. సత్సంగతి ¹సజ్జనులకు
నుత్సవ మొనరించు నృగున కున్నతిఁ ద్రిజగ
ద్వత్సలుఁ డగుకృష్ణుండు స
ముత్సుకతం ²జేరఁ జనుట యొసఁగిన మాడ్కిన్.

443. వ. అని పలికి మఱియును.

444. క. దానము సమగ్రఫలదము
భూనాయక గోవునెడ వి¹బుద్ధిత్వము గీ

---

2 నఁచిత - క. ష పెక్కుప్రతులు; సంచిత - వా.

439. 1. తాచి హృద్యాక్షరములుగా - పీ. క. ష

440. 1 హరణముక్రియ - పీ. క. ష పెక్కుప్రతులు.

442. 1 జనములకు మహోత్సవ - అ. ఇ ఎ ఏ క. ష. 2. అపము త్రియొనగిన - ఎ.

444. 1. బుద్ధిత్వము - కొన్నిప్రతులు; బుద్ధత్వము - వా

దైనది గావున గోస
మ్మానన మేమఱక యుండు మది యేర్పాడ్డున్.

445\. వ. అనిన విని ధర్మజుండు గోవులయెడ విరుద్ధాచరణంబున నయ్యెడు దురితంబు తెఱంగెఱింగించితి గోదానఫలవిశేషం బింకను వినవలతుం జెప్పవే యను టయు ననిమిషనదీనందనుం డిద్విషయంబున నైనది యొక్క యితిహాసంబు గల దాకర్ణింపు మని యతని కిట్లనియె.

-: గోప్రభావవిషయకం బగునౌద్దాలకి పుత్రచరిత్రము :-

నం. 19-70-1

446\. సీ. [1]అనఘ యౌద్దాలకి యనుమహాముని దన
తనయునిఁ బిలిచి యిధ్మములు దర్భ
కట్టయు జలపూర్ణకలశంబుఁ బువ్వులు
మఱచి వచ్చితి నేటి[2]మడఁ గుమార
గొనిరమ్ము వేగంబ చని యన్న [3]నాచికే
తాహ్వయుం డగునతం డరుగునంత
వాహిని పొంగిన [4]వత్తోడి యవి పోయెఁ
గానక యాతండు క్రమ్మఱంగ

ఆ. నరుగుదెంచి కాన ననుటయు నాఁకలి
దనదుకర్మ పై[5]కృతంబు సైఁపఁ
జాలకలిగి యోరి యముఁ జూడఁ బొమ్మని
శాప మిచ్చెఁ దండ్రి భూపవర్య

446\. 1 శ్వేతకేతుండను విశ్రుతముని-పీ శ ష. పెక్కుప్రతులుకాని మూలమునందు ఔద్దాలకి అనియే కలదు
"ఋషిరౌద్దాలకి ర్దీక్షామ్ ఉపగమ్య తతస్సుతమ్" భండార్కరు ప్రతి (19-70-2) పి. పి. యస్ శాస్త్రిప్రతి 1.-60-2. 2. మడుగునోర - శ ష. సూ, మడుగువార - ట, దరికుమార-ఊ ఈపాఠమున సాధురేఫ శకటరేఫములయతిసాంకర్యము కనబడు చున్నది. 3. సాధికేత - ఇ. ఏ శ ష. ఇట్టిపాఠమెచ్చటను కనబడలేదు 4. వత్తాత్తి; వత్తొడ్డి - అనిపాఠములు 5 కృతము సహింప -పీ శ ష. పెక్కుప్రతులు.

447. వ. ఇట్లు శపియించిన నబ్బాలకుండు గేలు[1]మోడ్చి ఫాలంబున మోపికొనుచుం బ్రసన్నుండ వగు మని పలుకు వలుకఁగాఁ జేతనారహితుం డై పడుటయు నమ్మునివరుండు.

448. క. కనుఁగొని పశ్చాత్తాపం
బున నుల్లం బెరియ నిట్లు పుత్రకునే నే
పని కై చేసితి విగళా
సునిఁగా నని మూర్ఛ మునుఁగుచుం బడియె ధరన్.

449 వ. పడి యొక్కింత సేపునకుం దేఱి [1]తనయుం దేఱిచూచి యశ్రు లొలుక [2]నబ్బాలకు నురంబున మొగంబు మోపి చేష్ట దక్కియుండ నద్దిన శేషంబును నయ్యామినియునుం జనియె సూర్యోదయసమయంబున.

450. ఆ. అతనికన్ను నీర నాప్లుతంబై నయా
శవము చేతనించి చలన మొంది
యెలమి న త్తపస్వి యాశించుచుండఁగ
న్దెఱచె నిట్లు మగుడఁ దెలివినొంది.

451. క తనుఁ గనుఁగొని యెడి సుతుతో
మునిపతి యిట్లనియెఁ బుణ్యముల [1]ప్రోఁకవు నీ
వనఘ చని పుణ్యలోకముఁ
గని మత్పుణ్యమున రాక గలిగెను మగుడన్.

452. క. నీదగు తనువున దివ్యా
మోదము సాంద్ర మయి నోదుముట్టెడు నత్యా
హ్లాద మహైశ్వర్యసము
త్పాది యగుచు నీగతాగతములం దెపుమా.

453. వ. అనిన విని యమ్మునిపతికిం బ్రణమిల్లి యక్కుమారుం డిట్లనియె.

454. సీ. నీయాజ్ఞఁ జని కమనీయ విశాలమై
మణిమయత్వంబున మహిత మగుచు

---

447 1. మొగిడ్చి -కొన్ని ప్రతులు
449 1. తనయుదెసంజూచి – పీ. స. 2. నద్దారకు _ అ. ఇ ఈ. ఉ. ఓ. చ.
451. 1. ప్రోవవు _ కొన్నిప్రతులు

వెలిఁగెడు సమవర్తి కొలువుకూటముఁ బ్రవే
శించితి నాతఁడు సేరఁ బిలిచి
యంచితాసనము వెట్టించి భవద్గార
వాతిశయంబున నర్ఘ్యముఖ్య
పరిపూజనముల సంభావించె నతనితో
నేలోకమున వసియించువాఁడ

తే. ననఘ యానతి యిమ్మ నా కంటి ననిన
నీవు సావవు నీతండ్రి నిన్ను జమునిఁ
జూడఁ బొమ్మని పనిచినఁ జూచి తండ్ర
యరుగు మమ్మనివగ పేద ననియె నతఁడు.

455. వ. అనుటయు నట్లకాక మగిడిపోయెద నీకడకు వచ్చితి ధర్మమయుండ వగు నిన్ను దర్శించితిఁ బుణ్యలోకంబులు దర్శింప వేడ్క పుట్టెడుఁ జూపవే యని విన్నవించిన.

456. ఉ. అంచితవాహనాకలితయానముఁ దేరఁగఁ బంచి నన్ను నె
క్కించి సహోధిరూఢుఁ డయి కేల్దనకేల నమర్చి సత్కథా
సంచయవర్తనుం డగుచుఁ జారుముఖాబ్జవికాస మొప్ప వ
ర్తించుచుఁ బుణ్యలోకములు ప్రీతి యెలర్పఁగ నాకుఁ జూపినన్.

457. తే. నయనములకుఁ జిత్తమున కానంద మొసఁగు
నట్టి మణి[1]గేహవాపికోద్యానములను
బరమ భక్ష్యభోజ్యాత్మకగిరులు హృద్య
దుగ్ధఘృతమయ ఘనసరిత్తులును గంటి.

458. వ. మఱియు గంధమాల్య దివ్యాంబరాభరణప్రముఖంబులగు భోగయోగ్య పదార్థంబులు మహోరాసులై యుండ నాలోకించితి నీలోకంబు లేపుణ్యంబులు సేసినజనుల కనుభావ్యంబు లని యడిగితి నడిగిన ధర్మరాజిట్టివారి వని యెఱింగించి యిందధికవిభవంబు లైన యట్టిమాననీయ స్థానంబులు గోదానంబు లాచరించినవారలయవి భక్ష్యభోజ్యగిరులును దుగ్ధఘృతనదులును వారివ యని చెప్పి వెండియు

457. 1. మయవాటికోద్యానములును - స

459. క. మానితపాత్రము సదను
స్థానంబును శ్రీశిభక్తి సంపన్నతలున్
ధేనువు మేలిమియుం గల
దానముఫల మిట్టి దనఁగఁ దరమె యజునకున్.

460. తే. బలము శేఁ ద్రాయమును రూపుఁ గలుగునట్టి
[1] గనపయెద్దు సద్ధర్మవిప్రునకు నిచ్చి
నతఁడు సద్విధి గోదాన మాచరించి
నతని పడసినగతిఁ గాంచు ననఘచరిత.

461. క. గోవులు సూర్యుని యుజ్జ్వల
గోవుల యట్లగుటఁ జేసి గోదానపరుల్
భూవినుతా సూర్యసదృశు
లై వెలుఁగుదు రిట్లు చెప్పు నాగమఫణితుల్.

462. క. అని పలికి వీడుకొలిపిన
మునివర యజ్ఞమునిచరణముల కెఱఁగి ముదం
బున వచ్చితి ననె జనకుని
మన మానందరసపూరమయతం [1]బొంగన్.

*-: ఇంద్రునకు బ్రహ్మ సెప్పిన గోదాన విషయక వాక్యము :-*

సం 13-71-6

463. వ. అని చెప్పిన కుంతీతనయాగ్రజుండు గోదానకర్త లెందేని [1]వసింతు రాలోకం బెట్టి దెఱింగింపు మనిన నన్నరదేవునితో దేవవ్రతుండు దీనికి బ్రహ్మవాక్యం బులు గల విట్లు యింద్రుం డడిగిన నతనికి బ్రహ్మ యిట్లనియె.

464. ఆ. అడిగి మేలుసేసి తాలోక మెవ్వరు
నెఱుఁగ కునికిఁ దెల్ల మేను సువ్ర

---

460. 1. ఘనపయెద్దు - శ. ష. అర్థము విచార్యము; ఘనత - కొన్నిప్రతులు.

462. 1. జెఁదెన్ - కొన్నిప్రతులు.

463. 1 వసియింతురాలోకం - కొన్నిప్రతులు.

తాత్ములైన మునులు సతుల పాతివ్రత్య
సతులు నెఱుఁగుదుము విశాలచిత్త

465. క. విను మయ్యెడఁ గాలక్రము
మును దప్పియు రోగములును మదిమియు [1]లేవ
ద్వినుతస్థానం బవ్యయ
మును గేవల సారసంప్రమోదకరంబున్

466. వ. దానిపేరు గోలోకంబు

467. క. గురుశుశ్రూషకులును స
త్యరతులు శమదమ వినిర్మలాత్ములు దుర్భ
క్త్యరహితులును నిత్తు రను
త్తర మగునచ్చోట గోప్రదానపరులతోన్.

468. వ. అని వెండియు.

469. ఉ. దాయధనంబు సంగర విధానముపార్జితముగా సధర్మకో
పాయసమాహితంబును శుభప్రతిపాదన లబ్ధముగా మరు
న్నాయక వెండియుం గలుగు నాయపుఁ జొప్పుల సొమ్ములుం దగుగా
గోయజనార్థసత్క్రియలకుం దెఱసొమ్ముల నైనఁ గీడగున్.

470. క. విను గోలోకంబును గడ
చిన లోకము గలుగ దూఁది చెప్పెదఁ బుణ్యం
బును గోప్రధానవిధి మిగి
లిన యట్టిది వత్స యొండు లే దరయంగన్.

471. తే. ఆగమాధ్యయనంబు వ్రతాభిరతియు
నైజకర్మశీలము గురుపూజనంబు
మాతృపితృరక్షణముఁ బాత్రమహిమ లప్ర
తర్క్యఫల[1]దాయి యైన గోదాన విధికి

472. క. అని నిర్దేశించిన న
వ్వనరుహ సంభవుని దివ్యవాక్యంబులు నె

465 1. లేదద్వినుత - కొన్నిప్రతులు

471. 1. ధామమైన - ఇ ఓ. క; దానమైన - ఌ కొన్నిప్రతులు

మ్మనమున నిడి గోయజ్ఞము
లనూనవిధి నడపె నింద్రుఁ డమలచరిత్రా

473. క. నీవును నవధానపరతతో
గోవుల మన్నింపు పాత్రకోటి కొసఁగు స
త్సేవిత పుణ్యచరిత్రము
లా వెరవునఁ బోల వెన్నియైనఁ గుమారా.

474. క. అని యిట్లు గోవిశేషము
లనేకభంగులను బాండవాగ్రజునకు శం
తనుసుతుఁడు సెప్పె నన విని
మునివర యే భంగి వాకంములు మఱి సెల్లెన్.

475. వ. అని యడుగుటయు

476. శా. ధర్మాధర్మ[1]విదూరనీతి పరవిద్వచ్చిత్తయోగీ జగ
న్నిర్మాణస్థితితంత్ర సంహరణ ధూర్నిర్వాహరాగీ మహా
శర్మాపాదనపాంసుపద్మ సుతపస్స్వాధ్యాయసద్మా మనో
మర్మద్రాలతికా ఫలత్వలసితా దాంతిస్ఫుటోద్భాసితా.

477. క. ప్రమదవిషాదాదిద్వం
ద్వమలా[1]విహితాంతరంగవాసా విశ్వా
గమవేద్యసముల్లాసా
శమరమ్యవి[2]భాస నియమజనితవికాసా.

478. మాలిని అకలుషహృదయాంతర్యాగ సం[1]సిద్ధమూర్తీ
నిక్షిదశకషట్కా[2]స్వీకృతి ప్రౌఢవర్తీ
సకృపలసదపాంగోత్సార్యమాణాశ్రితార్తీ
సకలనిగమచూడాచారు రంగైకవర్తీ.

*గద్యము.* ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధరాజి
తిక్కనసోమయాజి ప్రణీతం బైన శ్రీమహాభారతంబున నానుశాసనిక
పర్వంబునందు ద్వితీయాశ్వాసము

---

474. 1. శాంతనవుండు సెప్పె - వ పీ. శ. ష న.

476. 1 నిరూఢి - కొన్ని ప్రతులు.

477. 1. విహితాంతరంగ - పెక్కుప్రతులు 2 ధాస, భావ - అనిపాఠములు.

478. 1 వేద్య - పీ; సిద్ధ - క. చ. ల వా. (1965) శ. ష. 2. స్వీకృత - శ. ష. కొన్ని ప్రతులు.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆనుశాసనిక పర్వము - తృతీయాశ్వాసము

—o—o—

[1]శ్రీమహిమ దానకరుణా
[2]భూమోద్యాపి బహునామ పుణ్యస్తోమా
[3]రామహృదయధామ విత
ర్కామేయవిభూతిసీమ హరిహరనాథా.

*—: ధర్మజునకు భీష్ముం డనుష్ఠేయంబులఁ జెప్పుట :—*

సం. 13 - 74 - 1

2. వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు గోవుల[1]మహాను
భావంబు [2]విని పాండవాగ్రజుండు భీష్మునితో ధర్మంబులు తేటపడ ననుగ్ర
హించుచుం బయిలోట వాపి నన్నుం గలిపికొని కృపకు భాజనంబుగాఁ
జేయుటం జేసి కొంకక యింకను నడిగెదఁ దాత్పర్యంబున ననుష్ఠింపవలయు
నవి యెయ్యవి యెఱింగింపవే యనుటయు నతనితో నతండు.

3. సీ. విను నియమంబును వేద[1]పారంబుఁద
ద్ధరణంబు దమము నధ్యాపనంబు
నప్రతిగ్రహమును నాత్మీయకర్మని
ష్ఠయు సకలేంద్రియజయము సత్య

---

1. 1 శ్రీమహిమదానకరుణ - అ ఇ ఐ. ఓ. ఔ ఖ, శ్రీమహిమాధానకరణ - ఈ; శ్రీమహిమారాధనకర - ఒ; శ్రీమహితదాన - స. 2 భూమోద్యాపితసదామ - ఇ. ఉ. శ. ష. స. 3. రామదయాధామ - అ ఈ; రామజయోద్ధామవిత - ఎ.

2. 1. మహానుభావత్వంబు - ఈ 2. వినిన - అ ఉ. ఓ

3 1. పాఠము తదుద్ధరణంబు - అ ఎ; పారంబు నుద్ధరణంబు - ఉ

నిరతియు[2] శ్రుతదానపరతయు బ్రహ్మచ
ర్యముఁ బితృశుశ్రూషణమును మాతృ
శుశ్రూషణము గురుశుశ్రూషణము నను
కంపయు గో[3]వ్రతసంపదయును

ఆ. వత్స యాచరింపవలయునట్టివి యని
పలుకుటయును నాన్నృపాల[3]వరుఁడు
గో[3]ప్రదానవిధి యకుంఠిత[4]కృప నాకు
నెఱుఁగఁ జెప్పవే సమిద్ధ[5]బుద్ధి.

4. వ. అని యడిగిన యక్కురుపతికిం గురుపితామహుం డి ట్లనియె.

5. ఆ. తనియ మేసి నీరు ద్రావి మందకు వచ్చి
సౌఖ్య మెసఁగఁ బసులు శయన మొంది
యుండ నచట [1]నియతి నుండి మాంధాతృండు
పరమభక్తి నమరగురునిఁ దలఁచి

6. వ. ఇట్లు యదుగం [1]గలవాఁడై కరంబులు మొగిచి బహువిధంబులం బ్రస్తుతించిన నాపురుహూతపురోహితుండు ప్రత్యక్షం బగుటయు నప్పుడమితేఁ డమ్మహాత్ముని పాదంబులకుం బ్రణమిల్లి యడిగిన నద్దేవగురుం డన్నరదేవోత్తమున కి ట్లనియె.

—: బృహస్పతి మాంధాతకుఁ దెలిపిన గోదానవిధి ప్రకారము :—

నం. 19-75-4

7. ఆ. పుణ్యదినమునందు భూసురానుజ్ఞతో
నుపవసించి గోవు లున్నమంద
కరిగి పరమనియతి నయ్యహోరాత్ర మ
గ్గోష్ఠమున వసించి నిష్ఠతోడ

---

2. యుఁగృతదాన-ఒ ఓ. క, ‹గృహదాన – ఎ 8 కుండు – అ. ఈ. 4 వ్రత-ఉ; మతి – ఎ. 5. చరిత, తేజ – అనిపారములు.

5. 1. నిలచియుంటి – అ. ఈ

6. 1. దలంచిన వాఁడై కరంబులు – వ. ఔ. ఖ.

8 వ. మఱునాఁడు

9. ఆ. సంగవాభిధానసత్కాలమునఁ దన
యిచ్చుగోవుఁ [1]బేర నెలమిఁ బిలిచి
యజ్ఞుఁడు కరుణఁ జెప్పినట్టి యవ్వాక్యర
త్నముఁ బఠించునది యుదాత్తచరిత.

10. ఆ. తల్లి గోవు వృషము దండ్రి గర్భప్రదే
శంబు దివము [1]ధరణి సంప్రతిష్ఠ
యని పఠించి యోగ్యుఁడగువిప్రు నర్చించి
పలుకవలయు నీగి కలిమి దెలియ.

11. వ. తదనంతరంబ.

12. క. సారములగుగోవులు [1]మ
ఘోర [2]సకలకల్మషములఁ [3]ద్రుంచును సౌమ్య
త్వా[4]రూఢంబులు శాశ్వత
సారోదారపద మిచ్చి సౌఖ్యముఁ [5]జేర్చున్

13. క. అనిపలికి గోవు నిచ్చితి
ననుచు నుదకధారఁ బ్రీతి నవిప్రుకరం
బునఁ బోయవలయు నర్ఘ్యం
బనిచెప్పుదు రజ్ఞులంబు [1]నాదిమునీంద్రుల్

14 క. విను [1]శిష్యుఁడు వ్రతశీలుం
డనఘుఁడు శాంతుండు దాంతుఁ డక్రోధనుఁ డీ

---

9. 1. జేర - ల.

10. 1 దలఁప - ఔ ఖ.

12. 1. మద్భూరి - ఎ, ఔ. 2. నరక - ఉ ఊ. 3. ద్రుంచుచు - అ, ఋ, ఊ, ల.
4 రూఢముత్రె - కొన్నిప్రతులు. 5 జేయున్ - ఊ, చ.

13. 1. లాదిమునీంద్రుల్ - ఒ పీ, శ ష

14. 1. విప్రుడు - కొన్నిప్రతులు.

విసుత ప్రదానవిధికిని
జననాథవరేణ్య యెఱుఁగు [2]సత్పాత్రంబుల్.

15. ఆ. ఇవ్విధమున గోవు నిచ్చినయాతండు
చంద్రలోక[1]వసనసౌఖ్య మొందు
నని సురేంద్రమంత్రి యమ్మహీపాలుతో
నాదరమున నిట్లు లనియె మఱియు.

16. ఉ. మానవుఁ డోపి యాశ్వయుజమాసము [1]రెండవునష్టమిం దగం
బూని దినత్రయంబు పరి[2]పూరితగోష్ఠతలంబునం బ్రతా
ధీనతఁ బెండ యన్నమును ధేనువుమూత్రముఁ [3]బాలుఁ బానముం
గా నియతిం వసించి బహుకామ్యఫలంబులఁ బొందు భూవరా.

17. వ. అని చెప్పె నట్లు బృహస్పతి నిర్దేశించినతెఱంగున మాంధాతృండు మహీ
సురులకు గోవుల నిచ్చి యుభయలోకంబులను [1]వినుతుం డయి వెలింగె
నవ్విధం బెఱింగె గోప్రదానపరులైన భరతదిలీప[2]భగీరథదాశరథిప్రభృతిభూప
తులు పుణ్యలోకంబులు వడసిరి పాండవాగ్రజా నీవును దేవగురూపదిష్టంబు
[3]లయిన యివ్వాక్యంబులు భావగతంబులు సేసికొని గోవిషయవిధిజ్ఞుండవై
విప్రోత్తములకు నుత్తమగోప్రచయంబుల నిమ్మనిన నమ్మనుమండు [4]తాతకుం
బ్రీతిం[5]బ్రణామంబు సేసిన నమ్మహాత్ముండు వెండియు నవ్విభున కి ట్లనియె.

18. క. రేపకడ నీరు ద్రావక
మేపు గొనక [1]మున్న గోవు మిక్కిలి భక్తిన్
భూపాల యిచ్చునది ది
వ్యాపార[2]సుఖంబుఁ బడయు నాత్మఁ దలఁచినన్.

---

2. సత్పాత్రముగన్ - ఆ

15. 1. వాససౌఖ్య, భవనసౌఖ్య, వసతిసౌఖ్య - అనిపాఠములు

16. 1 రెంతవయష్టమి - కొన్నిప్రతులు 2 పూరిత-వ. కొన్నిప్రతులు. 3. నెయ్యిపాలునుం - ఎ ఓ క; పాలునెయ్యునుం - వ

17. 1. వినతుండై వెలింగె - పెక్కుప్రతులు. 2. దశరథదాశరథి-పెక్కుప్రతులు, 3. లైన — పెక్కుప్రతులు. 4. తాతకుఁబ్రణామంబు - కొన్నిప్రతులు 5. బ్రణమిల్లిన - ఆ, పీ. శ. వ

18. 1 యున్న - కొన్నిప్రతులు. 2. సుఖంబుపడయ - కొన్నిప్రతులు.

19 క. మొదవులలో నెల్లఁ గపిల
మొదవు [1]వరిష్ఠంబు రాజముఖ్య నియతిమై
నది విప్రున కిచ్చు టరయఁ
దుది దానంబులకు నఱకు దురితాటవులన్

20. వ. అనిన విని కౌంతేయాగ్రజుండు కపిలగోవున కివిశేషం బెట్లు గలిగె నెఱిం
గింపవే యనుటయు గాంగేయుం డతని కిట్లనియె.

-: *గోవులకుఁ గపిలత్వంబు సిద్ధించిన ప్రకారము* :-

సం. 13-70-21

21. సీ. దేవత లాఁకొని దేవతాజ్యేష్ఠునిఁ
గానంగఁ బోవ నాకములజన్ముఁ
డమృత మిచ్చిన ముద మారఁగాఁ ద్రావఁ ద
త్సుగభిత్వసంపద సురభి పుట్టె
నది సౌరభేయుల నధిప యుత్పాదించె
నొకయప్డు హిమగిరియుపరితల మ
లంకరించుచు నవి శంక యించుక లేక
యున్నెడ వానిలో నొకటి లేఁగ

తే. చన్నుగుడువఁ దదాస్యనిష్యందమాన
మైనదుగ్ధఫేనము పవమాననిహతిఁ
దూలి తప[1] ముగ్రముగఁ జేయు శూలిమౌళిఁ
బడిన నద్దేవుఁ డధికకోపంబు గదుర.

22. క. చిచ్చఱ కన్నదరు లెగయ
విచ్చినఁ గపిలత్వ మొందె విబుధప్రకరం
బుచ్చెరు వందుచుఁ గన్గొన
నచ్చెరువ సౌరభేయు లమలచరిత్రా.

---

19 1 విశేషంబు - ఊ క వ, విశిష్టంబు - ల.

21 1 ముగ్రగతిసేయు - ఊ

23 క. అవి యిట్టు [1]తెవరఁ [2]దక్కటి
యవియు [3]నదరి తెదరె నిట్టు లగ్గోవులు వా
టి వెసను సోమునిపాలికి
నవనీశ్వర దాని నెఱిఁగి యజుఁ డేతెంచెన్.

24. సీ. ఏతెంచి [1]నిభృతిమై నీశ్వరు చరణాంబు
జములకు [2]నెఱఁగి హస్తములు[3] మొగిచి
యమృతసిక్తుఁడ నైతి వఖిలైక గోవుల
కెంగిలి లే దిందుఁ డెట్టు లమృత
మొసఁగు నట్టుల గోవులొసఁగు దుగ్ధంబులఁ
దద్వత్సపీతదుగ్ధంబుఁ శుచియ
కాన కోపము దక్కి కరుణింపు మనియొక్క
కమనీయ వృషభంబుఁ గప్ప మిచ్చె
తే. శివుఁడు ప్రియ మంది దానిఁ గేతువును వాహ
నంబుఁగాఁ జేసి సకలజనంబు [4]నెలమి
వృషభకేతనుఁ డనియును వృషభవాహ
నుం [5]డనియుఁ బేర్కొనఁగ నొప్పి యుండె నధిప

25. వ. ఇట్లు ప్రసన్నుం డయి గోసంచారం బెందునుం గలుగునట్లుగా [1]ననుగ్ర
హించిన [2]నా[3]సౌరభేయగాసముదయంబు మగుడ నన్నగంబునకు వచ్చి
విచ్చలవిడి వర్తింపం జూచి తనచూపునం గపిల లయినగోవులకుం [4]దక్కిన
వర్ణంబుల గోవులకంటె నుత్తమత్వంబు గలుగ వరం బిచ్చి [5]విరించిని వీడ్కొలిపె
నట్లుగావునం గపిలగోప్రదానంబు గోదానకల్పంబున [6]కంతకు నధికంబని చెప్పె.

26. క. ఈకపిలాఖ్యానము సు
శ్లోకము దీనిపరనంబు శ్రుతముఁ గలిమలో
ద్రేకంబుఁ బాచి సుతుల న
నేకధనంబులను బెంపు నిచ్చు నరేంద్రా.

---

23 1. తెవరె – కొన్నిప్రతులు 2. దక్షిన – అ. ఈ. 3 నువఁ – ఇ క.
24 1 ప్రీతిమై – కొన్నిప్రతులు. 2 మ్రొక్కి హస్తములు – కొన్నిప్రతులు. 3. మోడ్చి – కొన్నిప్రతులు 4. తెలమి – కొన్నిప్రతులు. 5. తనుచు – ఐ ఔ ఖ
25. 1. వరంబిచ్చి – ఐ ఔ. ఖ 2 నాచేరుకసౌర – ఇ ఏ. 3. సౌరభేయ – చ కొన్ని ప్రతులు. 4 దక్కటి – కొన్నిప్రతులు. 5. దీవించి వీడ్కొలిపె – అ. ఈ. క.
6. కలాపంబంతకు – పెక్కుప్రతులు

27. వ. అనిన విని ధర్మపుత్త్రుండును దమ్ములును సమ్మోదంబు నొంది భీష్మునకుం బ్రణమిల్లి గోప్రదానంబులు విధిసంపన్నంబులుగాఁ జేయువారై మనంబులం బూని రప్పితామహుం డప్పాండవాగ్రజు నుద్దేశించి వెండియు నిట్లనియె.

28. సీ. సౌదాసుఁ డనఁగ నిక్ష్వాకుకులంబున
జనియించె నాతఁడు మునివరేణ్యుఁ
డైనవసిష్ఠుని నాత్మపురోహితు
వినతుఁడై యడిగెఁ బవిత్ర మెద్ది
యని దానికాదరమతిశయిల్లఁగ నమ్మ
హా[1]త్ముఁ డిట్లనియెఁ బుణ్యాత్మ వినుము
గోవు పవిత్రంబు గోవు హవిర్జన్మ
భూమి గో వరయఁగా భూతములకు
తే. నెల్ల నాధారభూతమౌ[2] నిద్యవస్తు
వతులలక్ష్మికి మూల మత్యంతదురిత
జలనిధికి నోడ నిర్జరసద్మమునకు
[3]ననఘ నిచ్చెన సురలకు మనికిపట్టు

29. వ. అని చెప్పి మఱియును.

30. క. పదియును నూఱును వేయును
మొదవులు గలవారు దానములు గా నొకటిం
బదియింటి నూటి నిచ్చిన
[1]నదియు నదియు నదియు సదృశమగుఫలము నెడన్.

31. క. విను గోవులను బ్రభాతం
బునఁ దలఁచుట తద్గుణములు వొగడుట భక్తిం
గనుఁగొనుట యధికపుణ్యము
లని యెఱిఁగించు జనములకు నాగమభణితుల్.

32. ఆ. కిల్బిషంబు గోశకృన్మూత్రముల రేప
పడుట సకలమాంసభక్షి కైన

---

28. 1 మునియనియె బుణ్యాత్మ - ఎ 2. మైయార్యవస్తు. మైయెనఁగువస్తు - అని పాఠములు 3 నసఁగ, ననుప, అని పాఠములు.

30. 1. నదియును నదియును సమానమగు - శ.

ఘోరపాప మంద్రు గోమాంసభక్షణ
మబ్జసంభవాదు లైన సురలు.

83\. క. జనములు దుస్స్వప్నంబులు
గని గోకీర్తనము సేయఁగాఁ దద్దురితం
బునఁ బొరయరు గోమయయుత
వినుతాంబుస్నాన మతిపవిత్రం [1]బనఘా.

84\. చ. సురభులు సౌరభేయులును సుస్థితి నాకడ నుండుఁ గాత మేఁ
గరము వినీతి గోగణముఁ గన్గొనుచుండెద నర్థి గోసము
త్కరమును నన్నునెప్డుఁ గనుఁగావుత [1]మం చెద గోవులం దలం
తురు బుధబోధితుల్ భయము దోఁచినచోటులఁ దత్ప్రి[1]శాంతికై.

85\. వ. అని నిర్దేశించి వెండియు నమ్మునీంద్రుం డానరేంద్రున కిట్లనియె.

86 క. అరుణధవళమేచకధూ
సరవర్ణాకలిత గోవిషయదానంబుల్
ఖరకర సురపాగ్నిపవన
వరలోకసుఖముల నిచ్చు వసుధాధీశా.

87 క. విను తక్కినవర్ణంబులు
జనవర గంధర్వసిద్ధసాధ్యాదినివా
స నితాంతసౌఖ్యదములగు
ననిమిషయోషిత్ప్రియత్వ మన్నియు నిచ్చున్.

88\. క. ధేనుప్రమాణయగు తిల
ధేనువు నిచ్చిన నరుండు దీప్తుం డగుఁ బ
ద్మాసనలోకసంవా
సానందోన్నతిఁ జరించు నృపతిహితుఁడై.

89\. క. బహు[1]రూప విశ్వ[2]రూపక
మహితసురూపత్వ దివ్యమహిమ గలుగు గో

---

83 1 బధిపా – కొన్ని ప్రతులు.
84\. 1, మంచుచు – ఎ ౠ; యంచును – ఐ ఖ 2 శాంతికిన్ – ఎ. గ.
89 1. పీర్ల – ఇ. ఏ 2. మంగళ – శ

నుహనీయమూర్తి మన్మతి
సహితముగుం[3]గాత మనుట [4]సంపదలొసఁగున్.

40. క. అని మునిచెప్పిన సౌదా
సనరేంద్రుఁడు గోప్రదాన[1]సక్తాత్ముండై
యనితర సులభావ్యయ[2]సుఖ
[3]జనకస్థానంబు పడసె జనసంస్తుత్యా.

41. క అని గంగాపుత్రుఁడు గో
వినుతమహిమఁ దెలియఁజెప్ప విని ధర్మసుతుం
డనఘచరిత్రా [1]యిట్లుం
డునె గోవులపెంపు నావుడుం దగ మఱియున్.

42 వ. అమ్మహాత్ముండమ్మహీపతితో గోవిశేషం బింకను విను మని యి ట్లనియె.

— *వేదవ్యాసముని శుకునకుఁ దెలిపిన గోప్రభావప్రకారము :—*

సం. 13-80.6

43. సీ. సర్వజ్ఞుఁ డగుపరాశరనందనుని పాద
[1]పద్మంబులకు [2]దృఢభక్తి[3]నెఱఁగి
యతని నందనుఁడు [4]సముంచితమతియును
నవుశుకుం డెల్ల వస్తువులకంటె
నధికతమంబును యజ్ఞమూలంబును
నగునది యెయ్యది యతులకరుణ
నాకెఱింగింపవే నావుడు నమ్మహా
త్ముండి వ్విధము మహానుభావ
తే. మనఘ యెందు నెక్కాలము నన్యవస్తు
వులకు లే దరయంగ గోవులకుఁ దక్కఁ
బుణ్య[5]తమతయు యాగవిభూతి[6]మూల
కారణత్వంబు [7]వానిక కాక [8]కలవె.

44. క. అని చెప్పి మఱియు నిట్లను విను
గోవులు పరమనియతి వేధఁ గొలువ నె
మ్మన మలర నతఁడుగ నుఁగొని
మును వానికి లేసిశృంగములు గల్పించెన్.

---

41. 1. యిట్లుంపును - వా, యిట్లుండునె - పెక్కుప్రతులు.
43. 1. పంకజంబులకునుభక్తి - ఓ 2. నతి - ఊ వ. 3. మ్రొక్కి - ఇ. ఏ 4. నంచిత మతియును నగుశుకుడెల్లపుణ్యవస్తువులకంటె-కొన్నిప్రతులు 5 తరమును,తమముసు- అనిపాఠములు 6. దాన-అ ఈ. 7. వానికె - కొన్నిప్రతులు. భారతమునందు ఏవార్థకమునవానికిఁగాక-'అ'మాత్రమే కనబడును. పీ.శ.ష. 8. కలదె-కొన్నిప్రతులు.

45. వ. అట్లు గోష్ఠి లోనఁగి సురమునిలోకంబు నాలోకించి.

46. చ. పరమపవిత్రముల్ యజనభాజనముల్ దము విన్నఁ జూచినన్
దురిత[1]చయంబులం దొలఁగఁ ద్రోవఁగఁ జాలు ప్రధానకర్తకు
త్తరగతిలాభమై భవము తంగెటిజున్నుగఁ జేయుగోవు లె
వ్వరు దగ వీనిఁ గొల్తు రనివారణఁ జొత్తురు వారు నాకమున్.

47. వ. అనియె[1] గోవులపావనత్వంబు విశేషించి చెప్పెద వినుము.

48. సీ. అమలాత్మ గోవుమూత్రముఁ బాలునేయిని
బానార్హమగు పెండతోన వరుస
[1]మూఁడుదినంబులు [2]మునుద్రావి మఱిమూఁడు
దివసంబులందు వాయువు భుజించి
యవలు నుగ్గుగ ధేనునివహంబు ద్రొక్కించి
వెలవ నత్తెఱఁగు నూకలన కాఁచి
నెలలు మూఁ డత్యంతనియతి నాహారంబు
గొన బ్రహ్మహత్యఁ బోలినవి యైనఁ

తే. బాయుఁ బాపముల్ దివిజు లీపావనక్రి
యా[3]విధానంబుననకాదె యసురగణము
గెలిచి రావులనేయి విప్రులకు నీగి
దాని వ్రేల్చుట [4]ద్రావు టుదాత్తతరము.

49. క. విమలాంబువుల నుపస్ప
ర్శము నిర్వర్తించి గోప్రచయమధ్యమునన్
దమయుతముగ గోమతిచి
త్తమున[1] జపించిన [2]శుచిత్వధన [3]మొడఁగూడున్,

50. తే. అగ్నిసన్నిధి గోనిచయంబునడుమ
బ్రాహ్మణులపాల గోమతీపరన మాచ
రించినను విన్నఁ గోర్కి సిద్ధించు గోవుఁ
గడచినట్టిది లేదు జగత్త్రియమున,

---

46 1. భయంబులన్ - ఈ. ఊ చ పీ శ ష

47. 1. యగ్గోవుల - కొన్నిప్రతులు.

48 1. మూఁడేసిదినములు-న. కొన్నిప్రతులు; మూఁడేనిదినములు - న. 2. యొగి - ఎ.శ. వ. 3. నిధానంబున - వా. 4 ద్రావుటు(డు)త్తారకములు - న కొన్నిప్రతులు.

49. 1. నంబతించిన - ఊ. ఎ 2. శుభత్వధనమొనగూడున్ - గ. 3. మొనగూడున్ - కొన్నిప్రతులు.

51. క. అని యిట్లుపన్యసించిన
జనకవచనరచనఁ గల్గు సార మఖిలముం
గని శుకుఁడు గోసమారా
ధనతత్పరచిత్తుఁ డయ్యె ధర్మతనూజా

52. వ. అనిన విని పాండవాగ్రజుండు బ్రహ్మ విశ్వంబునకు విభుండు తదీయస్థానంబునకు మీఁదు గోలోకం బని విందు నట్లుగాఁ గతం బేమి యని[1]యడుగుటయు నాపగాతనయుం డతని నాదరభరితుం డగుచు నాలోకించి వినుము వివరించెద విశ్వకర్మ తపోనియతుండయి యజ్ఞార్థంబును మోక్షార్థంబునుంగా నమృతమయమూర్తియుఁ గామరూపిణియు నగు సురభి యనుకన్యకం దనమనోవృత్తిం గల్పించి మహాతేజోమయుండగు నొక్కపురుషుని సృజియించిన దేదీప్యమానుండగునాతం డతిమనోహరాకృతి యగునయ్యావం గనుంగొని కామమోహితుం డయియార్తి నొందుటయు నఖిలలోక[2]పావనుండైన చతురాననుండు సన్నిహితుండై మార్తో భవ యని పలికి యతని యార్తత్వం బుడిపి తనపల్కు కారణంబుగా మార్తాండనామం బొసంగి యన్నారీరత్నంబు నిచ్చి యన్నెలంతకు నీకును జనియించిన యపత్యంబులు యోగాపవర్గార్థక్షీరజనకంబులై మదీయలోకంబునకు నుపరిభాగంబున వర్తింప వరం బిచ్చితి ననియె [3]నట్లొందినయయ్యిరువురకునుం బ్రభవించిన సౌరభేయీకులం బాకమలాసను నిర్దేశించినట్టిదై సురాసురప్రముఖనిఖిలజనంబులకు నమస్కార్యంబును సపర్యాభాజనంబును నయి రాజిల్లు నని చెప్పి వెండియు.

53. క. అది కారణముగ గోవులు
తుది ముట్టిన పెంపు గలిగి దురితహరగుణా
[1]స్పద మయి తమ్ము సభక్తిక
[2]హృదయులగుచుఁ గొలుచువారి కిష్టము లొసఁగున్.

54. క. అని చెప్పినఁ బాండునృపతి
తనయుఁడు మార్తాండసురభిదాంపత్యమున
మును పుట్టిన ప్రజ యెయ్యది
విన వలతు మహాత్మ చెప్పవే నా కనుడున్.

---

52. 1 యడిగిన - పెక్కుప్రతులు. 2. పాలకుండగు, పాలకుండైన - అనిపాఠములు. నట్లా ప్పిన - అ శు. ఉ. టు

53. 1 స్పదములయి తము - పీ. శ. ష. 2. హృదయ తదగఁగొలుచు - ఉ. టు.

55. వ. భీష్ముం డిట్లనియె.

56. తే. తపము పెంపున సురభి మార్తాండువలన
ధరణినాథ యేకాదశాత్మజులఁ బడసె
నిగమసంకీర్తనీయులు నిఖిలలోక
పతులు వారు బ్రాహ్మణులకుఁ [1]బ్రకృతి సుమ్ము.

57. వ. వారల నేకాదశ[1]రుద్రులంగా నెఱుంగుము.

58. తరు. అనఘాత్మ యజపాదుఁడన నహిర్బుధ్న్యుఁడనఁ గడు విలసిల్లి త్ర్యంబకుఁ డీతఁ
డనఁగ వృషాకపి యన నొప్పి శంభుఁ డను పేరిపెంపున నమరి కపాలి
యనఁగ రైవతుఁ డన నతులానుభావ మతిశయిల్లఁగ హరుఁ డన బహురూపుఁ
డనఁ గీర్తిఁగని యుగ్రుఁ డన విశ్వరూపుఁడన బేర్చి యా[1]రుద్రు లర్చితు లైరి.

59. వ. [1]తదనంతరంబ [2]సౌరభేయీ[3]ప్రచయంబు ప్రభవించె నగ్గోకులంబు [4]విశేషం
బాకర్ణింపుము.

60. సీ. ఆననంబునను జిహ్వను శృంగముల బల
వైరి రంధ్రంబుల మారుతుండు
కకుదంబునందు శ్రీకంఠుడు పదముల
యందు మరుద్గణ మనఘ కుక్షి
వహ్ని చన్నుల సరస్వతి [1]పెండఁ బంచిత
మున లక్ష్మియును గీర్తియును గ్రమమును
రుధిరంబునందుఁ జంద్రుఁడు హృదయంబున
భగుఁ డను దేవత పాల వేధ

తే. [2]వెంద్రుకలయం దనుష్ఠానవితతి దోఁక
ధర్మునఁ డకుల సూర్యుండు చర్మమునఁ[3]ద

56. 1. బతులు – అ
57. 1. రుద్రులనియెఱుం – కొన్ని ప్రతులు
58. 1. రుద్రులంచితులైరి – కొన్ని ప్రతులు.
59. 1. అనంతరంబ – పెక్కు ప్రతులు 2 సౌరభేయ – కొన్ని ప్రతులు 3. ప్రపంచంబు, నముదయంబు – అనిపాతములు 4 విశేషంబువినుము – ఐ. ౌ ఖ ల.
60. 1. పేఁడ – ఓ. ఓ వ. 2 వెంట్రుకలయందు – పెక్కు ప్రతులు. 3. ననుబరఁగు భూమియుమతిసంధిపట్ల – ఉ ఊ

పంబు సిద్ధితేజము సంధిపట్ల [4]సిద్ధు
లునికి గలదచెు గోవు నేమనఁగ వచ్చు.

61. వ. మఱియు నొక్కటి యక్కజంబగునది గోమహాను[1]భావప్రకటంబయిన యితి
హాసంబు సెప్పెద వినుము

—. సుమిత్రుఁడను మునిచేఁ బోషింపఁబడిన గోవుల ప్రభావము .—

సం. 13-120-1. (కుంభ)

62. తే. త్రిశిఖరం బనుపేరి ధాత్రీ[1]ధరమును
ప్రాంతమున గ్రదకల్పితంబైన కూల
హాభిధానకల్లోలిని శోభితోప
[2]కంఠయై యొప్పుఁ దత్తీరకాననమున.

63. వ. భృగువంశసంభవు లగు [1]సంయమీశ్వరులు గొంద ఱాశ్రమంబులు గావించు
కొని తపఃపరులై యుండుదు రందు సుమిత్రుం డనుపేరం బరఁగి పరమా
చారభవ్యుం డగునొక్క భార్గవునకు నంగిరసుం డనునొక్కమహాద్విజుండు
సఖ్యంబునను సౌజన్యంబునను గోశర్కర యొసంగిన నమ్మునిఁ తనగోవు
నయ్యోషధి మేపి పోషించిన నది సుపుష్టయు సుస్వరయు సురూపయునై
యొక్కవృషభంబుపొందు వడసి గర్భిణియై మిథునంబు నీనిన.

64. క. అమ్మిథునము బహుసంతా
న మ్మయ్యెం బెరిఁగి క్రమమునను గోనిచయం
బిమ్మెయిఁ బెక్కుసహస్రము
లమ్మునికిం గల్గె గోవు లతఁడును వానిన్

65. తే. [1]వేడ్కఁ జూచుచు నెప్పుడు వెనుకఁ[2]దిరిగి
మేపు నీరును గలచోటి కోపి [3]వెలిచి

---

4. నద్ధులు-అ ఠ. 6 వచె,దట్టె, వట్టె,వట్టి, అనిపాఠములు.

61 1. భావంబు - అ ఉ. ఎ. ఐ క ఖ వ.

62. 1. ధరంబు ప్రాంతమున - అ. ఇ. ఏ. వ. శ ష. 2 కాంతమై - ఏ. శ. ష.

63. 1 సంయమివరులు - పెక్కుప్రతులు.

65. 1. వేట్క - ఇట్టి రూపము రాళపత్రప్రతులందు కనిపించుచుండును. 2 దగిలి - కొన్ని ప్రతులు; దిరుగు - శ. వ 3. పెనిచి, పిల్చి, వెనిచి - అని పాఠములు వెనుచు అనురూపము కాన్పించలేదు.

పాలు గ్రేపులు గుడువ స్వప్నమదుఁ డగుచు
దాను గో[3]స్తనఫేనంబు ద్రావి యుండు.

66. క. దానఁజేసి యతనికిఁ
ఫేనపుఁ డనునామ మొసఁగెఁ బ్రియమున మునిస
[1]మ్మానితుఁ డగుగౌతముఁ డ
ట్లానిర్మలబుద్ధి గోసమారాధకుఁడై.

67 వ. వర్తిల్లుచుండ నొక్కనాఁడు కామరూపిణు లగుగోవులు కొన్ని కాంతా కారంబులు గైకొని కమనీయం[1]బగు కొలన జలక్రీడలు సలుపుచుండఁ దోడి ధేనువు లచ్చట[2]మెలంగి కనుంగొని మీ రెవ్వ రని మానుషభాషణంబుల నడి గిన నయ్యంగనాజనంబులు

68. తే. ఏము గోవుల మనవుడు నిట్టియద్భు
తానుభావంబు మీకెట్టు లావహిల్లె
[1]ననిన విని వానితోడ నయ్యబలు లిట్టు
లనిరి మాతెఱఁ గెఱ్ఱఁగ వినుఁడు మీరు.

69. వ. హవ్యకవ్యంబులకు నతిథిపూజనంబులకు నిజాహారంబులకు సద్ద్విజావలి సంతో షింప నింపారుపాలు వారికిం గురియుదుము కృషి[1]క్రియానిర్వర్తనంబు లకు మాపుత్త్రులం బనుతు మాసుకృతంబుల నివ్విశేషంబులు గలిగె మాకును గోలోకంబును సులభంబు మీ రాసు[2]కర్మంబులు సూచి [3]యసూయ [4]సేయు దురు గావున.

70. క. [1]క్రేపులు తో రా దుర్గతిఁ
బ్రాపింపఁ[2]గలార యిట్టి భావివరిత ము

66. 1. మ్మానితమతియగు గౌతముఁడా నిర్మల - ఉ
67. 1. బైన నొక్కకొలన, లగునొక్కకొలన - అని పాఠములు. 2. మెలంగుచుండి కనుం గొని - ఒ ఓ, క, వ; మెలంగివారింగనుంగొని - అ ఈ
68 1 ననిసెనవిని వానితోడ - కొన్ని ప్రతులు
69 1. క్రియాదినర్వ - ఐ, ఖ; క్రియానివర్తనంబున(ల)కు - కొన్నిప్రతులు 2. సుకృతం బులు - ఎ ఏ ఒ ట 3. యసహ్యంబు - ఒ, క. 4. పడుదురు - అ
70. 1. క్రేపులును మీరు దగగతి, క్రేపులును మీరు దుర్గతి, క్రేపులు మీరలు దుర్గతి - అని పాఠములు 2 గలారలిట్టి - కొన్ని ప్రతులు.

దీక్షితబోధమునం గని
మీపైఁ గృపఁ జెప్పవలసె మీకుం దెలియన్.

71. వ. అనుటయు నగ్గోవులు దీనాననలై.

72. క. గోవులకును [1]గోవులు గతి
గావున మీ రరసి సుగతి గలుగు[2]తెరువు మా
కేవిధినైనను జెప్పం
గా వలదే [3]యనిన నట్ల కాకని వారల్.

73. తే. రంతిదేవుండు వేవత్సరములు సేయు
నధ్వరమునకుఁ బశువులై యరుగుఁ డతఁడు
విశసనము సేయ గోలోకవిభవ మొందఁ
గాంతు రని నెమ్మిఁ బల్కిన [1]సంతసిల్లి.

74. సీ. అగ్గోవు లవ్విభు నధర్వంబునకుఁ బో
నుత్సహించుటయు నం దొక్క గోవు
మనము సుమిత్త్రనిధన మాతఁ డనుమతి
సేయక యెట్లు వోఁ జెల్లు ననిన
నాతనిఁ జంపుద మతఁడును గోలోక
మున[1]కేఁగుదెంచుఁ గా కని కడంగి
చని మునిఁ దేఱిచూడను జాల [2]కంతంత
నతిభీతిఁ గ్రమ్మఱి యరుగుటయును
తే. గొన్ని కపిలధేనువు లతిక్రూరచిత్త
లేము వధియించెదము మాకు నేమి మేలు
సేయువారలు దగ మీరు సెప్పుఁ డనిన
నన్నిమొదవులు నేక[3]వాక్యత్వ మొంది.

75. ఆ. సకలవర్ణధేను సమితికి నెల్లను
గపిలగోవు శ్రేష్ఠ గాఁగఁ గపిల

---

72. 1. గోవుల, గోవులె - అని పాఠములు. 2. తెరవు, తెఱగు - అని పాఠములు, 3 యనుడు - కొన్ని ప్రతులు.

73. 1 సంతసించి - ఐ ఖ

74. 1. కరుగుదెంచు - ఎ 2 కంతయు - ఉ. 3. వాక్యంబునొంది - అ. ఎ. ఔ

నీగి గోశతంబు నిచ్చిన యట్లుగా
వరము మీకు నిచ్చువార [1]మనియె

76. వ. అనిన విని కరంబు ప్రియంబునం గామరూపిణులైన యగ్గోవులు రూపాంత రంబులు గైకొని యాభృగువంశవర్యుపాలికిం బోయి యేము గోమాతలము నీదగు గోసమారాధనంబునకు మెచ్చి వరం బిచ్చువారమై వచ్చితి మిష్టం బెయ్యది యడుగు మనుటయు నమ్ముని యిప్పటియట్ల యెల్లప్పుడును గోవులవలన భక్తిస్నేహంబులు గలుగ నిం డనియె నమ్మాటకు నవి యట్ల యయ్యెడు గాక యని పలికి వెండియు నిట్లనియె.

77. క. ఈలోకం బేటికి మన
గోలోకంబునకు రమ్ము కులవర యనుడుం
జాలుదునే [1] మద్గోర
త్నాలి విడిచి యందు రాక కని ముని పల్కెన్.

78. క. విని యాధేనువు లాతని
తను వాకసమునకు నెత్తి తమ యోగబలం
బునఁ జైతన్యముఁ బాపి య
వనిమీఁదఁ గళేబరంబు[1] వైచి రయమునన్

79. క. కొమ్ములఁ గాళ్లం ద్రొక్కఁ
గ్రుమ్మి [1]మగిడి పోయి పూసగ్రుచ్చిన[2]గతి ముఁ
దమ్మాం బనిచినగోవుల
కమ్మునితెఱఁగెల్లఁ జెప్పి హర్ష మొనర్చెన్.

80. వ. గోలోకంబునకు ముఖ్యలగుగోమాత లంతయు నెఱింగి తమకడకుం బనుదెం చిన సుమిత్రు నాదరించి సుదతులై విహరించినగోవులు మొదలుగా సకల గోవులతెఱంగు నతని కెఱింగించి నీకు నిది మేల కాక యని పలికి యతనిం

---

76. 1. మనిరి - అ. ఏ క గ వ
77. 1. గోగణరత్నాలి - ఇ ఏ.
78 1. వైచె - అ
79. 1. మగుడి - పెక్కు ప్రతులు. 2 యట్లున్, రీతిన్ - అని పాఠములు

ప్రీతునిం జేసి బ్రహ్మ[1]ఘాతిక లయిన యన్నిగోవుల[2]కును మీవంశం బెఱచి వదనం బయ్యెడు మని శాపంబి[3]చ్చిన నాధేనువులు రంతి[4]దేవుపాలికిం బోయి సుగతి వేఁడి తమ్ముం బశువులంగా [5]విశసింపుమని [6]మానుషభాషణంబులం బ్రార్థించుటయు

81. క. మిమ్ముఁ దెగఁ జూచి సద్గతి
కెమ్మెయిఁ బోవంగ నేర్తు నే నని వినయా
ర్ద్రమ్ముగ మ్రొక్కుచుఁ బలికిన
నమ్మానవపతికి [1]నిట్టులను నగ్గోవుల్.

82. క. [1]జ్ఞానుల యూపనికై నినుఁ
గానఁగఁ బుత్తెంచి రట్లు గావున సుమనో
మానితగతి నీకును నగు
భానునిభా నీ యశంబుఁ బరఁగు జగములన్.

83. క. నావుడు మీలోపల నొక
గోవై నను మోహ[1]వశతఁ గూరుటయు మఖం
బావేళఁ బరిసమాప్తము
గా వలయును వినుఁడు సమయకల్పన దెలియన్.

84. క. అని యవ్విభుండు పలికిన
విని గోవులు సమ్మతింప విశసించుచు వే
ల్చె నతఁడు యజ్ఞానలమున
ననేకగోచయములం గ్రమాకలనమునన్.

85. క. ఒకనాఁడు గో వొకటి లేఁ
గకుఁ జన్నిచ్చుచును దానిఁ గనుఁగొని నీ విం

80. 1. ఘాతకులైన, ఘాతినులైన - అని పాఠములు. 2. కతంబున మీవంశంబుఱచి - ఉ. ఊ. 3. బిచ్చెనంత నద్ధేనువులు, బిచ్చెనాధేనువులు - అని పాఠములు. 4. దేవుని కడకుం - వా. దేవునిపాలికి - అ.గ ల.వ పీ.శ. ష. 5. హింసింపుమని - ఊ 6. మానుషాకారంబులం - ఓ.

81 1. గోవులనియెనరేంద్రా - శ ష

82 1 జ్ఞానులు నినుసీపనికైకానఁగ - ఓ.

83 1. పరత - కొన్ని ప్రతులు

కకటా యొక్కడఁ జేరెద
వక్కృపులు వచ్చెరరు చంప నని పల్కుటయున్

—: గోవులు రంతిదేవు యజ్ఞపశువులై గోలోకంబునకుఁ బోవుట :—

సం 13_129_26 (కుంభ)

86. వ. మహానుభావుండు గావున నప్పలుకులు విని రంతిదేవుం డయ్యాగంబు సుప్ర యోగంబుగా సమాప్తంబు గావించెఁ గొన్నిగోవులు కదమ వడి పుడమిన నిలిచె నధ్వరోపయోగంబు వడసిన గోగణంబులు గోలోకంబునకుం [1]ప్రమో దంబునం బోయెఁ దదీయ చర్మాస్థిశ్రేణులు [2]తటంబులై తవరం బ్రభూత రక్తమేదః[3]క్లేదంబు లేత్తై పాఱి చర్మణ్వతి యనుపేరం బరఁగెనారంతిదేవభూ పతియును యజ్ఞసమృద్ధుండై వృద్ధశ్రవునితోడి సంఖ్యల[4]బునం బొలిచి యతఁయ[5]నాకంబున సుశోకుండై యుండె ఫేనపాఖ్యుండును గోలోకంబున శాశ్వతుండై వసించె నని చెప్పి భీష్ముండు వెండియు.

87. సీ. మానవనాథ యీనఫేపాఖ్యానంబు
బదరికాశ్రమమున బాదరాయ
ణుఁడు ప్రీతి నారాయణునకుఁ జెప్పిన నమ్మ
హాత్ముఁడు గోయజనార్థియగుచు
నిది గొనియాడంగ విదితమై జగమునఁ
బరఁగెఁ బుణ్యతమంబు పావనంబు
దీనిఁ బఠించిన వీనుల నించిన దురిత
[1]వర్గంబులఁ బొరయ వలదు

తే. పూరున్నృపకుల[2]భూషణ [3]పూతచరిత
నీవు నతిభక్తి గలుగుము గోవులందుఁ

---

86 1. ప్రమదంబునం - కొన్ని ప్రతులు 2 దట్టంబై దట్టంబులై - అని పాఠములు.
3. క్రవ్యంబులేత్తై - అ. ఈ; పూరంబులేత్తై - శ. 4. బొనరిచి, బొనర్చి - అని పాఠములు 5 లోకంబున - కొన్ని ప్రతులు.

87 1. దుర్గంబుల - ఇ. ఈ ఉ. ఊ; వర్గంబుల దొరఁగునం్రదు - శ. ష. 2. భూషిత-ట.
3. పుణ్య - అ. ఎ. ట.

బరమనియతి నీతంత్రంబు పరనవిధియు
నేతదాకర్ణనంబును నెపుడుఁ దలుపు.

88 క అనిన విని యట్ల చేసెద
ననఘా గోమహిమ యిట్టి దాకర్ణింపం
గనియును [1]దనివి ననదు నా
మన మింకను జెప్పు నీ విమలవాక్యములన్.

89 క. అని ధర్మతనయుఁ డడిగిన
ననయంబుఁ బ్రియంబుఁ బొంది యమరనదీనం
దనుఁ డిట్లను సత్యవతీ
తనయునివాక్యములు సెప్పెదను [1]వినుము నృపా

90 ఆ. గోవిశేష మర్థి నీవు న న్నడిగిన
యట్ల శుకుఁడు దండ్రి నడిగె దాని
కాత్మఁ [1]బ్రియముఁ బొంది యామహాసంయమి
యానుబుద్ధి కిట్టు లనియె నధిప.

91. సీ. స్థావరజంగమాత్మకమైన భూతజా
లంబు సుస్థితి గోగణంబు నాశ్ర
యమునన తత్సంభవమును గోవుల యంద
యవి మూలసంతాన మజున కట్లుఁ
[1]గాక [2]సిద్ధులసాధ్యగణములమాతలి
ట్లగుట యెఱింగిన [3]యతఁడు బ్రహ్మ
[4]లోక గోలోకాది [5]లోకాంతరములకుఁ
దనయింటి కరుగుచందమున నరుగుఁ

88. 1. దృప్తి (స) చనదు - పెక్కు ప్రతులు.

89. 1. వినుమనఘా - కొన్ని ప్రతులు

90. 1. సంతసిల్లియామహా - అ.

91. 1. గాఁగ, గాన - అని పాఠములు. 2. సిద్ధులు సాధ్యగణములు - అ. ఎ. 3. యవియు - క. 4. లోకంబులావిగా లోకంబులకు నెల్ల - ఎ. 5. లోకోత్తర ములకు - స. కొన్ని ప్రతులు.

తే. బరమగతిఁ గోరువారలు పాదముష్టి
యష్టివాక్చిత్తముల గోవు నభిభవింప
కుండ వలయు నివ్విద్యఁ బద్మోద్భవుండు
సెప్పె నది యాత్మపావన శిష్టసేవ్య.

92. క. పావన మని శ్రుతి సెప్పిన
యేవస్తువు నాశ్రయించి యెక్కు డయిరి భూ
దేవులుల కు [1]సుర లట్టిది
గోవు తదీయ మగు మహిమకున్ గుఱి గలదే.

93. క. వీణాకాహాళవేణు
క్వాణప్రతిమములు ధేనువర్గధ్వను ల
క్షీణసుకృతంబు నిర్మల
వాణి తదాకర్ణనంబు వర్ణనవిధమున్.

94. క. క్షీరము దధియును ఘృతము సు
ధారూపములగుట [1]దేవతాప్రీణనయ
జ్ఞారంభంబులు విమలా
చారా గోదోహనైకసాధ్యము లయ్యెన్.

95. ఆ. శ్రుతులు నౌపనిషదసూక్తులు గోస్వరూ
పంబు లని సరోజభవుఁడు సెప్పె
ధర్మపరత పరమతపము మహాధ్వర
మనఁగఁ బరఁగు గోసమర్చనంబు.

96. క. ఈవాక్యంబులు భూదే
వావలిసన్నిధిఁ బఠించునాతఁడు పుణ్యుం
డై వెలయు విన్నవారలు
పావనగుణ తత్త్వణంబ పాతు రఘములన్.

97. తే. [1]గోఘృతంబు ప్రాశించియు గోకరీష
సువిహితస్నానుఁ డయ్యు భూదివిజుఁ డధిక

---

92. 1 సురలిట్టిది - కొన్ని ప్రతులు; సురలివ్విధి - ఓ
94. 1. దేవతాప్రియములు యజ్ఞా - అ. దేవతా ప్రేరణయజ్ఞా - ఈ.
97. 1 గోఘృతంబుపానించియు - కొన్ని ప్రతులు

భ క్తి నిత్యంబు గోమతీపఠన [2]మాచ
రించియును గల్మషముల నిర్జించు ననఘ.

98. చ. అనిమిషులున్ మహామునులు నయ్యయిపెంపులు గోమతిం బఠిం
చిన సుకృతంబునం గనిరి శ్రీయును శత్రుజయంబుఁ బేర్మియుం
[1]దనయుసమృద్ధియుం గలుగుఁ దత్పఠనంబున [2]బంధుకోటిబం
[3]ధనమునఁ బాయు మార్గమునఁ[4]దప్పు మృగార్తియుఁ జోరబాధయున్.

99. వ. అనిన విని యమ్మునిపతికి శుకుం డిట్లనియె.

*—: వేదవ్యాసముని శుకునకుఁ జెప్పిన కపిలగోమహానుభావము :—*

సం. 13 - 126 - 2 (కుంభ)

100. క. తమజాతికిఁ దగుకర్మ
క్షమతలు లేకున్నయట్టిజనములు గపిలా
సమధికపూజన తద్దా
నము లొనరింతు రవి[1]వాచు నాదురితములన్.

101. సీ. అనుటయు సందియం బదియేల కపిలఁ బూ
జించినఁ బ్రీతి నిచ్చినను జెడని
యఘములుఁ గల్గునే యనియెఁ బరాశర
తనయుఁ డవ్వాక్యంబు విని తదీయ
తనయుండు గపిల కంతటిపెంపు రాఁ గతం
బేమి నావుడు నమ్మునీశ్వరుండు
వినుము మని యిట్లను ననిమిషసంఘంబు
నొకకారణమునఁ బావకుఁడు మొఱఁగి
ఆ. యరిగి తనదుగుప్తి యర్థించి గోవుల
నాశ్రయించె ననియు నగ్నిగోప

2. మాచరించుటయు - ఐ బౌ

98 1. త (ద) నుజ - కొన్నిప్రతులు 2 భక్తకోటి, బద్ధకోటి, బంధకోటి - అనిపాఠ
ములు. 3 ధనమును - పెక్కు ప్రతులు. 4. దల్గు - అ. ఇ. క ల. వ.

00 1. వాపు, పాచు - అని పాఠములు

నంబు సేసె నవ్విధంబున శిఖి యున్కి
సుర లెఱింగి రెల్ల[1]చోటు నరసి.

102. వ. ఎఱింగి కూడుకొని గోవులకడకు వచ్చి వానితో నగ్ని దాఁచుట యఖలజగ
జ్జనంబులకు నహితంబు సేయుట గాదె చూపకుండుట దగ దని పలుకుటయుఁ
బయిలోఁడి గోవు లప్పావకుం జూపిన నాసుపర్వులు సంతోషించి వానికి
వరం బీవలయు నని యవ్వాయుసఖుం బ్రార్థించిన నతండు దా నగ్గోవుల
యందు డాఁగి యుండ నవి కపిలచ్ఛాయం బ్రాపించి యునికిం గనుంగొని
గోవులకెల్లను గపిల యొక్క డగుటయుం దదీయారాధనంబునుం దద్దానంబు
నుం బుణ్యతమంబు లై దురితంబుల దమియించి యుత్తమలోకంబుల నిచ్చు
టయు వరంబులుగా నిచ్చె నని చెప్పి వెండియు

103. తే. కపిల యిచ్చిన వానిన కాదు [1]నిజను
[2]కొన్న వానిని బుణ్యాత్మ[3]కుఁడుగఁ జేయు
నీవుఁ గపిలాసమర్పనానిరత మాన
సుండ వగు టెంతయును మేలు సువ్రతాత్మ

104. వ. అని చెప్పుటయు నప్పరమమునీశ్వరుతో నమ్మునికుమారవరుండు గపిలా
లక్షణం బెఱింగింపవే యనిన నతం డతని కిట్లనియె.

105. తే. కర్ణ శృంగాక్షిఖురనాసికాపుటములు
గపిలములు గుత్తుకయును ముష్కములు గపిల
[1]పట్టు లొండు నెం దేనొకపట్టు కపిల
మైనఁ గపిలాత్వగుణమున కదియ చాలు.

106. క. మే నెల్లఁ గపిల మైనను
దానిం జెప్పంగ[1]నేల తగదు కపిలలన్
మానితగుణ విదికి కుడువఁ
గా[2]నేబలికైనఁ [3]గాక కట్టఁ బెఱికకున్.

101. 1 చోట్ల - అ. ఈ ఏ
103 1. వినుము - పెక్కుప్రతులు 2. కొనిన - అ. ఎ ఒ; కనిన - అ. ఈ. 3 కలితుఁ-
అ ఈ, కునిగఁ - ఐ క. ఏ; కులుగఁ - శ
105 1. పట్టులెందును నందొకపట్టు - కొన్నిప్రతులు.
106 1. వలదు - అ ఈ ఉ ఊ ఒ. ఓ. 2 నేవనికైన - పెక్కుప్రతులు 3 గాడి
గటంబరగున్ - కొన్నిప్రతులు.

107. ఆ. కాలఁ గేలఁ గోలఁ గపిల దండించిన
నరకవాసమునకు నరుగవలయుఁ
బూరి నీరు లెస్స యారసి యగ్గోవు
సత్కరింప సుగతి సంభవించు.

108. క. అనఘ కపిలాప్రదానం
బునకు ఫలం బిట్టిదనఁగఁ బోలునె కమలా
సనుఁడు మహానందప్రద
మని వెలిచుచుఁజెప్పె దాని నట యేమందున్.

109. వ. అని వెండియు.

110. క వసుధామరగాయత్రి
[1]వసంతములు సత్యగోసువర్ణంబులు నే
కసముద్భవంబు లని తా
పసవర్యులచేత వింధుఁ [2]పావనచరితా.

111. క. కావున భూమియుఁ గనకము
గోవును దానార్హవస్తుకోటికి నెల్లన్
ధీవినుతా యెక్కు డగుట
నీ విమలోదాత్తబుద్ధి నెలవు కొలుపుమీ.

112. క. అని మునిపతి చెప్పినఁ ద
త్తనయుఁడు ప్రియ మంది ననుడు ధర్మసుతుం డే
విని యుండుదు సిరి గోమయ
మున నుండుట దాని కెద్ది మూల మగు నొకో.

—: గోశ్రీసంవాదము :—

సం. 13-81-2

113 వ. అనుటయు గాంగేయుండు గోశ్రీసంవాదం బనునితిహాసంబు విను మ
య్యర్థంబు దేటపడు నని పలికి యిట్లనియె.

---

110. 1. వసుమతులను - ఏ. 2. ప్రస్తుతచరితా - ఉ. టిం.

114. సీ. సిరి ధేనువులలోని కరిగిన నెవ్వత
వని [1]యవి యడిగిన నమ్మహాత్మ
శ్రీ నేను మీలో వసింపఁగా వచ్చితి
ననవుడుఁ జంచల వైన నిన్ను
నొల్లము మాలోన[2]నునుపఁగా ననియె న
గ్గోవులు దాని కద్దేవి వగచి
[4]యేను బాసిన సర్వదానవకులముఁ
[5]గీడ్పడియెఁ బొందినసురల్ ప్రభుతనొంది
తే. రేను వచ్చుట గోరి కాదే తపంబు
లాచరింతురు నన్నిట్లు [6]లభిభవించు
[7]టుఅవె మీ కన్న న్ధువ మొల్ల మనుట
[8]యభిభవమె నీకుఁ[9]బోలిన యచటి కరుగు.

115. క. అని గోవులు వలికిన సిరి
విని మీచే నిట్లు పరిభవింపఁగఁ బడి యేఁ
జనిన నను నెవ్వరును గై
కొనరు శరణ[1]ముగుఁడు వేఁడికొనియెద మిమ్మున్

116. తే. మీసమీపమునం దున్కి మేలు దాని
నిందు నా కని [1]యడిగిన నెంతయేని
నాదరంబున నగ్గోవు లంతవట్టుఁ
గూడి యిట్లను లక్ష్మికిఁ గురువరేణ్య.

117. క. మామూత్రపురీషంబులు
భామా వేదంబు లెఱుఁగు [1]పావనములు నీ

---

114. 1. యడుగుటయును నమ్మ - అ 2. నునుపంగ - పెక్కు ప్రతులు. 3. దానికిఁ గుంది - ఏ 4 యేనువాసిన - కొన్ని ప్రతులు. 5 గీద్వడియె - కొన్ని ప్రతులు 6 లవహసింప వెరవె - అ. ష; దురువె - అ ఈ శ; టురవె - ఓ. ఔ క. ఈ శబ్దము నూ నిఘంటువున ఉభయరేఫముగను అత్వమధ్యముగను కనబడుచున్నది 7 టుఅవె ర. అభిభరమె - ఓ. వ. 9 దోచిన - ఐ ఖ.

115. 1. మగుట - కొన్ని ప్రతులు

116 1 వేడినవెంత, పల్కినవెంత, యాడినవెంత - అని పాఠములు.

117 1. పావనమగుటన్ సిపీయేవి - ఆ

పీమేలివస్తువులఁ[2] బ్రియ
ధామము వై యుండు మింపు [3]దలకొన మాకున్.

118. తే. అనుటయును సిరి నాదుపుణ్యమునఁ జేసి
కంటిఁ బడయంగ మీ యనుగ్రహము ననుచు
నట్లు వసియించె నిది గోమయప్రభావ
మూల మిట్టిది గోవున మోఘమహిమ

119. వ. మఱియు నొక్కవిశేషంబు సెప్పెద నాకర్ణింపుము.

120. ఆ సురభి తపము సేయ సరసిజాసనుఁడు ప్ర
త్యక్షమై మనోరథంబు సెప్పు
మిచ్చు కౌతుకమున వచ్చితి ననవుడు
నిట్లు లనియె నది మహీశవర్య.

121. క. మీ రిట్లు ప్రసన్నమతిన్
గారవమున వచ్చినంతకంటెను [1]మే తేఁ
గోరంగ వలయునట్టిద
[2]కారుణిక ప్రథమగణ్య కలదే నాకున్.

122. వ. [1]అనిన నత్యంతసంతుష్టస్వాంతుండై సురజ్యేష్ఠుండు సురభిం జూచి సురలో
కాది దివ్యలోకంబుల కెల్లను గోలోకంబు మీఁదుగా వరం బిత్తుం గాక యని
తలంచి యవ్విశేషంబు[2] మున్న తనవలన సిద్ధం బగుట సంస్మృతిగోచరం
బగుటయు.

123. తే. గోవులకు మేలు సేయంగఁ గోరు నాదు
చిత్తమున [1]మద్వరంబున [2]సిద్ధమైన
[3]తెఱఁగ యొలసె [4]దైవిక మంయి దీనిపెంప
యావహించెద నని యిచ్చె నవ్వరంబు.

---

2. ల్ప్రియధామముల్తై యుండు - లుప్రియధామములుగ నుండు - అనిపాఠములు.
3. దళుకొత్తంగాన్ - కొన్నిప్రతులు

121 1. మేలై - కొన్నిప్రతులు 2. కారుణ్యప్రథమగణ్య - ఏ. వ.

122 1. అనినవిని సంతుష్ట - కొన్నిప్రతులు 2. బటమున్న - కొన్నిప్రతులు.

123 1. నుండవరమునసిద్ధమైన - ఆ. 2. ప్రసిద్ధమైన - పీ ళ. ష. 3. తెఱఁగువలనె - కొన్నిప్రతులు 4. దైవికమైనదీని - ఒ

124. క. వనరుహసంభవుఁ డత్తెఱఁ
గునఁ దనలోకంబుకంటె గోలోకము స
జ్జనవినుతచరిత మీఁదై
యునికి వెలుఁగఁ జేసె నది మహోజ్జ్వల మయ్యెన్.

125. వ. అని చెప్పి.

126. క. గోవిషయవాక్యపరవ
శ్రావణసంశ్రవణములు ధరావర యాయు
శ్శ్రీవిభవకీర్తి సుగతిస
మావహములు దత్పరుండ వగు మిక్కు ఫలన్.

127. వ. అనిన విని కౌంతేయాగ్రజుండు శాంతనవుతో మహాత్మా గోవులమాహా త్మ్యంబు దేటపడం బెక్కుభంగులం జెప్పి నన్నుం గృతార్థుం జేసితి సర్వ యజ్ఞంబులందును [1]దాతవ్యం బత్యంతంబు సువర్ణం బని విందు వేదంబులు సువర్ణదక్షిణేతి సైయని చెప్పెడు భూమియు గోవులుఁ గాంచనంబును నీవిషయంబులైన దానంబులు నుత్తమంబు లని వేదవ్యాసువచనంబుకలిమి నీవ చెప్పితి సువర్ణవిశేషంబు విన[2]వలతుం జెప్పవే యనుటయు నతం డతని కిట్లనియె.

—: భీష్ముఁడు ధర్మజునకు సువర్ణదాన మహిమాతిశయంబు సెప్పుట :—

సం 13-83-6

128. సీ. శంతనునృపతి లోకాంతరగతుఁడైన
వినుు తదీయశ్రాద్ధవిధి యొనర్పఁ
బూని గంగాద్వారమున కేఁగి నాతల్లి
గంగ [1]సాహాయ్యంబు గౌరవమున
నాచరింపంగఁ గ్రియాకలాపం బెల్ల
నడపఁ బిండప్రదానంబు సమయ
మగుటయు దర్భవిన్యాస మొనర్ప నం
దంగుళీయక కంకణాంగదములఁ

127. 1. దాతవ్యంబు సువర్ణంబని - పెక్కుప్రతులు 2. వలతునానతీవే - ఉ. తి. వ.
128 1. సహాయంబు - పెక్కుప్రతులు.

ఆ. గాంతమైన యొక్కకరము వొడమి యఱ
చేయి సాఁచుటయును జిత్త మస్వ
తంబుఁ బొంద దానిఁ దప్పక చూచి య
య్యధిపుబాహు వగుట నాత్మ నెఱిఁగి

129. క. జనకుఁడు వేడుకఁ జే సాఁ
చిన యంతన సంతసిల్లి చేతం బిండం
బనుమానింపక యేఁ బె
ట్టిన శాస్త్రవిధాన[1]గతి ఘటింపమి వచ్చున్.

130. తే. పితృకరంబునఁ బిండంబు పెట్టు మనదు
శాస్త్ర మాచిత మగు కుశాస్తరణమునన
పెట్టఁ జెప్పు నట్లగుట నేఁ బెట్టఁ జేత
నని మనంబునఁ దలఁచి వచనము సేసి.

131. క. అనులంబగు కుశసంస్తర
ణమునం బిండంబు వెట్టినం దోఁచినహ
స్త మదృశ్య మయ్యె మత్పిత్రు
సమితి ముదము మోము లం దెసఁగఁ బొడసూపెన్.

132. క. పొడసూపి ధర్మమార్గం
బెడపక నీవిట్లు పిండ మిడుటకు హర్షం
బడరినఁ జనుదెంచితి [1]మె
క్కుడు తృప్తిం బొందితిమి [2]ప్రగుణ్యచరిత్రా.

133. వ. అని పలికి వెండియు.

134. క. [1]భూమికి గోవులకునునై
హేను మిడుట యస్మదీయహితమును దేవ
స్తోమప్రియమునుం బావన
ధామహనీయంబుఁ జుమ్మి ధర్మవిధిజ్ఞా.

---

129. 1. విధి - అ. ఠ. ఎ.

132. 1. మిక్కడ - ఖ. గ. న. 2 సుగుణచారిత్రా - అ. ఓ. క. చ,

134. 1. భూమికిఁగాగోవులకై హేమ - పెక్కుప్రతులు

195. క. పావనము సువర్ణము వం
శావలికిం దనకు నిర్మలాత్మత నిచ్చున్
నీ వది యెఱిఁగి నకలయ
జ్ఞావసరములను సువర్ణ[1]యాఱిన యగుమీ

196. క. అని చెప్పి చనిన నాదగు
మనము సువర్ణప్రదానమహిమ కెలయఁ ద
ద్వినుతానుష్ఠానపర
త్వనిరూఢుఁడ నైతి నేను ధర్మతనూజా.

197. వ. అని[1] పలికి యాభూనల్లభునితో భీష్ముండు వెండియు నిట్లను నిది యేను గనినది సువర్ణదానంబుమహిమ మఱియును విసినదియునుం గల దాకర్ణింపుము.

198. సీ. పరశురాముఁడు గిన్క నిరువదియొక్క మా
ఱదయుఁడై రాజుల వెదకి వెదకి
వధియించి కృప పుట్టి వాజిమేధంబు ప్రా
యశ్చిత్తంబుగఁ జేసి [1]యంతఁ దనివి
సనక వసిష్ఠాదిమునివరేణ్యులఁ గూర్చి
కల్మషపంకంబు [2]గడిగి పురుషు
నత్యంతవిమలుఁ జేయంగ నెయ్యది యో పు
ననిన వసిష్ఠుఁ డిట్లనియె నతని

ఆ. కనఘ విను సువర్ణ మగ్నిమయంబు దే
వతలు నగ్నిమయత నతిశయిల్లు
వారు గావునను సువర్ణదానంబు దే
వతల నీగి యట్ల శ్రుతులు సెప్పు.

199. క. కావున సువర్ణ మసదృశ
పావనతాస్పదము దాని భక్తిమెయిన్ వి
ప్రావలి కిచ్చినయతనికిఁ
బావనతం గొఱఁత గలదె పావనమూర్తీ.

---

195. 1. యాఱివిగమ్మీ - ఓ

197. 1. చెప్పి - కొన్నిప్రతులు

198. 1 యందుఁ దనివి - ఐ ఔ ఖ, యంతనింపు - ఎ. క. 2. గడిపి - ళ. ష.

-: వసిష్ఠుండు పరశురామునకుఁ జెప్పిన సువర్ణమహిమము :-

నం 13-33-40

140. వ. ఏను బ్రహ్మముఖంబున వినినది సువర్ణవిషయం బైన విశేషం బొక్కటి యెఱింగించెద నవహితుండవై వినుమని పలికి యమ్మునిపతి యమ్మహాత్మున కిట్లనియె.

141. క. గిరిజయు గిరిశుఁడును నొం
డొరువులకై తప మొనర్చ [1]యొకఱులొకళ్లన్
జెర[2]యం బడసి పరమసుఖ
భరితాత్మకు లై రి జగము [3]ప్రమదం[4]బందన్

142. వ. కొండొకకాలంబునకు నయ్యాదిమగృహస్థునితేజం బాపరమగృహిణీనిమిత్తంబుగా రేతోధాతురూపంబునం [1]బ్రసన్నం బై యమ్మహేశ్వరు మానసవృత్తిం జేసి యగ్నియందు నిలిచియుండ నత్తఱిం దారకుం డను నొక్క రక్కసుచేతం బెక్కువిధంబుల బాధలం బడి యనిమిషులును మునులును గమలయోనిం గానం జని యద్దానవుం డిడుముం [2]బఱిచినపాటెల్ల నెఱిం గించిన నద్దేవుండు వారితో దీని నెఱింగి యేను మున్న మీకు శోధనం బయ్యెడు [3]తెఱంగు సమకట్టినవాఁడ మీ రగ్ని[4]నాశ్రయించి మాకు [5]శుభంబు సేయవలయు నని సంప్రార్థనంబు సేయునది యతండు కర్తవ్యం బెఱుంగు నరుగుం డని నియోగించిన సంతోషించి యట్లు చేసెద మని యవ్విధాత వీడ్కొని నిర్జరవార మగ్నికడకుం బోవ నుత్సహించి.

143. సీ. ఆతనియున్నెడ [1]యారసికొని చను
నప్పు డాతండు నిగ్రాతిశయము
నూని [2]ప్రచ్ఛన్నుఁడై యుండుట వారలు
[3]గానక యున్నంతఁ గప్ప యొకటి

---

141 1. యొక్కరొకళ్లన్, – ఊ. ఏ. 2 యబడసి పరమ సుఖాదరితాత్మకులై రిజగమునమ్మ దమొందన్ ఉ. 3 ప్రణుతింపంగన్–గ. 4 బెనఁగన్, బొందన్. – అనిపాఠములు.

142 1. బ్రస్ఖలనంబై, బ్రస్ఖలితంబై, అనిపాఠములు. 2. బఱచు – పెక్కుప్రతులు. 3 విధంబు – అ ఈ. 4 నారాధించి – ఆ ఐ. 5 శోధనంబు – ఓ.

143. 1. నారసికొని, కారసికొని,–అనిపాఠములు 2 ప్రచ్ఛన్న విధాను లైయుండుట గాననేరక యున్న–ఐ. ఔ 3. గాననేరకయున్న – కొన్నిప్రతులు

యగ్ని పాతాళంబునం దునిక్కి యొలిఁగింప
నప్పావకుఁడు డాఁగి పిప్పలమున
శేఁగెడునెడ శాప మిచ్చెజిహ్వోన్మూర్తి
లేక [4]రసాలి వివేక[5]మెడలి

తే [6]యుండెడుమ కప్ప లని[7]బొక్క లెండ నెండి
చచ్చియును నీరు వచ్చినఁ జావు బొంకు
సేసి యెలుఁగులు[8]సెలఁగఁగఁ జెలఁగ వరము
వారు కప్పల కిచ్చి రవార్యతేజ.

144. వ. ఇవ్విధంబున విబుధులు మునులు నమ్మండూకంబుమఱుకువ యుడిపి మఱియును.

145. క. అనలుని నన్వేషింపఁగ
వనగజ మొక్కండు రావివలను [1]చతురతం
గనుగీటి చూప వా ర
ధ్వనస్ఫలిం జేరఁ జనఁగ వారని యలుకన్.

146. వ. అయ్యగ్నిదేవుండు గజంబులకు జిహ్వా దిరుగం బడ శపించుచు శమీ[1]గర్భ నివాసి యయ్యె నది మొదలుగా నగ్నికి శమీగర్భంబునం దుత్పత్తి గలిగె నద్ది విజులునుదాపసులును గజంబులు ప్రతిపజిహ్వాంబు లయ్యును సర్వరసజ్ఞానంబు గలిగి మాననీయంబులగువరంబులం జేసి రాజితంబు లగునట్లుగా ననుగ్రహించి యగ్గజంబువిషాదంబు [2]మాన్చి రంత నొక్కశుకం బెఱింగింప శమీగర్భంబున నగ్నియునికి యెఱింగి యందఱుం గ్రందుకొనం గదువేగంబునం బోదివి కొనిన నిదుర సెడుటకుం గోపించి

147. ఆ. జిహ్వ [1]మరలఁబడఁగఁ జిలుకల నగ్నిశ
పించె సురల సెవుల కించునట్టి

---

4. రసాలి – ఐ ఓ ఔ ఖ 5. ముడిగ – ఎ. 6. యుండెదము – శ. కొన్ని ప్రతులు. 7 ప్రక్కలెండ –అ, ఈ, బొక్కలెండ – శ. ష. కొన్నితాళపత్రప్రతులు. బొక్కరూపము.
సూ. నిఘంటువులోకానరాలేదు 8. మెరయగ, సెదరంగ అనిపాఠములు.

145. 1. సురలకుం – ఉ. ఊ

146. 1 గర్భవాసి – పెక్కుప్రతులు. 2 మాన్చియొక్క – పెక్కుప్రతులు.

147 1. దిరుగ – ఉ. ఊ. ఓ. చ.వ.

పలుకు వానికొసఁగి చిలుక నానందింపఁ
జేసి యాకృశానుఁ జేరఁ జనిన.

148. వ. అతండు వారి నాలోకించి మీవచ్చినకార్యం బేమి యని యడిగిన వారుఁ [1]దారకదైత్యుచేయుబాధ లెఱింగించి వాఁ డేమియుపాయంబునం దెగ టాఱు నట్టెఱం గాపాదింపు మని నిన్నుం బ్రార్థింప వచ్చితి మని పలికి వెండియు

149. క. మాకుం గుశలము గోరుము
నీకును మే [1]లివ్విధంబు నీదుమహిమ యీ
[2]లోకంబు లెల్ల మనములఁ
జేకొని [3]కీర్తించునట్లు సేయుము కరుణన్.

150. సీ. అనినఁ బ్రసన్నత [1]నట్టులు సేసెద
నూఱడుం డని వారి నూఱడించి
తనయందు వెలుఁగు శంభునివీర్య మిదియె గం
గాగర్భరూపంబు గాఁగ నాతఁ
[2]డది యతిపరివృద్ధ మగుటయు [3]ధరియింప
నోర్వక నిర్జరపర్వతంబు
తటమున శరవణ[4]స్తంబుగా గంగయు
సృష్టి మొనర్పె నాశిఖరి[5]సతరు
తే. వల్లరీగుల్మ[6]కముగ సువర్ణమయత
వెలుఁగ బాలుఁడై వెలిఁగె నవ్వీరగర్భ
ముచ్చటికి [7]వచ్చి కృత్తిక లార్వురును మ
దీయపుత్త్రికుఁ డనుచు నెత్తికొని రనఘ.

---

148. 1. దారకాసురుండు చేయు - అ. ఈ.

149. 1 లవ్విధంబు - కొన్నిప్రతులు; లెవ్విధంబు - ల 2. లోకంబుననిలిపినయదిచేకొనిమము నిర్వంహింపఁజేయుముకరుణన్ - ఎ 3. వర్తించు - ఏ. ల. శ.

150. 1. నట్టు(ట్లు) చేసెద - కొన్నిప్రతులు 2. తదిభారమగుటయు నయ్యింతి ధరియింప - ఉ. టం. న; దతిభారమగుటయు నయ్యింతిధరియింప - ఓ; తదియంతనతిభారమగుటయు - ఖ. 3. ధరియింప - ఆ ఖ. వ 4. స్తంభంబుగాఁగ సంసిద్ధిమొనర్పె - క. వ. 5. విటపి - ఉ. టం. 6 యుగ్మ సువర్ణ - అ ఈ. 7. కృత్తికలువచ్చిరార్వురును - చ

151 వ. ఇత్తెఱంగున నొక్కట నెత్తిగొనుటయు నక్కుమారుండును షణ్ముఖుండై యొక్కపెట్ట సకలకృత్తికాస్తన్యపానం బాచరించె నట్లగ్నిసంభవ గాంగేయ కార్తికేయత్వంబు లొందిన యయ్యిందుమౌళితేజంబు పదంపడి బ్రహ్మాది దేవతలు పూజింప దేవసేనాధిపతిత్వంబునం బేర్చి యర్చిర్మహిత యయిన మహాశక్తిం దారకుం బరిమార్చి బృందారకమునిబృందంబుల కానందం బొనర్చె నని యిట్లప్పరమముని పరశురామునకుం జెప్పి పురహరుం డగు నప్పురుషుండు హిరణ్మయుం డగుటయు [1]నద్దేవదేవుండు దాన తనూభవుండై తోఁచుటయుం దథావిధరేతోధారణంబున వహ్ని హిరణ్యాత్మకరేతోపవార్తియై హిరణ్య[2]రేతుం డనం జనుటయు నతండు [3]తద్రేతఃకలనంబునం దన్మయుం డగుటం జేసి పురహారునకు వహ్నిరేతుం డను నభిధానంబు గలుగుటయుం దేటపఱచి యవ్విధంబున రూపవంతంబై నది గావున సువర్ణంబు జాతరూప నామకంబై పరఁగుటయు నెఱింగించి.

152. క. మహిమాత్మక యేతాదృశ
మహిమంబు సువర్ణ మది సమంచితలీలో
మహనీయము తద్దానము
మహత్త్వమా[1]శివుఁడ యెలుఁగు మాకుం జూడన్.

153. వ. అవ్విశేషంబున నశేషకల్మషంబులం బాసి నరుండు విధూమత్వంబున వెలుంగు [1]శుచియునుంబోలె శుచిత్వ సంపద సొంపారం బెంపారునని [2]యుపదేశించె నవ్వసిష్ఠమునిపరువచనంబు లూఁది యచుంబాదరవర్ణనీయుండై సువర్ణదాన పరంపర లాచరించి.

154. క. ఆరాముండు శుచిత్వ
శ్రీరాజితుఁ డయ్యె నట్లు సేయుము నీవుం
గౌరవముఖ్యా యది [1]భవ
పారావారఘన[2]యానపాత్రము సుమ్మీ

---

151. 1. శివునకాదేవుండు - అ ఈ; నప్పురుషుండుతానతనయుండై తోఁచు- ఉ ఊ ఐ ఔ. ఖ చ. 2 రేతుఁడగుటయునతండు - చ. 3. తద్రేతఃస్థలనంబున - ఎ పీ. శ. ష

152. 1. శివుఁడెలుంగు - కొన్నిప్రతులు.

153 1. శిఖియునుంబోలె - కొన్నిప్రతులు. 2 యుపదేశించిన - కొన్నిప్రతులు.

154. 1 యింపారగభవసింధు పోతపాత్రముసుమ్మీ - ఎ. ఓ. చ 2 పోతపాత్రము - కొన్ని ప్రతులు. పోతభావము - శ. ష

155. క. అని యనిమిషతటినీప్రియ
తనయుఁడు సెప్పుటయు ధర్మతనయుఁడు హృదయం
బునఁ బ్రమదము నిండార న
తనితో నతిభక్తివినయ[1]ధాముం బగుచున్.

156. వ. పితృయజ్ఞప్రకారం బెఱింగింపవే యనుటయు [1]నక్కురువరుఁ డన్నరనాథున కిట్లనియె.

157. క. పితృపూజ [1]సమగ్ర్యము దై
వతపూజనమునకు మనుజవల్లభ పితృదే
వతలఁ గొనియాడుదురు దే
వత లాదిగఁ గల్గునెల్ల[2]వారును భక్తిన్.

158. వ. విశేషించి మనుష్యులకుఁ బితృసమారాధనంబు సర్వశుభసాధనంబు.

-: *భీష్ముఁడు ధర్మజునకుఁ బితృపూజావిధానం బెఱింగించుట* :-

సం. 10-87-9

159. క. అమవస నమవసఁ బితృయ
జ్ఞముఁ దగఁ బిండప్రదానసహితముగా భ
క్తిమెయిం జేయునతఁడు ని
త్యముఁ జేసినవాఁడ యగు సమంచితచరితా

160. వ. పితృయజ్ఞంబున[1]కుఁ దిథివిశేషంబు సెప్పెద.

161. సీ. పాడ్యమిఁ బితృయజ్ఞపరుఁడైనఁ జారుకాం
తాపతి విదియఁ గాంతలకుఁ దండ్రి

---

155. 1. ధాముండగుచున్, తత్పరుఁడగుచున్ - అనిపాఠములు.

156. 1. నక్కురువంశవరుండన్నర, నక్కురుపితామహుండానర, నక్కురునాథుండన్నర - అనిపాఠములు.

157. 1 సమగ్రము - అ. ల. శ. 2. వారలు - కొన్నిప్రతులు.

160. 1. కుఁగలతిథి, కుఁగల విధి - అనిపాఠములు

తదియను జవితిని దా[1]వాతిధనకుండు
[2]పశుభాగి పంచమి బహుసుతుండు
షష్ఠి[3]భానాత్ముండు సప్తమిఁ గృషిభాగి
యష్టమి వాణిజ్య[4]పుష్టుఁడు వసు
గజధర్మ[5]విష్టుచిత్తజతిథులం
దేకశతజంతువులను గోచయము గుప్య

తే. ములును దగ బ్రహ్మవర్చస్వి పుత్త్రికులును
ధనముగలవాఁడు విను చతుర్దశి రణైక
భాగి పున్నమ నమవస భవ్యసర్వ
కామ్యఫలభాగి యగుఁ జువ్వె కౌరవేంద్ర.

162. క. అపరం బగుపక్షంబును
నపరాహ్ణము మేలు పితృ[1]సమర్చనమున కా
ద్యవ్వుఁ దిథి దశమి చతుర్దశి
నృపవర యప్పక్షమునను నింద్యతఁ బొరయున్.

163. క. అనిన విని ధర్మసూనుం
డనఘా [1]యెద్దానఁ బితృసమర్చన మొనరిం
చిన నధిక[2]ఫలంబగు న
వ్వినుతద్రవ్యములఁ జెప్పవే తెలియంగన్.

164. వ. అనుటయు దేవవ్రతుం డతని కిట్లనియె.

165. క. తిలపాయసఘృతములు పితృ
కలనవునలకు నుత్తమములు గవ్యంబు మహా
ఫల మెద్దియైన [1]మత్స్యం
బులు మాంసము విహితవిధిఁ బ్రఖ్యాతఫలంబుల్

---

161. 1. వందిజనకుండు – క. ష న పెక్కుప్రతులు 2 వసుభాగి– ల. 3 హితాత్ముండు– అ ఏ ఓ, హీనాత్ముఁడు – ఎ గ. చ. జ. ట. ల. న. 4. పుష్టుఁడురగ ధర్మ – పెక్కుప్రతులు 5 శివార్కచిత్త, శీలార్క చిత్త – అనిపాఠములు.

162. 1. సమారాధనకా – ఐ ఖ

163 1 యెవ్వాన – కొన్నిప్రతులు. 2 ఫలదమగు – ల; ఫలమునొందును వినవలతునునాకుఁ జెప్పవే తెలియంగన్ – పీ క. ష.

161. మద్యంబులు – వ

[illegible]

మృగమునందిలి పలలంబు మేకమూంస
మొక్కఁ డొకటికి ఫలమున నెక్కు డండ్రు
పితృసమర్చనవిదులైన పెద్ద లధిప

167\. వ. నక్షత్రవిశేషం బాకర్ణింపుము

168\. సీ. కార్తెఁ జైత్యక మగుఁకర్మ మొనర్ప ని
శ్చ్యతుత రోహిణిఁ బుత్రలబ్ధి
శశితారకమున [1]నోజఃప్రాప్తి యార్ద్రిఁ గ్రూ
రపువర్తనము పునర్వసువునందుఁ
గృషిఫలోదయ మనిమిషగురు తారను
పుష్టి యాశ్లేష నుత్కృష్టవీర
తనుజలాభము మఖఁ దనకులమున పెంపు
పుబ్బ సౌభాగ్యవిస్ఫూర్తిసిద్ధి

తే. యర్యమునితారఁ జెక్కుపత్యములు పుట్టు
హ స్తమునఁ గర్మసఫలత యవులతార
సుందరాకారయుతు లగుసుతులఁ గనుట
యనిలతార వాణిజ్యవర్ధనము గలుగు.

169\. సీ. వినుము విశాఖ సత్తనయబహుత్వ మ
నూరాధ [1]రాజాధికార మైంద్ర
మునఁ బ్రభుత్వముపెంపు మూలఁ బూర్వాషాఢ
నారోగ్యమును నుత్తమాతిశయము
నుత్తరాషాఢ శోకోదయరహితత్వ
మభిజిత్తునందు విద్యాభియుక్తి
[2]శ్రవణకాలమునఁ బరమగతిసిద్ధి ధ
నిష్ఠ రాజ్యము జలనిధిపతార

తే. మొదలుగాఁ దారకంబులు మూఁట నఖిల
కార్యఫలములు [3]సదజావికములు గోవు

168 1. నూర్జప్రాప్తి - ఇ ఏ.

169\. 1. రాజ్యాధికార - ఐ 2 శ్రవణంబునందుఁ బరమగతి - అ. 3 సంజ్ఞాదికములు - అ. ఈ; సద్యావికములు - అ. ఉ ఐ ఔ. ఖ.

లవుల మూఁటను గుప్య[4]వృద్ధ్యశ్వకాయు
వులు శుచి శ్రాద్ధకర్తకుఁ గలుగు నధిప

170. వ. అనిన నప్పుడమితేఁ డప్పురుషవరునిం బితృపూజనంబులకుఁ బాత్రంబు
లెట్టివి గావలయు నని యడిగిన నయ్యమరనదీనందనుం డిట్లనియె.

171. క. [1]దైవికకృత్యంబులకును భూవర
భూసురుల సూక్ష్మముగ శోధింపం
గా వలదు గాని పితృపూ[2]
జావిధికిఁ బరీక్ష వలయు సమ్యగ్భంగిన్.

172. వ. కావున నీ వడిగి మేలు సేసి శాకర్ణింపుము.

173. తే. కులవయోరూపశీలవిద్యల నుదాత్తు
లనఁగఁ దగువారు పంక్తిపావనులు తద్గు
ణమ్ము లారయ లేని[1]జనములు పంక్తి
దూషకులు పైతృకమునకు [2]దోషదూర.

174. వ. మఱియును బంక్తిదూషకులం జెప్పెద నాకర్ణింపుము.

175. సీ. జారరి గరదుండు వేదంబు సదువని
వాఁడు వడ్డికి నిచ్చువాఁడు గాయ
[1]కుండు గ్రామముపనిఁ గుడుచు నాతఁడు గృహ
దాహి కుష్ఠము గల తనువునాతఁ
డలుఁదెవుల్ గొన్నాతఁ డఖలవస్తువులను
నమ్మెడు[2]నతఁడు సోమమ్ము విక్ర

---

4. వృద్ధ్యతిశయాయువులు – స. పెక్కుప్రతులు ప్రీత్యతిశయాయువులు – వ; ఈపాఠమున రేఫ ద్విసంయుక్తమునకు ముందక్షరమును లఘువుగా గ్రహింపవలెను. చిత్యతిశయాయువులు – వ; వ్రితతిశయా యువులు–చ వ, విధ్యతిశయాయువులు–అ. ఇ.

171. 1. దైవతకృత్యంబులకు–వ; దైవతకార్యంబులకు – ఎ క. 2 పూజావళికి – ట గ

173 1 జనంబులెల్లదూషకులు – అ ఈ. ఎ. క 2 దురితదూర, దోషరహిత – అని పాఠములు.

175 1. కుఁడునుగ్రామము పనినడపు (గడపు) నాతఁడు – అనిపాఠములు 2. వాడు – కొన్నిప్రతులు.

[3]యించినయతఁ డర్థిసంచార[4]లాభోప
జీవకుం డుర్వీశసేవకుండు

తే. భార్యయును దాను బుత్రులఁ బంచికొన్న
వాఁడు పసులఁ బెక్కెలెడువాఁడు కపట
కృత్యముల [5]బ్రముచ్చమిని శిల్పకృతుల బ్రదుకు
వారు పంక్తిదూషకు లండ్రు పౌరవేంద్ర.

176. వ. అని చెప్పి వెండియు.

177. క. తలఁ జీరసుట్టియును చె
ప్పులు దొడిగియుఁ జేసినట్టి భోజనము ఫలం
బలఘుచరిత పద్మజుఁ డసు
రల[1]భాగం బని విధించెఁ [2]బ్రకటఫణితులన్.

178. తే. పలుదెఱంగుల వంటకంబులఁ బ్రమాద
జాతమై యశుచిత్వంబు సంభవించి
నప్పు డసురలు గొండ్రు క్రియాఫలంబుఁ
దిలలు [1]పైఁ జల్ల నశుచిత దొలఁగు నండ్రు.

179. క. శాంతుఁడు సువ్రతశీలుఁడు
దాంతుం డధ్యాపకుండు దయగలవాఁ డ
త్యంతప్రబోధసంప
ద్వంతుఁడు [1]పావనులు [2]భూపవర పంక్తులకున్.

180. క వ్యాకరణధర్మశాస్త్రవి
వేకములఁ బురాణ[1]జాత వేదితయు బ్ర
హ్మైకత్వబోధనము నధి
పా కలిగినవారు పంక్తిపావనులు [2]గడున్

---

8 యించినవాఁడర్థి, యించెడివాఁడర్థి యించువాడునర్థి- అనిపాఠములు. 4. లాభంబు సేయువాఁడుర్వీశ-అ. ఈ.లాభోపజీవితుండుర్వీశ _గ 5.బ్రముచ్చిముల-కొన్నిప్రతులు.

177. 1. భాగంబుగ – కొన్నిప్రతులు. 2. బ్రస్ఫుటఫణితిన్ – అ ఈ

178. 1. పైనల్క, పైనొల్క – అనిపాఠములు

179. 1. పావనుఁడు – అ. ఈ. క. శ. 2. భూమివర – అ. ఇ. ఓ. క

190. 1. బోధ, తత్వ, శాస్త్ర, జాల – అనిపాఠములు. 2. తగన్ – అ. అ. ఈ.

181. తే. మేలిగుణములు గనియు నమిత్రజనము
శ్రాద్ధపాత్రంబుఁ జేయంగఁ జన దమిత్ర
[1]దత్తమైనది భస్మహుతంబుఁ [2]జొట
నిడినవిత్తునుబోలె [3]నై చెడున్నృపాల.

182. క. మునుముట్ట నెఱిఁగి శ్రాద్ధ
ంబెనకుం గై కొనుట మేలు భూసురునిం గై
కొని యరసి కాఁ డనిన నా
తని యుమ్మలికంబు సెఱచు ధార్మికు నైనన్.

183. క. ఈతెఱఁగు లెల్ల నెఱిఁగి సు
నీతంబుగ శ్రాద్ధ మధికనియతి నడపుని
ర్ధూతదురితుండు నడచుఁ బ్రి
యాతిశయం బెసఁగ దేవయానమున నృపా

184. వ. అని చెప్పి శాంతనవుండు కౌంతేయాగ్రజుతో [1]మఱియు నిట్లను బ్రహ్మ మానసపుత్త్రుం డగు నత్రిమునీంద్రువంశంబునకుం దొడ వగు దత్తాత్రేయ నందనుండు నిమినామధేయుం డగు సంయమికొడుకు శ్రీమంతుం డను పేరివాఁడు మృతుం డగుటయు.

185 క. నిమి యక్కుమారునకు శ్రా
ద్ధము సేయుచు నుండి భక్తిఁ దలఁచినఁ గృప న
త్రిమునీంద్రుఁడు వచ్చి క్రియా
సమీతణము సేసె మది నెసఁగునర్మిలితోన్.

186. వ. [1]అట్లు పావకక్రియాకలాపం బనుసంధించి యాసంయమివరుండు.

*—: అత్రిమహాముని నిమి కెఱింగించిన శ్రాద్ధక్రియావిశేషము :—*

సం. 13-91-3.

187. ఆ. పరిగృహీతులైన బ్రాహ్మణుల్ పంక్తి[1]పా
వనవరిష్ఠు[2] లగుట వారి కిడిన

---

181 1 దత్తయైనది - వా, దత్తమైనది - పెక్కుప్రతులు. 2. జవుట - కొన్నిప్రతులు. 3 నెల్లద - అ, ఈ

184. 1. వెండియు - అ, ఈ

186. 1. అట్లతనికి. అట్లునివాప క్రియా, అట్లతనిపైతృకక్రియా, - అనిపాఠములు.

187. 1. పావనులునర్హులగుట, పావనులఁబెద్దలగుట - అనిపాఠములు 2 గరిషులగుట - పెక్కుప్రతులు

దర్భవిష్టరములు దక్షిణావ ర్తంబు
లగుటఁ గ్రియలు దిల³సమగ్ర లగుట

188. క. అమలినతర దర్భన్యా
సము లెందును దక్షిణంబు సాఁగ నిడినయ
గ్రములు గలిగి యుండుట మం
త్రము లయ్యైవిధుల కంచితముగ నడచుటన్

189. ఆ. మునగ యుల్లి యడవిమునగ దుర్మాంసము
లానుగమ్ము మలినమైనయుప్పు
కలియ జీలకఱ్ఱ కలివేము గురుజ యిం
గువ ప్రవర్జనీయకోటి యగుట

190. క. శునకంబు రజస్వలయగు
వనిత పతితుఁ డంత్యజాతివాఁ డాక్రియప
ట్టున కె¹యిది తవులఁ జేరక
చనఁజేయుట ²నుగ్గడించి సంభావించెన్

191. క. కావున శ్రాద్ధక్రియలకు
భూవల్లభ యట్టిదంగి పూజ్యత నిచ్చుం
డా వినిపించెం బితృదే
వావలి సత్రి నిజవంశుఁ డగు నిమికిఁ దగన్

192 వ. అ_త్తెఱం గెఱింగించెద సత్రి నిమితో నిట్లను శ్రాద్ధంబున సర్వమువరుణా సోమాగ్నులకు భాగంబులు బ్రహ్మ గల్పించె¹విశ్వలగు దేవతలు పితృదేవతలతోఁ గూడం దక్షిణా యోష²యోగ్యతం దోఁతురు వారలకును భాగకల్పనం బొనరించె దేవతలయందుఁ గొంద ఱ³సూక్ష్మపు లయిన మహాభాగులం బితృత్వనిర్దేశంబున నేర్పరించె నవ్విరించి వివరించిననామంబులు సెప్పెద వినుము

3 సమగ్రమగుట _ ఈ ఉ. ఊ ఎ. శ

190. 1. కెదరవుటం, కేతిరువు (న) ల కెద్దరువుల, కేదరువుల - అనిపాఠములు 2 యుగ్గడించి _ పెక్కుప్రతులు

192. 1. విశ్వలగు - పెక్కుప్రతులు 2 యోగ్యులై తోఁతురు. - పెక్కుప్రతులు. 3 సూక్ష్మరూపులైన, సూక్ష్మపురుషులైన - అనిపాఠములు.

బలుండు ధృతి విపాప్ముండు పుణ్యకృత్తు పావనుండు పార్ష్ణి క్షేముండు సమూహుండు దివ్యసానువు వివస్వంతుండు వీర్యవంతుండు హ్రీమంతుండు కీర్తివంతుండు కృతుండు విద్యుద్వర్చసుండు సోమవర్చసుండు సూర్యశ్రీ సోమపుండు సూర్యసావిత్రుండు దత్తాత్ముండు పుండరీయకుం డుష్ణినాభుండు నభోదుండు విశ్వాయువు దీప్తిచమూహరుండు సురేశుండు వ్యోమారి శంకరుండు భవుం డీశుండు కర్తృకృతి దక్షుండు భువనుండు దివ్యకర్మకృత్తు గణితుండు పంచవీర్యుం డాదిత్యుండు రశ్మిమంతుండు సప్తకృత్తు సోమపూర్వుండు విశ్వకృత్తు కవి యనుగోప్త సుగోప్త నప్త యీశ్వరుండు జితాత్ముండు మునివీర్యుండు దీప్తరోముండు భయంకరుం డనుకర్ముండు ప్రతీతుండు ప్రదాత యంశుమంతుండు శైలాభుండు పరమక్రోధి ధీరోష్ణి భూపతి స్రజుండు వజ్రి వరి వీరలు భాగార్హు లని చెప్పి వెండియు.

193. క. గిరి వన దుర్గములందును
సరిదుత్తరణంబునపుడు శ్రాద్ధవిధిసమా
చరణసమయంబున వీరిం
బరికీర్తించిన[1]యతండు వడయు శుభంబుల్

194. ఆ. పూరిపంట ప్రాలు [1]నారుగబియ్యంబు
[2]జంబువునఫలంబు శ్రాద్ధ[3]కృతికిఁ
గావు తుమ్మ నేడ్వఁ గాదు శ్రాద్ధక్రియా
చరణసమయములఁ బ్రశాంతి వలయు.

195. వ. అనియునుం జెప్పె నని చెప్పి సరిత్సూనుండు ధర్మజుతో మఱియు నిట్లనియె.

196. సీ. ఒకతఱి మునివర్యు లొక్కటఁ జెక్కండ్రు
శ్రాద్ధముల్ సేయ భోజ్యములు పెక్కు-
లనుభవించుటఁ దమ కఱుగమి పుట్టుట
యును పితృదేవతల్ సనిరి సోము

---

193. 1. నరుండు - గ

194. 1. నారి(కే)క - పెక్కుప్రతులు. 2. జంబుఫలచయంబు, జంబుఫలమునూనె - అనిపాఠములు. 3 విధికి - పెక్కుప్రతులు

కడ కట్లు సనీ తమ [1]కాఱియ సెప్పిన
నతఁడు పద్మజుపాలి కరుగుఁ డనియె
వా రట్ల కా కని బోరన నరిగి ప
ద్మజునిఁ గాంచి యతీర్ణదశ యెఱుంగ

తే. విన్నవించినఁ దనయొద్ద వెలుఁగుచున్న
యగ్నిఁ జూపి [2]యిక్కఁ డితఁ డపహరించు
ననిన నగ్ని మత్సహితులై [3]కొనిన నఱుఁగఁ
జేయువాఁడ నాహారముల్ [4]సిద్ధ మదియు.

197. క. అని పలికినఁ బితృదేవత
లనలుఁడు ముఖ్యుఁడుగ నెపుడు నాహారంబుల్
గొని సుఖతీ[1]ర్ణానందం
బు నొందుదురు సూవె భరతభూపవరేణ్యా.

198. క. కావున సాగ్నికుఁ డయి తగ
నేవాఁ డొనరించు శ్రాద్ధ మీద్యం బది సం
భావింతురు పెద్దయుఁ బితృ
దేవత లసురలకు రాదు [1]తెలియుఁ జూడన్.

199. ఆ. అనఘ పితృపితామహప్రపితామహ
పూజనములు[1] శిష్టపూర్వకముగఁ
జేయవలయు నియతి దాయ దొడ్గినజన్ని
దంబుతోడ భక్తిధామ మగుచు.

200. తే. పిండసంబంధమునఁ బాయుఁ బ్రేతభావ
[1]మది సుగతి నిచ్చు గయఁ బిండ మట్లు గాన
నరుగునో గయ కొకఁ డైన నని కదా య
నేకపుత్త్రులఁ గోరుదు రిద్ధచరిత.

---

197. 1 చరణానందంబు - పెక్కుప్రతులు

198 1 తెలియంజూడన్ - కొన్నిప్రతులు

199 1 గనిష్ఠ, గరిష్ఠ, లునిష్ఠ, లునిష్ట-అనిపాఠములు.

200. 1. మతిసుగతి - వ పెక్కుప్రతులు

201. క. గౌరి యగుకన్య వరదా
[1]నారూఢంజేత నీల[2]మైన వృషభమున్
గారవమున విడువునుదం
బారంగాఁ జేయుఁ బితృచయముచిత్తములన్

202. క. [1]శ్రాద్ధంబుప్రకారంబును
వృద్ధాచార్యోక్తభంగి వివరించితి నీ
బుద్ధిం దోఁచినదాని స
మిద్ధగుణోదార యడుగు మెయ్యది యైనన్.

203. క. అని నిర్జరాపగానం
దనుండు పలుకుటయుఁ బ్రియము దళుకొత్తఁగఁ బాం
డు[1]నృపాలు నగ్రనందనుఁ
డనూననినయమున నమ్మహామతితోడన్.

204. క. తప మని యార్యులు సెప్పుదు
రుపవాసవ్రతము నదియె యొండు గలదొ సా
రపుఁ దపముతెఱఁగు నాకం
గృప నెఱిఁగింపుము విధూతకిల్బిష యనుడున్.

205. ఆ. అమ్మహాత్ముఁ డిట్టు లనుఁ బెక్కుదివసంబు
లుపవసించి యునికి తపము చొప్పె
దాన విను తపస్వి గానేరఁ డది యాత్మ
[1]ఘాత మగుట నరుఁడు గౌరవేంద్ర

206. క. సత్యంబు బ్రహ్మచర్యము
నిత్యశుచిత మౌన మతులనియమము దయ శు
ద్ధత్యాగంబుఁ దపస్సం
పత్త్యాకృతు లండ్రు బుధులు పౌరవముఖ్యా.

---

201. 1. నారూఢతఁజేసి – పెక్కుప్రతులు 2 మఁగ – ఇ. ఏ. ఐ. ఔ ఖ.
202 1. శ్రాద్ధక్రియావిధమెల్లను – అ. ఈ.
ఇచ్చట రేఫసంయుక్తాక్షర పూర్వము(క్రి)లఘువుగా చదువవలెను.
203. 1. నృపాల నంద నాగ్రజుఁడనూన – ఇ. ఉ ఏ ఐ ఔ ఖ.
205. 1. ఘాతమగుటనరుఁడు భూపవర్య – అ. ఈ.

207. వ. అనిన విని కురుపతి కురుపితామహునితో మహాత్మా దానశీలుని యప్రతి గ్రాహకుని విశేషం బెట్టిది యెఱింగింపు మనవుడు నాదేవవ్రతుం డీవిష యంబునకు సప్తర్షివృషాదర్భిసంవాదం బనునితిహాసంబు గల దని చెప్పి యమ్మనుజపతి కిట్లనియె.

—: సప్తర్షివృషాదర్భి సంవాదం బనునితిహాసంబు ప్రకారము :—

సం 13-94-4

208. తే. కశ్యపాత్రి విశ్వామిత్ర గౌతములును
విను భరద్వాజజమదగ్నులును వసిష్ఠుఁ
డును జగంబుల నెల్లఁ బేర్కొనిన ఋషులు
వారి సప్తర్షిగణ మండ్రు కౌరవేంద్ర.

209. వ. వసిష్ఠునిదేవి యగు నరుంధతి యెందును నతనితోడన తిరుగు నయ్యం దఱకుం బరిచారికయై [1]గండ యను చేడియ వర్తించుఁ దద్వల్లభుం డగు పశుసఖుండును వారలకుం బరిచారకత్వం బాచరించు నప్పుడుంద్రుడును దప శ్చరణపరులై ధరణిం జరించుచుండ నత్యంత[2]ఘోర యగు ననావృష్టి దోఁచి జీవసాధనంబు లగు పదార్థంబులు దుర్లభంబులై జనంబులకుఁ బ్రాణంబులు రక్షించుకొనుట దుష్కరంబై [3]చెల్లం గశ్యపాదులు నతిక్షుధార్తులై యాహారం బన్వేషించునెడ శిబిసూనుండైన యాజ్యానామధేయుండు తొల్లి యజ్ఞ[4]దక్షిణార్థంబుగాఁ దనకొడుకు నీలుం డనువాని ఋత్విగ్జనంబుల కిచ్చినం దద్వశగతి నుండి కాలం బగుటయు [5]మృతి నొందినం దదీయశవంబు.

210. క. సొదపై నుండఁగ వారలు
వదుంద్రుడునుం జూచి దాని భక్షింపంగా
మదిఁ గోరి చేరి చుట్టుం
బొదివిన సమయమునఁ [1]గాటిపొంత తెరువునన్.

---

209. 1. చండ – పెక్కుప్రతులు. 2. ఘోరంబగు కొన్నిప్రతులు. 3 చెల్లఁగాశ్య – అ. ఈ ఏ; చెల్లెఁగాశ్య – ఆ ఏ కౌ.శ ష 4. రక్షణార్థంబుగా – ఓ.క. 5 మృతింబొందిన పెక్కుప్రతులు

210 1. కాడి – అ. ఇ

211. తే. వేఁట వోయి మరలి విభుఁ డొక్కరుఁడు వృషా
దర్భినాముఁ [1]డతులదానపరుఁడు
పోయి పోయి కాంచి పోవక [2]నిలిచి య
మ్మునులతోడ నధికవినయ మెసఁగ.

212. క. మీ [1]రాఁకలిపెల్లున నా
హారంబుగ శవముఁ [2]గొనుట కడరితి రితి రి క్లే
లా [3]రం డిచ్చెద [4]మీ కా
హారంబులు వలసినట్టి వని తా మఱియున్

213. క. బహువిధము[1]ల ధాన్యములును
బహురసవర్గములు మీకు [2]భక్తి నొసఁగెదన్
బహుతురగశకటగోగణ
బహుళ[3]బహుగ్రామములును బహుమ[4]తి నిత్తున్.

214. వ. [1]అనిన వార లతని కిట్లనిరి.

215. తే. రాజవర రాజుదెసఁ [1]బ్రతిగ్రహము [2]విషముఁ
గల్లుఁ గాఁ జూతు మిట్టులు గాంచి యున్న
యట్టి మాకు నీ విచ్చెద ననుట మావి
ధం బెఱుంగమి యింతియ తప్పు గాదు.

216. క. అనుడు విషాదముతోడం
జని కృత్రిమవనఫలములు సమకట్టి తగన్
జనపతి మంత్రుల ఋషులకుఁ
గొనిపొం డని [1]పంప వా రకుంఠితభక్తిన్

217. వ. వానిం దెచ్చి యమ్మహాత్ములకు సమర్పించిన

---

211. 1 దరిక – ఊ. ఓ. చ. వ 2. మరలి – ఆ.
212. 1 రాఁకతి – అ. ఆ. ఉ. ఖ ల. 2 గొనుట క్రియుండఁగనేలా – అ. ఈ. 3. గండేని చ్చెరనాహారంబులు – అ క. గ. చ. వ. 4. నేనాహారంబులు – కొన్ని ప్రతులు.
213. 1. ధనధాన్యములును-ఈ 2 ప్రౌఢి – అ ఈ. 3. మహా – ఈ ఓ. 4. గతి – ఇ.ఏ.క.
214. 1. అనినవినివారలతని – పెక్కుప్రతులు
215. 1 బ్రతిగ్రహము – అ. ఇ. ఉ. ఐ. ఓ. ఖ. ల వ. 2. మద్య ఘటముఁగా – ఐ ఔ. ఖ.
216 1. పనుప, పలుక – అనిపారములు

218. ఆ. వాకు పట్టి చూచి వాని వ్రేఁగున హేమ
గర్భకంబు లగుట గాంచి [1]నవ్వి
పుచ్చుకొనక యున్నఁ [2]బోయి భూపతికి [3]న
త్తెఱఁ గమాత్యకోటి యెఱుఁగఁ జెప్పె.

219. క. విని యతఁడు రాజసంబునఁ
గనలు వొడమి కృత్తివేల్వఁగాఁ దగువారిం
బనిచిన [1]నప్పుడు హోమం
బున రాక్షసి యొర్తు పుట్టె భూపవరేణ్యా

220. వ. పుట్టి యప్పుడమితేని [1]ముందట నిలిచి పనియేమి పనుపు [2]మనిన నతండు ప్రీతుండై కశ్యపాదులం గనుపుగొట్టు మని పనిచిన నది వార లున్నెడ రోసి పోయె [3]నంతకు మున్న వారు వనంబున [4]మూలంబులు ఫలంబులు వెదకి తిరుగుచుండ శునస్సఖుం డను పరివ్రాజకుండు వచ్చి వారిం గని వందనంబు సేసిన వార లభినందించి రతండు నమ్మునులం గలసి [5]యేకార్థుండై సంచరించె నట్లు చరించు నమ్మహాత్ము లతి[6]క్షుధాన్వితులై తామర[7]తూండ్లు పుచ్చికొని నములుటకై యొక్క నలినాకరంబునకు సత్వరగతి నరుగుచు న్నున్న నా రక్కసి యక్కొలని కడ్డంబుగాఁ బోయి పొడసూపి నిలిచిన.

221. క. ఈ కమలవనముచేరువ
నేకార్యము సేయఁ [1]జూచె దీవెవ్వత వం
చాకొలను సొరఁగ [2]నమ్ముని
లోకము సేరుటయు [3]నచ్చెలువ యెలుఁ గెసఁగన్.

---

218. 1. యవియు - పీ.స 2. భూమిపతికిని నత్తెఱఁ - ఐ. ఖ. 3. నత్తెఱఁగుమంత్రికోటి - ఉ ఊ చ వ.

219. 1. నప్పటి - ఎ. ఖ. శ.

220. 1. ముంగల - ఐ. 2. మనుటయు-ఉ. 3. నంతకమున్న - కొన్నిప్రతులు; నంతకుమున్న - అ. ఈ క. 4 ఫలమూలంబులువెదకి - పెక్కుప్రతులు 5. యెందునుంజరించెనట్లు - అ ఐ ఔ ఖ 6 క్షుధార్తులైకొన్నిప్రతులు. 7 తూఢ్ల - ఐ ఖ.

221. 1. జూచితెవ్వతె పనియంటా - ఓ; జూచెదెవ్వతెపీవం - అ ఐ ఖ 2. నమ్మునులేకోద్ధతివో (బో)వమెలఁతయెలుఁగెసఁగంగన్ - అ ఐ. ఔ. ఖ. 3. నమ్మెలఁత - పెక్కు ప్రతులు

— వృషాదర్భి పుత్తెంచినకృత్తి శునస్సఖునిచే మృతిఁబొందుట. —

సం 19-95-49

222. వ. [1]ఏ నెవ్వత[2]నైతి నేమి యిక్కొలని కావలియున్నదాన ననుటయు నమ్మునులు [3]వల్లనై [4]యాఁకట నలందురి యుపజీవింప నొండేమియు [5]లేమిం జేసి యీసరోవరంబున బిసంబులు వెదకికొని భక్షించువారమై వచ్చితి మనిన నవ్వనిత మీమీపేళ్లు సెప్పి మఱి పద్మవనంబుఁ [6]బ్రవేశించువా రని పలికిన నప్పరమమునులన్నాతి యాతుధానియగుటయుం గృత్తి యగుటయు వధింప వచ్చినది యగుటయు నెఱింగి కశ్యపాదు లగు పదుండ్రును దానికి [7]దుర్బోధత్వంబు దోఁచునట్లుగా నిర్వచనసహితంబుగాఁ దమనామంబులు సెప్పి [8]రప్పాపవర్తన వెఱఁగుపడి యుండ శునస్సఖుండు దనయభిధానం [9]బభివ్యక్తంబుగా నుగ్గడించినం [10]గృత్తి నీపేరు దెలియంజెప్ప విది యేమి యనవుడు నతండు శేటపడంజెప్పి యుండం జెప్ప వనియెద విట్లంట తప్పు గాదె యిట్టి యుద్దండవు[11] మంత్రిదండంబుపాలు వడుమని బ్రహ్మదండ[12]నిభం బగు [13]నిజ [14]హస్తగత దండంబున దాని శిరంబు [15]బెట్టు వ్రేయుచుఁ బాప కర్మురాలా పడుము [16]భస్మంబ వగు మని నిష్ఠురాక్షరంబుగా నిర్దేశించిన దుర్దశ యగుచుం బడి యారక్కసి భస్మీ[17]భూతయయ్యె నప్పు డప్పదునొకండ్రునుం బ్రమోదంబునం [18]బయోజషండంబు సొచ్చి.

223. తే. బిసము లాదట నందఱుఁ బెఱికి రొంపి
వోవ నీటఁ [1]దెమల్చి [2]మోపుగ నమర్చి
తీరమునఁ బెట్టి నియమముల్ [3]దీర్పఁ జొచ్చి
తీర్చి [4]యాఁకలి దముఁ గోసి తినఁగఁ గూడి.

---

222. 1 ఏనెవ్వతి - కొన్నిప్రతులు 2 నైననేమి, నైననునేమి--అనిపాఠములు. 3. పెల్లైన- కొన్నిప్రతులు. 4యాఁకలి - కొన్నిప్రతులు. 5 లేమిఁదెలిసి-ఎ క. 6 బ్రవేశింపుద ని- ఎ. క 7 దుర్భరత్వంబు - ఔ. 8 రవ్వామవర్తన - ఇ ఔ. ఖ. శ. ష. 9. బవ్యక్తంబుగా - అ ఈ ఒ. ఓ క. 10 నగ్గాంతి నక్కృత్తి - అని పాఠములు 11 వృత్తిదండంబు-కొన్నిప్రతులు, వృత్తివిమర్దండంబు - ఉ.ఊ 12. సదృశంబగు- ఎ 13 తన - శ. ష 14 హస్తదండంబున - ఆ ఈ ఉ. ఊ, ఒ. ఓ శ. 15 బిట్టు - అ ఉ ఊ 16. భస్మంబగుమని - కొన్ని ప్రతులు, భస్మంబుగమ్మని - అ. ఈ. ఓ. 17. భూతంబయ్యె - అ. ఎ. ఓ. క. 18. గాసారంబు సొచ్చి - ఐ. ఔ. ఖ

223. 1 విదల్చి, విదిల్చి, వెదల్చి - అనిపాఠములు. 2 కోవుగ-స 3 తెలివితోనుదీర్చి-ఎ. 4. యాఁకటబిసములు దినఁగ - అ.

224\. క. కొలను వెడలి బిసము లిడిన
నెలవునకుం బోయి యచట [1]నిగిడించిన చూ
డ్కులు కవి దోఁపక యున్నను
గలయం బరికించి యెట్లుఁ గానక తమలోన్.

225\. వ. ఒండొరుల శంకించి శపథంబులు వలుకుదుము గాక యని నిశ్చయించి శున
స్సఖుని వినువానింగాఁ జేసికొని రప్పు డత్రి యిట్లనియె.

226\. తే. మొదవుఁ దన్నుట రవియభిముఖత దనకుఁ
గలుగ మూత్రపురీషమోక్షణము సేఁత
యధ్యయన మనధ్యయనము నందు నడపు
[1]టగు బిసంబులు ముచ్చిలి నట్టులైన.

227\. వ. అనుటయు వసిష్ఠుండు.

228\. క. శ్రుతి సదువమి సన్న్యాస
స్థితిఁ గాముకుఁ డగుట గుక్కఁ జేకొని తిరుగన్
మతి రోయమి నయ్యోడు దు
ర్గతి [1]తూఁడులు ముచ్చిలించు కష్టునకు నగున్.

229\. వ. అని వెండియు

230\. క. సుత నమ్మికొనుట శరణా
గతుఁ జేకొనకునికి నిచ్చుకారుణికుదరి
ద్రతఁ జూచియు వేఁడుట నగు
గతి బిసములు [1]దాఁచికొనుట గల్గినఁ గల్గున్.

231\. వ. అనియెఁ దదనంతరంబ

232\. చ. పలలవ్యపోహభుక్తి [1]సభఁ బతుముఁ [2]బల్కుట దుష్టదాన ము
గ్మలి దివసంబునం గవయుకష్టత విప్రజనంబు [3]లుద్ధతా

---

224\. 1 నిగుడించిన - పెక్కుప్రతులు.

226\. 1. డగు - అ ఇ. ఈ ఉ. ఒ. వ ష

228\. 1. తూండ్లును - ఎ ఒ; బిసములు - ఓ చ ళ

230\. 1. దాఁచి - ఉ. పీ. శ ష.

232\. 1. యరిపక్షము - అ. ఆ ఈ. కరి (సాక్షి) పక్షము - ఇ. ఊ. గ. ట. శ. ష న.
2\. పట్టుట - అ ఈ, వల్కుట - కొన్నిప్రతులు 3. లన్వృథా, దుర్బలా, లర్థితా - అని పాఠములు

కులితముఁ జేత యెల్లసరకుం గొని యమ్ముట[4]కాదె తూఁడుతీఁ
గలపొది ద్రుచ్చిలించు టని [5]కశ్యపసంయమి వల్కె భూవరా.

283. వ. పదంపడి.

284. క. జ్ఞాతులయెడ గోవులయెడ
గోత్రులయెడ ధర్మమెడలి క్రూరుఁ డగుట కా
ర్యాతుర విప్రోపేక్ష
నీతి బిసము లపహరించునిపుణత యరయన్

285. క. అని [1]పలికి భరద్వాజుం
డను మఱియు హావిస్స్రగంప నగ్ని నిడుట యొ
జ్జ [2]నధఃకరించి చదువుట
యను నివి సరి యౌ బిసాపహరణంబునకున్.

286. వ. అని పలుకుటయు.

287. తే. [1]ముట్టునను భార్యఁ గవయుట మూత్రమును బు
రీషమును నీర విడుపు విద్వేషయుక్తి
యోషిదుపజీవనము మృణాళోత్కరంబు
ద్రుచ్చిలుట [2]వోలు కల్మషములె తలంప.

288. క. అని జమదగ్ని మఱియు ని
ట్లను నన్యోన్యాతిథిత్వ మనపాయపువై
రనిరూఢి పాఁడిమొదవుం
గనలి [1]యడుచు [2]టిదె బిసనికరచోరతకున్.

289. వ. అనవుడు గౌతముండు.

---

4. సుమ్ము - అ. 5. కాశ్యప - కొన్నిప్రతులు; కాశ్యపి - ఊ.

285. 1 పలికె - శ ష 2 నుధిక్కరించి - అ ఆ. ఈ. గ వ. శ. ష. ; నుతక్కరించి-ఇ ఏ ఐ, నుతస్కరించి-ఓ. ఖ

287. 1. ముట్టుపొరిభార్య - ఈ. ఉ ఊ, ముట్టుతోభార్య - ఎ ఏ 2 వోలుకల్మషములు తలంప - న.

288. 1. యడఁచుటనరి - ఆ, యడఁచు టిదియె - అ ఈ, 2. టిడు - పీ శ ష కొన్ని ప్రతులు

240 క. [1]ధృత[2]వేదత్యజనానల
వితతి వృథా త్యాగసోమవిక్రయ వృషలీ
పతితా [3]దుర్గ్రామయా[4]జి
వితలు విస[5]స్తైయ కష్టవృత్తికి నెనయే

241. వ. అని నిర్దేశించిన విశ్వామిత్రుం డి ట్లనియె.

242 క. [1]తగు[2]భృత్యులఁ బ్రోవ కునికి
[3]దగని [4]భటులఁ బ్రోవు కపట[5]ధార్మికవృత్తిన్
జగతీపతిఁ గొల్చుట తె
న్సఁగఁ బోలఁగ నేర్చునే విస [6]స్తైన్యంబున్.

243. వ. నావుడు నరుంధతి [1]యల్ల నవ్వుచు

244. క. సతతంబు న త్త దూఱుటఁ
బతియెడ [1]దుశ్చిత్త యగుటఁ బరమాన్నము నొ
క్కత సేవించుట నగు దు
ర్గతి విసములు [2]దాఁచి కొన్న [3]కష్టకుఁ గలుగున్.

245 సీ. అనుదు వంటకము సేసిన యింతి తా మున్న
గుడుచుట [1]పతియెడఁ [2]గుటిల యగుట
[3]బొంకులు వలుకుట పుత్త్రిక వెలగొని
యిచ్చుట సుజనుల కెగ్గు సేఁత

---

240. 1. స్మృతి - ఇ ఏ; శ్రుతి - చ; ధృతి - ల 2 వేదాధ్యయనానలవితతి - ఏ.
3. దుఃఖోపాజీవితలు, దుష్కోపాజీవితలు, దుష్టోపాజీవితలు - శ. ష. న మున్నగుప్రతులపాఠములు 4. జీవితులు - కొన్నిప్రతులు. 5. సైన్య - ఈ. ఉ.

242 1. తగ - అ ఈ ఔ. 2 భృత్యుని - ఉ ఊ. చ. ల. 3. తగని - పెక్కుప్రతులు. 4. భటుని - ఉ ఊ ఒ ఓ 5 ధార్మికతధృతిన్ - ఎ. క; ధార్మికతంత్రిన్ - వ. 6 స్తైయంబున్ - పెక్కుప్రతులు

243 1 యల్లన - పెక్కుప్రతులు

244 1. దుశ్చరిత - కొన్నిప్రతులు. 2. దాఁచి - కొన్నిప్రతులు; దాఁచుకొన్న - ఏ. చ. 3. కష్టలకునగున్ - అ ఈ

245. 1. పతియెడ - ఉ ల 2. గుటిలవడుట - స 3. బొంకువల్కుటయును - ఐ. ఔ. ఖ

ఘెట్టిదుర్గతిఁ [4]దెచ్చు[5]నట్టిద కల్లు బి
సావలి మ్రుచ్చి[6]నట్టు లైన
నిట్లు గాకయుఁ బుట్టు వెల్ల దాస్యంబు నీఁ
గకపోవు నక్కఁడు గలనికృష్ట
తే. యనియె [7]గండ యసంతాను డగుట గర్భ
దాసుఁ డగుట దరిద్రత్వతప్తుఁ డగుట
చెందుఁ దూఁడులకట్టమ్రుచ్చిలిన[8]కష్ట
నరుని కనిపల్కెఁ బశుసఖనాముఁ డధిప.

246. వ. అని యి ట్లందఱుం దన కభిముఖులై పలికిరి వారితో శునస్సఖుం డిట్లనియె.

247. క. ఛందో[8][1]జ్ఞునకై నను దన
నందన నధ్వరధురీణునకు[2]నై నను నా
[3]నందనుగ [4]నిచ్చుటం బో
లుం దూఁడులకట్ట మ్రుచ్చిలుట దలపోయన్

248. తే. [1]అనిన నయ్యందఱును బుణ్యకర్మ
మనఘ శపథంబు[2]నకు విషయముగ నీవు
వలికి తటు గాన బిసలతాపహృతి నపహ
రించినాఁడవు మమ్ముఁ గారింప కిమ్ము.

249. సీ. అనిన నిక్కం బిది యందఱు నొండొరు
నే మనియెదరో[1] [2]పీ రీబిసముల
పొది యేను[3]దాఁచి చూచెద నని [4]దాఁచితి
[5]నిదె కొనుఁ డని [6]దాని నిచ్చి [7]మీకు

---

4 నిచ్చు - అ ఈ 5 నట్టిదగలుగు - పెక్కు ప్రతులు 6. నట్టిదైన - ఆ. ఐ. ఖ. 7 జరఠ, జండి - అనిపాఠములు. 8 దుష్టనరుని-పెక్కుప్రతులు

247 1. గురువునకైనను - ఐ ఖ. వ, గురుకైనసుదన - ఉ. ఔ. 2. నేనియు - పెక్కు ప్రతుల 3 నందమున - ఉ ఊ. ఐ ని. 4. నిచ్చుటను - కొన్నిప్రతులు.

248 1. అనుడు, అనఁగ - అనిపాఠములు. 2 మైవిషయముగ - ఉ. ఊ. చ. వ.

249 1. రాకొయాబిసముల - వ. 2 మీరీబిసముల - కొన్నిప్రతులు. 3. డాఁచి - కొన్నిప్రతులు 4 డాఁచితి - కొన్నిప్రతులు. 5. నిదిగొనుఁడని. - అ. ఈ. గ. 6. వాధికిచ్చి - ఎ క, వానికిచ్చి - ఏ వ 7 మిమ్ము - ఊ

నలిగి వధించుటకై హోమవహ్నిఁ బు
ట్టించి [8]వృషాదర్భి పంచెఁ[9]గృత్తి
నది[10]మున్న కాంచి రక్షార్థి[11]నై వచ్చి యా
రక్కసిఁ జంపితి నిక్కమునకు
ఆ. వాసవుండ లోభవర్జనముఖభవ
త్సద్గుణములఁ జేసి శాశ్వతంపు
నెలవు గలిగె రండు నెగయుండు పుణ్యలో
కముల[12] కని సమాదరమునఁ బలికె.

250. వ. అట్లు పలుకుటయు

251. చ. అనయముఁ బ్రీతిఁ బొంది నును [1]లట్టుల చేసెద మంచు నింద్రు ప
జ్జన తగ నేఁగి దేవపరిషత్పరిపూజ్యపదస్థులై వెలిం
గి నిఖిలలోక నిత్య పరికీర్తిత మూర్తుల నొప్పి [2]రింతయు
న్వినుమపరిగ్రహంబు మహనీయత నైనది సూవె భూవరా.

252. క. కావున లోభము విడుచుట
కేవియు సరి[1]గావు గుణము లీగుణము మహీ
దేవునకు వలయుఁ బెద్దయు
నీవిధమున కమరసంఘ మెంతయు మెచ్చున్.

253. వ. అని చెప్పి భీష్ముండు వెండియు.

254. ఉ. ఈయితిహాస మార్యసభ నెవ్వఁడు [1]సమ్మతిఁ జెప్పు వాఁడు దీ
ర్ఘాయువు శ్రీయు ధర్మము సముంచితకీర్తియు వృద్ధిఁ [2]బొంద సౌ
ఖ్యాయతనాత్ముఁడై మను సురావలియుం బితృకోటియుం [3]బ్రియ
[4]శ్రీ యలరారఁ గీడతనిఁ జెందక యుండఁగఁ జేయు నెయ్యెడన్.

---

8. యాతఁడుకృత్తిఁ బంచెననియె-అ. ఈ 9 గృత్య-ఉ ఈ ఐ. ఓ 10-మున్న గాంచి - ఉ ఈ ఎ క. 11 యై - అ. ఈ. ఒ. ఔ ఖ. 12. నకని - పెక్కుప్రతులు

251. 1. లట్లన - కొన్నిప్రతులు. 2. రెంతయున్ - కొన్నిప్రతులు; రంతయున్ - అ ఈ. ల

252. 1. రావు - ఈ

254. 1. సన్మతి - పెక్కుప్రతులు 2 బొందు, బొంది-అనిపాఠములు 3 బ్రియ భైయలరారం గీడతని - నందకయుండఁగ ఐ ఔ. ఖ. 4. శ్రీయలరంగ - ల

—: ఉపానద్దాన విషయక సూర్యా జమదగ్ని సంవాదము :—

సం. 19-97-9

255. వ. అనిన విని యజాతశత్రుండు [1]శంతనుపుత్త్రుతోఁ బితృకార్యాదులయందు గొడుగులుఁ జెప్పులు నిడుట యుత్తమప్రకారం బని చెప్పుదురు వానివిశేషంబు తెలం గెఱింగింపవే యనుటయు నమ్మహాత్ముం డమ్మహీపతి కిట్లను సూర్యజమదగ్నిసంవాదం బనునితిహాసంబు వినుము దాన నీయడిగిన[2]యది తేటపడు జమదగ్నిమహాముని క్రీడార్థియై శరాసనంబు ధరించి రేణుకాదేవి బాణంబుల కట్టఁ గొని తనతోడం జనుదేర [3]నివాసంబు[4]వెడలి [5]యొక్కబయల నయ్యంపపొది నిలువ [6]వైపించికొని దూరాపాతనం బాచరింప నిక్కుసుమకోమలి సని యమ్ము[7]లేఱికొని వచ్చి యిచ్చుచుండు.

256. తే. [1]ఇవ్విధమున వినోదింప వినుఁడు గగన
మధ్యగతుఁ డయ్యె నప్పు డమ్మగువ యమ్ము
[2]లేఱి తేరంగఁ బోయి యొక్కింత దడసి
యరుగుదెంచిన నాతఁ డయ్యబల తోడ

257. క. లోలాక్షి యచట [1]నిమ్మరి
యేల తడసి తనుడుఁ బేర్చు నినుతేజమునన్
నేలకు వేఁడిమి [2]దనికినఁ
జాలన వెసఁ ద్రొక్కఁ [3]దలయుఁ జాలఁ దపించెన్.

258. క. ఇమ్మెయి నలంగి యొకవృ
క్షమ్మున క్రీనీడ నిలిచి చను[1]దెంచుట నా

---

255. 1. శంతన – పెక్కుప్రతులు 2. యర్థంబు – అ ఈ ఏ. ఒ ఎ. 3. నిజనివాసంబు – వ 4 వెలువడి–ఆ,ఐ. ఔ ఖ. 5. యొక్క యెడనయ్యంప–ఉ. ఊ ఏ. ఒ. వ. 6. వైపుకొని – ల; వైపించుకొని – అ ఇ ఊ ఎ ఏ. ఓ. క వ. ; వైచుకొని – గ. 7 వెఱికికొని – ల

256 1. ఇవ్విధంబునఁ గ్రీడింప – పి శ ష; ఇవ్విధంబున విహరింప – వ 2 లేఱికొనితేరఁ బోయి – ఉ ఊ చ వ,

257. 1. గ్రుమ్మరి. ద్రిమ్మరి, నీవది – అనిపాఠములు. 2 నూవిన – అ ఈ. 3. దనువు, వలయు – అనిపాఠములు.

258 1 దేరఁగ – ఆ.

[2]కిమ్మరి దడయ పలసె నని
యమ్ముద్దియ సెప్పెఁ జెమట యడరఁగ మేనన్.

259 క. విని [1]యేమేమీ నొంచెనె
యినుఁడు నినుం దత్ఫలంబు నిప్పుడ కుడువం
గనియెదుఁ గా కస్త్రీనల
మునఁ బొదివెద నతని ననిరె ముని కోపమునన్.

260. ఉ. దాని నెఱింగి భూసురతఁ దాల్చి వెసం జనుదెంచి యర్కుఁ డ
మ్మానితసంయమిం గని యమత్సరభావము దోఁప రోషమున్
మానుము నావుడుం బలుకు మానుము నీ వటు వాయు మేసెదన్
భానుని నేలఁ గూల నని పల్కె మునీంద్రుఁడు కోప[1]తాతుఁడై.

261. చ. పలికిన బ్రాహ్మణుం డొదుఁగఁ జాలక నిల్చి మునీంద్ర [1]యిట్టు లి
ట్టల మగు క్రూరవృత్తికిఁ గడంగుదురే సవిత్రుండు రశ్ములన్
జల మొసఁగంగ నోషధుల సంపద హవ్య[2]మహాత్త్వ మొంది వే
ల్పులకు బలంబు [3]నిచ్చు నది లుప్తము గాదె యతండు నొచ్చినన్.

262. చ. [1]అనినను శాంతి లేమికి భయం బెదఁ గూరఁగ మ్రొక్కి యాతఁ డే
[2]నినుఁడ సహింపు నావలన నెగ్గులు [3]గల్గినయేని [4]నీకు నె
మ్మనము దయామయం బని సమస్తజగంబులు [5]సంస్తుతింపఁ గా
విని మద [7]మందుదున్ శరణు వేఁడెదఁ గావుము న న్మునీశ్వరా.

263. చ. అనినఁ [1]బ్రశాంతుఁడై తపను నాభృగుముఖ్యుఁడు ప్రీతిగౌరవిం
చినఁ బ్రమదంబునన్ గొడుగుఁ జెప్పులు మానసవృత్తిఁ దెచ్చి య

---

2. కిమ్మెయి - అ. ఎ. ఒ క.గ వ
259. 1. యేమీనినునొంచెనె -క.
260. 1. తాప్యుఁడై - వ.
261. 1. యిట్టియిట్టల - ఇ. ఎ. ఒ 2. మయత్వ - స కొన్నిప్రతులు. 3. దెచ్చునది, లిచ్చునది - అనిపాఠములు
262 1. అనుటయు - అ 2. నినుఁడు - ఇ ఈ. క 3. గల్గెయేని - ఒ 4. నీదు - పెక్కుప్రతులు. 5. జనంబును, జనంబులు - అనిపాఠములు. 6. సన్నుతింపఁగా - అ. క. 7 మందెదన్ మందుచున్ - అనిపాఠములు.
263 1. బ్రశాంత చిత్తుఁడయి యాభృగు - అ

మ్మునికడఁ బెట్టి యుత్తరణి మున్నివి లే వనిపల్కి దీన మైఁ
దనుకదు [2]పీనఁ బాదములఁ దాఁకదు నాదగు[3]వేఁడి యేమియున్.

264. మ. నయ మిట్లారఁగ నాతపత్రము నుపానద్ద్వంద్వముం జూపి చె
ప్పి యపూర్వం బగుసృష్టి ఖేలనమునం [1]బెంపొందు నవ్వస్తువుల్
[2]దయ సద్విప్రున కీగి నైహికసు[3]ఖౌదాత్త్యంబు నాముష్మిక
ప్రియమున్ దాతకు సుస్థిరంబులుగఁ గల్పించున్ మునీంద్రోత్తమా.

265. మ. అనినన్ మోము మలర్చ దినేశ్వరునిఁ దా నామంత్రితుం జేసి య
మ్మునిశార్దూలుఁడు వల్లభాసహితుఁడై మోదంబునం దేలుచుం
జనియెన్ నాఁడు జనంబు లెల్లను బ్రవర్షం బందుచున్ వానిఁ గై
కొని రవ్వస్తువు లిట్టి పేర్పడఁగ నీకుం జెప్పితిన్ భూవరా.

266. చ. దినకరచిత్త సృష్టము లు దివ్యమునీశ్వరలాలితంబు లీ
వినుతపదార్థముల్ గరుణ [1]విప్రునకున్ యతిసాధు[2]వృద్ధ స
జ్జనులకు నిమ్ము [3]నీ వది సుసారపు[4]ధర్మము [5]సూవె దానఁ గ
ల్గును [6]విను గోకులాకలితలోకము [7]లోనగు పుణ్యలోకముల్.

267. క. దాన ప్రవణయుపాన
ద్దానంబును నాతపత్ర[1]దానము సురస
[2]మ్మాననస[3]భాజనము లగుట
నానా[4]బుధజనులచే వినం బడు నెపుడున్.

268. క. అనిన విని పాండు[1]భూవర
తన[2]యోత్తముఁ డిట్టు లనియెఁ దాతకు భూద్రుం

---

2 దీన - కొన్నిప్రతులు, 3 వేఁడిమేమియున్ - పెక్కుప్రతులు.

264 1. బెంపారియావస్తువుల్, బెంపారెనివ్వస్తువుల్ - అనిపాఠములు 2. దయతో విప్రులకీగి - ఆ. ఐ. ఔ. ఖ. 3. శుభౌదాత్యంబు, శుభోదాత్తంబు - అనిపాఠములు

266 1. విప్రులకున్ - పెక్కు ప్రతులు. 2. శిష్టరిక్త - అనిపాఠములు 3 నీవధివ - పెక్కు ప్రతులు; నీవనఘ - ఐ. ఖ 4 ధర్మువు - ఓ. 5 సువ్వె - ఒ 6 తుది-ఎ; దుది-క. వ, గను - శ 7. లోనుగ, లాదిగ - అనిపాఠములు

267. 1. దానంబు(ను) లున - అ ఈ, క. 2 న్మానన, న్మానన - అనిపాఠములు. 3 సేవితము - ఉ. ఊ. 4. విధ - ఆ ఎ ఓ క. వ

268. 1. భూపతి - క. వ. 2. యాగ్రజుఁడిట్టు - ఆ

డనఘా యెమ్మెయి చరితం
బున నిహ[3]పర పరమసౌఖ్యములఁ జెందఁ గనున్.

269. వ. అనుటయు నతం డతని కి ట్లనియె.

*-: శూద్రున కవశ్యానుష్ఠేయం బైన ధర్మంబు నిరూపించుట :-*
సం. 13-146-4 (కుంభ)

270. క. లోకహితార్థంబుగ ముని
లోకోత్తముఁ డాత్మ శిష్యలోకమునకు సు
శ్లోకుఁడు పరాశరుఁడు ధ
ర్మాకారము తెలుఁగఁ జెప్పె నంచితచరితా

271. వ. అవ్వాక్యంబులు సెప్పెద నందు భవత్ప్రశ్నవిషయం బయిన యర్థంబు నవగతం బగు నాకర్ణింపుము.

272. సీ. కరుణాఢ్యుఁ డగు పరాశరమునివరుఁడు [1]శి
ష్యులకు నిట్లను నింద్రియోత్కరంబు
గెలిచి యంతశ్శత్రుకుల మైన కామాది
వర్గంబు నోర్చి గర్వంబు వదలి
త్రైవర్ణికులయెడ భావంబు భక్తిమ
యంబుగా శుశ్రూష యాచరించి
శూద్రుఁ డైహిక[2]సుఖసుగతులఁ బడయు [3]వే
దాదీరితపముల [4]నాచరించె

ఆ. నేని [5]నుభయలోకహీనాత్ముఁ డగు భూమి
సురనృపాలవైశ్య [6]శూద్రులకును
నధ్యయనము [7]బలసమగ్రత వాణిజ్య
మనుచరత్వ మధికధనము లరయ.

---

3. పరసౌఖ్యములను బొందఁగఁగనున్, పరసౌఖ్యములను బొందఁగల్గున్(గాంచున్)-అని పాఠములు.

272. 1. శిష్య (న) ల కిట్లులను - అ. ఈ. ఇ. ఏ ఐ. క ల. 2 శుభ - పెక్కుప్రతులు 3. వేదాదిష్టతపముల - పెక్కుప్రతులు; వేదాదిష్ట తపముల (గుణముల) - ఊ. చ. వ. 4 కప్పళించె - పెక్కుప్రతులు. 5. యుభయ - కొన్నిప్రతులు. 6. శూద్రజనుల కధ్యయనము - అ. 7, రక్షయలఘువాణిజ్యం బనుచరత్వ - ఐ. ఖ.

273. క. ఇవి శాస్త్ర[1]దృష్టమార్గము
లవనిసురప్రభృతు లీసదా[2]చారంబుల్
సు[3]విహితములుగా [4]నడపిన
భువనద్వయమునను బడయఁ బోలుం బెంపుల్

274. తే. ఇట్లుగా కాత్మధర్మంబు లెడల విడిచి
వర్ణములు నాలుగింట నెవ్వార లైన
దొలఁగఁ ద్రొక్కినఁ [1]జాటిల్లు [2]దుష్టగతులు
[3]మన్నకాలంబు పదపడి చన్నయపుడు.

275. వ. అని పలికి శౌచవిధి యెఱింగింపం దలంచి యిట్లనియె.

276. క. మూత్రపురీ[1]షోత్సృష్టికి
రాత్రి పగలు దక్షిణో త్తరదిశాముఖతా
[2]సూత్రం... వలయునది సం
ధ్యా[3]త్రయమును [4]ను త్తరంబు యగు నప్పనికిన్.

277. క. పలుక వలదు శౌచక్రియ
సలుపక మును సలుపునపుడు జలములు దొడలం
జిలుకుట యొప్పదు మృ త్తిక
వలయు నపానంబునం ద్రివారంబు లిడన్

278. క. గుదతలము నొవ్వఁ దోమినఁ
గదుకును రోగంబు [1]లేపగంధాపగము
ప్రద మగు కొలఁదిన శౌచము
సదురుగ నాచెప్పినట్ల సలుపఁగ వలయున్.

---

273. 1. దృష్టి - కొన్నిప్రతులు 2 చారములన్ - ఐ.ఔ ఖ; చారమునన్ అ. 3. విదితము - ఔ ఖ. 4 నడచిన - ఐ ఔ. ఖ.

274. 1. గడగును, గలుగును - అనిపాఠములు 2. దుష్టతయును - ఓ. 3. మున్ను -ఐ. ఖ

276. 1. షోత్సృష్టము, షోత్సర్గము - అని పాఠములు. 2 సూత్రమువలయు నధిప సంధ్యా - ఔ, సూత్రమువలయు నృపతి సంధ్యా - ఐ ఖ 3. త్రయమున - పెక్కుప్రతులు.
4. ను త్తరంబునగు, ను త్తరంబుదగు, ను త్తరంబతగు-అని పాఠములు.

278. 1. గానకల్మషరహితంబొదవంగఁ దగినరీతిని - ఔ, ఖ, గానకల్మషరహితంబొదవగఁ గడగిన రీతిని - ఉ

279. తే. అంబరంబున శౌచజలంబు వడుట
చెట్ట శౌచ మల్లలన చేఁత మేలు
వామకరశుద్ధి దొల్తఁ ద్రివారమృత్తి
కాకలనమునఁ[1]దద్ద చేయంగ వలయు.

280. క. కుడిచేతఁ బిదప డాచేఁ
గడిగి [1]పొరిన్ సప్తమృత్తికాకలనమునం
గడుగునది కరయుగము మఱి
కడుగ[2]వలయు గుహ్య మల్పకమృదాకలనన్.

281. క. ఇమ్మెయి గుహ్యతలము శు
ద్ధమ్ముగ నొనరించి కేల్ పదంపడి జలధా
తమ్ముగఁ జేసి సముత్థా
నమ్ము పిదపఁ బాదశోధనము సేయఁ దగున్.

282. క. జనములు సూచుచు నుండఁగఁ
జనదు మలము మూత్రమును విసర్జింపఁగ న
ప్పనులకు శౌచాచరణం
బునకు నవశ్యంబు నోలములు గావలయున్.

283. క. అపత్సమయంబున శౌ
చాపాదన మిట్టిదంగి [1]నల్పమి [2]మలనం
శేపనగంధము వోవఁ గ్రి
యాపరుఁడై చేయునది మృదా[3]కలనంబున్.

284. సీ. బుద్బుద విరహితంబుగ వారిఁ గరమున
[1]గొనకొని పొరి డెందమునకుఁ జేరు

---

279 1. గ్రసేఁత గాఁగ వలయు - ఐ ఖ
280. 1. పొదివి - అ. ఇ. 2. వలయు నల్పమృత్తికన్ మేఢ్రంబున్ - ఉ. ఊ. ఐ. ఔ. ఖ
288 1. నల్పక - అఖండయతిగా చూడదగును. అ 2. వలనన్ లాపనము దన్నుజోత గ్రియా - ఐ, వలనన్ లేపనగంధమువోవగ్రియా - ఔ 3 కలనమునన్ - కొన్ని ప్రతులు.
2-14. 1. గొని చల్లి, గొని పొరింబోరి - అని పాఠములు, గొని కొన్ని పోసిడెందమునఁ జేరు - న, మిన (న్ప) సగింజొగి ముగ్గునను పుదోఁచు - ఐ. ఔ. ఖ. న.

నటుగ నిశ్శబ్దమై యుండ ముమ్మాఱు
ద్రావి యిన్మాఱు తిర్యగ్విధమున
నాస్యంబు దొడసి నీ రంఘ్రుల శిరమునఁ
బ్రోక్షించి యోష్ఠసంపుటము ముట్టి
నాసికాపుటములు నయనముల్ సెవులు మూఁ
పులు హృదయము నాభితలము మౌళి

ఆ. ముట్టవలయు హస్తములు పాదయుగమధ్య
గతములుగ నుదఙ్ముఖత్వ మొండెఁ
బ్రాఙ్ముఖత్వమొండెఁ [2]బ్రాపించి యిమ్మెయి
నాచమనము సేయు టార్యమతము

285. సీ. [1]ముమ్మాటిజలపానమున నొలి ఋగ్యజు
స్సామవేదంబులు [2]సంతసిల్లుఁ
దొలితొలి వక్త్రంబు దొడయ నథర్వహా
ర్ణంబును రెండవుసారె ధర్మ
శాస్త్ర[3]దోషేతిహాస ప్రమోదపురాణ
సంప్రీతులును గల్గుఁ జరణయుగముఁ
బ్రోక్షింపఁ బుండరీకాక్షుండు ప్రియమందు
నయనంబు లంటిన నలినహితుఁడు

తే. సమ్మదంబునఁ దేలు నాచమనసంప్ర
యోగ మిట్టిది వస్త్రయజ్ఞోపవీత
[4]ధరణముల నన్నపానతంత్రముల మున్న
సేసి పిదపను నిది యనుష్ఠింప వలయు.

286. తే. ఆస్యశుద్ధి యొనర్చిన [1]యపుడు వోక
భక్ష్య భోజ్యలవంబులు పండ్ల [2]నడుము

---

2. బాటించి – పెక్కుప్రతులు.

285. 1. ముమ్మాటు, ముమ్మాఱు – అని పాఠములు 2 నంతసించు – ఆ. ఇ. ఏ ఓ. గ ల. 3 తోషేతిహాస–పీ. శ ష. కొన్నిప్రతులు 4. ధారణము నన్న – ఐ. ఖ; ధర్మము (న) ల – ఆ ఈ

286 1. యప్పుడొక్కభక్ష్య – వ. స. 2. యెడల – పెక్కు ప్రతులు.

నిలిచి పదపడి పోవుట గలిగెనేని
నాచమన మాతఁడంబ చేయంగ వలయు.

287. వ. [1]శౌచవిధి సమస్త వర్ణసామాన్యధర్మంబు [2]శూద్రునకు నాచమనం బొక్క
పుటం బొకమరి ప్రోక్షించుకొనుటయు దానిం గరంబున నడ్డం బొకమరి
దొడయుటయు నింతియ

288. క. శౌను శుచిత్వం బేమిట
నైనను నేమఱక నియతి నతులితశుశ్రూ
షా[1]నిరతుండై [2]శూద్రుఁడు
మానిత[3]విప్రులకు శోడి మనఁగా వలయున్.

289. సీ. అవనీసురుఁడు జపయజ్ఞుఁ డధ్యయనోప
జీవి తప[1]శ్శోభి భూవరుండు
ప్రారంభయజ్ఞుఁడు పరమదండో[3]ప[2]జీ
వకుఁడు పాలన[3]శోభి వైశ్యుఁ డమల
హవ్యయజ్ఞుఁడు [4]విక్రయాజీవి యాతిథ్య
పరిశోభి శూద్రుండు పరిచరత్వ
యజ్ఞుండు శుశ్రూషణా[5]జీవి దక్షత్వ
శోభి యట్టులు గాని చొప్పు లకల

ఆ. వర్ణజాతులకు నవశ్యంబు [6]నాలవ
వాని కెమ్మెయిం ద్రివర్ణభక్తి
వలయు నడప యతులవలన విశేషించి
నిత్యభజనపరత కృత్య మరయ

---

287. 1. కావున నిదినమస్త - ఉ. ఊ ల. వ 2 తంత్ర - ఏ.

288 1 నియతుండై శూద్రుడు - ఏ. 2. శూద్రుం డానియమముతోడ నుండుటర్హం
బరయన్ - అ. 3. దీప్తులకు - ల.

289 1. శౌచి - కొన్ని ప్రతులు 2. జీవనుఁడు - అ. ఈ. ఓ. 3 శౌచి - ఔ 4. విక్రయను
జీవి - ఐ ఖ 5. భిషిచక్షతాశోభి - ఐ. ఖ 6 నాలవు, నాల్గవ, నాలువ - అని
పాఠములు

290. క. యతిసర్వాశ్రమచరణ
స్థితులకు నుత్కృష్టుఁ డతని [1]తెరు వూఁదిన శ
క్తత గలిగిన వారు శ్రుతి
స్మృతి విహితాచారు లగుట మే లరయంగన్.

291. సీ. ప్రియ[1]వాదితయును శాంతియును దాంతియు ననా
లస్యంబు నతులశీలంబుఁ గలిగి
నాకిది వలయు [2]దీన సుదుస్తరంబును
ఘోరంబునైన సంసారజలధిఁ
గడతు నే నని భిక్షుకజనంబులకు నెవ్వి
హితము లప్పనులు సంతతముఁ జేయు
చడుగు లొత్తుచు [3]నిష్ట మడుగుచు [4]నీచత
ననుచరించుచు ధర్మమున నుపార్జి

ఆ. తంబులైనయట్టి ద్రవ్యసంచయములఁ
దృప్తి సేసి దేహగుప్తి నడపి
పగలు [5]రేయు నాక పరిచర్య [6]నొనరించి
శూద్రుఁ డిహపరముల సుఖము వడయు.

292. క. [1]దానోపవాసముల స
న్మానితగతి లేదు శూద్రునకు యతిసేవ స
[2]మ్మాననమునఁ [3]దత్పూజా
ధీనరతిం గాని యెన్ని తెరువులఁ జూడన్.

---

290. 1. తెరువుందన - అ. ఔ. ఖ. చ, తెరువూఁ దన - ఉ. ఐ. ఓ. ఓ. గ; తెరువూఁదక - ఎ. క.

291. 1. శారితయు - ఐ. 2. దీనను దుస్త - పెక్కు ప్రతులు. 3. నిష్ఠయుడుగక - అ; నిష్ఠమడుఁగుచు - వా పెక్కు ప్రతులు, నిష్టమడుగుచు - గ. చ. శ. ష. సె. 4. సమ్మోదమొనరించుచును ధర్మ - ఉ. ఊ. ఓ. 5 రేయి, రేయ - కొన్ని ప్రతులు; రేయనాక - ఐ. ఓ, శ 6. లొనరించి, యొనరించి - అని పాఠములు.

292. 1 ధ్యానో - అ. ఈ. 2 న్మానితమగు, న్మానంబున - అని పాఠములు. 3. దత్పూజ నధీ నిరతిం - అ. ఈ ఉ

293. తే. తెరువు[1]దప్పి తూఁగాడుచు నరుగు[2]దెంచు
యతిఁ గనుంగొని మనమున [3]నడలు వొడమ
నెరుఁగుకొని [4]దప్పి దీర్చి సమ్మదము సేఁత
[5]శూద్రునకు ధర్మవిధి యని శ్రుతులు సెప్పు.

294. చ. యతి రుజఁ బొందినం దొలఁగ నౌషధకృత్యముఁ బథ్యమై సమం
చిత మగునట్టి భోజనము సేర్చుటయున్ మలమూత్రముల్ జుగు
ప్సితములు గానిభంగి గలచిత్తముతో జలశౌచ మొపి వ
ర్ణిత[1]ముగఁ జేఁతయుం గల చరిత్రము శూద్రున కిచ్చు సద్గతిన్.

295. క. ఏ విధమున [1]నోపిన యతి
భావను దుఃఖంబు వాపుపని సాదరచే
తోవృత్తిఁ బూని చేయం
గా వలయును శూద్రుఁ [2]డది సుగతి [3]నొందించున్.

—: సర్వవర్ణ సామాన్యధర్మ నిరూపణప్రకారము :—
సం. 13-162-1 (కుంభ)

296. వ. అని చెప్పి సర్వజాతిసామాన్యంబు లగు ధర్మంబు లెఱింగించు నాదరంబున
నమ్మునివరుం డిట్లనియె.

297. సీ. పరధనంబుల కాసపడక యొడ్లను దన
యట్లకాఁ జూచుచు నఖిలవస్తు
వులుఁ దోఁచు నడఁగు వీచుల [1]చందమున మెఱుం
గులభంగి నని [2]కనికొనుచు నెందు

293. 1. నడచి - ఉ ఊ. చ. వ. 2 చన్న - ఖ. 3. నరలువొడమ, నడరు వొడమ - అని పాఠములు 4. దప్పి - ఏక్షుప్రతులు. 5. శూద్రులకు - ఐ ఖ. వ

294. 1. మగు జేతయుం - ఊ

295. 1. నైనను - అ. ఈ; మోసిన - ఇ. 2. దిది, దతి-అనిపాఠములు. 3. బొందించున్- పెక్షుప్రతులు.

297. 1 బంధమున - ఐ ఔ ఖ. 2 గనుగొనుచు - ఈ ఖ పీ

నాసక్తి లేక [3]భూతాళిపై దయ గల్గి
నడచుట హిత[4]ముతో నడనుచుఁ జేసి
వది[5]మేల చేయుట చదురు గీ దపశతఁ
దొడరఁ బ్రాయశ్చిత్తదోషాలమున
తే. వేగ తొలఁగించు [6]టొప్పెడు వెరవ యెమ్మ
లేనిజంతువుఁ జంపి త్రిస్నానములను
ద్వాదశప్రాణసంయమ నాదరమున
నొక్క యుపవాసమునఁ బాపయుక్తి వాయు.

298. ఆ. అస్థి గలిగి హీనమగు జంతువైనఁ ద
ద్విగుణవృత్తి వఱయుఁ బ్రగుణజంతు
వునకు నలుమడించుకొనునది నరమాత్ర
హింస యష్టగుణాకృతిహఁ బాయు.

299. క. హీననరునట్ల గుఱ్ఱము
నేనుఁగును మనుష్యవధ మనేకాబ్దికళి
బా[1]నిరతి ప్రభృతిసుక
ర్మానుష్ఠానములఁ గాని యఱుగ దలఁతులన్.

300. తే. కల్లు ద్రావుట గురు[1]తల్పగమన మధిక
పాతకము లివి ప్రాణముల్ వాయఁ బెట్టి
చేయుప్రతికారములఁ గాని చెడవు గోధ[2]
రాద్యధిక దానములనైన నఱుగవంద్రు

301. క. ఇవి యెఱిఁగి యెప్పుడుఁ బరలో
కవిభీతి మనంబునందుఁ గల్గి సకలభూ
తవిషయదయ నూనినయ
ట్టివాఁడు గీ డెల్లఁ బోనడిచి మే లొందున్.

---

3. భూతాళి - ఈ ఊ. ఓ 4 దానరుచు, గానరుచు - అని పాఠములు. 5. మేలు-
నేయుట-పెక్కుప్రతులు. 6 దొప్పెడు-ఇ ఉ.ఏ.ఒ.ఔ. (భావార్థమున దు వర్ణకము)

299 1. నిరతి ప్రకృతి - అ. ఈ ఏ వీ; నిరతిం బ్రకృతి - ళ. ష.

300 1. వల్పి - ఆ. ఎ క; 2 ధరాత్యధిక, ధనాద్యధిక - అని పాఠములు.

302. క. ఈనెఱిఁ [1]గనికొని శూద్రుం
డైనను గ్రమవృత్తినవ్యయం బగుపదముం
గానం బడయుట గల్గును
వానికి [2]నియమముల త్రోవ వలవక యునికిన్.

303. వ. అని [1]నిర్దేశించి యరిష్టంబు [2]లెఱింగింప ననుకంప పుట్టుటయు.

304. సీ. పురుషు హిరణ్మయు నరుఁ డెవ్వఁ డుత్తర
మునఁ గాంచు దక్షిణాముఖత నుండ.
నతనికి వర్షత్రయమున మృత్యువు వచ్చు
రవిమండలంబు నిష్ప్రభముగాఁగఁ
గనిన [1]రెండేఁడులఁ గౌముదిఁ దననీడఁ
దూఁటు సూచిన నొక్కయేఁట నది వి
షాళియై యున్న షణ్మాసమాత్రంబునఁ
గర్ణముల్ గరములఁ గదియ మూసి
ఆ. కొనినయపుడు మ్రోఁత విన కున్న నెలనాళ్ళఁ
గర్ణములును నాసికయును బట్టు
గదల విశ్రుతవర్ణకత పండ్లఁ గన్నులఁ
గలుగ నాఁడ మరణ మొలయు నంద్రు.

305. వ. అట్లు వర్తిల్లునరిష్టంబులం [1]దెయ్యది దోఁచినం గలంకం బొరయనియంతరం
గంబుతోడఁ దృష్ట[2]కలితం బైన సంసారంబునందలి [3]యాసంగంబు వదలి హృద
యం బేకాగ్రంబు [4]గావించి [5]మునీంద్ర నిర్మలధ్యానకర్మంబులం దగిలి యుండె
నేని [6]గాలాంతకప్రసాదంబు వడయుం [7]దెలివు[8]కొంతం గాలగోచరత్వంబు

---

302. 1. గైకొని - ఉ. ఒ. ల. వ. పి. శ. ష. న; గనుగొని - ఈ. ఊ. ఐ. ఖ. గ. వ.
2. నియమంబులొందు - అ. ఈ; నియమములతోడి, నియమముల త్రొక్కు - అని పాఠములు

303. 1 యెఱింగించి - అ. 2, లు వివరింప - ఆ.

304. 1. రెండేండ్లకు - ఓ. వ; రెండేండ్లను - వ.

305. 1. దెయ్యది - ఉ. ఊ. ఓ. ఔ. క. చ. ల 2. కృతంబైన - పెక్కుప్రతులు; వ్రతం బైన - ఆ. ఓ. 3. వ్యాసంగంబు - అ. ఈ. ష. 4. గావించికొని, గావించుకొని - అని పాఠములు. 5. మునీంద్ర నిర్దిష్ట నిర్మలధ్యాన - పెక్కుప్రతులు. 6. గాలాంతర - అ. ఇ. ఈ. 7. దెలివి - కొన్నిప్రతులు. 9. కొంత - ఏ. ఓ.

నొంది వైశ్య [9]రాజన్య విప్రకులంబులం దత్తద్విధసంపత్సమృద్ధంబులుఁ
బ్రబుద్ధంబులు నగు వంశంబులం గ్రమంబున జన్మించి

806. క. అయ్యైకర్మంబుల దెస
నెయ్యం [1]బెసలారఁ గలిగి [2]నియమనిరూఢుం
డియ్యన యన సుకృతంబుల
నయ్యెడు సౌఖ్యంబు నిహమునందుఁ బరమునన్.

807. తే [1]అనుభవించుచు గమనంబు [2]నాగమనము
[3]నాచరించుచు బ్రహ్మసభాంత మైన
పుణ్యలోకనికాయంబుఁ బొంది యెల్ల
నెఱిఁగి యూహించి యిట్లని యెదఁ దలంచు.

808. క. ఇవి యెల్ల నశాశ్వతములు
భవమరణాకలితములును బటుసంసారో
ద్భవదుఃఖ సంయుక్తములు సుఖ
లవయుతములు వీనియందు [1]లౌల్యం బేలా

809. వ. అని తలంచి యపునర్భవకారియు [1]ననధికంబును నచలంబును నగుధర్మంబు
గోరుచుండు నకృతకర్మఫలంబు నొందను గృతకర్మఫలంబు [2]దొఱంగను
నెవ్వరికి వశంబు గామి ధ్రువం బగుటం జేసి కృతకర్మవిశేషంబున నతండు
వాసవాది వరిష్ఠసహవాసంబున వర్తించి.

810. తే. పుణ్యఫల[1]కాలమున యంతమున నితాంత
సంప్రబుద్ధ జనంబు వంశమునఁబుట్టి
బ్రహ్మ[2]సంస్కారములనెల్లఁ బడసి యతిథి
దేవపితృ[3]కోటులకుఁ బరితృప్తి సేసి.

---

9. రాజవిప్ర - అ ఈ
806 1. బలరార - వ. నూ 2. నీతినిరూఢుం, నీతినిరూఢిం, నిరతినిరూఢుం - అని పాఠములు; నిత్యవిధిజ్ఞు - అ. న, నీతివిధిజ్ఞు-అ. వ.
807. 1. అనుచుఁ బలుకుచు - అ ఈ 2. లాగమ - ఏ. క. 3. లాచరించుచు - ఏ క.
808. 1. లౌల్యము లే లా - ఎ. ఐ. ఔ క. భ.
809. 1. నదీనదంబు, నధీనంబును - అని పాఠములు 2. దొలంగను - అ ఈ. వ.
810 1. గౌరవమునంతమున, గారవమునంతమున - అనిపాఠములు. 2. సంస్కారయోగము బడసి-ఉ, ఊ ల, 3 కోట్లకును - కొన్ని ప్రతులు,

311. తే. భార్య పుత్త్రు లాదిగఁ గల పాశసంచ
యంబు నిరసించి యతిధర్మ మాచరించి
యిలు వెడలి గురుశుశ్రూష నలఘుసాంఖ్య
యోగశాస్త్రరహస్యైకయోగ మొంది

312. సీ. పుణ్యంబులైన యరణ్యంబులను శూన్య
గృహముల దేవతాగృహములందు
[1]గుహాలను నిలుచుచుఁ గుడుపు బిక్ష [2]నొనర్చి
యొక [3]చోటమరుగక యొల్లమియును
వలపును [4]నెడలి నిర్ద్వంద్వత వాటించి
మమత యహంకృతి మాని నిత్య
తృప్తాత్ముఁడును జనాధీనత్వరహితుండు
నై గమ్యదిశ యొక్కఁ డనఁగ లేక
ఆ. మెలఁగుచుండి పక్వఫలము [5]దోడిమఁ బాయు
పగిది గుణచయంబుఁ బాసి యత్మ
యంబు నచలమును నిరామయంబును నగు
పదముఁ [6]జెందు శుద్ధభావ మెసఁగ

313. వ. అని చెప్పి.

314. క. ఖితుకుఁ డిమ్మెయి [1]సిడముఁ
బత్తి [2]విడుచునట్లు మాయఁ [3]బాసి యభేద్యం
బతర [4]మనుతత్త్వంబును
సాక్షాత్కృతిఁ [5]గూర్చి నిలుచు శాశ్వతపదవిన్.

315. వ. అమ్మహానుభావుండు సంసారసాగరంబు గడచుటయు కా దాశ్రితులనుం
గడపం జాలి యుండు

---

312. 1. గుహలతోనిల్చుచు - అ; 2 యొనర్చి, మొనర్చి-అని పాఠములు 3. చోటుమరుగక, చోటనరుగక - అని పాఠములు 4. నెడల - కొన్నిప్రతులు. 5. దోదను - అ ఈ, తొడిమె - ఐ ఖ. 6. నొందు - ఉ, ఊ ఓ.

314. 1. నతిసుతపక్షములన్విదచి - ఆ. 2. విడిచినట్లు - అ. ఈ. ఐ ఒ. క, విడుచుమాద్కి- - వ. 3. బాచి - ఉ. ఐ. క, 4. మమృతత్త్వంబున-ఉ ఊ. ఓ. చ; మగుతత్త్వంబు న - ఐ 5. గూర్చు - ఏ ఒ

816. ఉ. కావున భిక్షుఁ జెంది ప్రియ[1]కారిత శూద్రుఁడు [2]గొల్చునేని సం
భావితుఁ డైన యాతనికృపారస[3]మాని తదీయ సంగవి
ద్రావితకల్మషుం డయి చిర[4]క్రమవృత్తిత [5]నూయి గ్రొచ్చి నీర్
వావిరి గన్నయట్లు శివం బగుతత్త్వము గాంచు నెమ్మెయిన్.

817. తే. అఖిలజనులకుఁ బరమపదాభిలాష
వృత్తి సామాన్య [1]యది యొండువెంట శూద్ర
జనములకు నెట్లు వొరలిన సఫల గాదు
[2]దాని భిక్షుకసేవ [3]సత్ఫలతఁ గూర్చు.

—: పరాశరముని ప్రణీతధర్మవిశేషంబు భీష్ముండు ధర్మజునకుం జెప్పుట :—
సం. 13-159-1 (కుంభ)

818. తే. వర్ణములకెల్ల నింద్రియవ్యాప్తినిగ్ర
హంబు వలయు [1]నియ్యది గన్నయంతఁ దృప్తిఁ
[2]బొందు [3]యొం డాసపడకున్న నొందు సాధు
జనులు [4]వెదుకు ననామయ[5]సత్పదంబు.

819. తే. పరమమైన యీధర్మంబు వట్టి పాప
యోను లగుకామినులు వైశ్యులును శూద్రు
లును సుగతి గాంతు రనిన సజ్జన[1]తఁ బరగు
బ్రాహ్మణులకు రాజులకును బ్రాఁతె సుగతి.

---

816. 1. కాంక్షను - ఎ క. 2. గొల్చునేని - అ. ఎ. ఓ. ఓ. క. జ. వ. 3. మూఁది, మూని మాన-అని పాఠములు 4. క్రమవృత్తత - అ. ఎ. వా. కొన్నిప్రతులు; శ్రమవృత్తిత - శ. ష శ్రమవృత్తిననుగ్రహించివిద్యా విదుగన్న, శిసంబగు శ; (ఈపాఠమునయతి భంగము) 5. నూ తిద్రవ్వి - అ. ఈ; నుయ్యిగ్రొచ్చి - ఉ. ఊ. ఎ. ఓ. క; నూయి ద్రవ్వి-ష; నూయిగొల్చి - ఖ. చ [illegible]
817. 1. మది - కొన్నిప్రతులు. 2. పరమ -ఉ. 3. తద్ఘనత, తత్పరత, తత్త్వముల, తత్ఫలత -అని పాఠములు
818 1. నెయ్యది - పెక్కుప్రతులు. 2. బొంది - పెక్కుప్రతులు. 3. యొందాన - ఈ. ఔ; యందాన - ల. 4. గోరుననామయ - అ.ఐ.ఔ.ఖ. 5. సత్పథంబు - కొన్నిప్రతులు.
819. 1. సుతులగు -అ ఈ.

820. వ. అని చెప్పి వెండియు.

821. సీ. బోధ మతీణపాపునకుఁ గల్గదు [1]సద్గు
రుండు సెప్పంగ [2]సంశ్రుతము లై న
పనులఁ బాపంబులు వాసిన నిర్మల
జ్ఞానోదయం బగు దాన గర్వ
ముదయింప వచ్చిన నుడుపంగ వలయు గ
ర్వంబున గురుసమారాధనంబు
వదలిన నాబోధవై భవ మెడలిన
యంతటఁ బోక కీ డావహిల్లుఁ
ఆ. బరమబోధమునకు ఫల ముపశాంతిగా
నెఱిఁగి యెంతబోధ మెక్కు డయ్యె
నంతశాంతుఁ డగుచు ననవరతంబును
గురునిఁ గొలిచి [3]మేలు పురుషుఁ డొందు.

822. సీ. రక్షించునది యుదరంబు శిశ్నము ధృతిఁ
బాణి పాదములు దృక్పాటవములు
వినుఁ డింద్రియంబుల మనమును మనము[1]న
బుద్ధి నిల్పినఁ బ్రబోధవికచ
హృదయస్థుఁడై ధూమ [2]మెడలిన శిఖవోలె
[3]వెలుఁగు దేవునిఁ జూచు వెరవు గలుగు
యుక్తుండు గా కేల యొరవు మహేశ్వరుఁ
గనుట [4]యుక్తాత్ముండు గనును [5]భక్తి
తే. నట్టిభంగికిఁ [6]జాలినయట్టిఁ డైన
విశ్రుతి షోడశకంబును బ్రకృతిప ప్త

---

821. 1. సద్గురుండూఁదిచెప్పంగ శ్రుతము - ఉ ఊ వ, సద్గుఁరు డుపదేశింపగ శ్రుతము-ల
2. విశ్రుత, సుశ్రుత - అని పాఠములు. 3. మేలు - పెక్కుప్రతులు

822. 1. నద్బుద్ధి - కొన్నిప్రతులు. 2. మెగసిన - శ 3. మెంగు - అ. గమనిక - ఈపాఠ మునమెలఁగు - వెరవు అనుచోట-రకు యతి చెల్లింపబడినది. 4. యేకాంతుండు-అ. ఐ. ఔ; యేకాత్ముఁడు ఖ, యు క్తాత్ముఁడగును సుభక్తి - అ ఈ 5 సుభక్తి - పెక్కుప్రతులు 6 జాలనియెట్టిదైన - పెక్కుప్రతులు; జాలనియట్టిదేని - ఐ. వ

కంబు మూలప్రకృతిఁ జిత్తకలన నరయ
వికృతియును బ్రకృతియుఁ గాని విభునిఁ గాంచు.

323. క. ఇది సాంఖ్యానము దీనిని
మది గలవడఁ జేసికొనుచు మఱవక గురుని
శ్రద్ధుఁడై కొలువఁగ గేవల
పదము నతనికరుణ నెంపు ప్రకటము సేయున్.

324. తే. భిక్షు భావంబుఁ బొంది యాశిత యూఁది
మెలఁగు సద్వృత్త త్రైవర్ణికులకుఁ గలదు
శూద్రునకు భిక్షుసంసర్గసులభ మమల
పదము వానికి భిక్షుతఁ బరఁగఁ జనదు.

325. క. పరమజ్ఞానుల [1]యొద్దను
బరగిన నజ్ఞుఁడును బోధభరితుఁ డగునిరం
తర మేరు సమీపస్థితి
హిరణ్యరుచిఁ [2]గాక మెసక మెసఁగినేవగిదిన్.

326. క. గురుశుశ్రూషామహిమం
గరుణఁ జతుర్వర్ణహితముగా నిమ్మాడ్కిం
బరివర్తితంబు సేసెం
బరాశరమునీశ్వరుండు పౌరవముఖ్యా.

327. వ. అని సకలధర్మోపదేశధుర్యుండైన భీష్ముండు పరాశరమునివర్యు వాక్య సంచయంబు సెప్పినం బరితుష్టుం డయి పరమవినయంబునం బాండవాగ్రజుం డక్కురుకులాగ్రగణ్యుతో నరులు సురలకు వంద్యు లగువారును గల రని వింద వారల వర్తనం బెట్టి దెఱింగింపు మనిన నతం డతని కిట్లనియె.

328. సీ. ఇట్లు మాతలి యమశేంద్రుని నడిగిన
ధర్మార్థకామముల్ ధర్మ[1]చరిత

325. 1. యందుంబరఁగిన, యొద్దంబరఁగిన – అనిపాఠములు. 2. గాంచియెనక – అ. 3. భంగిన్ – కొన్నిప్రతులు.

328 1. ముఖ్య; వృత్తి – అనిపాఠములు.

వర్తనఁ జెల్లించువారు వామాక్షులు
గోరఁగాఁ దగు రూపగుణసమృద్ధి
గలిగియు వర్జితకాము లయ్యెడువారు
విద్యాధనైశ్వర్యవిషయ²గర్వ
విరహితు లగువారు విజితేంద్రియులు నిజ
దారతృప్తులుఁ దపోధనము గాథ
తే. తత్పరతఁ గూర్చు ఘనులు సత్యవ్రతులును
బరమశౌచులు బహుకార్యపరత లేని
గూఢధర్మలు సన్న్యాసకోవిదులును
దనకు నభివంద్యు లగుట యతండు సెప్పె.

329. వ. అనిన విని ధర్మతనయుండు తటాకనిర్మాణరూపం బగు ధర్మంబు విశేషంబు విన వలతుం జెప్పవే యనుటయు ననిమిషనదీనందనుం డాదరభరితుండై.

-: భీష్ముఁడు ధర్మజునకుఁ దటాకనిర్మాణ ఫలవిశేషంబు సెప్పుట :-

సం. 13-92-1

330. సీ. దేవ తిర్యఙ్నరస్థావరాశ్రయము త
టాకంబు విను మట్లుఁ గాక యందు
గోకులంబులు నీరు గొని ¹దానికర్తకు
లము నెల్లఁ బుణ్యలోకమున కనుచు
నీలోకమున శ్రీయు నెక్కుడు కీర్తియు
నతనికిఁ జేయు వర్షాగమమున
నీతున వేసవిఁ జెఱువులో నీ రున్న
నగ్ని²హోత్రాదిమయజ్ఞవాజ
ఆ. పేయఫలము లోలి నాయన కగుఁ గట్టఁ
దగినతరువు లిడిన సుగతి గలుగు
నిహసుఖంబుఁ బొందు విహాగాది బహుభూత
వాసపౌఖ్య మతఁడు సేసెఁ గావ

2. వర్గ – ఉ

330. 1. దానిక్రంతకులము – న 2 త్రాదిక – అ. ఈ. ఐ. ఓ చ.

891 క. సలిలాశయములు చేసిన
నలఘుప్రియ [1]మందుఁ బితృచయము లూర్ధ్వగతుల్
గలుగును దానం దమ కను
తలఁపున నది గోరుచుండు ధర్మతనూజా.

892. తే. ఛాయ నతిథివర్గంబుఁ బుష్పముల సురగ
ణంబుఁ [1]బండులఁ బితృనివహంబుఁ బ్రమద
మందఁ జేయు వృక్షంబు ల ట్లగుట వృక్ష
రోపణక్రియ మేటి ధర్మువు కుమార.

893. క. అనిన విని ప్రీతుఁడై య
జ్జనవిభుఁడు గృహస్థధర్మ సాకల్యజ్ఞా
ననిరూఢి నాదుచిత్తం
బున నొలయింపు భవదీయ పుణ్యఫణితులన్.

894. క. అనవుడుఁ దాత యలరి య
మ్మనుమనితో నిట్టు లనియె మహియును విష్ణుం
డును జేసిన సంవాదము
విను మది నీ కోర్కిఁ దీర్చు విశ్రుతకీర్తీ.

895. తే. నన్ను నీ వడిగినయట్లు వెన్నుఁ డర్థి
బుజ్జవంబులు మున్నుగ భూమిదేవి
నడిగె దానికిఁ బ్రియ మంది యమ్మహాను
భావ యిట్లని[1] చెప్పెఁ దర్పావ మలర.

896. క. దేవా హుతవహపరిచ
ర్యావిధి యొనరించి బలిసమాచరణము భ

891 1. మొందు - అ ఈ; బంధు - ఉ. ఔ

892. 1. బండ్లను - కొన్నిప్రతులు

895. 1 పలికె - ఉ. ఊ.

క్యావేశంబునఁ జేయఁగ
దైవతసంఘంబు [1]సమ్మదంబునఁ దేలున్.

837. తే. అన్నమున దుగ్ధమునఁ బండ్లనైన మూల
కోటినైనను [1]దనుపారు నీటనైన
నిత్యమును జేయునది పితృకృత్య మోపి
వైశ్వదేవ మవశ్యనిర్వాహ్య మనఘ.

838. క. ఆచేత పిదప దానం
బాచరణీయంబు శక్తి కనుగుణముగ భి
క్షాచర్య సేయు విప్రుల
వేచి యిడఁగ వలయు [1]నెవుడు వేగమ భిక్షల్.

839. తే. అప్పటికి వారు లేకున్న [1]నగ్రమగ్ని
ముఖమునందైన నిడునది [2]సఖుల బంధు
[3]జనుల నతిథుల గురుల భోజనవిధాన
తృప్తులుగఁ జేసి బలివిధిఁ దీర్పవలయు.

840. వ. బలు లు[1]భయప్రకారంబులు వానియందు ధర్మార్థకామ్యౌషధి వనరక్షోజనాది
విషయం బైన శ్రౌతబలి యేను మున్ను నిర్దేశించిన యది యిప్పుడు చెప్పిన
యది పశుపతిచండాల ప్రభృతిగోచరం బగు స్మార్తబలి యని నిర్దేశించి
రెండియు,

841. ఆ. విను గృహస్థధర్మ[1]విధ మిది యీభంగి
నడపి పిదప భోజనంబు సేయ
వలయు విప్రుఁ డట్టివాఁ డొందు నిహపర
సౌఖ్యసంపదలఁ బ్రశస్తచరిత

---

836. 1. సమ్మదంబున - అ.
837. 1. దనివార - అ. ఈ; దనుపార - ఒ. ఖ.
838. 1. నవుడు - కొన్నిప్రతులు.
839. 1. నన్నమగ్ని - న. కొన్నిప్రతులు. 2. యతిల- ఓ. 3. జనులు-ఔ వా పీ. వ; జనుల- పెక్కుప్రతులు.
840. 1. బహు - ఎ క
841. 1. విధియిది - కొన్నిప్రతులు.

842. క. అని చెప్పినఁ గృష్ణుఁడు నె
మ్మనమ్ మలర గృహస్థవిధిసమాచరణము ని
ష్ఠ నడపెఁ గర్మశ్రద్ధా
ఘన నీవును [1]నట్లనడపు గార్హస్థ్యంబున్.

843. క. అది దురితనిరాసము న
భ్యుద[1]యానందంబుఁ జేయుఁ బుణ్యయశస్సం
పద నిచ్చు నూర్ధ్వలోక
ప్రదమగు [2]దాని గొనియాఁడు భరత[3]వరేణ్యా.

844. వ. అని యిట్లు భీష్ముండు భీమాగ్రజునకుఁ గృహస్థధర్మప్రకారం బెఱింగించె [1]నని చెప్పుటయు నప్పౌరవకులోత్తముల సంప్రశ్నోత్తరంబులు మఱి యొత్తెఱంగునం జెల్లెం జెప్పవే [2]యనుటయు.

845. చ. అపగత కామరోషహృద[1]యాంతరఖేలన[2]కల్య నిర్జరా
జప మహితవ్రతైక [3]పర[4]సంగ ధురాధిక లౌల్య చంద్రమ
స్తపనమయాక్ష కౌస్తుభనితాంతరుచిస్ఫురితాస్థిదామదీ
ప్తిపటలచారువక్ష మునిధీస్ఫుటభావిత దేవసేవితా.

846. క. సత్త్వాధిష్ఠాన కృతకు
భ త్త్వప్రకటాభిధాన భక్తాధీనా
[1]త త్త్వం పదార్థరూపా
[2]త త్త్వసదనదీప భూతదైత్యాటోపా

842. 1. నడపునెమ్మిగార్హ – ఒ.

843 1. యాకరమందఁజేయు – అ. ఈ; యానయనంబుఁజేయు – ఉ. ఊ. ఏ. శ. ష, యానందములుచేయు – ఐ. ఖ 2 కొనియాడుదాని – ఎ క. 3ప్రవరా – ఎ.

844. 1. నని జనమేజయునకు వైశంపాయనుండు చెప్పిన నప్పౌరవ – పీ. శ. ష. 2. యని యడుగుటయు – పెక్కుప్రతులు.

845 1. యాంతక – గ 2 నిర్భరార్జవా, నిర్భరాజ్యతా–అనిపాఠములు, కల్యనిర్భరా–అ. పీ. ష. 3. విధి – ష, వర – ఎ, 4 నంగమరాజిత–అ. ఈ; నంగదురాధిక – బ; సంగమరాధిక–ఇ ఉ. ఏ శ. ష.

846. 1 తత్త్వపదార్థనిరూపా – అ ఇ. ఎ. ఐ. ష. 2. తత్త్వావనదీన – ఎ. ఓ.

947 మాలిని జగదవనవినోదా [1]సత్యజాతప్రమోదా
సగుణ[2]విగుణభంగి సంయ[3]మారామ[4]సంగి
విగతవికృతమూర్తి విశ్వ[5]భూతప్రవర్తి
సుగమ[6]గహనధామా సోమ[7]పింఛాళి[8]రామా.

*గద్యము* :– ఇది శ్రీమదుభయకవిమిత్త్రి కొమ్మనామాత్యపుత్త్రి బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతంబైన శ్రీమహాభారతంబున నానుశాసనిక పర్వంబునందుఁ దృతీయాశ్వాసము

---

947 1. నిత్య – అ. ఏ. గ. ష. 2. విమల – చ. 3 మారాధ – చ 4. భంగి-ఏ. ఇ. ఔ ఖ గ 5 రూప – ఇ, లోక – శ. ష స. 6. నిగమ – అ; గమన– ఓ. 7. బంధాలిరామా–చ. 8. దామా; – ఇ; ధామా – ఓ

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆనుశాసనిక పర్వము - చతుర్థాశ్వాసము



1. క. శ్రీపరమ [1]మహిమ నిశ్చల
తాపాదన కేళికౌతుకాతిశయ మనో
వ్యాపార నిరూఢస్తు
త్యాపాంగ విలాస[2]లలిత హరిహరనాథా.

-: ధూపదీపనైవేద్యంబుల ఫలవిశేషము భీష్ముండు ధర్మజునకుఁ జెప్పుట :-

సం. 13-155-1 (కుంభ)

2. వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె.

3. తే. అట్లు గృహమేధిధర్మతత్త్వావగమము
దనకుఁ గలుగంగఁ జేసినతాత కెఱఁగి
మనుమఁ డూర్జితభక్తియు వినయగౌర
వంబు సమధికతావైభవంబుఁ దోఁప.

4. వ. మహాత్మా సుమనోధూపదీపనైవేద్యంబు లుత్తమంబు లగుపూజాసాధనంబు లని వానిం గొని దేవతలం బూజింతురు తద్విశేషం బెఱింగింపవే యని యడుగుటయు నతం డాదరభరితుం డయి దీని శుక్రుండు బలిదానవేంద్రునకు బలి మనువునకు మనువు [1]సువర్ణుం డనుతపోధనునకు సువర్ణుండు నారదునకుం జెప్పె నప్పరమముని నాకుం జెప్పె నత్తెఱంగు సెప్పెద నాకర్ణింపు మని పలికి యప్పుడమితేని కిట్లనియె.

---

1. 1. మహిత - కొన్నిప్రతులు. 2 లసిత - కొన్నిప్రతులు

4 1 సువర్ణునకు - కొన్నిప్రతులు

5. సీ. ఓషధు లమృత మయ్యుత్తమవస్తుసం
తతిలోనఁ బుష్పవంతములు మేలు
పుష్పముల్ గొని సురపూజ లొనర్చిన
మానవులకు మంచిమనసు గలుగు
నట్లు గావున సుమనోభిధానము పుష్ప
ముల కయ్యెఁ దద్దివ్యపూజ లిచ్చు
నరులకోర్కులు సుమనస్కతఁ దీర్చుట
నమరులు సుమనస్కు లనఁగఁ బనిరి
ఆ. కంపురూపుఁ దెలుపుఁ గలిగి యకంటక
భూరుహాదులందుఁ బుట్టినట్టి
పుష్పములఁ బ్రియంబుఁ బొంది కైకొంద్రు ని
ర్జరులు పూజనములఁ గురువరేణ్య.

6. క. నలినంబులు [1]జాజులునుం
దులసీదళములుఁ బ్రభూతతోషము గీర్వా
ణులకుం జేయును యక్షా
దులకు జశోద్భవము లెల్ల ద్రుష్టి యొనర్చున్.

7. క. అరుణంబులును సకంటక
తరుభవములుఁ గటుకగంధధామములు నొన
ర్తురు శాత్రవాభిచారిక
కరణమున నథర్వమాంత్రికతఁ గుసుమంబుల్.

8. తే. భూతరక్షోగణములకు భూపవర్య
తీక్ష్ణగంధపుష్పంబులు తృప్తిఁ జేయు
[1]నలుపుఁ దెలుపుఁ గలిగి పరిమళసుకాంతి
భరితములు నగుపువ్వులు నరుల మెచ్చు.

9. క. విను దేవాలయమునఁ బిత్ఱ
వనమునఁ బుట్టుకుసుమములు వలదు వివాహాం

---

6. 1. జాదులు - కొన్నిప్రతులు

8. 1. నలపదీపునలచి పరిమళ - అ. ఇ. న. సూ. కొన్నిప్రతులు

బునకును శాంతికపౌష్టిక
వనితాజనరంజనాదిన ర్తనములకున్.

10. తే. కుసుమములగంధమున దేవకోటి వాని
దర్శంబున యక్షులు దదుపభోగ
మున భుజంగప్రతాన మీమూఁడుదెఱఁగు
లను మనుష్యులు ప్రియ మందు టనఘ కలుగు.

11. క. దేవత లర్హ్యకుసుమపూ
జావిధిఁ బ్రియమంది యపుడ జనుల[1] యెడల సం
భావించి వారికోర్కులు
గావింతురు సఫలములు గఁ గౌరవనాథా.

12. తే. సల్లకీజాతనిర్యాస మెల్ల దేవ
తలకు మే లంతకంటెను గుగ్గిలము లెస్స
[1]యగలు గంధర్వయక్షోరగాదులకుఁ బ్రి
యంబు ధూపదానమునెడ నధిపవర్య.

13. వ. ధూపదానంబులయందు నధికతరంబు కర్పూరధూపం బని చెప్పి మఱియును.

14. క. సమధురము గటువును దీ
క్ష్ణము నగుగంధములధూపకలన వరుస హ్రా
ద్యములు సురయక్షరక్ష
స్సహితులకును దత్ప్రకారజాతులకు నృపా.

15. తే. తగినయట్టి ధూపము దేవతలకు నిచ్చి
పరమపుష్టియు నాయువుఁ బడయుఁ గర్త
యక్షగంధర్వపన్నగరాక్షసులును
ధూపమున మెచ్చి కోర్కు లిత్తురు [1]కుమార.

16. క. మలయజము నగలు మఱియుం
గలుగు సురభివస్తువులు నికామప్రియదం

11. 1. సురగనంథా - శ. ష. కొన్నిప్రతులు.
12. 1. యగరుగంధర్వ - శ. ష. కొన్నిప్రతులు.
15. 1. నృపాల - కొన్నిప్రతులు.

ములు [1]పైశాచికధూపంబులయెడ
మానవులచిత్తములకు నరేంద్రా

17. ఆ. రైవతార్చ[1] లపుడు [2]తామసభూతర
క్షోముఖంబులైన కుత్సితంపు
జాతులెల్ల దీపసన్నిధి నడఁగు న
ట్లగుట దీపదాన మధికఫలము.

18. క. ఆలోకదాన మన భూ
పాల పరఁగు దీప మీగి భావము సద్ధ
ర్మాలోకనశీలం బగు
నాలెన్స యొనర్చినట్టియతనికి నధిపా.

19. తే. ఘృతము సోఁకిన వర్తి నికృష్టయగుట
దగ నమర్పించి పెంచుట ధరణినాథ
కానియది దీపదానవిధానమునఁ బ్ర
కాశవస్తువు దృఢదీప్తికముగ వలయు

20. వ. అని వెండియు

21. క. ఒరు లిచ్చిన దీపం బప
హరించి తత్పాతకమున నంధుం డగు భూ
వర [1]రథ్యాపథగుడిపై
గిరి దీపం బిడి విభూతికిం బాత్ర మగున్.

22. తే. ఆలనేయి ముఖ్యము మహిషాదిమేష
జనితఘృతములఁ దైలంబు మనుజనాథ
మధ్యమము లగు మేదోస్థిమాంసరసము
లగయ నింద్యముల్ దీపసమర్పణమున.

---

16. 1. వాహ్యశిక - జ

17 1. తార్చనపుడుదాకినీభూత - ష; తార్చనపుడుఘాకినీహూర-న (?) 2. దానవ - కొన్ని ప్రతులు

21 1 నథగుడిపైతోపలగిరి - క. ష న

23. క. ద్యోతితసాలోక్యకులో
ద్ద్యోతనమహిత ప్రకాశయోగంబులు పు
త్త్రి తెచ్చు దీపదానము
దాత కొసఁగు నమరపూజితసుఖత్వంబున్[1]

24. క. దేవతలకు నగ్రపుసం
భావన నుపహార మిచ్చి పదపడి కుడువం
గా వలయు నట్టు సేయని
ధీవిరహితుఁ డసుర యగుట దెల్లం బధిపా.

25. వ. కావున.

26. క. తనయింటఁ గలుగునన్నము
మును దేవతలకు నివేద్యముగఁ జేసి ప్రణా
మనియమసహితసమర్పణ
మునఁ గృతకృత్యుఁడుగ వలయుఁ బురుషుం డనఘా.

27. వ. పూజకుండు శక్తిసంపన్నుం డయి యొనర్చిన.

28. క. తిలపిష్టము దధిదుగ్ధం
బులు మఱియును ధూపములును బుణ్యపరిమళం
బులు నగుపదార్థములు విబు
ధులకుం బ్రియ మొసఁగు బలివిధులఁ గురుముఖ్యా.

29. క. ఉపహార[1]సమర్పకుఁడగు
సుపురుషు గృహదైవతములు శుభములఁ గూర్చున్
నృపవర తత్కర్మరహితుఁ
గృపలేక నితాంతవిఫలకృత్యుం జేయున్.

30. ఆ. రక్తమాంససహితభక్తపిండముల ను
ల్లసితలోహితాక్తలాజములను
సురను బలి యొనర్ప నురగయక్షాసుర
ప్రముఖభూతములు శుభంబు లొసఁగు.

---

23. 1. రుచిత్వంబునన్ - క. ష వెక్కుప్రతులు

29. 1. సమర్పకుడగు - కొన్నిప్రతులు

81. క. సౌమ్యాసౌమ్యబలులు విను
సౌమ్యాసౌమ్యప్రకారజనకృత్యంబుల్
సౌమ్యనృపోత్తమ యర్థ్యో
కామ్యముఁ దత్త్రప్రపూజ్యకరణిం జేయున్.

82. క. అగ్రపదాయి వర్ణన
మగ్రుఁడు బలయుతుఁడు బుద్ధిమంతుడు లోకా
నుగ్రహపాత్రము శాత్రవ
నిగ్రహశక్తుండుఁ దత్త్వనిష్ఠుండు నగున్

83. వ. అనిన విని యజాతశత్రుండు గంగాపుత్త్రితో సుమనోధూపదీపబలిప్రదానంబులఫలవిశేషంబు లింకను విన వలతుం జెప్పవే యనుటయు నప్పురుషవరుం డాకురువంశవరున కిట్లను నహుషు వృత్తాంతంబున నది విస్పష్టం బగు వినుము చెప్పెద.

-: భీష్ముఁడు ధర్మజునకు నహుషుని ధూపదీపదానవిశేషంబు చెప్పుట :-

సం. 13-156-1 (కుంభ)

84. సీ. నహుషుఁడు భూపాలనము సేయుచుండి రా
జసమించుకయు లేక సత్త్వనిష్ఠఁ
బుష్పంబులను ధూపముల దీపముల నివే
ద్యంబుల నమరుల కర్చ లిచ్చుఁ
బితృసంతతికి [1]దీనఁ బ్రీతి యొనర్చు రా
క్షసయక్షభూతభుజంగమాది
వర్గంబులు నర్హతానిగూఢములుగా
నివి గొని యొనరించు నిట్లు నిత్య
తే. నిరతిఁ జెల్లించి తత్ఫలపరిణతి ప్ర
దీప్తతేజోవిశేషసంప్రాప్తదేవ
రాజ్యుఁడై సురమునిగణపూజ్యభావ
మహిమఁ బొందియు దీనిఁ దా మఱవఁ డధిప

85. క. సురలఁ బితృదేవతలఁ ద
త్పరతను మున్నెట్టులట్ల పన్నుగ నమ్యా

84. 1. విను బ్రీతి - కొన్ని ప్రతులు

కృతకృత్యులఁ గాఁ జేయుం
బరమ కుసుమ ధూపదీప బలిదానములన్.

36 తే. దానఁ జేసి తదీయమహానుభావ
మంతకంతకు నగ్గల మగుట కతనఁ
దగియె ముని[1]వరవాహనత్వంబు నమ్మ
హోద్యుతికి వేయు నేల [2]యనవద్యరహిత.

37 క. విను [1]మనుజేంద్రుల కెవ్వరి
కిని లేని విశేష మతనికిం గలుగుట గ
ర్వనిరూఢి నొంది దుర్వ
ర్తనపరుఁడై యాతఁ డజగరత్వముఁ బొందెన్.

38. వ. అట్టియెడఁ బూర్వంబునం జేసిన పుష్పాదిదాన పుణ్యవిశేషంబుల మహానుభా
వంబు వలన నవ్వసుమతీశ్వరు శపించిన మునీశ్వరుండు సదయుండయి శాప
మోక్షంబు నిర్దేశించెఁ దత్ఫల విశేషంబునన యశేషదోష నిరసననిపుణుండ
వగు నీ వప్పుణ్యానుష్ఠానంబున కొదవి తని చెప్పి వెండియు.

39. తే. పాండవాగ్రజ నహుషుండు బ్రహ్మసభకు
నాత్మ[1]గృహమున కరిగినయట్ల యరిగె
నట్టిపెంపును జనవిభుం డప్పవిత్ర
దానఫలమునఁ దానె పొందంగఁ[2] బడసె.

40. క అని పలికి భీష్ముఁ డిట్లను
విను మెందును దీపదానవిధి మే లనిశం
బును జేయ నూర్ధ్వలోకం
బును గర్తకుఁ బరమదివ్యబోధము నిచ్చున్.

41. క. ఎన్ని [1]నిమిషములు రైవత
సన్నిధి వెలుఁగంగఁ జేయు జనుఁడు ప్రదీపం

---

36. 1. వాహనోల్లసత్వంబు - ఉ. ఐ. ఖ. 2. యనంన్యచరిత - ఐ. ఒ. ఓ.ఔ. కొన్నిప్రతులు
37. 1. మనుజేంద్రుల - పెక్కుప్రతులు
39. 1. పురమున - టం. చ 2. గఁగాంచె - పీ శ ష. స
41. 1. నిమిషములు - పీ. వా (1965) శ ష. నిముషములు - పెక్కుప్రతులు

బన్ని సురవత్సరములు సు
ఖోన్నతి సన్నుతుల నాతఁ డొప్పు దివమునన్.

42. క. అనిన విని ధర్మజుఁడు శం
తను తనయునితోడ విప్రధనము నపహరిం
చిన యాతఁ డేగతిఁ జను
ననుటయు నతఁ డిట్టు లనియె నన్నరపతికిన్.

43. క. దురితము లనేకములు గల
వరయఁగ లోకమున వానియన్నిటికంటెన్
ధరణిసురధనము పాపపుఁ
జెరువునఁ గొనుటధిక మంద్రు ధీరవిచారా.

44. క. భూసురధనాపహరణము
చేసినఁ గులనాశమగుట సిద్ధము దానం
జేసి యగును జండాల
[1]త్వాసంగము నపరభవము నందు నరేంద్రా.

45. వ. ఒక్కయితిహాసంబు సెప్పెద నాకర్ణింపుము.

46. ఆ. క్షత్త్రబంధుఁ డనఁగఁ గల డొక్కనరపతి
యతఁడు మాలవాని నధికదుఃఖ
భాగిఁ గాంచె గాలిఁ బఱచువిప్రక్షేత్ర
తలము రేణువునకుఁ [1]దలఁగి చనఁగ.

47. క. కని యాధూళికిఁ గడు [1]రో
సినకారణ మేమి యనుఁడుఁ జెప్పె నతని కి
ట్లని యమ్మాలఁడు తొలు[2]భా
మున నే నొక విప్రుకొడుక మునులు నుతింపన్.

48. ఆ. పరమనిష్ఠతోడ బ్రహ్మచర్యవ్రత
మాచరింతు భిక్షితాన్న మొక్క

---

44. 1. త్వాసంగతియపర – పీ. శ. ష.
46. 1. దొలఁగి – అ. ఈ. ఉ. ఊ. ఐ.
47. 1. వెరచినకారణమేమి – ఏ. 2. భవమున – ఏ.

నాఁడు వేడ్కఁ బుణ్యనదితీరమున భుజిం
పంగఁ దలఁచి చనఁగఁ జాప మడరి.

49. క. ధరణీదేవక్షేత్రము
పరాగపటలంబు బహుళపవనంబుగతిం
బరగి నరనాథ నా దగు
కరంబు నన్నమునఁ బట్టెఁ గడుసాంద్రముగన్.

50. క. ఆధూళితోడఁ గుడిచిన
నీదుర్జన్మంబు వచ్చె నిది యెఱిఁగెడు సం
వేదనము పూర్వపుణ్యఫ
లోదయమునఁ గలిగె నిన్న నొకకల గంటిన్.

51. వ. దానిం జెప్పెద నవధరింపుము.

52. క. ఒక విప్రవరుఁడు ననుఁ గని
యకటకటా యనుచు నిలిచి యడలకు మీఁదుః
ఖకలాపమెల్ల వాయును
సకలంబును క్షత్రబంధుసంవాదమునన్.

53. క. అనియె నని చెప్పి వీడ్కొని
చని మృతుఁడై తొంటి బహుళ సత్కర్మంబుల్
దన నుత్తమపదమునకుం
గొనిపోయిన నిత్యసౌఖ్యకుండై యుండెన్.

54. వ. అనిన విని యజాతశత్రుండు గంగాపుత్త్రితో నాకలోకం బేకప్రకారమనో
హారియై యుండునో బహుప్రకారప్రమోదియై వెలుంగునో యెఱింగింపవే
యనుటయు నతండు పుణ్యకర్మంబు లనేకవిధంబులు గావే కావునం దత్త
దనురూపానేకస్థానంబై నాకంబు నిశ్శోకంబును నస్తోకసుఖకరంబును నై
కరం బొప్పుచుండు గౌతమశతక్రతుసంవాదం బను నితిహాసంబు విను మది
భవదీయప్రశ్నంబునకుఁ బ్రాదేశవిశదీకరణం బగు నుత్తరంబై యుండెడు
గౌతముం డనుమహాద్విజుండు వనంబునం దపంబు సేయుచుండి కుంజాల
శిశువుం దల్లి లేనిదాని నొక్కెడం గని కారుణ్యంబు వొడమి పుత్త్రినిం బోలెఁ
బెనిచె నయ్యేనికకొదను కాలక్రమంబున మేటియేనుం గయి వెలుంగుచుండె

నక్కాలంబున భూపాలనంబు సేయుధృతరాష్ట్రుం డను రాజునాకారంబు దాల్చి నాకపతి యయ్యేడకు వచ్చి యవ్వారణపతిం బట్టి తనకుం గొని పోవువాఁడై దీని నా కిమ్మని యమ్మునిపతి నడుగుటయు నతండు.

55. తే. ఇధ్మములు దెచ్చి యిచ్చు నేనిచట లేని
సమయమునఁ గాఁచు నీపర్ణశాల మర్త్య
బుద్ధియుత మిది యీదంతిఁ బుత్త్రుఁబోలెఁ
బెనిచినాఁడ నీ కీఁ జాల మనుజనాథ.

-: ఇంద్రునకు మతంగమహామునితోనైన సంవాదము :-

సం. 13_159_11 (కుంభ)

56. వ. అనుటయు నాకృత్రిమజనవిభుండు.

57. చ. మునులకు నేనుఁ గోటికి నమూల్యపుగోవులఁ బుచ్చికొమ్ము వే
యనఘ పసిండి నీవలసినంతయు నిచ్చెద నన్న శైశవం
బున నిది తల్లి లేకునికిఁ బుట్టిన యక్కటికంబు పెంపునం
బెనుచుటఁ జేసి దీనిపయిఁ బ్రేమము నామదిఁ గల్గు భూవరా.

58. క. కావున నొల్లను బదివే
ల్గోవుల నిచ్చినను నిష్కకోటి యొసఁగినం
బోవయ్య యేను మొఱ యిడఁ
గా వావిరిఁ గొనఁగఁ దగునె కరిపతి నీకున్.

59. క. అని మునిపతి పలికిన న
జ్జనపతి వాహనము గాఁగ సామజముం గై
కొనఁ దగదె రాజునకు ని
ట్లనఁ దగునే నీకు విడువు హస్తిఁ బ్రియమునన్.

60. వ. అని రాజసంబు దోఁపం బలుకుటయు నప్పరమద్విజుండు పుయిలోట దక్కి యిట్లనియె.

61. తే. పుణ్య[1]కర్మములు హర్షంబుఁ బొందఁ గనుట
పాపకర్మలు శోకార్తిపాలు పడుట

---

61. 1. కర్మముల్ - ఇ. ఎ. ఒ. ఓ. ఔ.

యొచటఁ గల్గు నజ్ఞముసభ కేఁగుదెమ్ము
దంతి నచ్చట నిచ్చెద ధరణినాథ.

62. వ. అనుటయు నతండు.

63. సీ. వినుము నాస్తికు లగు జనులఁ బాపాత్మకు
లును గాక యేను వత్తునే మునీంద్ర
యచటికి నన్న నయ్యముఁడు పుణ్యుఁడు తపీ
యాదరం బొప్పదే యనియె విప్రుఁ
డమ్మాట కప్పిభుం [1]డప్పఁ బ్రోచునతండుఁ
దల్లికిఁ దండ్రి కత్యంతభక్తి
గలవాఁడు నమ్మేలు గను నందు రానొల్ల
నని పల్కెఁ బల్కిన నత్తపస్వి

తే. రమ్ము మందాకినికిఁ దత్తటమ్ముపొంత
హస్తి విడిచెద ననుమాట యాడ నాతఁ
డతిథి శిష్టాన్నభోజులు నప్రతిగ్ర
హులును గండ్రది సరకు సేయుదునే [2]యచటు.

64. క. [1]అనినను ముని మేరువనం
బున నీ కొప్పింతు గజముఁ బోద మనుడు న
జ్జననాథవరేణ్యుం డా
తని మోమునఁ జూడ్కి నిగుడ దరహాసముతోన్.

65. క. మృదువులు సత్యోపేతులు
సదయులు భూతహితులందుఁ జను జనములు నా
కది యేల వేడ్క నిదె వ
చ్చెద నొండొక మంచిచోటు సెప్పు మనవుడున్.

66. క. నారదమునినాయకుని వి
హారస్థల మైన వనమునం దిచ్చెద నీ
వారణము నచటు కిన్నర
ధీరమ్యం బప్సరోమతిప్రియ మనఘా.

63. 1. దప్పప్రోచు - డ. 2. నేను - ఎ క.
64. 1. అనవిని ముని - కొన్ని ప్రతులు.

67. సీ. అనిన గౌతముపల్కు విని గీతనృత్యాది
చతురులై దేవతాసన్మునీంద్ర
వార్షంబు గావించునట్టివా రచ్చటి
కరుగుదు రేనొల్ల నచ్చ టనియె
నరపతి యుత్తరకురుభూము లనిమిష
కమనీయములు సర్వకామ్యవర్షి
యగు నందు వాసవుం డట వచ్చి కరి నొప్పఁ
గొను మని పలికె నమ్మునివరుండు
తే. గామహింసారహితులకుఁ గాక నాకుఁ
దరమె తత్ప్రదేశం బని దర్పఫణితి
నాడెఁ బతి దాని కాభూసురాగ్రగణ్యుఁ
డిందుగృహమున నిత్తు ర మ్మిభము ననుడు.

68. క. దాన[1]రతులు నతనులా
దాన విముఖు లందుఁ జోవుతరముజనులు నా
కానెలవు సెలవు లే దని
మానవపతి పలుక ముని సమధురవచనుఁడై.

69. వ. అన్నరనాథుతోడ.

70. సీ. రవిపాల నిచ్చెద రమ్మిక కుంజరముఁ జే
కొనుటకు ననిన సజ్జనవిభుండు
నుతతపస్స్వాధ్యాయరతులకు [1]గంతవ్య
మచ్చోటు నాకేల యనుడు వరుణు
పురఁ గుంభిఁ గైకొను పొద మన్న మునిఁ జూచి
యగ్నిహోత్రము సిష్టి యజనములును
గలవా రరుగుదురు గాక యన్నెల వొల్ల
నని యాడె భూపతి యతని కాతఁ

---

78. 1. పరులు – ఆ. ఇ. ఏ. ఒ.

70. 1. గర్తవ్యమచ్చోటు – పెక్కుప్రతులు.

తే. డింద్రుకడ మర్త్యకోటికి నిష్ట మచట
గారు నీ కిత్తు నని చెప్పె [2]శూరయాజి
[3]వేదిశతవర్ష పురుషులు వోదు రందు
దాని నేఁ గోర నని పల్కె ధరణివిభుఁడు.

71. వ. పలికిన నప్పరమతపోధనుండు.

72. క. రదిఁ గొను మచ్చోటను వే
పొద ప్రాజాపత్యలోకమున కనవుడు నా
కది యేల యశ్వమేధుల
పద మనియెం బతి తపస్విపతి యాతనితోన్.

73. చ. అపగతమోహశోక మగునట్టిది గోగణలోక మిత్తు మ
ద్విపవరు నందు నీ కనిన ధీర్[1]నిషేవులు గోప్రదానవు
ణ్యపరులు బ్రహ్మచర్యనియమాఢ్యులు నచ్చటి కేఁగువారు దా
నిపయిఁ బ్రియంబు నాదు మది నెక్కొన దక్కడ కేల వచ్చెదన్.

74. సీ. అని ధృతరాష్ట్రుఁ డాడిన ముని శీతోష్ణ
సుఖదుఃఖమిత్రారిముఖములైన
బహువిధద్వంద్వముల్ పరఁగవు బ్రహ్మలో
కమున నయ్యెడ సామజము హరింతు
గాని ర మ్మనుడు నమ్మానవపతి యసం
గులుఁ గృతాత్ములు వ్రతాచలితమతులు
నధ్యాత్మనిరతులు నందుఁ బోదురు గాక
[1]యచ్చటు గాన శక్యంబె నాకు

తే. నవనిసురవర్య యన రాజు నతఁడు చూచి
మునిమహత్తరుఁ డే నిన్ను ననిమిషేంద్రుఁ
గా నెఱింగితి నెల్లలోకములఁ దిరుగు
దెచట నైనఁ బొందదు గదా యెగ్గు నిన్ను.

75. చ. అనవుడు మ్రొక్కి యింద్రుఁడు మహాత్మ మతంగజహేతువాదవ
ర్తను ననుఁ బంపు నీపనుపు దక్కొని చేసెద నన్నఁ బుత్త్రిఁ డీ

2. సూరియాజి - శ. ష. న కొన్నిప్రతులు 3. వేదశతవర్షపురుషులు - కొన్నిప్రతులు; వేదవరశాంతపురుషులు - కొన్నిప్రతులు.

73. 1. నిషేవ్యులు - శ. ష. పెక్కుప్రతులు

74. 1. యచ్చట రా ను శక్యంబె నాకు - శ. ష. పెక్కుప్రతులు.

పనకరి నాకు సాధుజనవత్సల యిమ్ము కరంబు నెమ్మి దీ
ని ననియె సాంత్వనంబుగ మునిప్రవరుండు గుల ప్రదీపకా.

76. వ. అనిన విని యింద్రుం డిట్లనియె.

77. తే. కరి చెలంగి నీమీఁదఁ బుష్కరము సాఁచి
మూరుకొనియెదు నడుగుల ముందు నిల్చి
ముద్దు గురి[1]యుచుఁ బలుమఱు మ్రొక్కు నిట్టి
దాని ని న్నేల పాపుదు మాననీయ.

78. మ. నను నే డాఁచెద నన్న నేలుదుఁ గానం బాల రత్నాబ్ధి
ధనసంపత్తి నెఱింగి తేర్పడ మునీంద్రా గండు నీవుస్ భవ
త్తనయుం డీకరియుస్ నితాంతసుఖనిత్యం బైన సౌఖ్యంబునం
దనపాయస్థితి మత్సఖత్వమునఁ బెంపారం బ్రవర్తింపఁగస్.

79. ఆ. అనుడు సంతసిల్లి యట్లు కాక నిన న
మ్మునివరుండుఁ గరియు మున్న గాఁగ
నేఁగె దివమునకు మహేంద్రుడు సమోద
భరితుఁ డగుచుఁ గురునృపాలవర్య.

80. క. అనిన విని భీష్ముతో న
జ్జనపతి యి ట్లనియెఁ దపము సారపుధర్మం
బని యూఁది మీరు సెప్పుదు
రనఘా లే కుండునే తదధిక [1]ంబొఁడుస్.

81. వ. అనుటయు నాదేవవ్రతుం డానరదేవోత్తము నర్థిత నాలోకించి.

—: భగీరథునకు బ్రహ్మతోనైన సంవాద ప్రకారము :—

సం. 18-160-1 (కుంభ)

82. సీ. వినుము ధర్మము లెల్ల వినుతకృత్యంబుల
తప మెన్ని యెన్నఁగా ధర్మమెందుఁ

77. 1. యించు, సెదు, సెడి – అనిపాఠములు
80. 1. బెందుస్ – కొన్నిప్రతులు.

గలదు తపం బనఁగా నియతాశన
త్వము భగీరథుఁడు పద్మజునిసభకు
నరిగిన నతనితో సద్దేవుఁ డింగుల
కతులనిర్మలతప మాచరింప
కరుగుదేరంగ నెవ్వరికిని రా దెట్లు
వచ్చితో యనిన నవ్వసుమతీశుఁ

తే. డేను గోదానములును భూదానములును
గన్యకాదానములుఁ దీర్ఘకలనములును
రాజసూయాశ్వమేధాధ్వరములుఁ జెక్కఁ
జేసినాఁడ వచ్చుట దానఁ జేసి కాదు.

83. మ. అవనీదేవత లొక్కెడం గ్రతువిధివ్యాసక్తులై యుండఁ ద
త్ప్రవిఘాతంబులు దోఁచె నేను రణసంరంభంబునన్ వారి కు
త్సవ మొందించితి వానిఁ బాపి ముద మందన్ వారు నన్ బ్రహ్మపా
ల వరిష్ఠావ్యయసౌఖ్య మొందు మని లీలం జెప్పినన్ వచ్చితిన్.

84. తే. ఆఁకలియు నీరువట్టును నాదరింప
కేను విప్రులపని సేసి యిట్టిమహిమఁ
గంటి నియతాశనత్వము గాక తప మ
నంగ వే ఱొండె ధర్మాభినంద్యహృదయ.

85. చ. అనుటయు బ్రహ్మ యవ్విభున కర్చన లిచ్చి తగంగ గారవిం
చె నధిప నీవు విప్రుల భజింపుము సంయమితాశనుండవై
యని దివిజాపగాసుతుఁడు సాదరభాషణవృత్తిఁ జెప్పిన
న్విని ముద మంది ధర్మజుఁడు నెమ్మి దలిర్పఁగ నమ్మహాత్ముతోన్.

86. క. పురుషుఁడు శతాయు వను శ్రుతి
పురుషవరా బాలురైనఁ బొందుదురు మృతిం
జిర మగు నేమిట నాయు వ
చిరమగు నెద్దానఁ దెలియఁ జెప్పుము కరుణన్.

87. వ. అనుటయు నయ్యుభయ ధర్మవేది [1]యవ్విభున కిట్లనియె.

---

87. 1. యగుభీష్ముండవ్విభున – పీ. శ. ష.

౮౮. తే. అనఘ యాచార మాయువుఁ బెనుచు నదియ
కాదు శ్రీయును గీర్తియుం గలుగఁ జేయు
విను దురాచారుఁ డాయువు పెనుపుఁబొందఁ
డతని [1]సర్వభూతంబులు నభిభవించు.

౮౯. క. కావున నాచారపరత
భూవర మేల్ సాధుజనులు వోవుతెరువు సం
భావించుట యాచారము
రా వర్ణాశ్రమ సమర్థ్తం బరఁగు నృపా.

౯౦. ఆ. గురునిమాట సరకు గొనమి దుశ్శీలత
[1]పిట్ట పుడుక గోరు పిసుకఁ ద్రుంపఁ
గఱవ మఱుగు టుదయకాలా స్తమయసమ
యముల భానుఁ జూచు టాయు వడఁచు

౯౧. క. విను క్రోధంబును హింసయు
నన్నృతంబును లేమి సంధ్యాస్నానం బరుపా
సనము సురపూజనము రే
పొనరించుట చిరతరాయు వొనరించు నృపా.

౯౨. క. పరదారగమన మెప్పుడు
పురుషున కది యెల్ల పాపములకంటె నరే
శ్వరవర యాయుస్సంతయ
కరంబు దద్వర్జనంబు గడుమే లరయన్.

౯౩. క. పర[1]దారలయందును సభ
గురువృద్ధనృపాల బాలకుల బాంధవ భూ

---

౮౮. 1. నఖిల భూతంబులు - పీ శ ష. కొన్ని ప్రతులు.

౯౦. 1. నాయుని వనిత గోరు టక్రమ్మఁను గని సేర యఁదయ - టు. ఎ.ల ఓ. బొ. క. ధ.
పిట్ట పుడుక గోరు పిసుకఁ ద్రుంపఁగఱవ వా. (క్రమాలంకారముగా పూరపఱెను) పిట్ట-
బెడ్డ, లోష్టము - ఆంధ్రశబ్దరత్నాకరము. ఇచ్చటమూలము "లోష్టమర్దీ తృణచ్ఛేదీనఖ
ఖాదీచయోనరః ।నిత్యోచ్ఛిష్టః సంకసుకోనేహాయుర్విందతే మహత్" 18-181-15.
కుంభకోణ ప్రతి

౯౩ 1 దారములందును - శ ష కొన్ని ప్రతులు

సురవైద్య కృత్యములుధరా
గరికులసతు లాయువునకుఁ గడుఁ జేటనఘా.

94. వ. అని చెప్పి.

95. క. మేలిమి కీడివి యని భూ
పాలక యేఁ జెప్పినట్టివను తెలుఁగుము నీ
వోలిన యాయువుఁ జెఱుపం
జాలు ననియు నపహరింప శక్తము లనియున్.

96. తే. తగనియది యెద్ది యైన వ్రతంబు పూని
మాన [1]నోచిన నాయువు [2]మాల్పకుండు
నంగటన బోవ దాయు వత్యంతవృద్ధిఁ
జేయుఁ దగినది సేసినఁ జెప్ప నేల.

97. వ. అని పరిభాషించి.

98. క. దేవగృహములకడ వీథిని
గోవాటమునందు రచ్చకొట్టముపొంతన్
భూవర సస్యములను వి
స్థాపింపఁజన మొప్ప రండ్రు చారిత్రవిదుల్.

99. ఆ. ప్రాఙ్ముఖుండు నార్ద్రపాదుండు నై భోజ
నంబు సేత మేలనంగ విందు
నిలిచి యుండి కుడుపు నింద్య మమ్మెయి మూత్ర
సర్జనంబుఁ బాపసరణి యండ్రు.

100. క. అనలము గోవును బ్రాహ్మణుఁ
జన దెంగిలితోడ ముట్టఁ జంద్రార్కులఁ జూ
డను నమ్మెయిఁ దగ దాసన
మును గాంస్యము ననమ భిన్నములు వర్జ్యంబుల్.

101. ఆ. వృద్ధు వచ్చునపుడు విను బాలుప్రాణంబు
తెగయఁ [1]జూచి యతని కెదురు [2]లేచి

---

96. 1. నోసిన - పెక్కుప్రతులు 2 మాన్పకుండు - గ.
101. 1. జూచు నతని కెదురు చూచి - సూ, జూచు నతని కెదుర - పెక్కుప్రతులు 2. వేచి -
పి. శ. ష

ప్రణతిఁ జేసెనేనిఁ [8]బాదునఁ బడి యవి
దొంటియట్ల నిలుచు దురితపూర

102. తే. అధ్యయనమున మస్తకం బంటుటయును
నిద్రయును నశుచితతోఁడ నింద్యకోటి
శిరముఁ గ్రోఁకంగఁ దగ దిరుచేత మస్త
కంబు తైలంబు బూయఁగాఁ గాదు మేన.

103. సీ. వైరనిర్బంధంబు వలవదు గురునితో
నతఁడు కోపించిన ననుసరించి
తీర్చుట మేలు నిందించుట గురునెడ
ననృత మాడుట యాయు వపహరించు
విప్రగోక్షత్త్రియవృద్ధదుర్బలభార
వహాగర్భిణులకు నీ వలయుఁ దెరువు
మాన్యభూదేవుని మంగళంబుల వన
స్పతులను వలగొని చనఁగ వలయుఁ

తే. బంచదశిని జతుర్దశిఁ బర్వమి త్తి
వసుతిథుల జన్మతిథులందు వలయు బ్రహ్మ
చర్య మడుగు లొండొంటితోఁ జనరు తోమ
దోషములు గొండియముఁ గ్రూరభాషణంబు.

104. తే. అంగహీను దరిద్రు విద్యావిహీను
రూపహీనునిఁ దెగడుట పాప మంద్రు
వేదదేవతానిందలు [1]వేతనార్థ
కముగ జోస్యంబు నడపుట కల్మషములు.

105. సీ. దంతధావనము మూత్రపురీషసర్జనం
బులు మౌనియై చేయ వలయు నుభయ
సంధ్యల నిద్రింపఁ జనదు తండ్రికి రేపు
మ్రొక్కి యాచార్యవిప్రులకు వరుస

8. బాటునపడి — పెక్కుప్రతులు

104. 1. వేదవిక్రయంబునడపుట కల్మషమంద్రుబుధులు — కొన్నిప్రతులు.

మఱి మ్రొక్కనది వీరి కెఱఁగుట దక్క దే
 వార్చనంబునకు ము న్ననృ్యకడకుఁ
జనఁ గాదు గర్భిణీసం యోగ మొన్పదు
 పరిణయంబునకు మున్ సురతసుఖము
తే. దనుభవించిన నపకీర్తియందు రట్టి
యఘము వోవుఁ బ్రాయశ్చిత్త మాచరింప
ను త్తరము పడమర దలయుఁగ శయింపఁ
దగదు శీర్ణతల్పంబు నిద్రయును గిడు.

106. క. సితపీతంబులు ధార్యము
లతులమతి కుసుమకోటియందుఁ గృతస్నా
నత [1]రే పాపము శుచిత
చ్యుతుఁ డగు సుస్నాతుఁడేని నొడలు [2] దొడసినన్.

107. తే. నీళ్ల నాడక మును పూఁత నిందితంబు
చీర తడి[1]తో విదిర్చుట సెట్ట యొరుబు
గట్టి విడిచిన వస్త్రంబు గట్టఁ గాదు
మడతమార్చు టొప్పరు[2] కడుమాపు దైన.

108. క. వలవదు వటపిప్పలముల
పలములు నములంగ మేడిపండ్లును దగ దా
వుల మేఁకల నెమిళుల యొఱ
చులు[1]ఁ గానివి యవిహితంపుఁజోటుల నధిపా.

109. క. విను [1]మొరుచూచిన మూచూ
చినభోజ్యము నింద్య మన్యచిత్తముతోడం
గొనఁ దగ దాహారము పొ
త్తునఁ గుడుచుట యఘము గూడు దూషించుటయున్.

---

106. 1. రేబాపునుశుచి - గ 2. దుశిచినన్ - పెక్కుప్రతులు. పద్యార్థమువిశదముకాలేదు

107. 1. తోరదీర్చుట - గ 2 కురుమాపునైన - అ. ఒ. ఓ. ఊ. గ. ష న.

108. 1. లట్లనావవిహితంపుతోటుల - పీ గ. ష.

109. 1. మాచూచిన - కొన్నిప్రతులు

110\. క. చేతఁ గొని యుప్పు నములుట
రాత్రి[1] పయిని నుప్పుఁగొనుట రాత్రి దధిమధూ
పేతంబుగఁ గుడుచుట ధ
ర్మేతరములు నేయి సక్తు వెగ్గు నరేంద్రా

111\. క. ఒకరులు చూచినయది వా
రికిఁ బెట్టక నములుటయును బ్రీతిం దనపం
క్తికిఁ దెచ్చినచుట్టలు వే
ఱొకభంగిం గుడువఁ గుడుపు నుఱు విషభుక్తిన్

112\. క. నేయి మధువు సక్తువు దధి
పాయసము జలంబు భుక్తపరిశిష్టము భూ
నాయక యేరికి [1]నిడఁ దగ
దాయువు చెంపారఁ గోరు టాత్మఁ [2]గలిగినన్.

113\. తే. అంగుళాగ్రముల్ చిటికెనలందు మొదళు
లనఘ దేవర్షి తీర్థము లనఁగఁ బరఁగు
వరుస వరకేలియుప్పలవాయి పైతృ
కంపుఁదీర్థంబు తర్పణకార్యమునకు.

114\. క. ఆచమనపూర్వకంబుగ
నాచరణీయంబు సర్వమగు తర్పణమున్
వాచఃపరుషత క్రోధం
బాచారవిధిజ్ఞ లఘము లండ్రు కుమారా.

115\. క. దినమున సురతం బెయ్యెడఁ
జనదు చెడిపఁ గన్యఁ గవయ జనదు పతిత నం
టనిరాని నగ్నఁ జూడం
జన దుమిసిన వార్పకునికి సతుతుఁడై నన్.

116\. ఆ. అట్టి[1] యెడలఁ దనకు నాచమనము దొర
కొనక యున్న సూర్యుఁ గనుచుఁ బ్రణవ

---

110 1. తిరైయుప్పుగొనుట - ఇ. ర. ఈ. ఏ. చ
112 1 నింతగదాయువు - కొన్ని ప్రతులు 2. గలిగనన్ - అ. ఱ.
116\. 1. అర్ఘివేళయందునాచమనము - ఐ. ఔ. ఖ.

కలనతోడఁ గూడ వలచెవి ముట్టుట
శుచిత నిచ్చు నండ్రు సూరిజనులు.

117. ఆ. భగిని గురుని మిత్త్రుఁ బండితు [1]వంశజుఁ
జేర వడినఁ దెచ్చి ప్రియముతోడఁ
దనగృహమునకల్మి కనురూపముగఁ బ్రోపు
సెనుపు సేయు నాయువునకు సిరికి

118. క. పారావతములు శుకములు
శారికలును బుష్పలతలు జనవర పసిఁడిం
దారమున నైనముట్టులు
నారయ గృహమంగళంబు లాదర్శములున్.

119. తే. గ్రువ్వ గ్రద్ద దివ్వాభీరుపుఁ బ్రువ్వ గూబ
యిల్లు సొచ్చిన శాంతి సేయింప వలయుఁ
జరువుఁ గుడుపును [1]సందెలఁ జనదు రాత్రి
యైనఁ బితృకార్యములు సేయు టఘముఁ జేయు.

120. క. కులమును రూపము శీలముఁ
గలకన్య వరించి యందుఁ గనిన యపత్యం
బులకుఁ దగ నడపునది మం
గళములు గృతదైవపైతృకక్రియుఁ డగుచున్.

121. తే. వలయుఁ బ్రాఙ్ముఖోదఙ్ముఖత్వముల నొకటి
తారకంబులుఁ దిథులును వారములును
జోస్యు తెలిఁగించినవి మేలు సుప్రవైశ
[1]తోల మంగళపనికిని దైలమునకు.

122. క. వినుము సపిండీకరణ
మ్మున నేకోద్దిష్టమునను భోజనవిధి వ
ర్జన మొప్పు నామతింపక
చన దామెతఁ గుడువఁ బోవ [1]సజ్జనవినుతా.

---

117. 1. షష్యుని, వైద్యుని - అనిపాఠములు
119. 1. సంధ్యల, సంజల - అనిపాఠములు.
121. 1. శీల - పీ. శ. శర ష.
122. 1. సద్వ్రతనిధీ - పెక్కుప్రతులు.

123. క. తల్లికిఁ దండ్రికి సుతులకు
నెల్లవిధంబులను వలయు హితములు సెప్పన్
మల్లకుఁడు గాక కర్తము
¹సల్లభ్యము గాఁగఁ జూచి సౌజన్యనిధీ

124. సీ. క్షత్త్రియుం డశ్వంబు గజమును రథమును
నెక్కనేర్పులు గడుఁ జెక్క గఱచి
నానాయుధాభ్యాసనైపుణంబునఁ బొల్చి
యుద్ధతంత్రములకు నోహటింప
కుండెడుమది బేర్చి దండనీతికి బోధ
కం బగునట్టి శాస్త్రంబు మొదలు
గాఁగ గాంధర్వంబుఁ గామతంత్రంబు లో
నగు శాస్త్రముల నెల్లఁ దగినభంగి

ఆ. నలవరించి మున్న యధ్యయనంబునఁ
బౌరవ గలిగి ధర్మచరణవేది
యై ప్రజాభిరక్ష యధ్వరకరణంబు
వలను మెఱసి నడవవలయు నధిప

125. క. విను వర్ణాచారంబుల
ననఘ యిచటఁ దెలుపఁ దొడఁగ నైనను మును నీ
పను లాయుర్వృద్ధికరము
లనుట కతన వలసె నీకు నై చెప్పంగన్.

126. సీ. అధిప రజస్వల నంటుట కల్మష
మాచరితస్నాన యైనపతిఁ జ
తుర్థదినంబున దోషాపమయమునఁ
¹జెందంగఁ దగు నండ్రు గొన భార్య
²లేనవునాఁ డొంద నింతియు షష్ఠాహ
మునఁ బొంద మగవాఁడు బుట్టు వినుము

---

123. 1. సల్లాపముగాఁగ — ట. శ. శర. ష. న. కొన్నిప్రతులు

126. 1. బొందంగ — కొన్నిప్రతులు. 2 లేనవ — పీ శ ష. కొన్నిప్రతులు

మఱియును సమవిషమము లగుదివసంబు
లం దోలిఁ బురుషుండు నంగనయును
తే. సంభవింతు రిట్టులు షోడశంబు రాఁక
నెల్లనాఁడును ఋతుశక్తి యెడల కుండ
నెట్టికార్యము గల్గిన ఋతుమతీస
మాగమము దప్ప నీ కున్ననాయువెక్కు.

127. క. విను మాచార మవశ్యం
బును నడపఁగ వలయు ధర్మమున కది మూలం
బనఘా ధర్మం బాయువుఁ
బెనుచును లక్ష్మిని యశంబుఁ బెం పొందించున్.

128. తే. ఇన్నియాచారములలోన నెక్కు డం(దు
సకలభూతంబులందును సదయుఁ డగుట
యాదిమును లట్లు గావున నఖిలవర్ణ
ములకు దయ కల్మి పెద్దయు వలయు గుణము.

129. క. ఈయాచారాధ్యాయం
బాయుశ్శ్రీకీర్తికారి యగుఁ బాపంబుల్
వాయం జేయును బృథివీ
నాయక సద్భక్తిఁ జదివినను దగ వినినన్.

130. తే. అనినఁ బ్రీతుఁడై పాండునృపాగ్రతనయుఁ
డమరతటినీతనూజుతో నన్నదమ్ము
లేమి విధమునఁ దములోన నెనసి నడచు
వార లెఱిఁగింపు మనుటయు గారవమున.

131. వ. అతం డతని కిట్లనియె.

132. క. విను భక్తియు వెఱపుఁ గలిగి
యనుజన్ములు పెద్దవాని నారాధింపఁ
జనవర యతండుఁ దమ్ములఁ
గొనియాడన్ సిరికిఁ బట్టగుదు రుజ్జ్వలులై.

193. క. అనుజుఁ డొకఁడు వెంగలి యై
నను [1]దప్పెడుఁ గాని పెద్దనకుఁ గార్యజ్ఞా
ననిరూఢి లేక తక్కిన
ననుజన్ములు సిక్కు వడుదు రవనీనాథా.

194. చ. జనవర యన్నదమ్ములు ప్రసన్నమతిం గలకల్మి పంచికు
డ్చిన వినుతించు లోకములు శ్రీయుఁ బొరింబొరిఁ బెంపు నొందు లో
భనిరతిఁ బెద్ద కాసపడి పాడి దొలంగినఁ బ్రాణగోడ్డపుం
బను లగు నవ్విధంబు మన[1]పడ్డది గాదె జగం బెఱుంగఁగన్.

195. తే. తండ్రి పిమ్మట నన్నయ తండ్రి పిన్న
వారలకు నెల్ల నాతనివనిత తల్లి
తల్లి కడచన్న నని చెప్పి తాత మఱియు
మనుమనికి నిట్టు లను నభిమన్యుపౌత్త్రి.

196. క. మానవనాయక యగ్రజుఁ
డైనను ననుజన్ముఁ[1]డేని నన్యాయంబుం
బూని సహోదరులకుఁ గీ
డైన నతఁడు దండ్యుఁ [2]డండ్రు రవనీపతికిన్.

197. వ. అని సహోదరప్రకారంబు సెప్పి వెండియు.

198. క. విను మప్పఁ దల్లియట్లుగఁ
గొని నడపఁగ వలయుఁ జన్ను గుడిపి పెనిచె నె
వ్వనిత యదియు నాతనికిని
జననీసమ[1] యండ్రు బుధులు సౌజన్యనిధీ.

199. క. జనకుం డధికుఁ డుపాధ్యా
యునకుఁ బదిమడుంగు లెక్క డుర్వీనాథా

---

193 1. దప్పదుగాని — అ ఆ. శ ష. కొన్నిప్రతులు

194 1. పద్ధతిగాదె — ఐ ఋ.

196 1. డెన — కొన్నిప్రతులు 2 దండురవనీ — సూ; దండ్రునవనీ — శ. ష. కొన్నిప్రతులు

198 1 మండండ్రు — కొన్నిప్రతులు

జనకునకు దశగుణంబులు
జనని గురుగుత్వమున నిది ప్రశస్తము శ్రుతులన్.

140. క. జననీజనకులచే నగు
జననం బాగమును దను విషయ మని చెప్పఁగ
విను మాచార్యువలన నొం
దిన పుట్టు జరామరంబు దివ్యంబు నగున్

141. వ. కావున గౌరవంబున నాచార్యుండు సర్వాధి[1]కుండు.

142. క. అని యిట్లు సుప్రసంగం
బున గురుజన తారతమ్యములు సెప్పినఁ దా
విని శంతనుతనయున కి
ట్లనుఁ బాండునృపాగ్రతనయుఁ డతులిత భక్తిన్.

143. క. భూసురులకు నృపులకు నుప
వాసము దగుఁ గాని యన్యవర్ణులకుఁ దదీ
యాసక్తి గలిమి పెద్దయు
దోసం బని విందు ధర్మధుర్యస్వాంతా.

-: భీష్ముఁడు ధర్మరాజున కుపవాసవిధివిశేషంబు సెప్పుట :-
సం. 13-109-3 (కుంభ)

144 వ. ఉపవాసవిధియోగ్యతయును దత్ఫలవిశేషంబును విన వలతుం జెప్పవే యను
టయు నప్పురుషవరుం డప్పుడమితేనితో దీని నీవు న న్నడిగినట్లు యే నంగి
రసు నడిగిన నమ్మునిపతి నాకుం [1]జెప్పి న తెఱంగుఁ జెప్పెద నాకర్ణింపు
మని పలికి యి ట్లనియె.

145. క. రాత్రిత్రయంబు బ్రహ్మ
[1]క్షత్రియులకు నుపవసింపఁ జనుఁ దదధికముగ

141 1. కాదుంతు - కొన్నిప్రతులు

144. 1. జెప్పినట్టునీకెఱింగించెద - ఉ చ

145. 1. క్షత్రమునకు - ఉ. ఊ ఒ ఐ. ఒ ఔ. చ. న

గాత్రస్థితిఁ దప్పింపని
[2]మాత్ర నయిన మేలు కురుసమాజవరేణ్యా.

146. క. విను వైశ్యులకును శూద్రుల
కును నాలుగు గుడుపు లుడుగు కొలఁదికి మిగులం
ఆన దుపవసింప నుపవా
స నిరూఢత పెంపు కల్మషము వారలకున్

147. ఆ. పౌర్ణమాసిఁ బూర్వపక్షాష్టమిచతు
ర్దశుల నుభయపక్షవశత వచ్చు
షష్ఠిఁ బంచమిని సునిష్ఠులై నుపవాస
మున్న వివిధశుభము లొలయు నండ్రు

148 సీ. ఏకభుక్తవ్రత మెంతయు నిష్ఠ మా
సం బెల్ల నడపిన సద్ద్విజుండు
సుభగాకృతియు రూపశోభితాంగనయు స
త్పుతులును ధనధాన్యతతులు భోగ
ములు సద్గుణంబులు భూరియశంబును
మొదలైన బహుశుభంబులకుఁ బాత్ర
మగు నేఁడుకాల మయ్యతులవ్రతము సల్పి
యఖిల భూలోక సౌఖ్యములఁ ద్రిదివ
తే. మోదమును గండ్రు రెండును మూఁడు నాల్గు
నీక్రమంబున నోపిన లెక్కి నట్టి
దినము లెడ పెట్టి కుడుచుచు ధృతి నొకేఁడు
[1]నడపువారలతెఱఁగు లేర్పడఁగ వినుము

149. క. ఎక్కుడు దినముల [1]శుభములు
నెక్కు నఖిలవైభవములు నెక్కు[2]దినమునం

---

2. మాత్రమయిన — ఊ. ఎ. ఐ. ఔ. చ; మాత్రతయిన — న
148. 1. గరపువారు — అ ఆ కొన్నిప్రతులు.
149. 1. సుఖములునెక్కు — ఉ. ఊ. ఒ. ఓ. గ. చ. 2. దినమునం — ఉ. ఏ. ఐ. పీ. శ. ష.

దక్కక యుండెడుకాలము
నెక్కు మహాత్మతయు నెక్కు నిభపురనాథా.

150 తే వత్సరంబెల్లఁ బక్షోపవాసనియతిఁ
గడపునతనికిఁ బుణ్యలోకంబు లెల్ల
వాసభూములు మాసోపవాసవృత్తి
యైన బ్రహ్మలోకంబు సౌఖ్యంబు గలుగు.

151. ఆ ఎంతనిష్ఠ గలిగె నేనియు మాసంబు
లోనియంద యెక్కుడై నదినము
లధిప యుపవసింప నగుఁ గాని మాసాధి
కోపవాసవృత్తి పాప మండ్రు.

152. వ. యుగసామర్థ్యంబుననం బురుషు మహానుభావ విశేషంబుననుం జేసి యుప వాసవ్రతంబు మహాధికకాలకృతం బయినను గీడుం జేయక యత్యంత [1]ఫల ప్రదంబై యుండు.

153. తే. మాతకును వేదమునకు ధర్మంబునకును
బర[1]ము లగుగురుశాస్త్రలాభములు లేవు
తపము లేదుపవాసవ్రతంబుకంటె
నధిక మైనది యండ్రు మహాత్ము లనఘ.

154. తే పావనంబులలోనెల్ల బ్రాహ్మణుండు
పరమపావన మను శ్రుతి పౌరవేంద్ర
యట్లు గావున భూదేవతార్చనంబు
భక్తి[1]సంభృతముగ నడపంగ వలయు

155. వ. అప్ర[1]సక్తం బైనను నీయర్థంబు విన వలయు నట్టిది గావునం జెప్పితి నని పలికి వెండియు.

---

152. 1. ప్రమదమైయుండు - అ. ఈ.
153. 1. మమగునట్టిశాస్త్ర - ఓ
154 1. సంప్రీతముగ - ఆ ఇ. ఈ ఏ
155 1. ప్రసంగంబైనను - ఇ. ఏ ఐ. ఒ ఓ ఔ. క; ప్రశస్తంబైనను - అ. ఆ. ఈ. ఉ ఎ గ, ప్రస్తుతంబైనను - క

156. చ. అనశననిష్ఠఁ జేసి సుర లాదిమునుల్ మహితానుభావులై
రనఘ సహస్రవర్షసమనంతరకల్పిత మైన యేకభు
క్త నియమ తంత్రముం నడపి గాధితనూజుఁడు బ్రాహ్మణత్వముం
గనియె మహోపవాసములఁగాని [1]ఫలంబులు లేవు భూవరా.

157. క. కావున నుపవాసవ్రత
సేవనము శరీరమునకుఁ జిత్తంబునకుం
బావన మైహిక మహిమయు
దేవనిలయసుఖము [1]నిర్వ్యథఁ సమకూరున్

158. క పరమ మగునీవ్రతమున కం
గిరసుఁడు దర్శకుఁడు దత్ప్రగీతవిధమునన్
నరు లెవ్వరు దర్శకు లగు
దురు వారిం బొరయ వేమి[1]దుఃఖములు నృపా

159. క. ఈతంత్రంబు పఠించినఁ
బ్రీతి వినినఁ బాయు బహుదురితములు తిర్య
గ్జాతులభాష లెఱింగెడు
నాతెలివగు నపరభవమునందు నరులకున్.

160. వ. అనిన విని ధర్మజుండు సర్వధర్మజ్ఞానమాననీయునితో యజ్ఞకర్త యగుట మేలని మీరు పెక్కెడలం జెప్పితిరి యజ్ఞంబు ధనధాన్యవిభవ సహాయ సంపన్నులకుం దక్కం దక్కటివారలకుం జేయ శక్యంబు గామి దెల్లం బెల్ల వారికి ననుష్ఠింప నయ్యెడునట్టిపుణ్యకర్మం బెయ్యది యుపదేశింపవే యనుటయు నమ్మహీపతికి నమ్మహాత్ముం డిట్లనియె

161. క. నరవర యర్థంబులునుం
బరివారము లేకయును శుభస్థితిఁ జేయన్
దొరకొని[1] యుండుట గని యం
గిరసుం డుపవాసముం బ్రకీర్తించెఁ దగన్.

---

156. 1. వరంబులు — ఔ. క ఖ గ. ట న.
157 1. నిర్వ్యధీరవిచారా — శ. ష. స
158. 1 దురితములు నృపా — ఎ ఞ. క
161 1. నుపవనిగాదేయంగిర — అ ఈ. ఉ ఊ ఎ గ. చ జ కొన్నిప్రతులు

162. క. ఉపవాసాయాసంబును
నృపముఖ్యా దుస్సహంబుగ నీవు దలంచి య
జ్ఞపరత్వము దుర్ఘట మను
నెప మిడి యిట్లడిగి తని మనీషం గంటిన్

163. వ. అనశనవ్రతంబులందును జలంబని తెఱం గెఱింగించెద.

164. చ. పగలును రేయుఁ గుడ్వ జలపానము లోనుగఁ గుడువనప్పు తు
ష్టిగ నొనరించి మర్త్యుఁ డొకటిన్ నడుమన్ మఱి యెప్డు నంట శే
మిగతిని జాపముం బొరయమిం దలకొల్పుచు హోమకార్యముం
దగుమెయిఁ జేయుచున్న విను తంగెటిజు న్నగు నూర్ధ్వలోకముల్.

165. వ. ఇది నేలితెఱంగు గొందలు దుష్కరంబుగాఁ దలంతు రట్టివారలు దిమ
యోపినభంగుల నంగిరసుం డుపదేశించినయుపవాసవ్రతవిశేషంబు లనుష్ఠించు
వా రని చెప్పిన నప్పౌరవోత్తముం డయ్యుత్తమబోధనిధికి నమస్కరించి
యధ్యాత్మక విద్యాబోధకప్రకారంబు లగువాక్యసంచయంబులు పెక్కెడలం
గృష్ణద్వైపాయనాదిమునీంద్రులును గృష్ణుండును నాకర్ణింప నుపన్యసించితిరి
కృష్ణశ్రోతృత్వంబు మహార్హతమంబు గృష్ణుని యున్నరూ పెఱుంగుటయు
నత్యంతసంభావనీయంబు.

166. ఆ. ఎన్నఁ దెలుఁగఁ బడిన నెఱుఁగంగఁ జాలివి
దైన యెల్లయవియు నపగతంబు
లగుట యాపగాశరాత్మజుఁ డాశ్రిత
కోటి కర్థిఁ గృష్ణుఁ గుఱిచి చెప్పె.

167. క. కావున నధ్యాత్మకవా
క్యావలికిం బేరుగడ మహామహిమపదం
బై విలసిల్లెడుఁ గృష్ణుఁడ
యే వినఁగా వలతు నమ్మహితవాక్యంబుల్.

168. వ. అనిపలికి యింకను నధ్యాత్మవిద్యావివరణంబు లగువాక్యంబు లనుగ్రహింప
వలయు నని సంప్రార్థనంబు సేసిన నప్పార్థివాగ్రగణ్యుతో నక్కురువరేణ్యుం
డు హరసనత్కుమారసంవాదంబు సెప్పెద నది యధ్యాత్మవిద్యోపకార
ప్రకారంబు లైనయుపన్యాసంబుల నొప్పియుండు విను మని యిట్లనియె.

-: హరసనత్కుమార సంవాద ప్రకారము :-
సం 13-165-5 (కుంభ)

169. చ. హరుఁడు సనత్కుమారుకడ కర్థి మెయిం జనుదేర నమ్మునీ
శ్వరుఁడు చితాసనాదు లుపచారవిధిజ్ఞతఁ దా నొనర్చి యా
దరభరితాత్ముఁడై యభిమతం బగుకార్య మనుగ్రహింపు త
త్పరమతి నిర్వహింతుఁ దగ దానిఁ ద్రిలోచన మృత్యుమోచనా.

170. తే అనిన నీతోడి గోష్ఠికి నర్థి పుట్టి
యరుగుదెంచితిఁ దమ్ముఁడ యని ప్రమోద
మెసఁగఁ బల్కి యప్పరమేశుఁ డిట్టులనియె
నఖిలలోకార్చితుం డగునతనితోడ.

171. క. ధ్యానమున దర్శనీయం
బైనది యేవస్తు వెన్ని యనఘచరిత స
మ్మానితతత్త్వంబులు [1]సం
ఖ్యానము యోగంబు లెట్టిగతులం జెల్లున్.

172. వ. చెప్పుము మఱియు నధ్యాత్మవిషయంబు లగువిశేషంబులును వివరింపు మను
టయు నయ్యంభోజసంభవుం [1]డయ్యభవున కి ట్లనియె.

173. క. అరయఁగఁ దత్త్వము లనునవి
యిరువదినా ల్గింద్రు గొంద ఱిభ[1]దనుజహరా
యిరువదిమూఁ డనుటయుఁ గల
దిరువదియే నంద్రు [2]వానినే యె ట్లనినన్.

174. క. ఇరువదిమూఁ డనువార
ల్గిరిశేశ్వర ప్రాకృతుల్ మఱిమనవిద మ
త్తెరువు మనోబుద్ధులు వా
రరయఁగ నొక్కండ యం[1]డు రది య ట్లుండెన్.

---

171. 1. సాంఖ్యనము - ఈ ఉ ఎ. ఐ ఒ చ

172. 1. దప్పరమాత్మ నకిట్లనియె - పీ క. ష

173 1. దైత్యహరా - కొన్నిప్రతులు 2. గణుతికెక్క వరునతోన్ - ఐ. ఔ. ఖ

174 1. యంద్రునదియట్లుండెన్ - అ. ఆ ఈ. ఉ. ఔ గ. కొన్నిప్రతులు

175. క. ఇరువదినాల్గనువారలు
నరసి మనశ్శుద్ధి బుద్ధి యనుశాస్న్యన న
ప్పురుసునఁ బలికెద రేఁ గను
తెరువున వినుతత్త్వవిధము దేవస్తుత్యా.

176. తే. పంచవింశ మధిష్ఠానభావ మొంది
విలసనము నిచ్చుఁ దగఁ జతుర్వింశతికిని
దన్న కని తనయంద డిందంగ జేయు
దాన నప్పిండుగలయది తెలియదియు.

177. వ. చతుర్వింశతితత్త్వంబులు వివరించెద.

178. తే. అవధరింపుము భూతంబు లయిదుఁ దద్గు
ణములుఁ బది యింద్రియములు మనంబు బుద్ధి
యును మహేశ యహంకారమును బ్రకృతియు
నాఁగఁ దత్త్వాలు లిరువదినాల్గు వొలుచు

179. వ. ఆ చతుర్వింశతితత్త్వంబుల నధిష్ఠించి యుండుతత్త్వంబు నిర్దేశించెద.

180. క దేహం బని [1]యొడ వెరవున
నూహించును బుధుఁడు దాన నుండుం గాష్ఠ
స్వాహాప్రియుక్రియఁ బురుషుఁడు
సోఽహమనినశాన్ని రుద్ర యతనిఁ గను టగున్.

181. క. ఈనెఱి నిలుచుట గలుగదు
[1]మానేర్ష్యావంతులైనమానవులకు ని
ష్ఠానూన తపోవర్తకులైనను
గార్హస్థ్య బహుముఖాత్మకు లగుటన్.

182. వ. శ్రుతి పురుషు నమృతార్థతత్వం బనియు బ్రహ్మం బనియు నిర్దేశించి.

183. తే. అన్నితత్త్వంబులకు నమృతార్థతత్త్వ
మెక్కుడది యీశ్వరంబు నసీశ్వరంబు

---

180. 1. యొడివెరవున,యెట్టివెరవున - స.

181 1. మానజ్యావంతులైన - కొన్నిప్రతులు

[1]సత్యపాకంబు నతిరహస్యంబు దానిఁ
గనిన మృత్యుజాలము చిక్కు గడవ వచ్చు.

184 క. అనఘ యనులోమమునఁ దోఁ
పును బ్రతిలోమమున లయము వొందుటయును గ
ల్గును సర్వతత్త్వముల కవి
[1]యెనయిక బ్రహ్మమును గలయు నేకత్వ మగున్.

185. తే. ఉత్తమశ్రద్ధ లేకున్నఁ జిత్త మేక
ముఖముగా కున్న నింద్రియముల జయింప
కున్న వేదంబు చదువకయున్న నతని
కిపరిజ్ఞాన మీఁ దగ [1]దిద్ధచరిత.

186. వ. అని చెప్పి తదనంతరంబ యధ్యాత్మంబుల నధిభూతంబుల నధిదైవతంబుల
నుపన్యసించె నాసనత్కుమారుండు తత్ప్రపంచంబు నారదునకుం జెప్పుట
యేను నీ కెఱింగించి యప్పరిపాటి నిన్ను మున్న వినిపించితి ధర్మనందనా
యమ్మునిపతి మఱియు నప్పుశుపతితో నిట్లనియె.

187. ఆ. సకల జంతువులకు సామాన్య మధ్యాత్మ
మాదిగాఁగఁ గల్గు నంతవట్టు
నిట్లు గాఁగ నెఱుఁగు టెఱుఁగుట యొండుమైఁ
గనుట యెఱుక గాదు కామ[1]దమన.

188. క. విను మధ్యాత్మప్ర[1]శృతులు
గనితే ము న్నమరదనుజగంధర్వులునుం
గనుటయుఁ గల్గునె బ్రహ్మం
బున యున్న నిజంబు [2]తత్ప్రబోధం బనదే.

---

183 1. సత్యపాకంబు – ఇ. ఔ. క.

184. 1. యెనయఁగ – శ. ష కొన్నిప్రతులు.

185 1 దీర్ఘచరిత – ఎ. ఐ ఖ

187 1. మథన – అ ఇ. ఏ.

188 1. శృతుల, కృతుల – అనిపాఠములు. 2 తత్త్వబోధంబనదే – అ. ఉ. ఒ. ఐ; తత్ప్ర
బోధమును సుజ్ఞే (సుంది) – కొన్నిప్రతులు

189 క. ఓంకారవాచ్య మది యన
హంకారనిరూఢభావనారాధ్యము ని
ష్పంక మతీత మనుష్ణము
శంకర మఖిలంబుఁ గృపాహారము శివా.

190. తే. అప్రమేయ మవిజ్ఞేయ మచల మాది
విరహితంబు నితాంతంబు విమల ¹మవ్య
యంబు పుండరీకాక్ష మనఘ విషయ
మచ్యుతము సదసత్పరమైక్యభాసి.

191. క. అది నారాయణుఁ డొకనికి
విదిత మతనివలన సురలు వివిధమునులు ని
ర్మదసిద్ధసాధ్యగణములు
¹మొదలగునర్హుల సుబోధ²ములపొల మయ్యెన్.

192. వ. అట్లయిన నాతత్త్వంబు దృశ్యత్వంబు నిరూఢంబుగా రెట్లనిన వినుము బంధ
విముక్తుండు గదా కనువాఁడు.

193. చ. స్మరహర పొందు నింద్రియసమాజయుగంబు మనంబు బుద్ధియుం
బరువడిమై నహంకరణబంధము వాసినజీవుఁ డత్సము
త్కరసహితంబుగా నతఁడు దాఁ బరతత్త్వమునందు లీనతం
బొరయును దాని నెవ్వరు ప్ర¹బోధముగాఁ గనువారు సెప్పుమా.

194 క. భూతము లన్నియు నడఁగిన
యాతఱిఁ దనుఁ దాన కనుచు నంజనరహిత
జ్యోతిర్మయు మెసఁగ ¹వెలిఁగెడు
నా తెలి వాతత్త్వమునకు నమరు మహేశా

---

190. 1 మవ్యయంబు - కొన్నిప్రతులు

191. 1 పొందవికిసంబోధములకు బొలమైయుండున్-ఉ; మొదలుగనర్హుల - అ. ఈ. ఊ. ఓ.
ఔ చ 2. మూలంబయ్యెన్ - ఏ. ఖ

193. 1. బోధపునాకనువారు - కొన్నిప్రతులు.

194. 1 మెలఁగెడు - అ ఈ

195\. ఆ. అని సనత్కుమారుఁ డభవుతో[6] మఱియు ని
ట్లనియె దేహ[1]వర్తులైన దైవ
తముల నెల్ల [2]నాదరమున నాకర్ణింపు
మేర్పరింతు [3]యోగహితము గోరి

-: సనత్కుమారుఁడు శివునకు దేహాంతర్గత దైవతములం దెలుపుట :-

సం 13-167-1 (కుంభ)

196\. సీ. జిహ్వాసోముఁడు వాణి శిఖిఘ్రాణమున గాడ్పు
దానంబునందు శతక్రతుఁడాలి
వ్యావర్తనాంతరవర్తులై పర్జన్య
గగనముల్ బలమునఁ గౌశికుండు
మతి నపానమున సమానంబునందు నీ
శానమిత్రావరుణస్వామితు లక్షు
లందు సూర్యుఁడు మేన నంఘ్రుల[1]ఁ జెవి భూమి
ధరణీధరుఁడు దిక్కతి యుపస్థ
తే. మునఁ బ్రజాపతి బుద్ధియం దనఘ బ్రహ్మ
యుండు నింతకు [2]బుధ్యమానుం డనంగ
వెలుఁగునాత్మ యధిష్ఠాత విను ప్రబుద్ధుఁ
డన నబుద్ధుండు నా నొప్పు నతఁడు మఱియు

197\. క. ఈదైవతముల నన్నిఁటి
నాదరమునఁ గనుచు యోగి యచలిత[1]నిష్ఠన్
వేద[2]మయా మూర్ధగతుం
డై దతుతపేర్మి నిలుపుఁ బ్రాణము లచటన్.

---

195 1. వంతులైన - ఉ. వ; వర్తనాదిదైవ - అ. ఈ 2. సాదరముగ - ఆ. ఇ. ఈ. ఉ. ఎ చ. జ 3 యోగహితము - కొన్నిప్రతులు.

196\. 1. లందునుభూమి - కొన్నిప్రతులు. 2 బోధ్యమానుండనంగ - ఎ. ష; బోష్యమాను - ఆ ఇ క; లబ్ధిమాను - అ. ఈ.

197\. 1. దృష్టిన్ - ఈ వ 2 మయాయార్థ్వగతుండై - అ. ఆ. ఈ; మయోర్ధ్వగతుండై ప్రారక్షత - న

198. తే. [1]అపుడు బుధ్యమానునిఁ గనునవ్వరిష్ఠ
తత్త్వ మవ్యక్త మంద్రు తద్దర్శియగు బ్ర
బుద్ధుఁ డాతని నతని నబుద్ధుఁ డెఱుఁగు
చుండు నివి యాత్మదళ లతఁ డొకఁడ యనఘ.

199. క. ఇవ్విధము గాంచుయోగికి
నెవ్వరు సరి గారు యతు లనేకు [1]లచలులై
యవ్వస్తువు గోరుదు రది
దవ్వారులకు యోగితతికిఁ దక్క మహేశా

200. ఆ. తరుఁడు నతరుండుఁ [1]బరుఁడును నందు ర
వ్విను తదళలఁ బంచవింశకుఁడు ప్ర
బుద్ధనాముఁ డతఁ డబుద్ధునిఁ [2]గనుఁ బురు
షవిధముగను బ్రకృతిసంగ మెఱుఁగు.

201. క. విను షడ్వింశుఁ డబుద్ధుం
డనఁ జను వాఙ్మనసములకు నందక యునికిం
దనుఁ గా నాతత్త్వంబుం
గనిన ప్రబుద్ధుండ యతఁడు కామధ్వంసీ

202. క. వెలుగఁ గనినం బ్రకృతికిఁ
జాలు విడిచినట్ల తనను సుజ్ఞానము న
క్కాలు విడిచి తనకంటెను
మీఱు నొకటి లేమి గాన్పుమెయికొనవలయున్

203. వ. అని చెప్పి

204. తే. [1]తత్త్వమునఁ గల్గు మూఁడవస్థలను దెల్ల
ముగ భవద్భవ్యసన్నిధి నిగదనమునఁ
[2]గూర్చు టఖిలేశ నీ వెఱుంగుటయు నాకు
నెల్ల యోగి జనంబులు నెఱుఁగుటయ్యె.

---

198. 1 అనఘబోధ్య - అ

199. 1. లుచరులై - ఊ చ, లుచెలువె - ద

200. 1. సంతుష్టరనియెదువినుత - ఉ. ఊ 2. గనియెఁ బూర్వవిధము - స

204. 1. స్థానమునగల్గు - ల 2. గూర్చురఖిలేశ - పెక్కుప్రతులు.

205. వ. అని పలికి మునిజనకృత్యంబులు వివరించెద నవధరింపు మనుమాటయు సువ్యక్తంబుగా నాడి [1]యాక్రీడాతపస్వికి నప్పరమ[2]యశస్వి యిట్లనియె.

206 క. ముని వనమున శూన్యాలయ
మున నైన గుహాని[1]కేతనమున నేని[2]ని నా
సనబంధధీరుఁడై మన
మునఁ గొని యింద్రియములవిషయమునఁ దెరఁ బాపున్.

207. క. గురునుపదేశము నడపుం
బురహార విణ్మూత్రవేగముల నాఁకలితోఁ
బోరయుఁ డయ్యభ్యసనము
గురువుగ నాహార మెపుడుఁ గొనఁ డేచవులన్.

208 క. కుడిచిన యప్పుడు యోగము
దొడఁగుటయును వలదు మనసు దూలక యుండన్
మృడ వినుము బుద్ధిఁ గొని యె
క్కుడునిష్ఠను వలయు దానిఁ గుదియింపంగన్

209. క. అది గుదిసిన విజ్ఞానము
గదలక నిర్వాతదీపకాంతియుఁ బోలెం
బొదలును జిత్తంబును నుప
లదశాసంప్రాప్తి నిశ్చలం బగు దానన్

210. తే. అనఘ నిర్జననిశ్శబ్దమైనయట్టి
చోట హృదయస్థుఁ డగుదేవుఁ జూచుపనికి
వలయు లేకున్న శబ్దసంకలిత మేని
సజ్జనాన్వితస్థల మార్యసమ్మతంబు.

211. క. విను తమమును నిస్తమముఁ జే
తనారహితచేతనాసుధామయశాస్త్రా
ననిరూఢము నగు తత్త్వము
గను నిన్నియుఁ గలుగు యోగి కరుణామూర్తీ.

---

205. 1 యప్పరమాత్మునకు-పీ. శ. ష 2, తపస్వి - ఉ చ ట. పీ. శ ష,

206 1. నికాయమునవేని - బ. 2 యూనా - కొన్నిప్రతులు

212 క. మదనహరా యోగనిరతు
లది గని దుఃఖములఁ దొఱఁగి యజరామరతా
స్పద మగునెలవుల నిలుతురు
పొదలుదు రణిమాది[1]చయవిభూతి[2]పదమునన్

213. వ. అని మఱియును

214 తే. యక్షగంధర్వసిద్ధసాధ్యాదిభూత
కోటికంటెను మిగిలి యోగులు నిజేచ్ఛఁ
బరఁగుదురు భవ్యయోగతత్పరుల మేము
నిట్టు లగుట యోగీశ నీ[1]యెఱుఁగుపనియ

215. వ. అని నిజసహజన్ము లయిన సనకసందన[1]సనత్సుజాతులం దలఁపించినవాఁ డయి వెండియు.

216. తే. [1]యోగధర్మంబుకంటెను నుత్తమంబు
గలుగ నేరదు ధర్మ మొక్కటియు నపున
రాగమం బగుపదమున కరయ నిదియ
మేటినిచ్చెన సంయమికోటి కెల్ల

217. క. యోగంబు తెఱఁగు సెప్పితి
భోగిపరాభరణ సాంఖ్యమును జెప్పెదఁ ద
[1]ద్భాగు లగునైష్ఠికులు భవ
సాగరముం గడతు రైక్యసంభోగమునన్.

—: సనత్కుమారుడు రుద్రునకు సాంఖ్యయోగంబుతెఱంగెఱింగించుట :—
సం. 13-169-1 (కుంభ)

218. వ. కావున సల్యాదరంబున నాకర్ణింపు మని పలికి యి ట్లనియె.

---

212. 1. చర, గుణ, పర - అని పాఠములు 2. చయమునన్ - పెక్కుప్రతులు.
214. 1. యెఱిఁగినదియ - వీ. క
215. 1 సనాతులందలఁపించిన - కొన్నిప్రతులు.
216. 1. యోగిధర్మంబుకంటె - అ ఉ ఏ.
217. 1. ద్భోగులగు - ఇ. ఏ క ష.

219. ఆ. ఇంద్రియములకంటె నిశాన మన మహం
కారతత్త్వ మంతకంటె దాని
కంటె బుద్ధి బుద్ధికంటెఁ బ్రకృతి యెక్కు
[1]డన్నిటికిని బురుషుఁ డెక్కు డరయ.

220. తే. అంబరాదిభూతములు శబ్దాదిగుణము
లింద్రియము లిరుదెఱఁగు శాతేందుమౌళి
మన [1]మహంకారబుద్ధు లి ట్లొనరి బ్రకృతిఁ
గలయఁ దత్త్వచతుర్వింశకత్వ మొందు

221. క. చేతనుఁ డగుపురుషుని ని
శ్చేతన యగుప్రకృతి వొంది చేతనతాప్ర
స్ఫీత యగుం [1]బెఱతత్త్వము
లాతత్త్వం బనుమహాబ్ధియందలితరఁగల్

222. క. గుణములఁ బొందఁడు పురుషుఁడు
గుణమహితాప్రకృతి యిచ్చు గుణముల[1]కెలమిన్
గుణములు దానను గుణులై
గుణిత్వ మానిర్గుణాత్మకున కొలయించున్.

223. తే. వీని నెల్ల న[1]సత్కోటిఁగా నెఱింగి
కొనుచుఁ బ్రకృతి నుపేక్షించి తనకుఁ దాన
కాని యొం డెద్దియును లేమి గాంచినపుడు
పురుషుఁ డపగతధూమాగ్నిఁ బోలి వెలుఁగు

224. తే. అట్లు గాక యహంకార మావహిల్లి
ప్రకృతి దా నని సృష్టిఁ బ్రళయమునకుఁ

---

219. 1. దన్నిటికినిబురుషుఁడధి కుఁడరయ-అ ఈ ఉ ఊ ఎ ఐ. చ. జ. ట. ల
220. 1. సహంకారము - ఏ పీ శ
221 1 బరతత్త్వము - పెక్కుప్రతులు
222 1. తెలమిన్ - పెక్కుప్రతులు; కెల్లన్ - ష; కమే - వా
223 1 సునొక్కటిగా - అ ఈ

గర్తయైన వికారాత్మకత్వ మొందుఁ
బ్రకృతివికృతులు గాని యాప్రభువు [1]నవుడు.

225. క. ధృతి పూనమిఁ బ్రకృతిక వశ
గతుఁ డగుచుఁ దమోమయత్వకలితం బగున
వ్రితతా[1]సుఖతత్త్వము సుఖ
మతిఁ బురుషుం డనుభవించు మదనధ్వంసీ.

226. క. నేరిమి దాని నుపేతం
జేయుచ షడ్వింశభావసిద్ధిఁ బొరయు గా
రీరమణ పంచవింశుఁడు
సారామల[1]నిపుణమతిఁ బ్రసన్నాత్మకుఁడై

227. క. [1]సత్త్వాశ్రయమునఁ బురుషుఁడు
దత్త్వాశ్రయమునను [2]సత్త్వతత్త్వములవివే
కిత్వాలేపత్వము లన
విత్త్వము జిత్త్వంబు నొందు విశ్వాధారా.

228. క. నానాత్వైకత్వముల
జ్ఞానజ్ఞానజము ల[1]నపజయ కండ్రు బుధుల్
వాని నవిద్యయుఁ విద్యయుఁ
గా నివి విను పంచవింశకస్థావస్థల్

229 క. విద్యామయ షడ్వింశుఁడు
విద్యావిద్యావిభేదవిరహితుఁ డజరుం
డాద్యుఁ డనంతుం డచ్యుతుఁ
డద్వ్యతనుఁ డనాది కేవలాత్ముఁ డరయన్.

---

224. 1. నరపు - న
225. 1. సుఖత్వమునుసుఖమతి - పెక్కుప్రతులు
226 1. నిస్పృహప్రసన్నాత్మకుడై - అ ఈ
227. 1. సత్త్వానాశ్రయపురుషుడు, సత్త్వాశ్రయుడుడు, సత్త్వములై కర్తృత్వాలేప - న, తత్త్వం బుచేతసత్త్వమునతత్త్వాశ్రయమునను - ఉ. 2. సత్త్వతత్త్వము లైకర్తృత్వాలేపత్వ - అ ఈ ఈ. ఎ, సత్త్వత్వములై క్త్వత్వా - అ ఐ, పీతతత్త్వ రుద్రైకర్తృత్వాలేప - ఏ. ఝ.
229. 1 నవవయమున్ బుధుల్ - కొన్ని ప్రతులు

230. ఆ అని యుపన్యసించి యమ్మునిపతి యను
శంభుతోడ మఱియు సాంఖ్యయోగ
శిష్టమానసుల కరిష్టపరిజ్ఞాన
వై భవాతిశయము వలసి యుండు

231. వ. ఎట్లనిన దృష్టారిష్టవిక్రృతు లయి యాసుకృతు లవిచ్ఛిన్నాత్మానుసంధానంబు నం దడీయదురవస్థం ద్రోవం జాలుదు రరిష్టంబు లవధరింపు మనుపలుకు వలికి వాని నెల్లను వివరించెద నని పరాశరసంయమీశ్వరుండు శిష్యుల కుప దేశించినవిధంబులై యుండు నంతవట్టును మును నీవాకర్ణించి తని యమ్ముని వరుండు మఱియు నమ్మహాదేవుతో సరిష్టంబులం గాంచి యోగిజనంబులు సర్వాంగ[1]ధారణసహితంబును బరమహితంబును నగు ననేకత్వాకలన కృత్యం బున మృత్యువు జయింతు రని నిర్దేశించి.

232. క. జలమున [1]మీను నుదుంబర
ఫలమున మశకములుం బోలెఁ బ్రకృతిం దా ని
మ్ములు నునికి దెలిసి వేర్పా
టలవఱిచినపురుషుఁ డవ్యయత్వముఁ బొందన్.

233. తే. కమలదళమున నున్నజలముపిధమునఁ
బ్రకృతి[1]నుండి తదీయసంబంధవికృతి
లేనితనుఁ గని వెలుఁగు [2]నిర్లేపనిశ్చ
లాజరామరపదవి జీవాహ్వయుండు

234. ఆ. ప్రకృతి నిట్లు వాసి పంచవింశుండు ష
డ్వింశభావ మొంది విమలశివని
రంజనస్వరూపుఁ డై వెలుఁ గొందు న
త్తెఱఁగు ముక్తి యంద్రు దేవదేవ.

235. క ఈ పరిబోధం [1]బభవా
కాపిల[2] మస్మద్గురుండు గపిలుఁ డతని శి

231. 1 ధారణోపసహితంబును - కొన్నిప్రతులు
232. 2. మీనముదుంబర - ఊ ఏ ద ల. శ వ
233. 1. నొంది - ఊ ఎ ఏ 2 నిర్లేపనిశ్చలాజరామరపదవి - ల
235. 1. బుశివా - ల 2. లమునినద్గురుండు - ల

ఈపరిణతి బహుశిష్యులు
దీపితవిజ్ఞాను లైరి దృఢనిశ్చయతన్.

236. క. ఏనును శిష్యుల కిది
జ్ఞానము పెక్కండ్రకుం బ్రసన్నమతిని గా
ఢానూనంబుగఁ దెలిపితి
మానిత మది దివ్యమునిసమాజముచేతన్.

237. వ. గార్గ్యగౌతమకాత్యాయనాదులు దీననచేసి దీప్త[1]బోధు లయి [2]వీతాతంకులును విజ్వరులును నిర్లేపులును నిర్భరానందులు నైరని చెప్పి వెండియు ని ట్లనియె.

238. క. సంగము బంధ మఖిలని
స్సంగత మోక్షంబు బహువిచారము లేలా
పింగజటాజూటకలిత
గంగాబాలేందుమహిత గౌరీసహితా.

239. క. అని యిట్లు శివునకును న
మ్రుని విజ్ఞాపించి గగనమున కెగసి వెసం
జనియె శివుండును నిజది
వ్యనిర్గళచిత్త[1]పథవిహారుం డయ్యెన్.

240. క. అని చెప్పిన భీష్మున కి
ట్లను ధర్మతనూజుఁ డెక్కుడైనశుచిత్వం
బొనరింపఁ జాలు తీర్థం
బనఘా యెఱిఁగింపవే దయం [1]దెల్లముగన్.

241. సీ. అనవుడు నాతఁ డమ్మనుజవల్లభుతోడ
వినుము తీర్థము లెల్ల వినుము మేలు
సత్యాభిధానమై శౌచాతిశయముఁ జే
యఁగఁ జాలు మానసం బైన తీర్థ

237 1. బోధనలై - ర. వ. 2. నిరాతంకులును - ఇ ఈ. ఎ. ల.

239. 1 విధవిహారుం - ఎ. ఏ ఐ ర. జ. ల.

240 1 దెలియంగన్ - కొన్నిప్రతులు

మది ధృతి యను మహా హ్రదమున శోభిల్లు
దమము రజస్సును [1]దఱియ ద్రోచి
కొనుచు [2]సత్త్వము నూత గొని చొచ్చి యాచరి
తస్నానుఁడై శుచిత్వమున వెలుఁగు

ఆ. నరుఁడు వీతరాగపరివ్యాప్తేంద్రియవ్యథ
వ్రతల[3]సద్వివేకు లతిశయిల్లు
విమలతీర్థములు సవినయత వారలఁ
జెందుటయును దీర్థసిద్ధి యధిప

242. క. దమమును దపము నహింసయు
శమమును దీర్థములు వాన శౌచాతిశయం
బమలగుణ కలుగు రి త్తజ
లములం దోఁగిన శుచిత్వలాభము గలదే.

243. వ. అని వెండియు

244. క. దొరకొనని వానిఁ గోరక
దొరకొనినందును మనత్వ[1]తుష్టహృదయతం
బొరయక విగతస్పృహు లగు
పురుషులు శుచు లేల తీర్థములు వారలకున్

245 క అనినఁ బ్రియ మంది తాతకు
మనుమఁడు ప్రణమిల్లి బోధమహితా యేవ
ర్తనమున నుత్తమపదముం
గను [1]నం ద్రది యెఱుఁగఁ జెప్పు కరుణ దలిర్పన్.

246 వ. మృతుండు మేను విడిచి యెయ్యది సహాయంబుగాఁ జను నదియును విన
వలతు నని యడిగిన నమ్మహానుభావుం డాభూవల్లభున కి ట్లనియె.

247. క నీయడిగిన [1]గూఢములగు
నీయర్థము తెలుఁగఁ జెప్ప నింద్రగురుఁడు గా

241. 1. దలగ ద్రోచి - కొన్నిప్రతులు 2 సత్త్వమునూత - ఈ. ఊ. చ. వ; సత్యమునూత - వా కొన్నిప్రతులు 3. హాసద్వివేకు - ఇ. ఏ. స
245 1. నరుదరియెరుగ - పెక్కుప్రతులు
247. 1 దూథములగు - వి శ్రీ వ స.

కేయెడల నొరుఁడు [2]గలఁడే
యాయన యిట వచ్చు నిపుడు యడుగుము ప్రీతిన్

248. క. అనుసమయంబున నయ్యెడ
అనిమిషగురుఁ [1]డరుగుదెంచె నతనికిఁ గుంతీ
తనయాగ్రజుండుఁ దమ్ములు
జనపతులును గేశవుండు సద్భక్తి మెయిన్.

249. వ. ఎదుర్కొని ప్రణామపూర్వకంబుగా సముచితోపచారంబులం బ్రీతాత్ముం జేసి యాసీనుండై [1]యున్నెడం గురుపతి యగ్గురునిం గురుపితామహు నడిగిన యట్ల యడిగిన నతం డతని కిట్లనియె.

250. ఆ. తనకుఁ దాన కలఁడు జననంబునప్పుడు
మరణమునను సుగతినరకములను
దల్లి దండ్రి దక్క నెల్లబంధులు శరీ
రంబు ననుగమించి క్రమ్మఱుదురు

251. క. ఉత్తమపథంబు ధర్మా
యత్తము ధర్మంబు మృతుల [1]కధిప సహాయం
బెత్తెఱఁగున ధర్మక్రియఁ
జిత్తంబునఁ జేర్పవలయు జీవించుతఱిన్.

252. క. అది లేని[1]వాఁడు నరకా
స్పదుఁ డగు నటు గాన ధర్మపరుఁ డగుటయ యొ
ప్పిదము మనుజునకు నేఁ జె
ప్పెద మఱియును వలయు[2]వానిఁ బ్రీతి నడుగుమీ

253. వ. అనిన నజ్జనపతి శరీరంబు విడిచి చనియెడుజీవుని ధర్మం బెట్లనుగమించు ననుటయు నయ్యాంగిరసుండు.

---

2. గలుగునెయాయన - అ ఆ ఇ ఈ ఊ. ఎ. ఏ ఐ. ల
248. 1. దేగుదెంచె - అ. ఈ. వ.
249 1. యున్నయెడ - కొన్నిప్రతులు
251. 1 కధిక, కరుల - అనిపాఠములు
252. 1. నాడు - ఉ. ఋ. ఐ. వ. 2 దానిబ్రీతి - కొన్నిప్రతులు.

254. తే. భూతపంచకశక్తులు బుద్ధియును స
ధర్మకంబుగ జీవునితోఁ దగిలి యరుగు
నను(డు దేహప్రకార మెట్లనియె నృపతి
యతని కిట్లని చెప్పె నయ్యమరమంత్రి.

255. తే దేహగతభూప్రభృతిపంచదేవతలును
మనుసు నన్నసంతృప్తిఁ బొందిన నృపాల
కల్గు రేతస్సు పురుషుండుఁ గామినియును
బొందఁగా నది గర్భత్వ మొందుఁ జువ్వె.

256. వ. అని చెప్పి మఱియును.

257. తే. పుణ్యపాపానుగుణభంగిఁ బుట్టి సౌఖ్య
దుఃఖమయ[1]సంసరణమునఁ [2]బొదలునరుఁడు
వినుము దేవం ధర్మవర్తన సుఖైక
[3]భాజ[4]నత నొందు ధర్మైకనిరత మేలు

258. క. జనవర కృమిగర్దభముఖ
జననంబులఁ బొంది నరకసంవాసముఁ జెం
దు నధికపాపాత్ముం డగు
మనుజుఁడు కర్మవిశేషమహిమఁ దెలిపెదన్.

259. క. జననీజనక గురులయెడ
నొనరించిన మేలుఁ గీడు నొదవించు సుఖం
బునకును దుఃఖమునకు నిం
తని కొలఁది యిడన్ వశంబె యజునకు నైనన్.

260. క. మాతృపితృగురులు దక్కఁగ
నే తెఱువునఁ బాప మొలసె నేనియు దానిం
బాతురు ప్రాయశ్చిత్తకృతులు
దద్విషయమైనఁ జెఱచు దల్పములన్

261. క. కొలు చపహరించు నన్నరుఁ
డెఱకయుఁ బందియును నైన యీాదుర్జననం

257. 1 సంస్మరణ - అ ఈ. 2 దొంగు - ఆ ఈ 3 భావనత - చ. 4. నమునొందు - అ ఉ ఏ ఒ వ

బులఁ బొందు నంతఁ బాపము,
వొలియక యాతనికిఁ గుక్కపుట్టువుఁ గల్గన్

262. క. పరదారగమనదోషము
వరుసన వృకకంకగృధ్ర[1]పలిముఖశశభ
క్ష్మీరతంబు లైన భవములఁ
బొరయించుం గ్రిమియుఁ గాఁగఁ బుట్టించుఁ దుదన్

263. సీ. తనయ నొక్కని కిచ్చి మనసు మరలఁబడి
యన్యున కిచ్చినయట్టివాఁడు
కృమి యగు దేవకార్యము సేసి మఱి పైతృ
కంబు సేయక భోజనంబు సేయు
నతఁడు కాకం బగు నన్నుఁ దిట్టినఁ గొంచ
మై పుట్టు బ్రహ్మకులాభిజాతఁ
గవసి శూద్రుఁడు నరకపుగుంటపు[1]ర్వగు
నంతకుఁకంకరు లంటఁ బట్టి

తే. కట్టికొని పోయి కోసియుఁ గాల్చియును గ్రు
తఘ్ను నుగ్రకంటకసముదయముమీఁదఁ
గ్రంద నదిమియు మఱియు దుఃఖములఁ బెట్టు
తెఱఁగు లెన్ని యన్నింటను బఱతు రధిప.

264. క. ధనవాంఛ నిరాయుధుఁ జం
పిన గాడిద మొదలు గాఁగఁ బెక్కులు తిర్య
గ్జననంబులఁ బొందును శ
స్త్రనిపాతిఁ దోడ్తోఁ మసణదశ వాటిల్లున్

265. ఆ. [1]ఆఁడుదానిఁ జంపినతఁ డేకవింశతి
దూష్యనరకవాసదుఃఖ మొందు
నన్నదధిపయోఘృతాపూపహరణముల్
మతికాదికీటమయత సేయు

---

262. 1. వానరశవ - ల
263. 1. ద్రుప్వగు - ఇ, ఈ, ఒ ఔ క.
265. 1. ఆటదాని - కొన్నిప్రతులు

266. ఆ. ఫలము వినుము వెండిఁ బసిఁడి ముచ్చిలికొన్నఁ
గ్రోఁతిఁ గాయసంబు గ్రువ్వ[1]నీచ
[2]కృమియు నగు సదంబరము హరించిన శశ
జనన మొందు నరుఁడు మనుజనాథ.

267. తే. నమ్మి యిల్లడ వెట్టినసొమ్ముఁ గొనిన
మీను లోనగునీచపు యోనులందుఁ
బుట్టు గంధవస్తువులు గొన్నట్టివాఁడు
వినుము మఱుపుట్టువునఁ జుంచుతనము నొందు.

268. తే వనిత లీపాపములు సేసి వానివాని
పత్నులై జనియింతురు పాపభీతిఁ
దెరువు దప్పక నడచిననరులు సౌఖ్య
మందుదురు రెండులోకంబులందు నధిప.

269. వ. అని చెప్పి యిట్లనియె నేనుం గొన్నిదెఱంగు లెఱింగించితి మఱియు ననేక పదార్థాపహారణంబులకు బహువిధంబు లగుఫలంబులు వాటిల్లు వానినెల్లను శాస్త్రాంతరశ్రవణంబున నెఱింగెదు గాక యనిన విని యక్కురుపతి బృహస్పతితోఁ బాపంబుల బాపికొనుతెఱం గెఱింగింపవే యనుటయు నతం డతని కిట్లనియె

270 క. విను దానంబులఁ బాపము
లనఘా చెడు దానములకు నన్నిటికిని స
జ్జనసేవ్య యన్నదానము
మును లధికం బండ్రు పాపములఁ [1]బాపునెడన్.

271 క. న్యాయార్జిత మగునన్నము
వేయింటికిఁ జెప్ప వలయు విప్రజనము హ
ర్షాయత్తంబుగ దానం
బాయనిపాపములఁ గలవె పౌరవముఖ్యా

272 తే తిరిసియేనియు నన్నంబు దెచ్చి శిథు
లైన విప్రులయాఁకలి నపహరించు

266. 1 చెనఁటి - ఉ పీ క. ష 2 క్రియ - పెక్కుప్రతులు
270. 1. బనెదబాపున్ - ఎ. క

పురుషుఁ డూర్ధ్వలోకంబుల పురుషవరుల
కర్చనీయుఁడై వెలుఁగుచు నంద యుండు.

273. క. వేదాధ్యయనార్థప్రతి
పాదనమున విప్రవరుఁడు బ్రహ్మవిషయస
ద్మ్యాదానంబుల నరపతి
యేదురితములైనఁ గౌరవేశ్వర పాచున్.

274. తే. నేర్చి యలజడిఁ బడిన వాణిజ్యవిధుఁ
బడసి వైశ్యుఁ డన్నం బిడి పడయు సుగతి
[1]చన్పునంతలు వడి సిరి దెచ్చికొని చ
తుర్థుఁ డన్నంబు పెట్టి కాంతురు దివంబు.

275. తే. దివము వంధ్యంబు గా కుండఁ దివిరి యన్న
పానదానంబు [1]లోదవినభంగిఁ జేసి
మఱి భుజించుటఁ బోలెడుమహితధర్మ
కార్య మొండొకఁ డెందును గలదె యనయ.

276. తే. అన్నదానంబు ధర్మంబు లన్నిటికిని
ముఖ్య మింత యెఱుఁగు కురుముఖ్య యనుఁడు
ననిమిషాధిపమంత్రికి నమ్మహీశుఁ
డి ట్లనియె భక్తి[1]వినయంబు లెసక మెసఁగ

277. క. ధ్యానం బింద్రియవృత్తుల
మానించు [1]టహింస గురుసమర్చనవిధి ని
త్యానుష్ఠానము దప మను
పీనఁ బరమసేవ్య మెద్ది వినఁగా వలతున్.

278. వ. వినిపింపు మనిన నమ్మహాత్ముండు

---

274. 1. వచ్చినంతలు - ఇ. ఒ. ఔ, చదివినంతలు - కొన్నిప్రతులు

275. 1. లోపినభంగి - ఊ ఎ.

276. 1. విషయంబు - ల

277 1. దహింస - అ. ఇ. ఎ. ఔ వ.

279. క. ఈయాఱును మంచితెరువు
లై యుండు నహింస యున్నయదిటికిఁ బవి
త్రాయతన మట్లు గాకయు
నేయుత్తమధర్మములను నిది వెలిఁగించున్.

280. వ. అని పలికి యామంత్రణంబు సేసి వాసవమంత్రి యమరనగరంబునకుం జనియెఁ దదనంతరంబ.

281. ఆ. ధర్మనందనుఁడు పితామహుతో సర్వ
దేవతలును భూమిదేవతలును
మునివరులు నహింస గొనియాడుదురు దాని
తెఱఁగు సెప్పు నాకుఁ దేటపడఁగ.

282. వ. అనుటయు నమ్మహనీయుం డమ్మనుజపతిం బరమాదరంబున నాలోకించి.

-: *భీష్ముఁడు ధర్మజునకు నహింసాస్వరూప నిరూపణంబు సేయుట* :-
సం 13 - 178 - 6 - (కుంభ)

283. ఆ. దంతియడుగులోనఁ దక్కినజంతుచ
యంబు నడుగులెల్ల నడఁగియుండు
నట్లు ధర్మకోటు లన్నియు లోనగు
నిద్ధగుణ యహింస కింత నిజము.

284. వ. అదియును.

285. క. అరయఁగ నాలుగువిధములఁ
బరఁగుఁ జతుష్పాదవృత్తిఁ బరఁ[1]గిన గోవున్
దొరయుచు నం దొకఁ[2]డెడలిన
నరవర సద్ధర్మవర్తనము కుంటు వడున్.

286. తే. మనసునను వాక్కునను గాయమునను హింస
నడపు మాంసంబు దినుటతో నాలు గయ్యెఁ
దెఱఁగు లవిష్టుమ్వై హింస వర్తింపఁ జేయుఁ
గాన కడుఁ గీడు మాంసభక్షణము దలఁప.

287. క. ఈనాలుగుతెఱఁగులఁ దగ
మానుట యేఁ జెప్పినట్టి మహితాహింసా

---

285. 1. గెడుగోవున్ - పెక్కుప్రతులు. 2 డొదవిన - ఐ. ఖ; డెడలిన - ఓ. ఝ. వ.

నానచతుర్విధములు మాం
సానేకరుచిప్రమగ్నుఁ డది యె ట్లుడుగున్.

288. క. కావున మాంసముపైఁ దగు
లేవిధమున నుడుగుటయ యహింసారూపం
బై వఱలుఁ సుమీ భూవర
నావుడు నక్కురువిభుఁడు వినయమయుఁ డగుచున్.

289. వ. మాంసంబు పితృదేవతలకుం బ్రియంబు [1]శ్రాద్ధంబు మాంసముఖ్యంబుగా నడపవలయు నని చెప్పుదురు వధింపక మాంసలాభం బెట్లు గలుగు ననుటయు ననిమిషనదీనందనుం డానరనాథున కి ట్లనియె.

290. తే. వాజిమేధంబు శతంబును బూజనీయ
కర్మ మందురు మాంసభక్షణము విడుపు
వినుము చంపుటయును జంపఁ బనుచుటయును
గల్మషంబుల కెల్ల నగ్గలము లధిప.

291. క. పితృకార్యయజ్ఞముఖముల
శ్రుతిచోదితహింసఁ గీడు సోఁక నేరదు వి
శ్రుతగుణ మాంసము చవి గో
రి తినం బ్రాణిఁ దెగటార్చు క్రియఁ బాప మగున్.

292. క. తను నమలినవాని నములు
నని మాంసము తెలుఁగు సెప్పు నాగమములు గా
వునఁ దద్భక్షణ ముడిగిన
ననఘు [1]తపంబునకుఁ జాలు నది యొక్కండున్.

293. క. ఘనవర మాంసముచవిఁ గడ
చినచవు లరయంగ లేమిఁ జేసి చవి యెఱిం
గినవాఁ డది యుడిగిన నా
తని దేవసమానుఁ డండ్రు ధర్మవిధిజ్ఞుల్.

---

289. 1 పైతృకంబు - అ. ఉ. ఔ.

292. 1. త్వంబునకు - పెక్కుప్రతులు.

294. ఉ. ప్రాసను జాతరుం గలదె మాంసము ప్రాణులమేనఁ గాక య
మ్మే[1]నుల నొంచునప్డు తమమే[2]నులు సోఁకిన మాత్ర నెట్లగుఁ
దానిఁ దలంపఁగా వలదె తా నది మానిన హింస లన్నియుఁ
మానవె యంచు నుత్తముఁడు మాంసము మాను దయార్ద్రచిత్తుఁడై.

295. ఆ. మాంస మూన కునికి మనుజేశ ప్రాణివ
ధాభిరతి దొలంగు టగుటఁ జేసి
యట్టివాని కభయ మఖిలభూతంబుల
వలన నెపుడు నెందుఁ గలిమి నిజము.

296. క. స్వాయం[1]భువుఁ డనుమనువును
నీయర్థము సెప్పె లోకహితముగ మార్కం
డేయాదులు మాంస ముడుగు
[2]టాయుశ్శ్రీరూపకారి యగు నని రథిపా.

297. క. విను మాంసము గోరునరుఁడు
దనుజుఁడ చూవె మును దేవతలు మాంసంబుం
దిను టుడిగి కాదె దానవ
జనితభయముఁ [1]బోవఁ ద్రోవఁ జాలిరి వత్సా.

298. క. దానము ధర్మము దప మి
జ్యానిష్ఠ యనంగఁ గల్గు సత్క్రియ లెల్లఁ
మానవనాథ యహింసా
మానాకృతు లండ్రు శ్రుతుల నూనిన పెద్దల్.

299. క. శతవర్ష దుష్కరతపః
కృతి నంజాడు దినమి నగు సుకృత మివి రెండుఁ
మతిఁ దలఁప నొక్కరూ పని
శ్రుతివేదులు సెప్పుదురు కురుక్షితినాథా.

300. క. తపముల దానంబుల బ్ర
హ్మపురినివాసంబు దప్ప దన రాదు జనా

---

294 1 నులునొచ్చునప్డు ఉ. ఔ. క. 2. ననుశస్త్రముసోక – ఆ. ఉ. ఔ.
296. 1. భుంక్తైన మనువుసీయ – పెక్కుప్రతులు. 2. డాయుశ్శ్రీరూప– ఇ. ఉ. ఐ. ఓ. ఔ. లం
297. 1. దొలగద్రోవ జాలిరి – ఐ

ధిప మాంసము నములని పు
ణ్యపురుషునకు సులభ మందు రానెల వార్యుల్.

801. తే. అధిప యాషాఢముఖ్యంబు లైననెలలు
నాలుగింటను మాంసంబు నముల కుడుగు
[1]టాయురారోగ్యబలకీర్తు లనుఫలములు
నాలుగింటిని నిచ్చు నన్నరున కంగ్ర

802. ఆ. సగరనలదిలీపనృగభగీరథముఖ్య
నృపులు వార్షికంపునెలలు నాల్గు
మాంసభక్షణంబు మానుట నుభయలో
కంబులందుఁ బెంపుఁ గాంచి రంద్రు.

803. వ. అనిన విని యజాతశత్రుండు శంతనపుత్త్రుతో నిమ్మోయి మహనీయం బయిన మాంసవర్జనంబు వాటించి తక్కినయపూపాదులు ఫలప్రభృతులునగు భక్ష్యంబు [1]లాచరించి యేలవర్తింప రెల్లజనంబులు ననుటయు.

—:మాంసభక్షణమందలి రుచివిశేషంబు మానుట దుష్కరం బని చెప్పుట:—

నం. 13-173-7 (కుంభ)

804. సీ. అతనికి నతఁ డిట్టు లను మాం[1]సముల చవి
మరగినవారికి మాన వశమె
యట్లు గాకయు సురతాసక్తునకు బల
మొలయు నధ్వశ్రాంతుఁ డుల్లసిల్లు
క్షతము శీఘ్రమున లోపిత మగుఁ గృశునకుఁ
బుష్టి వేగమ వచ్చు భూపవర్య
విను మాంసభక్ష[2]ణంబున నపూపఫలాదు
[3]లం దవ్విశేషంబు లరయఁ గలవె

801 1. దాయురారోగ్య - కొన్నిప్రతులు.
802. 1. వార్షికంబునెలలు - కొన్నిప్రతులు.
803. 1. లుపయోగించి - ల ఖ
804. 1. మునచవి - కొన్నిప్రతులు 2 ణమునగాక నత్పల తతులందు నట్టివిధంబుగలదే - ట.
3. లను దద్విశేషంబు - కొన్నిప్రతులు

తే. మాంస మానినదోషంబు మహితదాన
విధులఁ బాయు ద్విజపితృ[4]విధివిశిష్ట
మై నయెఱిఁగి గీడొలయదు యజ్ఞములకుఁ
బశువిధానంబు వేదంబుపనుపు గాన.

805. వ. ఇట్లు[1]గాన నంజూడు నమలుటయు నధికదోషంబులు [2]గానియెడలునుం గలిగి యుండు నగస్త్యుండు రాజులకు వేఁట విధించెం గావునం గుతూహలంబుఁ గోపంబు ననియెడు భావంబులం బొరయక లోకరక్షణార్థంబుగాఁ గ్రూర మృగవధంబును స్వీయ స్వవిక్రమార్జితమాంసంబున దేవపితృప్రీణనం బొనర్చుటకుం గాఁ బశుమృగమారణంబును జేయుభూనాయకుండు దురి తలం బొరయ కుండు విశేషంబు వినుము.

806. ఆ. అన్యమాంసమున నిజాంగమాంసంబుఁ బో
షింతు ననుటకంటెఁ [1]జెట్ట లేదు
మాంసభక్షణంబు మానుటకంటెను
మేలు లేదు కర్మజాలకమున

807. తే. మాంసభక్షణదోషంబు మాను దాన
మహిమ ననుటయు మాంసంబు మఱి భుజింప
కున్నఁ జూవె ధర్మము లెవ్వియును దలంప
దయకు సదృశంబులే కురుధరణినాథ.

808. తే. ఆత్మసదృశత [1]ప్రాణభయంబునందుఁ
బ్రాణులకు నెల్లఁ గని మాంసభక్షణంబు
మాను దయ సార్ద్ర మానసుండైన పురుషుఁ
డాతనికి బ్రహ్మలోకాదు లాటపట్టు.

809. క. భూతముల కలుగునతనికి
భూత[1]ము లభయములు నలుగు భూతహితార్థి

---

4. తథివిశేష -ల; విధిశేష- పెక్కుప్రతులు
805. 1. గావుననంజూడు, గాకయునంజూడు - అనిపాఠములు. 2. లేదనికొన్ని యెడలునుం - అ ఆ. ఓ. వ. 8 భుజవిక్రమా - ఈ. ఏ.
806. 1. జెడ్డలేదు - అ.
808. 1, ప్రాణిచయంబునందు అ. ఈ ఏ ల
809. 1. తలికభయ - ల పెక్కుప్రతులు.

ఘాత[1]ముల కథయ మిచ్చిన
పూతాత్మున కభయ మిచ్చు భూతావలియున్.

310 ఆ. దానమును దపంబు ధర్మంబు యజ్ఞంబు
శౌచమంత్రతంత్రసత్యములును
బుధు లహింసరూపములు గాఁగఁ జెప్పుట
నెల్లకల్మి సు మ్మహింసకలిమి.

311. క. నరనాథ యహింసాగుణ
పరిగణనము గొంతమాత్రఁ బలికితి ధర్మో
త్తర యగు నహింసమేలిమి
యరయం గడుఁ బెద్ద దాని నలవఱుపు మదిన్.

312. ఆ. అనిన సంతసిల్లి యమ్మహీపతి శాం
తధికథ_క్తి ్రమొక్కి యస్మదీయ
సంగరంబునందుఁ జచ్చినవారల
కేది గతియొ నాకు నెఱుఁగఁ [1]జెప్పు.

313. క. బ్రదుకు[1]ను జావును సుఖదుః
ఖదములుగా జంతుకోటి కరుణామూ_
మదిఁ దలచుఁ బ్రాణలాభము
వదలు టరిది గాన నట్టివారి నడిగితిన్.

314. క. అనుటయు లెస్సఁ[1]గఁ దలఁచితి
విను మొకకీటంబునకును వేద[2]వ్యాసం
బున లోకహిత మొనర్చిన
మునికి నయినసత్కథనము మునినుతచరితా.

315. వ. దాన నీయడిగినయర్థంబు తెల్లం బగు నని పలికి భీష్ముం డిట్లనియె.

316. క. శకటపథంబునఁ గీటం
బొకటి వెసం బాఱఁ గాంచె యోగీంద్రుఁడు జం

---

312. 1 జెపుమ _ ఒ. వ. శ. ష
313. 1. టయుఁ జావుసుఖ _ అ. ఊ ఎ. ఏ. ఒ చ. ల. వ. శ ష
314. 1. గనదిగితి-వ 2. రహస్యంబున _ ల

శుకలాపమానపదశా
ప్రకారసంవేది బాదరాయణుఁ డధిపా.

817. వ. కాంచి నిరూపించి యాకృష్ణద్వైపాయనుం డక్కీటంబుతో నీవు భయంబున రయం బెసఁగం బాఱెదవు కారణం బేమి యని యడిగిన నది యమ్మునీంద్రున కిట్లనియె.

818. తే. తెప్ప దెరలంగ బండి యేతెంచుచున్న
యది మహాత్మ తన్నేమిజాతారవములుఁ
గడఁక నెల్లను దఱిమి రొప్పెడునరాలి
యులివు విని యుల్లమునఁ గడునులుకు పుట్టి

819. వ. బ్రతుకు[1]ను జావును బరమసుఖంబును నత్యంతదుఃఖంబునుం గాదె కావున.

820. క. క్రందున మేను [1]సిదియు నను
బొందలపా టొంది ప్రాణగొడ్డ మగుటఁ ద
ప్పం దొలఁగఁ బాఱెదను ముని
బృందారక [2]యపదె ప్రాణభీతి దలంపన్.

821. చ. అన విని దాని[1]కిట్టు లను నమ్మహితాత్మకుఁ డెంత లెప్ప నీ
మనికి దలంప నింద్రియ సమాజసుఖంబులఁ బొందఁ గీటము
ల్గను టది లేదు దుఃఖబహుళం బిది యీయొడ్కలేల చావు సీ
కనయము సౌఖ్యకారి యగు నత్తెఱఁ గీవు దలంచి చూడుమా.

822. వ అనుటయు నక్కీటంబు.

823. తే. అనఘ కీటంబులకు విషయజము లైన
సౌఖ్యములఁ బొంద లే దను చనువు గలదె
వినుము తమతమ తెరువుల ననుభవింపఁ
గలదు చావును భీతికిఁ గారణంబు

---

819. 1. పరమసుఖంబును జావత్యంత - వీ శ. ష. స
820. 1. చదియు - ఖ. ఒ. చ. వ శ ష. 2 యరుదె - ఊ. ఏ. వ; యనురె - అ. ల
821. 1 కిట్లనియె - అ. ఈ. ఏ.

324. వ. నీవు నామనం బరసి తింతియ కాక యింత యెఱుంగవే యది యట్లుండె నాతెఱం గవధరింపు మేను దొలుమేన నొక్క శూద్రుండ ధనవంతుండ.

325. సీ. ఆచారహీనత యతిలోభ మన్యథ
నాపేక్ష క్రూరత యవినయంబు
మొదలై నదుర్గుణంబులకు నెల వు నెల
వై యుండి మాతకు నధికభక్తిఁ
బ్రీతి నెప్పుడు నొనరింతు బ్రాహ్మణమాత్రుఁ
డతిథి యొక్కరుఁ డొకయప్పుడరుగు
దెంచిన నతనిఁ బూజించితి నది కార
ణముగ జాతిస్మరణంబు గలిగె
తే. మంచికర్మము సుఖము నొందించు టిపుడు
గాన వచ్చె మునీశ్వర కరుణ నాకు
న త్తెఱం గెఱిఁగింపవే యతివిశదము
గాఁగ ననవుఁడు నాతండు గారవమున

326. వ. అజంతువుం గనుంగొని నీవు సెప్పనేల దుష్కర్మకోటిఫలనం గీటంబ వగు చెఱింగితి భవదాచరితంబులైన సత్కర్మంబులుం గాంచితి నమ్మేలునకు [1]సంతోషించి కాదె నీతో సంభాషించితి మదీయతపోవిశేషంబున నీదయిన కీటత్వం బపనయించెద విషాదం [2]బపనయింపుము తపోబలంబును గడచిన బలంబులుం గలవే మనుష్యజన్మంబు నొంది మే లొనర్చెద నను కోర్కి నీకుం బుట్టుట మేలు మానవులకుం గర్మభూమికృతంబు లైన సదసత్కర్మం బులం జూవె దేవతలును గీటంబులు నగుట వాటిల్లెడు నని పలికి వెండియు.

327. క. సుకృతము లమ్మెయిఁ గల్గుట
నకట [1]జనిస్మృతియుఁ గల్గె నస్మత్సంద
ర్శకతయు నీకు నొదవె నో
డకు మున్నతపదము నిచ్చుటకు మెయికొంటిన్

---

326. 1. నమ్మతించి- అ 2 బునొందకుతపో - ఎ 3 భూతిమిశ్రితంబులైన సత్కర్మంబులం జూవె-ల

327. 1 జనపీశ్రిలిగలిగె - అ ఓ, జనిశ్రుతియు గలిగె నస్మత్సాన్నిధ్యకళయు నీకునొదవె - ల

328\. వ. అత్తెఱంగు[1]గాకర్ణింపుము.

*-: వేదవ్యాసుఁడు కీటంబునకు నుత్తమజన్మములు గలుగ ననుగ్రహించుట :-*

సం 13-130-1 (కుంభ)

329\. ఆ. నీచ శూద్ర వైశ్య నృప జన్మములఁ గ్రమ
వృత్తి నొందు మెపుడుఁ జిత్తమునకుఁ
బట్టెఱుంగునట్టిపోడిమి నొసఁగితి
ధర్మపరుఁడ వగుదు దానఁ జేసి.

330\. క. అని సాత్యవతేయుఁడు గృప
నెనసి సుధాధారఁ బోలు వీక్షణముం ద
త్తనువున నిగిడించిన న
మ్మునిపతిఁ గీర్తించె భూతములు ప్రీతములై.

331\. క. అక్కీటంబును భక్తిఁ
మ్రొక్కి శిరం బతనిపాదముల మోపి మనం
బెక్కుడు [1]ప్రమోదమునఁ గడుఁ
జొక్కఁగ నదనంతరమ యసువులం [2]దొఱఁగెన్.

332\. వ. కారుణికత్వధుర్యుం డగు నప్పారాశర్యుం డట్లవలీల మేలొనర్చి కీటంబుం గృతా[1]ర్థంబుం జేసి నిజేచ్ఛం జనియె నదియు నమ్మహానుభావునిర్దేశించిన తెఱంగున జనియించుచు ననేకపుణ్యంబు లాచరించుచు నృపజన్మంబునం బూజ్యంబైనరాజ్యంబు నొంది

333\. సీ. ఏనుంగు లెక్కి పెక్కేనుంగు లిరుగడ
రాఁ దురంగంబుల [1]రవణ యొప్ప
గొడుగు[2]లుం బడగలు ముదివడ [3]గాయక
వంది[4]పాఠకుల రవంబు లెసఁగ
భూషణంబుల రత్నపుం[5]జంబుదీప్తులు
దిక్కుల నెల్లను దీఁటుకొనఁగ

---

328\. 1. గెరిగించెద - ల

331\. 1. ప్రమదంబున - ఎ వ 2. దొరఁగెన్ - శ. ష (సాధురేఫరూపము)

332\. 1. ర్థత్వంబుంజేసి - అ. బ ఓ. వ. శ. ష

333 1. రవణమొప్ప - ష. స 2. లునుదరిండ్లు - న; నుదరిండ్లు - అర్థము విచారణీయము. శ. ర లో ఈపదములేదు; లుంజామరల్ - అ ఓ. 3. నెల్లెద - పి. శ. ష.
4 మాగధుల - ఏ; 5 జవిప్రదీప్తులు - పి. శ ష.

సామంతలోకవిజనసీమంతినీముఖ
పరివారవై భవస్ఫురణ మలర
తే. దేవపతివోలె సాత్యవతేయునాశ్ర
మమున కేతెంచి తత్పాదకమల మాత్మ
ముకుటసంగతముగఁ జాఁగి మ్రొక్కఁ గరుణ
నాతఁ డెత్తి తన్మస్తక మక్కుఁ జేర్చె.

334. వ. ఇట్లత్యాదరంబున సంభావించి శిష్యజనంబు నియోగించి

335. క రాజన్యసముచితం బగు
పూజావిధి యాచరించి పురుషోత్తమ నీ
పీజన్మంబున సన్ముని
రాజికి వెఱఁ గగుతపశ్చరణ మొంద వనా.

336. క. గోవులకై యొండెను వి
ప్రావలికై యొండె నిర్భరాహవకేలీ
ప్రావీణ్యము మెఱసి విడువు
నీ వసువులు దాన నధికనిర్మలత యగున్

337. వ. ఇట్లు నిష్కల్మషత్వంబు సిద్ధించిన

338. క. ధరణీసురజననమహిమ
దొరకొను నీ కని విధించి దుర్దాంతరిపు
స్ఫురణహరణపరిణతు న
న్నరపతి వీడ్కొల్పె మునిజనంబులు వొగడన్

339. తే. అతఁడు నానందసంభరితాంతరంగుఁ
డగుచు దండప్రణామంబు లాచరించి
యరిగి యమ్ముని చెప్పినయట్ల చేసి
భూమిసురజన్మలాభంబుఁ బొందె నధిప

340. వ. ఇవ్విధంబున సద్ద్విజుండై.

6 పరిజన - శ

341. క. పుణ్యస్థలముల నెల్లన
గణ్యము లగుయాపములు ప్రకాశములుగఁ గ
ర్ణణ్యతయు వివిధరత్నహి
రణ్యాదికదానములను బ్రస్తుతి కెక్కన్.

342. తే. అధ్వరంబు లనేకంబు లాచరించి
యతఁడు మఱియును బాదరాయణునిఁ గాంచె
సదయచిత్తత నప్పరాశరసుతుండు
వీడుకొలుపంగఁ జని యశోవిభవ మెసఁగ.

343. క. వ్రతశీలతఁ బరఁగి తుదిఁ
శతమఖునకు [1]నగ్గలంపుసఖు[2]డై యమరా
శ్రితసంస్తుతభవ్యపద
స్థితి నవ్యయపరమసౌఖ్యసిద్ధిం దనరెన్.

344. వ. అని చెప్పి భీష్ముండు.

345. క. మనుజేంద్ర కురుక్షేత్రం
బున నద్భుతఘోరసమరమున నమ్మాద్రిం
దనువులు దొఱఁగిననృపులకు
ననంతసుఖగతు[1]లు గల్గు టనుమానంబే.

346. వ. భవదీయబాంధు లందఱు నూర్ధ్వలోకప్రాప్తు[1]ల నీ వేమియు ననుమానింపకు మని పలికినం బాండవాగ్రజుండు పరమసంతోషభరితాంతఃకరణుండై సుర సరిత్స్నానములో విద్యాతపోదానంబులలో నెయ్యది [2]విశేషం బెఱింగింపవే యనుటయు నమ్మహీపతి నమ్మహామతి గౌరవంబునం గనుంగొని.

347. తే. వ్యాసమైత్రేయపుణ్యసంవాద మనఘ
వినిన నీప్రశ్నమున కది విశదమైన
యుత్తరం బగు నేకాగ్రచిత్తవృత్తి
వగుమ నీ వని పల్కి యి ట్లనియె నధిప.

341. 1 స్థానములెల్ల - ఈ. ఉ. ఏ ఓ. చ. ల.
343. 1. ననుగలంపు సఖుడై - ఈ. ఏ. బ ల. 2. డయ్యనురాశ్రిత - ల.
345. 1. లగుట. యుననుమానంబె - ఏ. ఒ. చ ల
346. 1. లైరి నీవేమి - ల 2. విశిష్టంబెరిం - ఆ. బ. చ. ల

-: వ్యాసమైత్రేయసంవాదము భీష్ముఁడు ధర్మరాజునకుఁ జెప్పుట :-

సం. 13-132-1 (కుంభ)

948. సీ. వ్యాసమునీంద్రుండు వారాణసీపురి
కరిగి ముని మైత్రేయుఁ డచట నునికి
నాతనియున్నెడ కప్రకాశతఁ జన్న
నెఱిఁగి యమ్మహితాత్ముఁ డెఱిఁగి భక్తిఁ
బూజించి యుత్కృష్టభోజనంబునఁ దృప్తి
సేసిన నధికవికాసరుచిర
ముఖుఁడైన యమ్మహామునిఁ జూచి మోద మ
గ్గల మయి మీయందుఁ గానఁ బడియెఁ
తే. గారణం బేమొకో యని గారవమున
నాతఁ డడిగిన నతఁ డధికాదరమునఁ
దపము శ్రుత మాదిగాఁ గల ధర్మకోటి
లోన నెల్లను నధికంబు దాన మనియె.

949. వ. అని మఱియును

950. క. దానార్హవస్తువులలో
మానిత మన్నంబు యన్నమయను లసువులున్
మేనుఁ దదీయ బలంబును
గాన బుధులు దానిఁ దద్గ్గై కొండ్రు మదిన్.

951. క. తపముల్లవు కల్మషముల
నపగతములఁ జేయు విద్య కాస్పద మగు నా
తపసి మహితదానంబున
నుపచిత మగు విద్య దపము నుత్కర్షించున్.

952. క. దాన తపంబును విద్యయు
దానోదాత్తప్రవర్ధితంబులు విద్యా
నూనత్వం బచ్యుతుఁ గను
దానికి దీపంబు సద్వ్రతప్రవణులకున్.

953. ఉ. కావున నన్నదానమునఁ గాఁ గెటు లుండు మహాప్రమోద మ
త్యావిలచిత్తుఁ డైనను మహత్తరదానమునన్ విశుద్ధస

ద్భావతనొండు నిక్క మని పల్కె నరేంద్ర తపంబు విద్యయుఁ
దైవతపూజనీయములు దానము వానికిఁ [1]బోషకం బగున్.

354. క. అని శాంతనవుఁడు సెప్పిన
విని కౌంతేయాగ్రజుండు విమలమతి యం
గనలసమాచారంబులు
వినంగ నే వలతుఁ జెప్పవే [1]తెలియంగన్

355. వ అనిన నతండు కైకేయీశాండిలీసంవాదం[1]బున నిది దెల్లం బగుం జెప్పెద
విను [2]మని యి ట్లనియె.

356. తే. సుమన యనియెడు కైకేయి యమరపురము
నందు శాండిలిఁ గని భవ్యమైన దివ్య
పదవి యేవ ర్తనమునఁ బొప్పెడియె నీకు
నలివ చెప్పుము నా కని యడిగె నధిప

357. వ. అని యడిగిన నా[1]యమ కయ్యంగన యి ట్లనియె.

358. సీ [1]మామకు న త్తకు [2]మార్వల్క దేవపి
త్రతిథిపూజనములయందు సొలయ
నిలు[3]వడిఁ దలవాకి లెప్పుడు నెఱుఁగక
[4]వెలుచ నవ్వక శుద్ధి వెలయ విప్ర
భిక్ష [5]యోపిక గల్గి పెట్టుచు వ ర్తింతు
వలయు కార్యములకు [6]వెఱఁది మగుడఁ

353 1. బోధకంబగున్ - అ రీ పీ. ష;పోషణంబగున్ - వ

354, 1 తేటపడన్ - కొన్నిప్రతులు.

355 1. బనునితిహాసంబుగలదువినుమని - పీ శ ష. 2 మనిపలికి యిట్లనియె - కొన్నిప్రతులు

357. 1. సుమనకు - జ

358. 1. ఇచ్చట సత్యాద్రౌపదీ సంవాదము చూడదగును ఆరణ్య - 5. 291 2. మార్వల్క- కొన్నిప్రతులు. 3 వాసి - ఉ. ల శ ష. స; వాడి - ఇది 'ఇలు + పాడి' యగును వ, పెక్కుప్రతులు 4. వెలిలిచెప్పక - జ. ఖ 5 లెక్కటియేన - చ జ. వ, శ. స కొన్నిప్రతులు; లెప్పుడునేన - ఉ; లెక్కడియనపెట్టు - ల. 6. నొలసి, వెదవి- అని పాఠములు

బతి వచ్చునప్పుడు భక్తియు వేడ్కయుఁ
దొడల నాసనపాద్యములను [7]సుముఖ
ఆ. భావమునను సేవ [8]వాటింతు బిడ్డల
శిశు వదలఁ దిట్టఁ బెట్టఁ గనియు
నాకు వేఱ ప్రియ మనఁగ లేదు పతి మెచ్చు
వంటకములు చవిగ వండి యిడుదు

359. చ. వరుఁ డొకవెంట నెన్నఁడు ప్రవాసగతుం డగు నాఁటఁ గోలె న
ప్పురుషుఁడు వచ్చునంతకును బూవులు పూఁతలు మేలిచీర లా
భరణము లెక్కుడుం జవులపాకవిశేషము [1]లాదరింప నే
ప్పరుసునఁ [2]గోల్పఁ గూడు[3]రువబంధులకుం దగ నెమ్మి సల్పుదున్.

360. క. గోవులు మొదలగు తిర్య
గ్జీవుల సుఖవృత్తు లరసి చెల్లింతు గృహ
శ్రీవర్ధనంబునకుఁ బతి
భావము సంకటపడంగఁ బలుక నొకటియున్.

361. తే. [1]అగ్ని యోపి రక్షింతు రహస్యమైన
దాని వెలిపుచ్చ గర్భంబు దాల్చి యున్న
యప్పుడు వాచవు లెల్లను నవులఁ బెట్టి
దాని కెయ్యవి [2]పథ్యముల్ వానిఁ గొందు.

362. క. అని చెప్పి యట్టిచందం
బున నడచిన సతికి లోకములు [1]రెండును సౌ
ఖ్యనిరూఢి [2]యొసఁగుఁ బోగ దొం
దు నరుంధతివోలె నవ్వధూటి నరేంద్రా.

363. క. నృప యీ యాఖ్యానము ప
ర్వపుదినమున భక్తిఁ జదువువారలు విను పు

---

7. సుఖము - ఉ. ఔ. ల. 8. పాటింతు, గావింతు - అనిపాఠములు
359. 1. లాచరింప - ఎ. క. ఖ. వ. 2 గొల్చి - వ. పి. స 3. గురుబంధులకుం - వ. పి. శ. ష. స.
361. 1. అన్ని - అ. ఈ. ల. 2. నర్వంబుదాని - కొన్నిప్రతులు.
362. 1. రెంటను - ఆ. బ ఖ. వ 2. యొసగు - ఉ. ఖ. చ.

న్యాపురుషులును నాయుక్తి
లపరిమితము [1]పొంది యమరు లగుదురు పిదపన్.

864. వ. అనిన విని ధర్మనందనుండు సర్వశాస్త్రసారంబై శ్రేష్ఠం బగు నర్థమేయం
బెయ్యది పితామహ యనుగ్రహింపు మని యభ్యర్థించిన నాపగేయుండును
కృపావిధేయుండై నారదపుండరీకసంవాదం [1]బాకర్ణింపుము దాన నీయడిగిన
యర్థంబు దెలియును దీరపరుండును జపతత్పరుండును బుండరీకాభిధానుండు
నైన మహాద్విజుం డొక్కయెడ నారదమహామునిం గని భక్తిం బ్రణతుండై
యిట్లనియె.

—: నారదపుండరీకసంవాదం బనుపరమేతిహాసప్రకారము :—

సం. 13-196-1 (కుంభ)

865. సీ. పరమేష్ఠి చెప్పిన పరధర్మం బల్ప
భణితి మహార్థంబు భవ్యమతికి
శ్రోతవ్యమును బరిజ్ఞాతవ్యమును దాని
విను ప్రకృతికిఁ బర మనఁగఁ బడిన
యిరువదే నగుతత్త్వ మరయంగ జీవాత్మఁ
డాతండ సర్వ భూతాత్మకుండు
నరుఁ డన వెలుఁగు నప్పురుషునివలనన
కలిగి నారము లన వెలసినట్టి
తే. యవ్యక్తతత్త్వంబు లతనికి నయన మగుట
నతఁడు నారాయణుం డన నతిశయిల్లు
విశ్వమును దనయందు యావిర్భవింప
విలయమొంద నద్దేవుండు విభుతఁ బొల్చు.

866. క. పరమబ్రహ్మం బనఁగాఁ
బరతత్త్వంబనఁగ బరమపద మనఁగా నీ
శ్వరుఁ డన విష్ణుఁ డన జగ
ద్భరి[1]తత నారాయణుండు దా వెలుఁ గొందున్.

863. 1 పొంది యునికియమరును పిదపన్ - ల.
864. 1. బనునితిహాసం బాకర్ణింపుము - ల.
866. 1. తుడు - తా. ప.

867. ఆ. అతఁడు వాసుదేవుఁ డన నాత్మ యనఁగ వే
దాంతవాక్యబోధ్యుఁడై వెలుంగు
[1]నరున కప్పదములు నామాంతరంబు ల
ర్థాంతరంబు లేనియట్టి వనఘ.

868. ఆ. సర్వశాస్త్రవాక్యసమితి నాలోకించి
మఱియు దృఢవిచారమహిమఁ దెలిసి
నిశ్చయింపఁ బడియె నిద్ధ నారాయణు
నెపుడుఁ దలఁప వలయు నిది యొకండ.

869. వ. కావున.

870. క. పరమానుష్ఠేయం బిది
నరోత్తమా నీవు నెపుడు నారాయణుఁ ద
త్పరతఁ దలఁపు చొరకు సవి
స్తరశాస్త్రార్థముల క్రిందుఁ దలపోఁతలకున్

871. క. విను మొకయించుక సేపై
నను నారాయణునిఁ దలఁచినను సుగతిఁ గనున్
మనుజుఁ డనిన మది నెప్పుడు
నునిచినయాతనికి బ్రాఁతే యుత్తమధిషణా

872. క. [1]ప్రణవయుత నమో నారా
యణాయ యను నక్షరాలి [2]నంతప్రాప్తి
క్షణమున జిహ్వకుఁ దెచ్చినఁ
బ్రణవార్థం బైన [3]పదముఁ బడయుదురు నరుల్.

873. క. నారాయణపదవాచ్యం
బారయ బ్రహ్మంబు దాని ననిశము వినియుం
సారమతిం దలఁచియు నిం
పారఁగఁ బొగడియు రమించు టతులహిత మగున్

---

867, 1. నరునకప్పు — అ, ఈ, ఉ, ఊ ఎ ఓ, చ పి శ ష, నరులకప్పు - వా. కొన్ని ప్రతులు.
872, 1. ప్రణవయుతనమో - అ. ఈ ఊ. ఎ ఓ. ఔ, క. చ; ప్రణుతయగు - వా. పి శ. ష. కొన్ని ప్రతులు. 2 నంత్యప్రాప్తి - అ. ఓ క ష. 3. పరము - ల.

374. తే. [1]విందు నారాయణపరాయణుండు పాత
కముల గెలిచి వెలుంగుచు కాదు తన్ను
నాశ్రయించినవారికి నతుల మైన
వెలుఁగు నొసఁగంగఁ జాలుట[2] వేధచేత.

375. క చతురాశ్రమములలోపల
నతులమతి యెందు నిలిచి నతనికి భక్తిం
మతిఁ గేశవుఁ గూర్చి స
ద్గతి పెఱకర్మముల నేల కల్గఁగ నేర్చున్.

376. క. కను టరిది యొండు[1]మెయి వి
ష్ణుని భక్తిఁ గనుము నీవు సువ్రత యద్దే
వుని వినుము భక్తవత్సలుఁ
డనునామము గలిమి దృశ్యుఁ డగు భక్తులకున్.

377. క. అని నారదుఁ డుపదేశిం
చిన [1]నానైష్ఠికుఁడు నియతచిత్తుండై వి
ష్ణుని నర్చించు సభక్తిక
మనవిశేషమున నెపుడు మనుజాధీశా.

378. తే. శంఖచక్రగదాధరు [1]శార్ఙ్గిఁ బుండ
రీకదళసన్నిభాక్షుఁ గిరీటకుండ
లాభిరాము శ్రీవత్ససంశోభితుఁ
గౌస్తుభోజ్జ్వలుఁ గలలోనఁ గను నతండు.

379. క. చిరకాలంబున సాక్షా
త్కరణంబును గల్గు దానఁ గానని[1]పదముం
గోరయనిశుభముం గలవే
కురువర నీవు నతిభక్తిఁ గొలువుము విష్ణున్.

---

374 1 విందు - ఖ. ల 2 వివేకచరిత - ఓ.
376. 1 మై - కొన్నిప్రతులు.
377. 1. నాతండధిక వినయచిత్తుండై - ల.
378. 1. చారుపుండరీక - అ. ఇ. ఈ ఎ ఏ. క. ఐ, ఖ, ల
379. 1 పదమున్ - ఊ. న.

880. క. అనిన విని హర్ష పూరం
బునఁ జిత్తము దేల ధర్మపుత్త్రుం డాశం
[1]తనుసుతునకుఁ బ్రణమిల్లెం
దనువునఁ బులకాంకురప్రతతి [2]జాదుకొనన్.

881. వ. ప్రణమిల్లి యతనితో దానప్రియ వచనంబు లెంటియందును నధిక రంజనం
బెయ్యది చెప్పవే యనుటయు నద్దేవవ్రతుం డన్నరదేవోత్తమున కిట్లను రెండును
మంచి తెలుంగుల యొపెరిచందం బెఱింగి నడుపునది దానంబు రంజకం బగుటం
దెలుస వలవదు సామవాదంబు [1]గుణంబు దెల్లం బగునట్టి యితిహాసంబు వినుము
చెప్పెద బుద్ధిసంపన్నుం డగు నొక్క బ్రాహ్మణుండు విజనం బగువనంబునం
గార్య[2]వశంబున మెలంగఁ దన్మాంసం బాహారంబు గొనుట కయి దారుణుం
డగు దానవుం డతనిం బట్టికొనిన సాంత్వనభాషణంబులు ప్రయోగించువాఁ
డయి యవ్విప్రుండు గలంపయుఁ గొందలంబును లేనిడెందంబుతో నద్దానవు
నాననంబు గనుంగొనిన నాధైర్యధుర్యుం గనుంగొని తదీయం బగు నదాత్త
త్వంబునం జిత్తంబు రంజిల్లి యద్దనుజుం డద్ధరాదివిజునితో మఱియుం బగు
ప్రశ్నంబునకు సదుత్తరం బిచ్చితేని నిన్ను నిడిచెద ననుపలుకు పలికి తనశరీరంబు
డయ్యుటకు వెలుకం బాఱుటకుం గారణం బేమి యని యడిగిన నమ్మహీ
సురవరుండు [3]వేగిరపడక కొండొకసేపు విచారించి మహాపురషా నీయట్టి
కృపాపరుం డడుగం దోఁచినతెలుంగునం జెప్పుట మేలు కాదె యాకర్ణింపు
మని [4]సౌపుఖ్యంబు నొంది.

---

880. 1. తనసుతు - ల శ. పెక్కుప్రతులు "శంతను" శబ్దము కొంతవిచారణచేయదగియున్నది
మహాభారత నామానుక్రమణికయందు ఈశబ్దము 'శాంతను' అనియున్నది. తెనుగులో
ఇది ఆదిదీర్ఘముగా లేదు.అష్టేవిషంటువు నందిది శంతను అనియేయున్నది శంతనుని
కుమారుడు శాంతనవుడు అనగా భీష్ముడు తెనుగు నందిది ఉకారాంతమా అకారాంతమా
యని సందేహము కలిగించుచున్నది. ఉకారాంతమైనచో శంతనుడు, శంతనవు అని
రెండురూపములు రావలసియుండగా శంతనుడు అనురూపమే కన్పించును. శంతనువు
అనురూపము లేమ మను పటు, శబ్దములకు 'దుక్'రాదు అట్లే శంతను శబ్దమునకు
'వు' వర్ణాంతత లేదని యెంచవలెను, 2 పాదుకొనన్ - అ. ఈ ఏ క చ.

881. 1 కరుణంబు - ఓ. ష. న 2. సంశయంబున - ల 3. వెరగుపడక - కొన్నిప్రతులు
4. సఖ్యంబు నొంది -ల

882. సీ. చుట్టాల నీ దగుచెట్టతనంబునఁ
బాసి పశ్చాత్తాపపరుఁడ వగుట
లేమి గల్గిన దుర్లభామేయధనములు
గోరుట మొగమోటగూరి యొరుని
చేఁ బడ్డ నిన్ను గెల్చితి నని యాతఁ డు
బ్బుట కృప నుపకారమునకుఁ బాత్ర
ముగ నీవు చేసిన పురుషుఁ డామేల్ దన
యలఘుపౌరుషమునఁ గలిగె ననుట

ఆ. కుమతిజనులు నీదుగుణములు గొనియాడ
సిగ్గుపడుచు బుధులచేతఁ బొగడు
గాన మరుగు చునికి వీనిలో నొక్కటఁ
గార్శ్యపాండురతలు గలుగు [1]ననఘ.

883. వ. అని వెండియు

884. సీ. ఉచితంబుగా నెఱి నుగ్గడించినమాట
సభ యియ్యకొనమి వల్లభకు నీదు
తప్పు తెల్లం బయి తాపంబుఁ బొందంగఁ
దేర్పంగ నేరక త్రిప్పికొనుట
నీసొమ్మునకు నొరుఁ డాసించుచుండంగ
దానికిఁ దగరత దలఁచు చునికి
దులువ పిమ్మట నిన్ను దూషించుపలుకులు
[1]కులజులు నిజముగాఁ గొనుట నీవు

తే. మానుషంబుల నడపంగ మాయకానిఁ
గాఁగఁ జెలులు గాంచుట వగకలిమిపేర్మి
దాని వెలిపుచ్చ [2]కోపమి వీన నొకటఁ
గార్శ్యపాండురత్వంబులు గలుగు ననఘ.

885. వ. అని మఱియును

---

882. 1. నధివ-౦
884. 1. జనములు - కొన్ని ప్రతులు 2. దోపమిదీన నొకట - ౦.

886. సీ. భార్యపుత్త్రికుఁ దల్లిఁ దార్యవృత్తము లేమిఁ
గ్రుమ్మరించుట జనకుండు దల్లి
సోదరుల్ నవయుట యుర్వీసురుని గోవుఁ
దోలుమేనఁ జంపుట దుష్టబుద్ధి
భూసురదేవార్థములు పుచ్చికొనుట య
ర్థము గోలుపోక బాంధవులచావు
బాలికు మొగమోటఁ బనిగొనఁగాఁ దన
యశమున కంతగాయంబు గలిమి

తే. పెద్దకాలంబు యత్నసంపీడ నొంది
చెల్లఁజేసినపని యొక్కబొల్లపగతు
చే నసిద్ధతఁ బొందుట వీన నొకటఁ
గార్శ్యపాండురత్వంబులు గలుగు ననఘ.

887. క. అని యి ట్లేర్పడఁ జెప్పిన
విని యద్దనుజహరి మెచ్చి విడిచెం గుంతీ
తనయాగ్రజ భూసురసాం
త్వన మిట్టిది యడుగు మింక [1]వలసినదానిన్.

888. వ. అనిన నజాతశత్రుండు గంగాపుత్త్రువదనంబునం జూడ్కి నిలిపి [1]మోడ్చిన కరంబులు శిరంబునం గదియించి

889. తే. మమ్ము సంసారవార్ధి [1]పారమ్ముఁ జేర్చు
యానపాత్రంబు నీకరుణాతిశయము
యఘలకల్మషములఁ బాపునట్టిదాని
వినఁగఁ గోరెద నొకపురావృత్త మనఘ.

890. క. ముని మనుజపతులసన్నిధి
నిను శ్రీకృష్ణుండు మాననీయచరిత వే
డ్క నుపాసించుచు నున్నాఁ
డ నుత్తమప్రీతి [1]దాని నాకర్ణింపన్.

---

887. 1. వలచిన వానిన్ - కొన్నిప్రతులు.
888. 1. మొగిడ్చిన - ల.
889. 1 తీరమ్ము - ఈ. ఏ. జ. భ.
890 1. నీత దాకర్ణింపన్ - ల కొన్నిప్రతులు.

891. క. సమ్మోదమ్మున నేనుం
దమ్ములునుం దేల సత్కథాకథ[1]నపర
త్వ మ్మాదరింపు మునివ
ర్గమ్ము నృపచయమ్ముఁ బులకరాజి వహింపన్

892. వ. అనుటయు భీష్ముండు.

893. క. పుణ్యం బగునితిహాస ము
గణ్యగుణా నీకుఁ జెప్పఁ గను [1]సుకృతముఁ గా
రుణ్యనిధి సర్వలోకశ
రణ్యుఁడు గృష్ణుండు విను వరంబుఁ బడసితిన్

894. క. పారాశర్యాదిమునులు
నీరాజన్యులను వినికి యెంతకు లే దీ
గారాము నాకుఁ బర మో
దారసదావాప్తి గాదె ధర్మతనూజా.

895. వ. నీయడిగిన యట్టిదానికి నొక యితిహాసంబుగల దది యుమామహేశ్వరసంవాదం బనం బరగుఁ గౌరవోత్తమా యప్పురావృత్తంబు ప్రవర్తించుటకుం గతంబైనకథ మున్ను సెప్పి మఱి దానిం జెప్పిన నొప్పి యుండుం గావున నప్పరిపాటిం జెప్పెద నవధానపరుండ వయి యాకర్ణింపు మని పలికి హరికిం బరమభక్తిం బ్రణమిల్లి యప్పాండవముఖ్యు[1]ముఖచంద్రచంద్రికం దనవిలోచనచకోరంబు లాన నమ్మాననపతికి నమ్మాననీయమతి యి ట్లనియె.

—: భీష్ముఁడు ధర్మజునకు శ్రీకృష్ణుని చరిత్రంబు చెప్పుట :—

సం. 19-203-1 (కుంభ)

896. క. తనయునిఁ బడయుటకై తప
మొనరింపఁగ రుక్మిణియు సముత్సుకవృత్తిం

---

891. 1. నమునన్ మమ్మాదరింపు - ల.
893. 1. మమతలు కారుణ్య - ల.
895 1. ముఖచంద్ర చంద్రి - ల, ముఖచంద్రి - వా. పెక్కుప్రతులు

దనతోఁ దాఁ దుహినాద్రికిఁ
జనియెం గృష్ణుండు మునులు సంతస మందన్.

397. వ. ఇట్లు చని ద్వాదశవార్షిక వ్రత[1]క్లిష్టుండై యున్నకృష్ణుం గాన మునీంద్రులు నారదపర్వతవ్యాసవాల్మీకిదేవలకాశ్యపప్రభృతులు శిష్యవర్గంబుతో వచ్చిన వారలం బాద్యాసనాదిసముచితార్చనంబుల సంభావించిన వార లద్దేవునిం బరివేష్టించి పుణ్యగోష్ఠి నడపుచున్న సమయంబున.

398. తే. అతని ముఖమున వెడలి మహాగ్ని యమ్మ
హీధరము విపినంబుల నేర్చెఁ బక్షి
మృగయుతంబుగ సిద్ధసాధ్యగణములు
సమాకులత్వంబుఁ బొందఁ బెల్లడరి యధిప.

399. క. ఆ కృష్ణుఁడు నిజసౌమ్యా
లోకనమున నాశిఖని [1]మలుఁగఁ జేసెం బూ
ర్వాకారత నవ్వనము ని
రాకులతం బొల్చె నది మహాద్భుత మయ్యెన్.

400. తే. దాని కమ్మును లెల్లఁ జిత్తమున భయము
విస్మయంబును బెనఁగొన వెఱఁగుపాటు
గదిరి చిత్రరూపంబులకరణి నుండ
వారిఁ గన్గొని రుక్మిణీవల్లభుండు.

401. వ. మీ రీయనలంబు తెఱం గేమిగా [1]నెఱింగితి రున్నరూ పెఱింగింపవలయు ననుటయు వారలు సభక్తికంబు లగు చిత్తంబులతోడ.

402. క. దేవా విశ్వము గలుగుట
నీవలనన యడఁగుటయును నీయంద భవ

---

397. 1. నిష్ఠుండైయున్న - ల. పీ శ. ష. స. కొన్నివ్రతులు

399. 1. నులుగ - శ. ర; ములుగు- సూ. ఈపాఠమున వాక్యార్థమునరిగా అన్వయించుటలేదు.

401. 1 భావించితిరి యున్నరూపు - ల.

ద్భావాధీనము సకల
స్థావరజంగమసమాహిత[1]త్వం బెల్లన్.

403. తే. నీవు మమ్ము బోధింపఁగా నేర్తు గాక
యుమ్మహానలస్ఫురణంబు నిట్టి దనఁగ
నేము నేర్తుమె యేమియు నెఱుఁగకునికిఁ
గాదె నివ్వెఱపడితిమి కమలనాభ.

404. వ. అనుటయు భవదీయచేతఃప్రసన్నత[1] గాదె జగంబుల వర్తనంబులకు నాధారంబు.

405. క. కావున మీకుం బ్రియముగ
నీవహ్ని తెఱంగు దెలియ [1]నెఱిఁగించెదఁ జి
త్తావిలత విడువుఁ డని కమ
లావరుఁ డిట్లనియె వారలకుఁ[2] గురువర్యా.

406. క. ఒకదానవుఁడు జగన్నా
శకుఁ డుత్తలిఁ గలఁడు వానిఁ జంపుట కేఁ బూ
నక యునికి గలిగె వాఁ డ
స్త్రకళావిదుఁ డగుట నాకతంబున నగుటన్.

407. క. కడుఁ గ్రొవ్వి వాఁడు లోకము
నుడుకులఁ బెట్టంగ [1]విసివి యుగ్రతపమునం
గొడుకుఁ బడసి యద్దనుజునిఁ
బొడవడఁగింపం దలంచి భూరివ్రతమున్

408. చ. నడప మదాత్మ యగ్ని యయి నావదనంబున నిర్గమించి యె
క్కుడు[1]వడి పద్మగర్భుకడకుం జనె నమ్మహితుండు మన్మథుం

---

402. 1. తంబెల్లఁగనన్ – అ ఈ
404. 1. తచూపె – ల. శ ష. కొన్నిప్రతులు.
405. 1. నేఱెప్పెదఁజి – పెక్కుప్రతులు. 2. కువంశవరా – పెక్కుప్రతులు, కువరదుంద్రె – ఉ. ల, కుమధురోక్తిన్ – ఊ. కుధీరవరా – ఓ.
407. 1. గదిరి, గవిసి – అనిపాఠములు
408. 1. పతివర్మ – శ. ష కొన్నిప్రతులు

గొడుకుగఁ బంచివే తను మగుడ్పఁగ వచ్చెఁ గడంగి పోవున
ప్పుడు వన మేర్చె నేను గృపఁ బూర్వవిధం బొడఁగూడఁ జూచితిన్.

409. వ. ఇట యద్దహానంబు తెఱఁగని చెప్పి యప్పరమపురుషుం డమ్మునివరులతో మఱియును.

410. సీ. లోకత్రయంబున మీకు నవిదితంబు
లేదు త్రికాలసంవేదులార
యుత్తమంబగుపురావృత్తంబు చెప్పి కృ
తార్థుఁ జేయుండు నన్ననిన వారు
సవినయంబుగఁ గృతాంజలు లయి మ మ్మింత
పెద్ద సేయుదె నీవు పెద్దలకును
బెద్ద వయత్నసంభృతజగత్త్రియుఁడవు
విశ్వప్రకార[1]సంవిదుఁడ వేము

తే. నీయెఱుంగని యితిహాస మేయుగమున
నెఱిఁగి చెప్పుదు మనవుడుఁ జిఱుతనగవు
మోమునకుఁ జెన్ను సేయ నమ్మురహరుండు
వారలకు నిట్టు లనుఁ గురువంశవర్య.

411. క. మానుషయోని జనించితిఁ
గాన మదీయ మగుబుద్ధిగౌరవము దదీ
యానుగుణత్వోపహితము
గా నెఱుఁగుఁడు మీరు సెప్పుకత విను [1]టపదే.

412 చ. అనుటయు వార లందఱు బ్రియంబున దానికి నియ్యకొన్న నె
మ్మనములతోడ నీపనికి మాన్యచరిత్రుఁడు నారదుండ త
క్కిన పెఱవారు చాలరు ప్రకీర్త్యవివేకుఁడు కృష్ణుఁ డర్థితో
వినఁగఁ బురాతనంబయినవృత్తము నమ్ముని చెప్పటొ [1]ప్పగున్

410. 1. శసంవిదుఁడ - కొన్నిప్రతులు, రైకవిదుర వాని - ల.
411. 1. టరుదె - కొన్నిప్రతులు.
412. 1. టొప్పెడున్, దొప్పెడున్ - అనిపాఠములు

413 చ. అని తగ నేకవాక్యతఁ బ్రియంబున నాతనితోడ నీవు మున్
కనినది విన్నయట్టిది ప్రకామకుతూహలచిత్తుఁ డైనకృ
ష్ణుని వినిపింపు నావుడు మనోజ్ఞకథాకథనంబునందు వే
డ్క నిగుడ నమ్మునీంద్రుఁడు వికాసము[1]నన్ మొగ ముల్లసిల్లఁగన్.

-: ఉమామహేశ్వర సంవాదంబను నితిహాసము :-

సం. 13-265-1 (కుంభ)

414. క. నారాయణసౌహార్దో
దారత్వవిభూతి మున్న తనకుఁ గలిమి న
న్నారాయణుని మనోరథ
మారం [1]బూరించె శంకరాంబికలకథన్.

415. వ. అ త్తెఱంగు వివరించెద నట్లు సమస్తసంయమిసంఘంబును బ్రస్తుతిపూర్వకం బుగా నియోగింపం బ్రియంబునం బురాతనకథా కథనంబునకుం బూని యద్దేవముని యద్దేవకీనందనునకు వందనం బాచరించి తద[1]భివందనంబు వడసి యవ్విభున కి ట్లనియె.

416. తే. తీర్థభజనంబునకు నెందుఁ దిరుగుచుండి
యుత్తరాశానగంబున కేను వచ్చి
కంటి రమణీయ మగుకేళి[1]కావనంబు
సకలతరువల్లికగుల్మచారు[2]తలము.

417. క. కోకిలకులగంధర్వా
నీకధ్వను లెనసి చెరసి నిగుడఁగ నమరీ
లోకభ్రమరీమండలి
కా[1]కలకలనాదములును గలసి చెలంగన్

413. మోమునదొంగలింపగన్ - ఊ. చ.
414. 1. బూజించె - ల. కొన్నిప్రతులు,
415. 1. దభివాదనంబు - స, దనుమతంబు - ఎ ఒ. ఓ. క.
416. 1 కాననంబు - ల. 2. తరము - పెక్కుప్రతులు.
417. 1 కలనాదముల పొందు గలిగి చెలంగన్-కొన్నిప్రతులు

418. వ. అప్పుణ్యవనంబునం గనక[1]స్థలంబున శార్దూల చర్మ వసన భుజగాభరణ భసితాంగరాగ [2]విరచితాలంకార చారుదివ్యదేహుం డగు మహాదేవుండు సురసిద్ధసాధ్య విద్యాధర మునిపుంగవ భూతగణపరివృతుం డయి యున్న యప్పేరోలగంబున నేనును సముచితప్రకారంబున నయ్య[3]నిరూపణీయప్రకారుం గొల్చి యుండితి నట్టిసమయంబున.

419. సీ. పుణ్యాంగనాకారములు దాల్చి పుణ్యన
దీనివహంబులు దిశలు గొల్చి
చనుదేర శంకరసదృశపరిష్కార
కల్యాణతనువైన గౌరి వచ్చి
వెనుకదిక్కున మెల్లునఁ జేరి మోమున
కలఁతి నవ్వునుమిడిచెలువు నొసఁగఁ
దమ్మితేకుల నుల్లస మ్మాడు తనమృదు
కరయుగ్మ[1]మునను శంకరునినేత్ర
ఆ. యుగ్మమల్ల మూసి యున్నంత లోక మ
నర్కచంద్రతారకాగ్నిహీనమై మ
హాంధకారమగ్న మగుటయు సంక్షోభ
మందె భూత[2]సముదయంబు లెల్ల.

420. ఉ. అప్పుడు ఫాలలోచనము నప్పరమేశుఁడు విచ్చె విచ్చినం
గప్పెఁ దదగ్నిజిహ్వలు నగం బఖిలంబును గౌరిదేవి య
ట్లొప్పమి తండ్రికైనఁ గని యుల్లము బెగ్గిల నీశునంభ్రములం
గప్పఁగ మౌళిభూషణముకాంతి ప్రణామము సేసెఁ జేసినన్.

421. ఆ. హరుఁడు కరుణఁ జూడ నాహిమవన్నగ
దాహ ముడిగి శోభితత్వ[1]మొలసె
నార్య పరమవిస్మయముఁ బొంది యాసర్వ
భువన[2]కర్తతోడ సవినయముగ.

---

418. 1. తటంబున - చ. 2. విలసితాలంకార - ఎ ఐ. ఖ 3. అనాద్యవ్యక్తరూప రమణీయ - శ ష స
419. 1. కమునశంకరుని - పెక్కుప్రతులు. 2. సంచయంబుల్లె - ల.
421. 1 మొందె - ఉ ఔ. 2. భర్తతోడ - ల పెక్కుప్రతులు

422. సీ. నిటలంబునకను దెఱచుటకుఁ గారణ మేమి
సర్వేశ యిది రహస్యంబు గాక
యున్నఁ జెప్పవే యన్న నద్దేవుండు
కాంత నీ కెఱిఁగింపఁ గానియట్టి
పని యెందుఁ గల్గునే వినుము లోకాత్మక
త్వము నాకుఁ గల్గుటవలనఁ జేసి
నన్నేది వొందిన నన్నిలోకంబుల
నది వొందుఁ గాన నాయంబకములు
. నీవు మూయంగఁ దిమిరంబు నిఖిలలోక
చయముఁ గప్పిన భూతముల్ భయముఁ బొందె
నీకరంబులు ద్రోవక చీఁకటియును
దెఱచుటకు ఫాలనేత్రంబు దెఱవ వలసె.

423. వ. అనిన విని యంబిక తనకు నడుగవలయునట్టివి యడుగుటకు [1]నది యవసరంబుగాఁ గనికొని యక్కపర్ది కిట్లనియె.

424. క. నాలుగుముఖములు నీకు
న్ఫాలనయన కలుగఁ గారణం బేమి మధు
శ్రీలాలిత్యాస్పదవా
క్యాలికలనమున నాకు నానతి యీవే.

425. వ. అనిన విని యమ్మహాదేవికి న[1]ద్దేవుం డిట్లను దైత్యులు సుందోపసుందు లన నిర్వురు[2] గలరు వార[3]లవార్య భుజవీర్యశౌర్యసంపన్నులు నస్త్రశస్త్రవిద్యులునై యుండుదురు వారలవినాశంబునకై మయుండు లోకంబులం గల[4] యొప్పులం దెల్ల నుత్తమసారంబులు దిలప్రమాణంబు లాహరించి యొక్కకామినిం గావించి తిలోత్తమ యనుపేరిడి నాకడకుం దెచ్చిన నచ్చెలువ నాకుం బ్రదక్షిణంబుగా వచ్చునెడ నే నిది దేవకార్యంబు సేయ [5]నోపుఁ బో మ్మను తలంపుతో నత్తరుణి తిరిగిన దిక్కుదిక్కున నొక్కొక్క మొగంబు దాల్చి దానిం బరీక్షించితి నాఁటం [6]గోలెఁ జతుర్ముఖుండనై యుండుదు.

---

423. 1. నిదినమయంబని-పీ. శ ష స

425. 1. నమ్మహాదేవుడిట్లను-అ. ఈ; నద్దేవదేవుడిట్లను-ఉ. ఖ. పీ. శ ష 2. రుద్దైత్యులు గలరు - ఇ ఏ ల పీ శ ష. 3 లవార్యశౌర్యులు భుజవీర్య సంపన్నులు - శ క. 4. యొప్పిదం బులందెల్ల - ఊ. 5 నోపు నాకోయను - పీ శ ష. 6. దొడంగి -- కొన్నిప్రతులు.

426. చ. అన విని గౌరి నీకు భువనాధిప కంఠమునందుఁ గప్పు గ
ల్గిన కత మేమి నాకు నెఱిఁగింపుము నావుడు దేవదైత్యు లం
బునిధి సుధార్థమై తరువఁ బుట్టి విషంబు త్రిలోకభీకరం
బనితరసాధ్యమై యొదవె[1] నత్తఱిఁ దాల్చితి దానిఁ గుత్తుకన్.

427. తే. అట్లు కంఠంబునందు మహావిషంబుఁ
దాల్పఁ నీలతగల్గిన దానఁ జేసి
కమలజాది[1]సురులు నీలకంఠుఁ డనుచు
నన్నుఁ గొనియాడి రప్పుడు నలినవదన

428. వ. అని చెప్పి శంకరుం డింక నేమి యడుగ వల తడుగు మనుటయుఁ[1] బార్వతి పినాకం బెల్లయాయుధంబులకంటె మెచ్చి పట్టుదు దీనికిం గతం బెయ్యది యని యడిగిన నామ్మృడుం డామ్మృడాని కి ట్లనియె.

429. సీ. ఆదియుగంబున నబల కణ్వుం డను
సంయమి తపము నిష్ఠానియూఢి
మెయిఁ జేయఁ జెరిఁగె వల్మీకంబు తనువు ము
[1]నుంగ నప్పుట్ట వేణువును బుట్టె
విను లోకసామాన్యఘనత [2]గాకుండ మ
హోద్భుతాయామంబు నధికమైన
పరిణాహమును గల్గె బ్రహ్మ యమ్మునికిఁ బ్ర
త్యక్షుఁడై వర మిచ్చె నతనిమీఁదఁ
ఆ. జెరిఁగి యున్న వెదురు గర మర్థిఁ దాఁ బుచ్చి
కొని జగద్ధితంబు గౌరి చేసె
నాకు [3] విష్ణునకుఁ బినాకశార్ఙ్గము లగ
ఖండమున నొలర్చె గాండివంబు.

---

426. 1. పునత్తరి - కొన్నిప్రతులు.
427. 1. సురలు - ఇ ఈ ఎ. ఏ ఐ. ఒ. ఔ. క. ఖ. శ.
ఇది సంస్కృత సమాస గతమై యుండుటచేత కమలజాదిసురులు అనియేకావలెను 'సురలు' అనుట విచార్యము.
428. 1. యుఁ బినాకంబెల్ల-వా. పీ శ ష; యుఁ బార్వతి పినాకంబెల్ల - పెక్కుప్రతులు.
429. 1. నుగగప్పుటయునువేణువును - స. 2 గాకందు - పెక్కుప్రతులు. 3. గృష్ణునకు - ం.

480. వ. ఇవ్విధంబున విండ్లు మూఁడు గావించి లోకహితం బాచరించి యవ్విరించి యమ్మూఁడవవిల్లు దాఁ గైకొని తనలోకంబునకుం జనియె నిది పినాకంబు సంభావనీయంబైన తెఱం గని చెప్పిన.

481. క. విని గిరితనూజ పెఱవా
హనముల నొల్లక వృషంబు నఖిలేశ్వర నె
మ్మనమునఁ గైకొని యెక్కుదు
వినఁగా నే వలతుఁ జెప్పవే [1]కారణమున్.

482. వ. అనిన నద్దేవుఁ డమ్మహాదేవి కి ట్లనియె.

483. సీ. హిమవన్నగంబునం దేను లోకహితార్థ
మైన మహాతప మాచరింప
గోవులు చుట్టుఁ దేఁకువ [1]సెడి తిరిగి నన్
సంకటపెట్టినఁ బంకజాక్షి
కోపించి చూడ సంతాపాకులత్వంబుఁ
బొందె గోకుల మరవిందభవుఁడు
నమరులుఁ జనుదెంచి ప్రార్థించి వృషముఁ గా
నిక యిచ్చి కరుణ జనింపఁ బలికి
తే. నాకు గోపతి యనియెడు నామ మిచ్చి
రపుడు [2]గోబాధ మాన్చి రయ్యమలవృషము
వాహనముఁ గేతువును గా శివప్రచార
మాచరింతు నెల్లెడ నది యాది గాఁగ.

484. వ. అనుటయు నంబిక యప్పరమేశుతో నీవు పరమశుచులును రమణీయంబులు నగు నివాసంబుల వసియింపక యశుచియు గేశాస్థికపాలదుర్గంధదుర్దర్శంబు నైనశ్మశానంబున నునికిఁ గతం బేమి యనిన నతం డిట్లనియె.

-: శివుఁడు పార్వతికిఁ దనశ్మశానవాసతకుఁ గారణంబు చెప్పుట :-
సం. 13-207-1 (కుంభ)

485. ఉ. క్రూరపుభూతముల్ జనుల ఘోరవిధంబుల ముట్టి యెప్పుడున్
మారణ మాచరింపఁగ సమస్త[1]జనంబులు నాశమొందఁగా
వారిజసంభవుం డెఱిఁగి వచ్చి ననుం దగఁ గాంచి తత్ప్రతీ
కారము సేఁతకై వినయగౌరవ మొప్పఁగ వేఁడె వేఁడినన్.

---

481. 1. కరుణమెయిన్ - ఆ. ఉ ఔ.
483. 1 లేకచేరినన్ - ఇ ఏ వీ శ ష. 2 గోగణముబ్బెనయ్యమల - ల.
485 1 జగంబులు. - అ ల

436. వ. [1]నిశ్చితంబుగా నొక్కెడ నుండి లోకంబులు రక్షింపవలయు నని తలంచితి నట్టియెడ.

437. తే. మోక్షపరులు శుచి[1]స్థానముగఁ బ్రశంస
సేయుదురు విజనత్వవిశేష మెఱిఁగి
కాన [2]యింపై శ్మశానంబు మానసమున
నొలసెఁ గావున నయ్యెడ నునికి గలిగె.

438. చ. అచటన యుండి లోకముల నన్నిటి నాత్మఁ [1]దలంచి రక్ష సే
యుచు విహరింతు భూతచయ మొక్కటఁ గూడి చరించుచున్కికిం
బ్రచురకుతూహలుండ నయి రాగముఁ బొందుదు నట్లు గాన నా
[2]కచటు నివాస మయ్యె విను మన్యతలంబులు దానిఁ బోలునే.

439. తే. అనిన భసితాంగరాగంబు నస్థిఘనధ
రాభరణములుఁ బరశుశూలాయుధములు
నై మహోగ్రత భీకర మైనరూప
మభవ యేల కైకొంటి నీ వనియె గిరిజ.

440. వ. అనుటయు నమ్మహేశ్వరుం డాపరమేశ్వరితోడ.

441. సీ. లోకస్వరూపంబు లోలాక్షి రెండు వి
ధమ్ములు శీత [1]ముష్ణమ్ము నాఁగఁ
జను నివి రెంటను సకలంబు గ్రథిత మై
యుండు సౌమ్యాగ్నేయ యోగకలిత
మఖిలజగంబు సౌమ్యము విష్ణుఁ డాగ్నేయ
మేను [2]వహింతు మయ్యురుదెఱంగు
[3]లెనయుటఁ గొని భరియింతు నీవిశ్వంబుఁ
గావున నాగ్నేయభావ[4]యూధ

---

436. 1. అదికారణంబున నయ్యెడ నునికి గలిగె - అ.
437. 1. స్నానముగ - అ. రు. ఏ. ల. 2. యిట్టి - ల
438. 1. నెరింగి-కొన్నిప్రతులు. 2. కచట - కొన్నిప్రతులు
440. 1. తోనిట్లనియె - అ.
441. 1. మూగనమ్ముమ్మునా - అ ఎ 2. ధరింతు - పెక్కుప్రతులు 3. నెనయుట - కొన్ని ప్రతులు

తే. ద్యైన యాకృతి లోకహితాకారముగ వ
హించినాఁడ నిం కెయ్యది యీవు నన్ను
నడిగె దడుగుము నావుఁడు నార్య సోముఁ
దలఁ బ్రియంబున నేటికిఁ దాల్చె తనియె

442. చ. అనవుఁడు దక్షుయజ్ఞమున కల్గిననాఁడు సురాలి కేను భీ
డన మొనరించుచోట వికటంబుగ సోముని మేను ద్రొక్కఁగా
నను [1]శరణంబు వేఁడిన మనంబున నక్కటికంబు [2]పుట్టి చే
సిన దురితంబు సోము నిటు సేయక పో దని మౌళిఁ దాల్చితిన్.

443. చ. అన విని కొల్చియున్న మును లందఱు నీకు దయావిశేషము
న్మనముల మెచ్చి పొంగి యఖినందనపూర్వము గాఁగ భక్తియున్
వినయము నుల్లసిల్లఁ బదివేల విధంబులఁ బ్రస్తుతించి ర
య్యనుపమధాము గౌరి సమయం బిది నా కని మోడ్పుఁ [1]గేలితోన్.

444. తే. లోలలోచనదీప్తులు బాలచంద్ర
భూషణుని[1] వదనంబునఁ బొలయ మునుల
మానసంబులు సంప్రీతి నూన సాంత్వ
[2]నస్వరంబున ని ట్లను నలిన[3]నాథ

445. క. వర్ణాశ్రమధర్మము లఖి
వర్ణింపుము వేదనిరతవత్సల యవి నా
కర్ణములతో నఖలజన
కర్ణంబులఁ బొంది పుణ్యకర్తృత యొసఁగున్.

446. వ అనియె నని యిట్లు గౌరి లోకహితాకరంబుగా వర్ణాశ్రమధర్మంబులు పరమే శ్వరు నడుగుటయు నారదముని కృష్ణునకుం జెప్పినతెఱంగు భీష్ముండు ధర్మ[1]జునకుఁ జెప్పుట యుపన్యసించిన నాక[2]ర్ణించి.

---

442. 1. నభయంబు - ఊ. ఓ. 2. బుద్ధిసేసిన - అ.
443. 1. గేలుతోన్ - ల. కొన్నిప్రతులు
444. 1. వదాంబుజమున బొలయ - ఐ. ఖ; కొప్పునం బ్రీతి బొలయ - ఔ. 2. స్వనంబున అ. ఇ ఈ ఎ ఏ. ఐ ఔ నేత్ర, వదన - అని పాఠములు.
446. 1. తనయునకు - ల పెక్కుప్రతులు 2. ర్ణించి జనమేజయుండు వైశంపాయనుతోడ-ఐ. ఖ.

447. క. మునివర నాదగుచిత్తం
బునఁ గౌతూహలము చాల మొలతెంచి తలి
ర్చున [1]నెలరారెడు నేర్పడ
[2]వినిపింపుము మీఁదికథ సవిస్తారముగన్.

448. వ. అని యడుగుటయు.

449. మ. [1]స్ఫుట [2]తత్త్వోదయ సంభృ[3]తైక సుమధురా భూతైక రమా[4]ధురా
తటినీఫింఛమనోజ్ఞమౌళిలలితా [5]దాంతాత్మ [6]సంకీలితా
త్రుటితా[7]పత్వ సమున్నతాశ్రితజనా దూరాంగజనాస్త్రవతో
త్కటశీలావనలోల దివ్యహృదయా ధర్మప్రతీసనొన్నదయా.

450. క. దేహాభిమానసంభృత
మోహాతమోనిరసనాభిముఖభూరివివే
కాహీన మహాతత్త్వస
మాహిత చిన్మాత్రరూప మధురిమ సుభగా.

451. మాలిని. త్వరితవిహితగాఢధ్యాయి సమ్మోద[1]వాదా
స్ఫుర[2]దరి దృఢ శూలస్ఫూర్తి సంశ[3]స్తహస్తా
తరణిశశిమయత్వోదారతాచిత్రనేత్రా
పరమనియతినిష్ఠా భవ్యహృత్పద్మసద్మా.

*గద్యము :* ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతంబైన శ్రీమహాభారతంబున నానుశాసనికపర్వంబు నందుఁ జతుర్థాశ్వాసము

---

447. 1. నలరారెడు - పీ శ. ష పెక్కుప్రతులు 2 వినుపింపు - కొన్నిప్రతులు

449. 1. స్ఫుటితత్త్వామల సంభృతైక్య మధురా - స; స్ఫుటతత్త్వద్వయ - అ. ఈ.
2. తత్వంపద . ఏ ఐ ఖ శ ష 3 తైక్య మధురా - అ, ఉ. ఈ. చ. ం.
4. సుధా-అ ఈ 6. దాంతత్వ నంకీలితా-ఈ 7. సర్వసమున్నత-అ ఈ నంకల్పితా-చ
8. తాపోదయా - అ. ఎ; ధర్మప్రపంచద్ధయా - స; ధర్మప్రతీపాలయా - స; ధర్మాత్మ సమ్యగ్దయా - ఐ ఖ.

451. 1. నాదా - ల; పాదా. - అ. ఆ ఈ. ఔ క. ఖ. 2 దతిదృఢ - కొన్నిప్రతులు
3. సక్త హస్తా - ష.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆనుశాసనిక పర్వము - పంచమాశ్వాసము

—o—o—

1. క. [1]శ్రీకాళీత్యాదర సు
శ్లోకాలోకన విలాస [2]సుస్థిరభవనా
శోకము[4]దాద్యవధూతి
వ్యాకోశవివేకభవన హరిహరనాథా.

-: శివుఁడు పార్వతికి వర్ణాశ్రమాచారంబులతెఱఁగెఱిఁగించుట :-

సం. 13-123-33 (అను 1 - 15)

2. వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె.

3. తే. అట్లు గంగాత్మజుండు ధర్మాత్మజునకుఁ
జెప్ప యిట్లనుఁ గౌరవశ్రేష్ఠ పద్మ
నాభుతో నవ్విధంబున నారదుండు
పార్వతీదేవిప్రశ్న మువన్యసించి.

4 వ. ఇట్లనియె నప్పర్వతరాజపుత్రి ప్రార్థించిన నప్పరమేశ్వరుండు పరమాదర
భరితుండై.

---

1. 1. శ్రీకారత్వాదర-జ, శ్రీకాలిత్వాదర-ఇ ఉ ఊ. ఓ. ఔ క. ష. న, శ్రీకుధరభవాదర-
ఐ. ఖ; శ్రీకరనర సుశ్లోకశ్లోకాలోకనవిలాస - ఏ. శ్రీకారిత్వత్ప్రటుసుశ్లోకా - అ. ఈ.
2. సుస్థిత - ఓ. చ. జ ఠ విలసచ్ఛోక అ. ఈ;భువనా శ్లోక - ఐ;భువనాలోక - కొన్ని
ప్రతులు. 4 దాత్తపధూత వ్యాకోచ, దాత్త విభూతి వ్యాకోచ, దావ్యయ దూతివ్యాకోచ
దాత్యవధూటివ్యాకోచ అనిపాఠములు

5\. సీ. అజుఁడు మును లోకహితార్థంబుగా బ్రాహ్మ
ణులను సృజించి రాజులను వైశ్య
లను శూద్రులను గ్రమం బొనర్పంగఁ గల్పించె
నాజాతులకు నోలి నతనిముఖము
బాహులు నూరులుఁ బదములు సంభవ
స్థానంబు లగుట[1]యుఁ దారతమ్య
భాగిను లగు[2]నని పార్వతి [3]భాతండు
తత్తదాచరణీయధర్మములును

ఆ. వినుము విస్తరించె విప్రులు లోకధా
రకులు వారియెడఁ బరాభవంబు
సేఁత యెల్ల చేటుఁ జేయు సమ్మానదా
నములు సకలశోభనము [4]నొనర్చు.

6\. చ. ప్రియ [1]మతియజ్ఞు నేనియు దరిద్రుని[2]నేనియు [3]విప్రుఁ గందఁ జేఁ
త యుభయలోకసౌఖ్యములు [4]దవ్వగఁ జేయుఁ దదీయ మైననిం
దయు నను జెట్టుదిట్టుట యధర్మత నాతనిసొమ్ము పుచ్చికొం
[5]టయును మదర్థముం గొనుట డాఁపక చెప్పితి [6]నిక్క మింతయున్.

7\. వ. అని పలికి యి ట్లనియె.

8\. సీ. అధ్యయనంబును యజనంబు దానంబు
నధ్యాపనంబును యాజనముఁ బ్ర
తిగ్రహంబును బ్రశాంతియుఁ దపస్సత్యశౌ
చంబులు విప్రధర్మంబు లావ
దలఁ దక్క నతనికి వలవదు వాణిజ్య
మగ్ని[1]కార్యంబు శూద్రాన్నవర్జ
నము నిజదారసంగమనియమంబును
నిరుప్రొద్దు గుడుపును హింసలేమి

---

5\. 1. దత్తారతమ్య - పెక్కుప్రతులు. 2 టది,నవి - అనిపాఠములు. 3 .యాభంగి, యదుగంగ- అనిపాఠములు. 4. లొనర్చు - పెక్కుప్రతులు.

6\. 1. మతి - జ. 2.నైనను - పెక్కుప్రతులు 3.విప్రుకెగ్గు (నగాగమలోపము)- ఎ. ఊ. క; విప్రుఁగుంద - ఆ. ఈ ట ఖ జ 4 దప్పఁగ - ఎ. ఒ. తప్పఁగ - క. ష.
5\. టయునవి పాపముల్ - ఉ ఔ 6. దోషమింతయున్ - న; నీకునింతయున్ - ఏ.

8\. 1. కృత్యముమానుట నుచితంబునిజదార - ఉ. ట ఔ ఖ. ఈ పాఠము చివరివరకును నిర్వహింపబడుటలేదు.

ఆ. యును నివాసశుద్ధియును నతిథిప్రియ
త్వంబు బ్రాహ్మణులకు వలయుఁ దపము
[2]పేర్మి సాధనముగ ధర్మమూలముగ వా
రల సృజించెఁ గాదె నలినభవుఁడు.

9. ఆ. క్షత్త్రియులకు విప్రసంరక్ష ముఖ్యధ
ర్మంబు సరణి వారిరక్షణమునఁ
గాని బ్రదుక దమ్మహానుభావుల పాల
నంబు సేయ శోభనంబు నొందు.

10. క. రమణీ యధ్యయనము యజ
నము దానము సాధుపోషణము దుర్జనులన్
దమియించుటయు సముత్సా
హము [1]కల్మియు [2]ధృతియు నృపుల కగుధర్మంబుల్.

11. తే. శస్త్రజీవికయును నరిషష్ఠభాగ
మాహరించుటయును భృత్యునరయుటయును
బ్రజ వివాదంబు వినుచోటఁ బక్షపాతి
గామియును రాజులకుఁ గృత్యకర్మకోటి.

12. సీ. వణిజులు లోకప్రవర్తనంబుల కెల్ల
నుపకారకులు గృషియును ననేక
భంగి బేహారంబుఁ బసులఁ[1]బెంచుటయుఁ [2]గృ
త్యంబులు వారల కధ్యయనము
యజనంబు దానంబు నర్హ[3]కర్మంబులు
త్రైవర్ణికద్విజత్వమ్ముకతన
నాతిథ్యములు విధేయములు వారికిఁ దిల
గంధరసముల విక్రయము దగదు

2. తత్సాధనముగ - ఉ. ఔ

10. 1. కల్మియు నృపుల ధర్మమగుకర్మంబుల్ - ఎ; 2. నృపులకర్హమగుధర్మంబుల్ - ఓ క.

12. 1. బెన్పుటయు - అ. ఈ ఉ. శ. ష. బెంచుటయును గర్తవ్యమగువారి కధ్యయనము - టీ; 2 ఇచ్చట అఖండయతిచెల్లుచున్నది కృత్యమ్ము వారలకు నధ్యయనవిధియు - ఉ ఔ. శ. ష. 3. ధర్మంబులు - కొన్నిప్రతులు; ధర్మములు త్రైవర్ణికుల్ ద్విజాం కవశ్యలగుట - ఉ. ఔ

తే. మూఁడుజాతుల [4]శుశ్రూష మూలకార్య
గతి తదుపయు_క్తి శూద్రులకలిమి నడచు
వారు శుశ్రూషకులు విప్రవందనంబు
వినయ మక్రూరు లగుట తద్విహితకృతులు.

13. క. తనతనవర్ణంబునకుఁ ద
గినయాచారంబు నడపి కిల్బిషరహితుం
డనఁ బరఁగు [1]నెల్ల వారికి
విను [2]మున్ముని జన్మసౌఖ్యవిభవము గల్గున్.

14. వ. ఇవి వర్ణధర్మప్రకారంబు లింక నాశ్రమధర్మంబులు వివరించెద ద్దినాకింపు మని పలికి పార్వతికిఁ బరమేశ్వరుం డిట్లనియె.

15. సీ. బ్రహ్మచర్యవ్రతపరమనిష్ఠయు గురు
నాశ్రయించుటయు నధ్యయన[1]కృతియు
నగ్నికార్యంబు గుర్వరసంచారంబు
భైక్షచర్యయుఁ గమలాక్ష బ్రహ్మ
చారిధర్మంబు లాశ్రమముల కెల్ల
నాశ్రయణీయమై గృహస్థత్వ మొప్పు
శౌచంబు నిజదార[2]సంతుష్టియును బంచ
యజ్ఞంబులును నిగమాభిరతియు
తే. దానహోమ[3]దయాతిథి [4]మాననములు
వలయు గృహమేధికిని వనవాసవన్య
భోజన బ్రహ్మచర్యజటాజినప్ర
ధారణములు వానప్రస్థ ధర్మకోటి.

---

4. కుసు శూద్రమూల, కుసుశూద్రముఖ్య - అనిపాఠములు; భక్తియిమ్ముల వహించి తదుపబోధితక్రియలందుఁబొదలినడచు _ ఉ. ఔ.

13. 1. చెల్లవారికి - అ,[illegible]నెవ్వఁడాతఁడు_ ఊ. 2. మున్నునుజెప్పు _ ఔ; మున్నను జన్మ_ఒ పీ.

15. 1. విధియు - పెకుప్రతులు; రతియు _ ఆ. ఉ ఔ. శ ష. 2. సంతృప్తియును _ ఓ. క. 3 దయావిధి మాననములు - ఇ, దయావిధి మాననములు _ ఒ; దయాలినన్మాన నంబు - ఉ 4. మాననములు - అ. ఆ. ఈ. ఒ. ఓ. క, చ. 5 కటవినివాన - పెక్కుప్రతులు

16. చ. కినియమి సంగవర్జన మకించన[1]భావము తాల్మి వి[ప్రవా
[2]సనము ప్రశాంతి [3]యార్జవము శౌచము [4]సు[వ్రతనిష్ఠ భైక్షభో
జన మిల నిద్రసేఁత కృప సంతతతత్త్వ[5]విచింతనంబు మా
నిని యతిధర్మముల్ శ్రుతి గణించినభంగినయేను జెప్పితిన్.

17. వ. అని యి ట్లాశ్రమధర్మంబులు సెప్పిన విని యప్పరమేశ్వరుతోఁ బార్వతి తపంబు తపం బనుచు మునిజనంబు లాచరింతురు దానితెఱం గెఱింగింపవే యనిన నద్దేవుం డి ట్లనియె.

-:శివుండు పార్వతికిఁ దపస్స్వరూపంబు చెప్పుట:-

సం 13 - 560 - 15 (అను 1)

18. సీ. భోగార్థులై తపంబునకుఁ బొత్తుగఁ దపం
బనఁగ వానప్రస్థు లాచరించు
ధర్మంబు లింద్రియకర్మనిగ్రహములతో
నుభయకాలములను హోగసేవ
ఫలకాంతఁ జేత తపస్స్వరూపంబుగా
నడపి కాలంబైన నాకమునకు
నరిగి తద్భోగంబు లనుభవింతురు పుణ్యా
[1]మవసిత మగుడు మర్త్యత్వ మొంద
తే. వత్తు రధికనియతి నుపవాసములను
జపముఁ బంచాగ్నిమధ్యవాసంబు గలుగు
తపముఁ[2]గల దప్పరః ప్రియత్వం బొనర్చుఁ
గర్త కది పాఁడుఁ దుది వచ్చుఁ గాని మరలి.

19. వ అని చెప్పి మఱియు.

---

16. 1. భావము దాల్మి - కొన్నిప్రతులు; భావముఁదాల్చి - ఆ 2. సనముఁబ్రశాంతి - అ. బ ఒ. ఓ. క. ఖ శ. ష. స. 3. మార్దవము - ఆ ఒ. 4. సువ్రత - ఒ. క. 5. విధిన్ దపంబు - ఉ; విధిన్ బదంబు - ఔ.

18. 1. మవసానమగుడు - ఈ ఓ చ. అపగతమగుడు-ఒ.ఖ. 2. దగరదప్సరాప్రియత్వం, దగ దప్సరః ప్రయత్నం,ఫలమప్సర ప్రియత్వం, నను నప్సర ప్రియత్వం-అనిపాఠములు.

20\. ఉ. ధారయుతంబుగా నడచుతాపసముఖ్యు లహింస[1]పేర్మికై
కారుణికత్వ మగ్గలము గల్గి తలంతురు సర్వజీవులుం
దారును నొక్కరూపుగఁ బదంపడి పుత్త్రకళత్రయుక్తిఁ బెం
పారుదు రూర్ధ్వలోకమున నజ్జనముల్ మఱి వచ్చుఁ గ్రమ్మఱన్.

21\. వ. [1]అనిన భవాని వనవాసవ్రతవిశేషంబులుం దదీయఫలప్రకారంబులు నేర్పడ నాన తీయవే యనుటయు నభవుం[2]డు [3]భరితాదరుండై.

22\. సీ. ఉపవాసములు మౌన మూర్వీశయత్వ మా
సన మూర్ధ్వబాహుక[1]స్థాపనంబు
నియమితాహారత్వనిష్ఠక్రమంబున
శశిమరుద్వ్రతవాసముల నిలుపు
గంధర్వదేవనాగస్థానముల నునికి
యును బహుసౌఖ్యసంయుతము గాఁగ
నానాసహస్రాబ్దమాననీయంబుగఁ
గావించు సంక్షేపగణనఁ గొన్ని
తే. మహితనియతులు సెప్పితి మఱియు నేమి
వ్రతము సలిపినఁ బాపనిర్హరణ మగుటఁ
బుణ్యగతిఁ గల్మి దప్ప దరణ్యవాసి
కడుగు మింకను వలసినయట్టి వనుడు.

23\. క. యాయావరుల నమరవం
ద్యా యేర్పడఁ జెప్పు[1]మనియె నంబిక దేవుం
డా[2]యమ కిట్లనుఁ దీర్ఘస
రాయణు లుపవాసవిధి సమధికులు వారల్.

24\. వ. అది యె ట్లంటేని.

---

20\. 1. బర్మికై - ఎ; లేమికిన్ - బా
21\. 1. అనిన విని భవాని - పెక్కుప్రతులు. 2. డాదరభరితుండై - ఎ. ఉ. క; ఙ. ౦. దయాళుండై - ఏ
22\. 1. స్థానకంబు - కొన్నిప్రతులు.
23\. 1. మనుడు - ఏ. 2 యమ - ఉ

25. క. నానాతీర్థసతతసు
స్నానంబులఁ బల్లలై నజడలును భిక్షా
న్నానోపవాసకృశమగు
మేనులునై వారితపము మిక్కిలి[1] మెఱయున్.

26. క. మానోపవాసవిధులం
జేసి తృణజధాన్య భుక్తి సెల్లింతురు వా
రే సురలకు తేనిసుఖా
వాసమ్ములఁ [1]జరితములను వఱలుదురు తుదిన్.

27. వ. అనిన విని యవ్వనితారత్నంబు వైఖానసులవిధంబు వివరింపు మనుటయు నవ్విరూపాక్షుండు.

28. సీ. వైఖానసులు [1]ఖరవ్రతు లెట్టు లంటేని
శిలఁ దృణధాన్యముల్ [2]చిదుకనడచి
కొందఱు పండులఁ గొఱికి కొందఱు[3]గన్న
గుఱుముల గువ్వల తెఱఁగు దోఁప
నప్పటి కప్పటి కాననంబున నైచి
కొనికొందఱాకు లెండినవి యేఱి
కొని కొంద అంబువుల్ గొని కొంద ఱనిలంబు
గొంద ఱాహారంబు గొందురట్లుఁ
తే. గాక యాహారపరులును గలరు వార
లింద్రునకుఁ బూజనీయు లై యెక్కుడైన
పదవిఁ జిరకాల బహుసౌఖ్యభాగు లగుదు
రని మహేశ్వరుఁ డుమకు నిట్లనియె మఱియు.

29. వ. ఇవి యెల్లను వానప్రస్థనియమనిష్ఠాభేదంబులు తపంబు తపం బని మును లాచరింతురు దానితెఱం గెఱింగింపు మని నీవడిగిన విధంబున నందొడంగి నాచెప్పినవిధంబు లిన్నియుం దపం బను శబ్దంబున కర్థంబు లై యుండు

25. 1. వెలయున్ - సూ
26. 1. జిరతరము (ల) గ - కొన్నిప్రతులు
28. 1. ఘనవ్రతు - ఉ; చిరవ్రతు - ఎ, వరవ్రతు - వా. క. ష 2. చి (ని) దియ - కొన్నిప్రతులు. 3. ముక్కుచెఱమల - ఉ. ట. పౌ. పీ. క. ష. శ,

ననిచెప్పి యంగుష్ఠప్రమాణదేహులు మృగాజినవసనులు నిర్ద్వంద్వులు నై వాలఖిల్యు లను పేరం బ్రసిద్ధులగు మునులు దినకరదీప్తులతోడంగూడి [1]వర్తించుచుండుదురు వారలతపోవైభవంబునంగాదె జగంబులు సుస్థిరంబు లై యున్నయవి యొండుమెయి దుర్లభంబు లైనట్టివి తపంబున సులభంబులగుం దపంబు గడవ ధర్మంబుం గలదే యని పలికి యాదరాతిశయంబున శివుండు శైలేంద్రతనయతో ధర్మంబులు మఱియు నెఱింగించెద నవహితవై యాకర్ణింపు మని యిట్లనియె.

80. ఉ. అంబుజసూతి యేర్పడ గృహస్థ[1]సమర్థముగాఁ బ్రవృత్తిధ
[2]ర్మంబు నొనర్చె నార్యజనమాన్యము దానితెఱంగు చాల సూ
క్ష్మం బతికాంత లేక తగుకాలమునన్ సముచిత ప్రవృత్తి ని
త్యంబును ధర్మముఖ్యముగ నరముఁ గామముఁ జల్పు టొప్పగున్.

81. చ. అతఁడు నివృత్తిధర్మము ప్రయత్నమునన్ వివరించె మోక్షుఁడో
ద్యత [1]మది తత్ప్రకారములు దాంతియు భూతచయంబుపై దయా
రతియును సత్త్వదృష్టియు విరాగత యింద్రియకోటికిన్ దృఢ
[2]స్థితముగఁ జేసి యోగనిరతిం బరికాంతి యొనర్చుకొంటయున్.

82. వ. అని మఱియును.

83. తే. క్షుత్పిపాసలచేఁ గడుఁ గుందినట్టి
యతిథివచ్చినఁ బ్రియమున నతనిడప్పి
వోవు నట్లుగ సముచితభోజనంబు
వెట్టు టెల్లపుణ్యములకుఁ బెద్ద తలఁప.

84. క. దీనికి [1]నఖిలాశ్రమసువి
ధానంబులకును గృహస్థతయ నెల వగుటన్
దానిసదా౽వపాలిస
మానము గా దరయ నాశ్రమం బెయ్యదియున్.

---

29. 1. వర్తించుచునత నిఁగీర్తించుచుండురు - ఊ. ఐ. ఓ. ఖ చ.
30. 1. సధర్మముగా సమార్గముగా, సమాగముగా - అనిపాఠములు. 2. ర్మంబొనరించె - ఎ. ఒ ఔ. ఓ. క
31. 1. మతిఁదత్ప్రకార - ఊ. ఒ. ఔ. 2. స్థితి యుగ - ఈ. ఊ. శ.
34. 1. నిఖిలాశ్రమ - కొన్నిప్రతులు; నఖిలాశ్రయ - ఒ. క.

35. క. అనవిని గృహాసునకు నే
పని ముఖ్యం బనియె గిరిజ పశుపతి జననీ
జనకారాధన మతనికి
[1]ననుత్తమం బైన ధర్మ మని రూపించెన్.

36. వ. అద్దేవుండు వెండియు.

37. క. పతిభక్తి ముఖ్యధర్మము
సతి కనవుడు దేవి నరుఁడు జననీజనకుల్
[1]మృతులైనను [2]నాతి విగత
పతిత్వమొందినను జేయువను తెయ్యవియో.

38. వ. అనుటయు నతవుండు వారివర్తనంబు తెఱింగించెద వినుమని యిట్లనియె.

39. క. దేవాతిథిపితృపూజలు
గావించుట భావశుద్ధికలిమి నరునకుఁ
దేవీ వలయును వారికి
నేవిధమున బ్రహ్మచర్య మేమఱమి తగున్.

40. వ. అని నిర్దేశించి మఱియును.

41. ఆ. పంచపర్వ సురత పరిహృతితో నిజ
దారతృప్తుఁడగుచు ధాన్యకోటి
పతి యొలుక దినిన[1] బ్రతుకుఁగాఁ గను గృహ
పతికి నశ్వమేధఫలము గలుగు.

42. వ. అని చెప్పి.

43. ఆ. ఎచట మెలఁగె నేమి యె ట్లుండె నేమి దా
నేమిసేసె నేమి యెల్లసంగ
ములను విడిచి కుడుపువలన నియతి[1]గలు
యతికి మోక్ష[2]వీథి యాటపట్టు.

---

35 1. ననుపమగునట్టి ధర్మమనిరూపించెన్ — అ.

37. 1. గతులైనను - పెక్కుప్రతులు 2. నారి, సతియు-అనిపాఠములు.

41. 1. పగిది — ఐ, ఖ.

43. 1. గల — పెక్కుప్రతులు. 2. విధియ, విధికి, వదవి, విథియు—అనిపాఠములు.

44. వ. అనిన విని సంప్రీత యై శైలరాజపుత్రి పురహరునితో రా జనువానికి భూతిసంబులయట్ల శరీరంబును భోజనాదులును నట్లయుండియు నతం డెల్లవారలచే మ్రొక్కఁ గొనుటకు నిగ్రహానుగ్రహంబులకుంజాలి సర్వాధికత్వంబున శోభిల్లు దానికిం గారణంబేమి యెఱింగింపవే యనుటయు [1]నీశానుం డిట్లనియె.

-:శివుఁడు పార్వతికి రాజత్వమహిమాతిశయంబు చెప్పుట:-

సం. 19 - అను I 15 - 875.

45. సీ. అధికపుఁ దపమునననైనది రాజత్వ
మట్లు గావునఁ బేర్మి నతిశయిలు
జనములచేఁ మ్రొక్కఁ గొనుటకు నిగ్రహం
బునకు నను గ్రహంబునకు శక్తుఁ
డై యుండు నతఁడు తదీయసునీతియ
[1]విను ముదమున రాజు వినయపరునిఁ
జేసి యెల్ల జనంబు శిక్షించు నిద్రియ
జయమును నరివర్గజయముఁబడయు
తే. నెఱిఁగి యుపధా విశుద్ధుల నిడునమాత్య
పదవి కను[2]రక్త సారవద్బలముఁ బ్రోచు
హిత[3]పరుల మిత్త్రులుగఁ గొను నిలకు మే లొ
నర్చు దుర్గంబు రక్షించుఁ గూర్చు ధనము.

46. వ. ఇవ్విధంబున సప్తాంగసంపన్నత్వంబు నొంది.

47. క. చేయఁ దపాత్రవ్యయములు
సేయుం బాత్రవ్యయంబు సేయున్ నిజర
క్షాయత్న మెల్లతెఱఁగులఁ
బాయక ధర్మంబుసేయుఁ బాపముదొలఁగున్.

---

44 1. సిశ్వరుండి - ఎ, బ, క.

45. 1 వినుదమమును, వినుమోదమున, వినుముధర్మము - అనిపాఠములు. 2. రక్త - ట. ఛ. శ. వ. 3. పరుల - కొన్నిప్రతులు.

48. ఆ. ఆచరించు [1]దండ మక్రోధగామిఁ జై
[2]చారదృష్టిఁ జూచు శత్రుకృత్య
ములను నాత్మదేశపురపరివారవి
ధముల నత్యభాషణముల నెగడు.

49 క. ఉద్యోగము ప్రియవాదిత
విద్యాపరినిష్ఠ సంధివిగ్రహ [1]విహితా
[2]పద్యత దీనానాథవి
పద్యాపన మాజ్ఞ[3]వెరపు [4] వాటించుఁ దగన్.

50. ఆ. కయ్యమునకు నెపుడుఁ గాలు ద్రవ్వఁడు తగ
వై నరణము దూరుఁడై యొనర్చు
యజ్ఞదాన విధిపరాయణుఁ డై యుండు
నిత్తెఱంగువృత్త ముత్తమంబు.

51. క. ఈనీతులకు విరుద్ధము
లై నపనులు నరకము[1]లకు నరుగున్నృపతి పా
[2]పానీతదుఃఖ మొకతఱి
మాను నొరుల కతని కెపుడు మానకయుండున్.

52. ఆ. భావశుద్ధి గలిగి [1]యీవినీతులఁ బూని
ప్రజల [2]కెవ్వఁ డతులరక్షణంబు
సేయు నట్టి[3]విభుఁడు సిరియును గీర్తియుఁ
గాంచుఁ[4]బుణ్యలోకగతియుఁ బడయు.

53. క. అనుటయు ధర్మరహస్యము
వినఁ గోరెద ననిన శాంతనవికి శంభుం డి

---

48. 1. ధర్మ - కొన్నిప్రతులు. 2. చారు - ఆ. ఇ ఉ. క.
49 1. ధీరో, పీతా - పరితా, నిరతా, విదితా విహితా విగతా (కొన్నిపాఠములు నిష్కృష్టార్థమునిచ్చుట లేదు) 2. పద్యత, దిత్యత, నద్యత - అనిపాఠములు.
3. వెరవు - కొన్నిప్రతులు. 4. పరిపాటించున్ - ఎ; ప్రాపించుఁదగన్ - క.
51. 1. నకు - పెక్కుప్రతులు, 2, పానుగత - ఆ. ఎ.
52. 1 భూవినుతులు వూని,పటుసీతిమైపూని - అనిపాఠములు. 2. కెవ్వదతులర- ఈ. ఊ. ఒ.
3. నరుఁడు - ఒ. 4 నూర్ధ్వలోక - పెక్కుప్రతులు.

ట్లనియె నహింస రహస్యం
బనఁ బరగును ధర్మజాత [1]మఖిలమునందున్.

54. వ. అనిన విని[1]యాగన్మాత యవ్విశ్వధాతతో హింసావర్జనం[2]బేఱనులకుం జెల్లదని
రని చూచెద నహింసతెఱంగెఱింగింపవే [3]యని న నర్థెపుం డదిసీతలంచినట్ల
నేలం బిపీలికాప్రముఖంబుల నాకసంబున మశకాదుల మఱియుం జేను నల్లి
సీరపేనులో నైన జంతువులం జంపక యెవ్వరికి మానరా దట్లు గావున.

55. చ. ఫలము దళంబునుం దొడిమఁ [1]బాయుట రాలిన[2]వానిఁగొంచు నాఁ
కలి [3]కెరసేసి గోరసముకార్యము [4]నటుల [5]నిర్వహించి బు
ద్ధులు [6]వెలి లేక [7]నిశ్చలతఁ దోయజపత్రనిభాతి. చిత్రరూ
పులొకొ యనంగ నుండు శమపుణ్యులుసూవె యహింసనా త కుల్.

56. తే. అదియ శ్రుతిచేత ధర్మరహస్యమనఁగఁ
బడియె నని చెప్పి మఱియును భవుఁడు దేవి
కిట్టులను నట్లుఁగాక యహింసతెఱఁగు
గలదు [1]వినుము విశేషించి కమలనయన.

57. తే. విధివశంబున మృతిఁబొందు వివిధజంతు
నిచయ[1]మం దనహంకారనిష్ఠుఁ డై నఁ
బురుషుఁ గల్మష మేమియుఁ బొంద[2]నేర
దెట్టు లంటేని విను మది యేర్పరింతు.

---

53. 1. మహిమలమందున్ - ఒ క (యతిచింత్యము)

54. 1. యాత్రిజగన్మాత - అ ఈ. ఓ. 2 బెల్లజనులకు - కొన్నిప్రతులు. 3. యనుటయు - పెక్కుప్రతులు.

55. 1. వాయుచు, బాసిన, బాటున, బాయుడు - అనిపాఠములు. 2. దానదోఁచు - అ. ఈ. 3. కెవ - అ. ఆ ఈ 4 తోయము - అ; నీటు (ను)న - కొన్నిప్రతులు. 5. నంగ హించి - ఒ. క 6. మఱిలేక - ఒ. 7 లోననిడి తోయజ - ఉ. ఔ.

56. 1. సవిశేషముగ వినుకమలనయన, సవిశేష మదివినుకమలనయన, సవిశేష మదియును గమల నయన - అనిపాఠములు.

57. 1. మందునహింసావిశిష్టుఁడైన-అ;మన్ని రహంకార నిష్ఠుఁడైన-ఈ నేరదట్టిదేవిను చెప్పెద నవ్విధంబు - ఋ. ఖ.

58. సీ. దివియలోఁబడు [1]బ్రువ్వ [2]దివియయెత్తినవారిఁ
పాపంబువొందునే యోపి[3]దున్న
[4]నాఁగేటిమొనఁ జచ్చు నానావిధప్రాణు
లన్నరుఁ బొందునే యఘము వారు
[5]తమపనుల్ సేయ విధాత్మవశమున నా
యువు దెగినట్టిజంతువులు సచ్చు
నేముసంపితి మని యించుకేనియుం నహం
కారంబు వారికిఁ గలుగు దట్లు
ఆ. [6]గానఁజూవె వారిఁగల్మష మొందదు
పుణ్యపాపములకు బుద్ధి మూల
మని శివుండు మఱియు నను హింసవోలెనై
యధికధర్మమైన విధము వినుము.

59. క. దైవగతిఁ జేసి తమకుం
[1]జావవలసి గోవు లొందుచా వొల్లక స
ద్భావమున రంతిదేవుని
గావించు[2] మఖమునఁ బశుతఁ గైకొని చెమ్మెన్.

60. వ. అనేకసహస్రంబు [1]లరుదెంచి

61. క. తము విశసించుట కాభూ
రమణుని వేఁడంగ నతఁడు రాజీవాక్షీ
క్రమమున విశసింపఁగఁ జ
ర్మములు దరులు గాఁగఁ జాఱెరక్తము నదియై.

---

58. 1. వు (బు) ర్వు - కొన్నిప్రతులు. 2. దివ్వెయెత్తిన - అ క; దీవెయెత్తిన - ఏ.
3. మనఁగ - అ. ఈ 4 నాఁగలి, నాగంటి - అని పాఠములు. 5. త(ద) గు-అ.ఈ.
6. కానచువ్వె,కానవువ్వె కానసూవె-అని పాఠములు.గమనిక:- 'కాన'దిశ | కళగాను ద్రుత
ప్రకృతికముగాను ఉభయవిధములను ప్రయోగింపబడుమందునది కాఁబట్టి పై రెండు
తెలుఁగుల పాఠములును గ్రాహ్యములే.

59. 1. జావొలసిన - ఔ. 2. మఖంబువళత, మఖంబుచేత, మఖముఁజూవ - అనిపాఠములు.

60. 1. లరుగుదెంచి - పెక్కుప్రతులు.

62. క. ఆచర్మణ్వతి యనునది
[1]గోచరమే వర్ణనమునకుం బ్రియ మగుకం
పై చవి చేయం బోలిచి య
నీచమహీశసలిలమయ్యె నెత్తురు సుదతీ.

63. క. స్నానమునఁ బానమున నా
కానందము సేయు నమ్మహానది గోసం
తానము దివికి [1]నరిగె న
మ్మానవపతిఁ జెప్పనేల మధురాలాపా.

64. క. పరబలము పైనపరి నె
త్తురు [1]వఱ్ఱులు వాఱఁ జంపుదురు దురమున న
ప్పురుషుఁ దనంబును బుణ్యో
త్తర మని వేదములు సెప్పుఁ దనుతరమధ్యా.

65. క. పోరుల[1]యందలి మరణము
మారణమునం బుణ్యలోక మహితమహిమకుం
గారణ మెఱుఁగు మహింసా
కారం బిట్టిదని [2]నీవ కమలదళాంక్షీ.

66. సీ. అనిచెప్పి వెండియు హరుఁడు పార్వతితోడ
నిటను [1]వేఁటకునెలయు టఘము
గాదు సస్యములు మృగములచేతనశించు
జగమెల్ల నిర్మనుష్యంబు గాఁగఁ
గోరు మృగము లది కారణంబు మృగ
హతిరాజులకు ధర్మమయ్యెనటు

62. 1 గోచరమై - ఓ క శ; గోచరమై సొంపు పెంపు గొమరారెడు కంపై చవివాయం దొలిచి - జ

63. 1. జనఁగ - ద టొ. భ. శ. ష.

64. 1. సేరులువాఱ - అ ఉ, వఱలుగాఁగ - ఓ; వఱదలువాఱఁ చేయుదురు రణమున-చ.

65. 1. యందుల - ద. టొ భ 2 నీవు - పెక్కుప్రతులు; నీవె - శ. ష.

66. 1. వేఁటను సేయుటఘము - ద భ

గాక మృగములకుఁ గలుగు సద్గతి రాజు
చేమృతిఁ బొందినఁ జెలువ వినుము

తే. దండ్యు దండింపకుండు టదండ్యు దండ
నంబు గూర్చుట విప్రుమనంబు నొచ్చు
నట్టిపని [2]సేఁతయును వినుమనపరాధి
తనువునొంచుట సూ హింస ధరణిపతికి

67. వ. అని బోధించి.

68. క. ధూసురుల కలుకవు వెట్టం
జేసి నహుషముఖ్యనృపులు చెడుట ప్రసిద్ధం
బాసురపతి విప్రునలుకఁ
గాసిఁ బడఁడె[1] తెలచి పశనెఁ గాదె నయనముల్.

69. క. కావున విప్రారాధకుఁ
డై వెలయు విభుండు రాష్ట్ర మతనిధనముసై
న్యావలి బంధులవిప్రుల
దీవనలం బొదలు నింత తెల్లము దేవీ

70. వ. అని నిర్దేశించి కపర్ది గౌరితో వెండియు.

71. ఆ. పరమమంత్రవిధులఁ బశువులు యూపంబు
లందుఁ గట్టఁబడి మహోరుచిత్వ
విభవ మొందు విహితవిశసనక్రియ మేను
విడిచి దివ్యసుఖము వడయుఁ బొలఁతి.

72. క. హోమవిధులఁ దన్మాంసము
లామిషములు గాఁగ నొసఁగి యమరుల నగ్ని
ష్టోమాదులఁ బ్రోవఁగఁ బర
మామితసౌఖ్యములు గల్గు యజమానులకున్

---

2. సేఁతయును విను మనపరాధితనువు - ఇ. ళ. ష; సేత నపరాధియైన యతని తనువు - వా.

68 1. తెలిసి - కొన్నిప్రతులు

73 క. శ్రుతివిహితహింస [1]హింసగ
మతిఁ దలఁపఁగ రాదు మునిసమాజంబిది దు
ష్కృతతతిఁ బాపెడు పరమసు
కృతమని కొనియాడుఁ గాన గీర్వాణనుతా.

74. ఆ అని యహింసతెఱఁగు లన్నియు నెఱిఁగించి
యింక నేమి వినఁగ నిచ్చ సేసె
దనిన రుద్రునడిగె నద్రిజ జనుల[1]జీ
వనము తెఱఁగు లెల్ల [2]వనజనాథ

75 సీ. అడిగిన నద్దేవి కద్దేవుఁ డిట్లనుఁ
గాంత మానుష్యంబు కర్మభూమి
సుఖదుఃఖ[1]మూలముల్ సురతిర్యగాత్మక
త్వంబు లట్లగుట విత్తంబువలయు
మనుజుల కెట్లన్న విను ధర్మకామముల్
విత్తసాధ్యంబులు [2]విద్య వార్త
సేవ [3]కార్షత యర్థసిద్ధికి మూలముల్
విద్యవానికి ననవద్యతయును
ఆ [4]గర్ష కునకు నేల కాల మెఱుంగుట
జట్టికాని కేది సంభవించె
నందు విలువ మొదలు నగులాభమునునెడ
వ్యయము [5]గల్గుటయు శివప్రదములు.

76 క వసులం బాలించునతఁడు
వినువక యేమఱక వానివిధము తెలిఁగి ప్రో

73 1 హింసాగతి మతిదలపగరాదుమునినికాయంబిది - ఉ. బ ఔ. ఖ. శ. ష.

74. 1. జీవనములెల్లఁ దెలుపుమనుచు నపుడు - ఓ 2 మనుజనాథ - చ.

75. 1. భూములు - అ. ఎ. బ ఒ. ఔ ఖ; దంబులు - ఈ. చ. 2. విత్త - అ. ఎ.
3. గోరుట, గావున, గామత, గర్షత, గర్షిత - అని పాఠములు; కారుత - సూ. 4 కర్ష
కునకు నెద్ది కాల - జ; కర్షకునకు నెల్లఁ గాల - అ; కర్షతకును నేంగాల - ఈ;
కర్షమునకు నేల గాల మెఱుగుటయు - చ 5. గనుటయు - పెక్కుప్రతులు.

విసమర్థుం డగు [1]వెరవునఁ
బసిఁ గను సేవకుఁడు ధనముఁ [2]బడయుఁ బొగడుతోన్.

77. క. వంచనయును జాడ్యంబును
నించుకయునులేక ప్రభువుసిప్టమెఱిఁగి తాఁ
బంచినపని వెరవునఁ గా
వించిన కర్మకరుఁ డొందు విపులధనంబుల్.

78. వ. అని వెండియు

79. క. [1]పరధనపరదారల నప
హారింపమియు దేవపితృసమారాధనముం
గరుణయు నతిథిసపర్యయు
గిరితనయా యెల్లవారికిం గృత్యంబుల్

-: శివుఁడు పార్వతికి వర్ణకర్మ పరిపాకంబుల తెఱఁగెఱింగించుట :-

సం 19 - అను I 16 - 1525

80. వ. అనిన విని[1]యపర్ణాదేవి వర్ణంబులకర్మంబులు పాకంబుఁ బొందు ప్రకారంబు
చెప్పు మని యప్పరమేశ్వరు నడిగిన నతం డిట్లనియె.

81. చ. తమతమకర్మముల్ తెరువుదప్పక చేసినవారు దేవలో
కమునసుఖంబు [1]నొందుదురు క్రమ్మఱ వచ్చియుఁ బూర్వజాతి[2]జ
న్మమున [3]మహార్థిఁ బొందుదురు మానిని యిమ్మెయిఁ దప్పి యెట్టికృ
త్యములఁ జరించి రజ్జనుల కట్టికులంబునఁ బుట్టు వారలున్.

---

76. 1. తెఱవు - ట. క ఖ 2 బడయు బొగడన్ - కొన్నిప్రతులు, బడయం బొగడన్ -
ఛ. క.

79. 1. పరధన పరదారమ్ముల, హరింప - స

80. 1. యపర్ణ వర్ణంబుల - పెక్కుప్రతులు

81. 1. నొందుదురు - కొన్నిప్రతులు. 2. కర్మమున - చ. 8. సువృద్ధి, సవృద్ధి, మహార్తి -
అని పాఠములు.

82 క. ఎంతెంత మేలుచేసిన
[1]నంతంతియ కులము నెక్కుడై సమాకూరుం
గాంతా [2]విప్రుఁడయిన న
త్యంతానంద మగులోక మతనికిఁ [3]గలుగున్.

83. వ అనిచెప్పి మఱియును.

84. ఉ. ఆపదఁ దూలపోక సిరినంది మదింపక [1]శౌర్యవృత్తిమైఁ
బాపుల గెల్చి యార్జవము బంధు[2]జనాలికి నార్యకోటికిం
జూపుచు దీనులం గరుణఁ జూచి తగం గలమాత్రఁ బ్రోచుచుం
గోపము[3]లేక మన్కిగలుగున్ దివిజాంశమునన్ జనించినన్

85. క. అనిన విని గౌరి కొందఱు
మనుజులు సంపద[1]సుఖించి మనఁ గొందఱు తే
మి నలంగి దుఃఖ[2]పడుదురు
విన వలతుం గారణంబు [3]వినిపింపు శివా.

86 చ. అనుటయుఁ శంభుఁ డిట్లను దయన్ బలిభితము పెట్ట తేమిఁ గుం
దినచెలిఁ బట్టనుం బిలిచి దీనత వాపి [1]యపాపవృత్తిఁ జె
ల్లిన తొలుబాము గల్గునరు లెస్సగ[2]మంచు విధాత నిమ్కృపా
త్ముని నతిలోభదూషితుని దుర్గతిదుఃఖతుఁ జేయుఁ బార్వతీ.

87. క. వినుమలుశయుఁ గూర్మియు లే
వనవద్యా యొజ్జనంబులందును విధికిన్
మును సేసిన కర్మముఫల
మనుభవగోచరము సేయునంతియు తఱితోన్.

---

82. 1. నంతంతయు, నంతయు-అనిపాఠములు 2 మీ విభవంబు ననంతంతకుఁ బరమలోకమ తనికినౌదవున్ - అ ఈ 3 నౌదవున్ _ కొన్నిప్రతులు.

84 1. శాంతవృత్తిమై _ అ అ. 2 జనాళికి - కొన్నిప్రతులు 3 లేని - ఆ ఇ ఊ. క.శ.

85 1. వహించి - ఔ ఖ. 2 పడుదురె - ఆ ఇ. ఉ ఎ ఒ ఔ 3, వివరింపు - అ ఈ. ఒ

86. 1. యుధర్మవృత్తి యపారవృత్తి. - అనిపాఠములు. 2. మన్నువిధాత - న.

88 వ. అని[1]యెఱిఁగించి వెండియు

89 ఆ. ధనము గలిగి యుండి ధవళాక్షి కుడవక
కట్టుకుండు[1] పరమకష్టజనము
[2]తొరువులొత్తి చెప్ప నుపకారకై తొలు
పుట్టు [3]నందు [4]మనినయట్టివారు.

90. ఆ. తనకు ధనము లేక తగుభోగముల కెవ్వ
రైన నడప మను సుఖాఢ్యజనులు
తొల్లి పేదవార లుల్ల మర్థుల కెప్డుఁ
బెట్టఁ గోరు[1]చుండి నట్టివారు.

91. సీ. [1]ఆయాసపడ కుండ నరయంబు చేరెడు
వారు పాత్రజనంబుఁ దార పిలిచి
తొలుమేనఁ బెట్టిన యులఘుదయాభ్యులు
ధనసిద్ధి [2]బహుప్రయత్నమునఁ గలుగు
మనుజులు పూర్వజన్మమున నర్థులు దమ్ము
[3]నడుగ దాఁపకయిచ్చినట్టివార
లాయాసమునను విత్తాగమం బెడలెడు
జనులు ముందరిపుట్టువునఁ గృపావి

తే. హీనులై యాచకుల నలయించి సిగప
నిడనిలోభులు ముదిసి ధనేశులగు న
రుండు ప్రాయంబునాఁ డీక గండడంగి
తొంటిభవమున నీగికి దొడఁగి నతఁడు.

92. తే. కలిగియుండియుఁ జెవుకులకతన భోగ
ములు భుజింపఁగలేనిమర్త్యులు గిరీంద్ర

---

88 1 యెఱుఁగఁగ జెప్పివెండియు - అ.

89 1. నట్టికష్ట - ఉ, ఊ చ. 2. తొరుల యొత్తి - న. 3. పందు - కొన్నిప్రతులు.
4 గలుగునట్టి - ఒ

90 1 చుండు - పెక్కుప్రతులు

91. 1 ఆయాసమునులేక యరముత్ - ఋ. ఓ. ఔ. ఖ. 2. బహుళ - అ. ఆ. ఈ. ట. క.
3. నడిగితాఁకఁగ నిచ్చినట్టి, నడిగినఁ దగనిచ్చినట్టి - అనిపాఠములు.

తనయ [1]తొలుమేనరోగముల్ దనికిచచ్చు
నపుడు దానంబు సేసినయట్టివారు.

93. తే అధికసౌందర్యములు గలయట్టిజనులు
తొల్లి మాంసభోజనముల( దొఱ(గియున్న
వారు రూపవిహీనులు దారు రూపు
గలిగి తొలుమేన( గొనటుల(బలికినారు

94. క వినుసౌభాగ్యసమేతు(డు
మును నిజ[1]దారైకపరు(డు ముందటిజన్మం
బున భార్యకు( బ్రీతియొన
ర్చని మనుజు(డు సుభగతావిరహితత( [2]బొం(దున్.

95. క. అమితజ్ఞానము విజ్ఞా
నము( గలిగియు( బేదయైననరు(డు చనినజ
న్మమున వినికి గలిగియు దా
నము తెరువున( బోనివా(డు నలినదళాక్షీ.

96. క. తగుబుద్ధిలేక సంపద
మిగుల( గలుగు నరు(డు తొంటిమేన( గరుణమై
విగతప్రజ్ఞుం డయ్యును
దగ దీనుల( బ్రోచినత(డు దళితాబ్జముఖీ.

97. సీ. మేధావియై [1]విన్కి మిగిలివిద్యల(బొల్చు
నరు(డు దొల్త్యామున గురునకధిక
[2]భక్తు( డై తన దైనపాండిత్య మొరులకు(
గావించువేడుక గలుగుసుజను(
డభ్యసింపంగ విద్యాయుక్తి లేకుండు,
నాత(డు దొల్లి విద్యాధికత్వ

92. 1. తొలిమేన - అ ఈ.

94 1 దారాభిరతు(డు - ఐ, ఖ. 2. నొందున్ - కొన్నిప్రతులు.

97. 1. వినుమేలిమి విద్యల( గొమరొప్పునరు(డు మున్గురునికధిక - ఐ, కొ ఖ; విన్కిమించి విద్యల - ఈ. 2. భక్తు(డు - కొన్నిప్రతులు.

మున గర్వితుౖడై శిష్టజనులకు సభ భంగ
 మొనరించి కుందఁ జేసిన యతండు
తే. భార్యయును బిడ్డలును దాను బహు[3]ధనముల
భోగులై రోగములులేక పొల్చువార
[4]లమలినాచారపాత్రదానములు సత్య
కరుణలును దొంటి[5]భవమునఁ [6]గలిగినారు.

98. ఆ. ఆలుబిడ్డ లొంటులై లేమిఁ గుందుచుఁ
దెవులుచేతఁ బడుచు నవయుజనులు
మున్ను క్రోధలోభముల నాస్తికతఁ బర
పీడనంబుచేసి [1]పేర్చినారు.

99 సీ. కాంత జాత్యంధుండు [1]గన్నులు చెడువాడు
 తనయొప్పు మెఱయునఁ దగిలి యొరుని
వనితఁ దొల్మేనఁ జూచిన[2]వాఁడు కర్ణరో
 గార్తుండు కటుక[3]వాక్యములఁ దొల్లి
శిష్టు నొప్పించిన కష్టుండు కడుపునఁ
 దెవులైన నతఁడు పూర్వభవమునందు
గరదుండు గోళ మత్సరిని [4]శర్కరనుబా
 ధితుఁ డగునతఁ డన్యసతిని గన్య
ఆ. మహిషిఁగోవుఁ దురగి మదనాతురతమున్న
గవిసినాఁడు శోషి దివిరి యొరువు
లనుభవింపఁ దెచ్చుకొనిమాంసము దొంటి
పుట్టువున హరించినట్టి నీచు

---

3. విధముల - ఉ. ట చ. జ. పి. 4 లమరునాత్మలఁబాత్ర - ఋ ఔ. ఖ 5. పుట్టున - కొన్నిప్రతులు. 6 గలుగువారు - కొన్నిప్రతులు.

98. 1. పేర్చువారు - ఊ. ఎ. ఐ. ఒ. ఖ

99. 1. గడుసుందరుండయి తన - న. 2 పాపి - కొన్నిప్రతులు 3. గార్హ్యమున - అ ఉ ఋ. ఔ. ఖ

100. ఆ. ఉలుము గొన్నవాఁడు తోలు మేన నాఘాత
బంధనముల నొరుల[1] ప్రన్న(దనము
చెఱచినాఁడు పంగు [2]వొఅవగఁ గాలుసే
విఱిచి సాధుజనులఁ బఱిచినాఁడు.

101. క. పిలకాదుల గంతులచే
నలమటఁ బడువారు బడియ నడిచియు ముష్టిం
జలమున బొడిచియు సాధులఁ
దొలుజామున నొంచినట్టి దుష్టచరిత్రుల్.

102. ఆ. పాదరోగు లకుచిపదముల దేహా
యములు [1]మెట్టుటయును నడువారిఁ
దప్పులేక క్రొవ్వితన్నుటయును దొలు
పుట్టునందుఁ గలిగినట్టివారు.

103. చ. జ్వరమున గుల్మపీడ నతిసారములన్ బలువుండులన్ మహో
దరమున వాతపిత్తకఫదారుణరోగములన్ నిరంతరా
తురులగువారు నిర్దయతఁ దొల్లి వినోదముగాఁగ జీవులం
దరమిడి [1]చంపినారు గురుఁదల్లడపెట్టినవారు పార్వతీ

104. తే. గూనివాఁడును బిచ్చుకకుంటు[1]గుజ్జు
గొలుచు లమ్మచో[2]గ్రచ్చులుగలిపి నరకు
దూఁచిపెట్టెడుచో[3]టులఁ దూన్కిఁదరపి
పూర్వభవమున లాభంబుఁ బొందినారు.

105. సీ. వెఱ్ఱులుతోలుమేన వెడ్డున సాధు[1]జ
నము మోసపుచ్చి ధనంబు గొన్న

---

100. 1. ప్రల్లదమున - చ 2. అఱవరె - కొన్నిప్రతులు; వఱపంగఁ గాల్సేయి - న
102 1 సొచ్చుటయు -ఔ.
103 1. నొంచినారు - కొన్నిప్రతులు.
104. 1. గునుకు - న. 2. గ్రంచులు - న. 3. చోటను, చోట్లను - అనిపాఠములు
105. 1. జనంబు వంచించి - ఐ. ఔ ఖ.

జను లనపత్యులు వినుతొల్లి పితృకార్య
దూరులు బాలఘా[2]తులును జూవె
పొలఁతి నపుంసకుల్ పూర్వభవంబున
నెద్దుఁ బట్టినవారు నేమినప్పుఁ
బొరయకుండఁగఁ [3]గోపమునఁ [4]ద్రికచ్ఛేదంబు
[5]గావించినారును గామసుఖము

తే. [6]విఘ్నపఱిచిన తులువలు విధవ తొంటి
జన్మమునయందు భర్తృవంచన మొనర్చి
ధనము గూర్చిన యదియు మదంబు పేర్మి
నోర్తుమగని హరించిన యుగ్మలియును.

106 తే. [1]ప్రయతులై పుట్టి యేవంపుఁబనులఁ గడుపుఁ
బ్రోచికొనువా రహంకారమునను గర్వ
మానమదదంభములఁ దొల్లి మాన్యజనులఁ
బరిభవించిన[2]తుచ్ఛులు పద్మనయన.

107. సీ. [1]దాసత్వమొంది యదల్పులఁ[2] దిట్టుల
నాటులఁ బడుచుండు నట్టి నీచు
లప్పాటఁ దొలుమేన నతిగర్వులై ప్రల్ల
దమ్మునఁ బెక్కండ్రఁ దప్పులేక
తిట్టియు [3]నడిచియుఁ [4]దిరిగినవార లా
[5]పొలువలపైఁ గృప గలిమి మేలు
ధనిక గృహద్వారమునఁ [6]ప్రతిహారి ద
మ్మాఁగంగనుండి దైన్యమునదుఃఖ

తే. పడుజనంబులు ఘోరైకపరతఁ దొల్లి
మానసీయుల కవసర మీనివారు

---

4. వృషచ్ఛేదంబు - ఖ. 5. గావించువారు - పెక్కుప్రతులు. 6. పెంపుచెఱచిన - అ. ఈ.

106. 1. పాత్రుత్రై - పీ. న-కొన్నిప్రతులు. ప్రాతిమెయిపుట్టి - ష. 2 తులువలు - అ. ఉ. ఔ

107. 1. దాసిత్వ - ఈ. ఊ ఔ. చ. 2. చొట్లను బరిభవంబులు గాని బడెడునీచు — ఖ. ఖ.
3. గొట్టియు - ఓ. 4. తెగడిన -అ. 5. పొలముఁ బొవకకృప -.ఖ. ఔ ఖ.
6. ఫణిహారి - పెక్కుప్రతులు , బడివారు - ఓ; ఒడియారి - అ. ఈ

రాజదండితుఁ డకృతాపరాధుఁ గ్రూర
దండదూషితుఁ జేసినతండు సూవె.

108. క. విను నష్టసకలధను లగు
జనములు [1]నిక్షేపమిడిన సరకులు దొలఁగఁ
మున మగుడ నీక నెపముడు
కొనినట్టి యసత్యలోభకుల్సితు [2]లరివా.

109. క. తమబంధులుఁ దారునునో
క్కమరియ తెగటాఱువారు కరుణారహిత
త్వమునఁ దొలుమేన [1]వెడపగ
నమేయ నరవధముసేసినట్టి దురాత్ముల్.

110. వ. అని యెఱింగించి యీశ్వరుం డీశ్వరితో ని[1]ట్లనియె.

111. సీ. ఇంతి నాచెప్పిన యిప్పాపకర్ములం
దఱకును నరకంబు దప్ప దండుఁ
బడుపాటు లెల్లను బడివచ్చి నరులైన
యప్పుడు వాటిల్లునట్టి తెఱఁగు
లివి యట్లుగాకయు నెక్కుడు గాని పా
పంబుల [1]మానుషభవము గలుగు
[2]నిక్కైన నమ్మైన నేకర్మమున ఫల
మైనను మానవు లనుభవింప

ఆ. రోపి మునులు దేవ[3]యోనులు నత్తను
వునన తపముఫలము లనుభవింతు
రనిన దేవి యెఱుఁగ నయ్యె మీఁదయఁ బెక్కు
లర్థములు గృతార్థనై తిననియె.

---

108. 1. త (ద) గదాఁచనిడిన - అ. ఉ ఐ. ఔ. ఖ. 2. లరయన్ -చ; లధిపా - ఙ.
109. 1. నెడపక - అ. ఓ. ఖ; వెఱవక - క, నెడవపఁ గ - ళ.
110. 1. మఱియును - పెక్కుప్రతులు
111 1. మనుజభావంబు - ఒ. 2. నెత్తైన - కొన్నిప్రతులు, నక్కైన నామ్మైన నౌకక్క ముఖఫల -
న నక్కైన నమ్మైన నధిక కర్మముఫల - ఓ 3. యోనుల వర్తనమును తపము - ళ.

112. వ. అని వెండియు పర్వేషునితోఁ బానుజులపరజన్మంబునం గాని కర్మఫలంబు లను
భవింప రంటిరి తప్పుచేసిననరుల నరపతు లిట్టితప్పున కిట్టిదండంబనునిరూపణం
బున దండించెద రని యక్కర్మంబుఫలం బప్పట్టువునన యనుభవించుటగాదె
యనిన గౌరికి గంగాధరుం డిట్లనియె

113. సీ. జనపతుల్ దమరాజసంబున దండించి
నారు గా[1]నొల్లక నరులతప్పు
లకుఁ దగుదండంబు లన వారిఁ బఱతురు
తక్కొరు లెవ్వరుఁ దప్పుసేయ
వెఱచుటకై యట్టి విధి [2]మూఁడుటది పూర్వ
కర్మంబుఫలనన కాని యపుడు
గలిగిన తప్పునఁ గా దన్న నాదేవి
యవనీశదండితుఁ డైననరున
తే. కషము వాయునొ పాయదొ యనిన నీశ్వ
రుండు నృపదండితుఁడు యమదండమునను
బడఁడు లేనితప్పున [3]నరుఁ బఱిచినతనిఁ
బఱుపక న్నాతనిని యమబాధ వొందు.

114. వ. అని నిర్దేశించి వెండియు

115. క. విను తమచేసినకర్మం
బునఫలమెవ్వరికిఁ ద్రోచి పుచ్చఁగ రాదె
ట్లును గుడువక[1]పోదది యన
విని పార్వతి యిట్లులనియె విభునకుఁ గృష్ణా.

116. తే. కర్మఫలములు గుడిచినఁగాని పోవ
వంటి వానిఁ బ్రాయశ్చిత్తమపహరించు
నందు రశ్వమేధంబున నఖిలపాప
ములును జెడుననఁగా వింటి భూతనాథ.

---

113. 1. కొక్కొక - ఇ. శ. ష; నొక్కొక - అ; కొల్లక - న; నొల్లనివారి తప్పు - ఏ
2. మూఁడుడది - ఇ. ఈ. శ. బి. నృపుఁ బఱిచినతని, నృపుఁ బఱచు నలిని, గడుఁ(బ
(ఱి) ఱచినతని, నారుఁబఱచినతని - అనియు పాఠములు.

115. 1. పోదనినను - ఉ.

117 వ. అనిపలికి యిది యెట్లొకో యనుటయు భవుండు.

118 ఆ. అతివ కామకృతంబులైన కర్మంబుల
ఫలము లనుభవింపవలయు [1]వినుమ
కామకృతముచేసి టగలుగుఁ బ్రాయశ్చిత్త
[2]మాచరింప సంశయంబు వలదు.

119 క. కావునఁ గుడువక [1]పోలియదు
దేవాసుర[2]మునులకైన దేవి [3]కర్మో
ద్భావితఫల మీయర్థము
నీ వలవఱపుము భవన్మనీషఁ దిరముగన్.

120. వ అనిచెప్పి యప్పరమేశ్వరుండు వెండియు.

121 క. సుకృతముల నరుఁడు నాకము
నకుఁ జను నవి గొంచెమైన నరుఁడుయగును వా
నికి దివి కేఁగి డిగిన యత
నికి మానుషమై భవములు నెఱయం గల్గున్.

122. వ అని నిర్దేశించి యుద్దేశరూపంబునం గర్మంబుల తెఱం[1]గెఱింగించి యింక నేవి యడుగ వలతడుగు మనిన నంబిక కర్మకరణంబు జంతువశంబు గ్రహవశం[2]బునా రెండు తెఱంగులం జెప్పుదు రందెయ్యది దృఢంబని యడుగుటయు మృడుం డిట్లనియె

123. తే. నాతి విను గ్రహచారంబు హేతువులుగ
నశుభములు శుభములు నరుఁ డాచరించు
గ్రహము చేయించునే తాన కాక చేఁత
కొడయుఁ డటుగాన ఫలములు గుడువవలయు.

124 వ. అనినఁ జావనునది యేమి యని యుమ యడుగ నీశానుం డిట్లనియె.

---

118 1. వినుము కామకృతము చెడును కడునొప్పకృత్యంబు నాచరింప - ఒ 2. యజ్ఞవిధుల నందియంబువలదు - ఐ ఖ

119 1. పోవదు - ఐ ఒ 2 పరులకైన - అ 3. ధర్మో - ఔ. అర్థము విచార్యము.

122 1. గెఱింగించితి నింకనేమి - కొన్నిప్రతులు 2. బని - కొన్నిప్రతులు.

125. తే నిత్యుడాత్ముండు దేహ మనిత్య మతఁడు
ముదిమిఁ దెవులున వికృత మై యది వికలతఁ
బొందుటయు దానిఁ దొఱఁగిటాఁ బోవునట్టి
దశకు మరణ మన్పేరయ్యెఁ [1]ధవళాంగి.

126 క జీవుఁడు జీర్ణశరీరముఁ
బోవిడిచి నూతనముఁ బొందఁ బుట్టుకుపేరం
దా వెలయుం దద్దశ జీ
వావలివర్తించునిటు గతాగత[1]పరమై

127. వ. అనిన విని పార్వతి శర్వునితో బాలురు చచ్చుటకును వృద్ధులు పెద్దకాలంబు బ్రదుకుటకును గారణంబేమి[1]యనుడు నతండు

128. తే. మేను జీర్ణముగాఁ జేయుఁ గాని మరణ
మొందఁ జేయదు విను కాల మెందు నరుని
పూర్వకర్మంబు లాయువుఁ [1]బొందఁ జేయ
సన్నముగఁ జేయ బ్రదుకును జావుఁ[2] గలుగు

129 వ అనిచెప్పిన నాయు వేమిటం బెరుఁగు నెద్దానం దఱుఁగు ననినవిని యుమకు నుమాపతి యిట్లనియె

-: శివుఁడు పార్వతికి నాయుర్వృద్ధిక్షయంబులకుఁ గారణంబులు చెప్పుట :-

సం 13 - అను I 15 - 2300

130. తే. క్షమయు సత్యంబుఁ గృపయు శౌచమును గురుల
వలనిభక్తియు నాయువు వొలుపు నిచ్చు
నలుకు బొంకు క్రూరత శుచితాపగమము
గురువిరోధమాయువుఁ గడుఁ [1]గుందఁజేయు.

---

125 1 ధవళనయన - అ ఈ.
126 1. పదవిన్ - ఉ పీ. శ, వ స.
127. 1 యనుటయునతండు - పెక్కుప్రతులు.
128. 1. బొందఁజేయ - ఎ. 2. వచ్చు - కొన్నిప్రతులు
130. 1. గ్రుంగఁజేయు - పీ. శ ష. స

181. తే. తపమునను బ్రహ్మచర్యవ్రతమున హింసమి
తాశనమున రసాయనాభ్యాసమునను
బెరుఁగు నాయు వాక్క్రియలపై నరుఁడు ప్రీతి
గలుగుటయుఁ బూర్వభవకృతకర్మఫలము.

182 క. తనలావున కధికమయిన
పనిసేయుట [1]యుక్తమును నపథ్యము నగు భో
జనములు వారించు నాయువు
వనిత యవియుఁ బూర్వకర్మవశతనకలుగున్.

183. వ. మఱియు నొక్కవిశేషంబు సెప్పెద.

184. ఆ. సుకృతు లమరలోక[1]సుచిరవాసులు నిట
దిగి చిరాయువులును నగుదు [2]రితరు
లతిచిరముగ నరకగతు లయి తుది నాయు
వల్ప మగుమనుష్యుల గుట గలుగు.

185. క. నా విని భవాని పురుష
స్త్రీవిధములు రెండుగలవు [1]త్రినయన వానన్
జీవుఁడు వర్తించు తెఱఁగు
నీవేర్పడఁ జెప్పవే యనియెఁ గంసారీ.

186. వ. అనిన విని మహాదేవుండు మహీధరతనయ కిట్లనియె.

187. క. తాత్త్వికము లైనపురుష
స్త్రీత్వంబులు లేవు పార్వతీ జీవున కా
[1]తత్త్వమున కహంకృతిఁ గ
ర్మత్వ మొలసి [2]భావ్యవిధమ మెయి[3]గొనుచుండున్.

---

182. 1. యుత్కటము - న కొన్ని ప్రతులు.

184. 1. సురచిర - వాసులీయిలకుదిగి చిరాయువులుననగుదు రతిదురితులు నరక - పీ. శ. న; 2 రతివ దురితముల నొనర్చి నరక నివాసులై యాయువల్ప - బ. ఖ

185. 1. త్రిణయన - ఔ. క. శ. ష.

187. 1. తత్త్వమ్మున హంకృతి - బ. ఔ. ఖ 2. భావవిధముమెయి - ఉ. 3. కొనవలయున్, కొనఁజేయున్ - అనిపాఠములు.

138. వ. అని మఱియును.

139. ఆ. కర్మములకుఁ గర్తగాఁ డాత్మ(?)ఁ డతని స
త్వము రజస్సుఁదమము [1]వాతపిత్త
కఫము లెట్లు మర్త్యకాయగతము లగు
నట్లు పొందుఁ గర్త లవియ చూవె

140. తే. సత్యశౌచదయాదులు సాత్త్వికములు
రమణి లోభ[1]సంగాదులు రాజసంబు
లనృతహింసాపరత్వభయాలసత్వ
ధైర్యహీననిద్రాదులు తామసములు.

141. క. ఇవి నానాముఖములఁ బగు
వికారముఁ [1]బొందఁజేయుచుంబరఁగును హై
మవతీ కావున సర్వం
బు [2]వినుము గుణకృత్య మిట్టిబోధం బొప్పన్.

142. తే. తన్వి సాత్త్విక రాజస తామసాత్మ
లైనవారలఁ బుణ్యలోకానుభవము
మనుజభావంబు నిరయపీడనముఁ బొందు
మోక్షలక్ష్మి నిర్గుణునకు మునుఁగ మునరు.

143. వ. అని వెండియు

144. సీ. ఎట్టివి కర్మంబు లట్టివ నరులకు
భాంశుభసంప్రాప్తు లట్లుగాక
[1]పరవిప్రియమున మేల్ పడయుటయును
గల్గుఁ బతిభృత్యతతిఁ బటుభర్త్సనముల
నొజ్జశిష్యులఁ దర్జనోక్తుల వెజ్జులో
గార్తుల నానావిధౌషధముల

---

139. 1. వాయుపిత్త - కొన్నిప్రతులు; వాతపైత్య - ఉ. ఔ

140. 1. ప్రముఖములు రాజసములు - అ.

141. 1. నొంద - కొన్నిప్రతులు. 2 వినుగుణత్వముననిట్టి - ఈ.

143. 1. అనినిర్దేశించి వెండియు - పెక్కుప్రతులు

144. 1. అనురక్తి పేర్మిమై నటుమేలునగుఁజంట్లుఁ బ(లి)డియును వత్సల భావకల్మి - ఉ.
ఔ. (భావకల్మి) పరమప్రియుల తమిభార్యల నేల్పరి పదిపదిభృత-క

నలమటఁ గొందింతురు వివిధంబులచేత
అన్నియు సుకృతంబులై ఫలించు

ఆ. అని మఱియును జెప్పు సఖశేంద్రియోపేత
మగుజరాయుజంబు సండజంబు
నువిధ [2]చోఁకు నెఱుఁగుముద్భిజ్జములు స్వేద
జములకడియుఁ జూపు సంభవించు

145. క. నరుఁడు జరాయుజములలోఁ
దరుణీ వినుముత్తముఁడు శ్రుతములేకున్న౯
[1]సరినతఁడు పశువుఁగావున
వరిష్ఠమగునట్టివినికి వలయు నరునకున్.

146. క. [1]ఇరుదెఱఁగు విను తమము శా
ర్వరమును దేహజము శార్వగము దేజస్సం
స్ఫురణమునఁ బాయు శ్రుతమునఁ
బరిహృతమగు దేహజంబు పర్వతపుత్రీ

147. ఆ. బ్రహ్మయాతమంబుఁ బాపుటకై తపో
వ్యాప్తిఁ బడసె శ్రుతులునంగములును
గానఁ గార్యములు నకార్యంబులును వానఁ
దెలిసికొనఁగ బుద్ధికలఁక [1]దీఱు

148. తే. క్రోధకామాదులైనదుర్గుణము లెల్ల
వాయుహతిమేఘపటలంబు వాయు [1]పగిది

---

2 సోకు – కొన్నిప్రతులు.

145. 1. ధరజనితఁడు పశువు – ఈ; నరియతఁడుపశువు – కొన్ని ప్రతులు, నరిపశువునకుం గావున – ఆ. ఉ ఔ శ | ష.

146. 1. ఇరుదెఱఁగు వినుత మము భాస్కరుఁడుదయంబైన యట్టిఘనతరతేజః – అ; ఇరుదెఱఁగు వినుతమము భాస్కరోదయంబైనయట్టి గర్వితతేజః – ఉ. ఔ; ఇరుదెఱఁగు తమ మొకటిభాస్కరోదయంబైన యజ్జగద్దిత తేజః – ఇ ఖ.

147. 1. దేఱు – కొన్నిప్రతులు.

148. 1. తంగి – ఆ.

శ్రుతముచేఁ బాయు నరులలో సురలకరణి
శ్రుతయుతులు దేజరిల్లుదు రతిశయిల్లి.

149. తే. శ్రుతము నరునిఁ బరిజ్ఞానయుతునిఁ జేయు
[1]వానిసుకృత మల్పమును ననూనఫలము
నిచ్చు నజ్ఞాని సత్కర్మ మెంత యైన
నఫల మగుఁ గాన శ్రుతవంతుఁ డగుట [2]వలయు.

150. వ. అని నిర్దేశించి సర్వేశ్వరితో సర్వజ్ఞుం డిట్లనియె.

151. సీ. మృతిఁ బొంది [1]వేగ జన్మించినఁ [2]బూర్వదై
హికము[3]లన్నియు బుద్ధి నెలయువాఁడు
జాతిస్మరుం డనఁ జను నయ్యెుఁక [4]పెద్ద
వాఁడు గాఁగాఁ కెడు వనిత వినుము
పు ట్టెఱుంగుట[5]కల్మి బోధించు[6]టకు నా స్తి
కు[7]లమును జన్మంబు గలుగు తెఱఁగుఁ
జచ్చిపోయినవారు వచ్చి యత్తను వొంది
మెలఁగు టొక్కొక్కచోట గలిగి యుండు
తే. నట్టితెఱఁగు వెంగలు లైన యమునికూత
లొరులఁ [8]జని కొనిపోయినఁ గరుణతోడ
నమ్మహాత్ముండు మగిడి [9]బొమ్మన్న నరుగు
దెంచు [10]టని నీ వెఱుంగు సందియము లేదు.

*-: శివుఁడు పార్వతికి స్వప్నాదులతెఱం గెఱింగించుట :-*
సం 13-అను I 15-2457

152. వ. అని తెలిపిన గౌరి కలయనునది యేమి యెఱింగింపవే యనుటయు నతండు

---

149. 1. దానుసుకృత మనల్ప మనూన ఫలము - స. 2. మేలు - ఉ. ఓ క.
151. 1. మగుడ - ఐ 2.పూర్వదేహంబున జన్మంబు లగు టెఱుంగు - ఏ. 3 లన్నరుబుద్ధి - కొన్నిప్రతులు; లతనబుద్ధి - అ; నుదనబుద్ధి, లనగుబుద్ధి, లుదనబుద్ధి - అనిపాఠములు
4. పెద్దవాఁడు - స. 5 గల్గి - ఇ ఈ. శ. 6. దగు. టయు, దగు - అనిపాఠములు
7. లుఋనర్జన్మ యుక్తులు నెఱుఁగరు - అ. ఈ. 8. నవిగొని, నడికొని - అనిపాఠములు.
9. బొమ్మనఁగనరుగు - కొన్నిప్రతులు. 10. టిది, దని. టది - అనిపాఠములు.

153. ఆ. స్వప్న మనఁగ సుప్తజనమునమనశ్చేష్ట
యదియుఁ గాంచు [1]నొగిన నాగతములఁ
గానఁ గలలు సూచకము లగు భావిక
భాశుభోదయముల [2]కనుచుఁ జెప్పె.

154. వ. చెప్పిన విని భవాని భవుని [1]తోడ.

155. సీ. దైవంబొ కర్మవర్తనము జనంబు న
త్సాహంబొ యనిన నతండు దైవ
మోపి కర్మంబు సేయుట లేదు దైవసం
కలన ఫలం బిచ్చుఁ గాని వినుము
దేవి పూర్వకృతంబు దైవ[1]నామకమునఁ
బరగు [2]నప్పటిచేత పౌరుషంబు
కృషివోలె నుండుఁ బౌరుషగతి [3]వర్షస
ద్వాయువు లట్లు దైవప్రకార
తే. మెఱుఁగు [4]ఖననసమధనముల నెట్లు జలముఁ
జిచ్చుఁ బుట్టు నమ్మెయి నరుచేష్ట దైవ
యోగమున సిద్ధిఁ బొందు నుద్యోగరహితుఁ
డెత్తెఱంగున దైవసమృద్ధిఁ [5]బడయు.

156. క. కావున నుద్యోగంబును
దైవంబును గారణములు దామరసాక్షీ
యేవిధము[1]నఁ గర్మముల ఫ
లావాప్తికి దీన సంశయము [2]వలదు సుమీ.

157. తే. అనిన నంబిక గర్భంబు నాత్మఁ డెట్లు
చొచ్చు ననవుఁడు [1]నభవుఁడు సురతబీజ
రక్త[2]దైవముల్ సూవె కారణము లాత్మ
గర్భసంవేశనమునకుఁ గమలనయన.

---

153. 1. మనమనాగతముల - కొన్నిప్రతులు. 2 కనియు - కొన్నిప్రతులు.
154. 1. కిట్లనియె - ఆ ఐ. ఔ. ఖ.
155 1. మానమ్మున - ఒ. 2 నిప్పటి - కొన్నిప్రతులు. 3. వర్షంబు వాయువు(న)లట్లు-ఊ. పీ. శ ష. 4. నమయంబు వచ్చిననెల్ల యవియుఁ జెడుచుఁబుట్టు - ఆ. ఉ. ఔ. 5. బొందు - ఐ. ఒ. ఓ. శ ఖ
156. 1. ౦ - పెక్కుప్రతులు. 2. లేదు సుమీ - పీ. ఐ ఒ. ఖ. శ.ష.
157. 1. సురతికి - క. 2. రేతముల్ - ఓ.

158\. క. మాయారహితుఁ డవాంకా
రాయత్తుఁ జూవె [1]పుట్టు వనుచెఱఁ బడి నా
నాయాసంబులఁ బడు నా
శ్లాయుతుఁడై యాత్మఁ డింత చర్చింపు [2]మదిన్.

159\. సీ. అని చెప్పి దైవరహస్యంబు [1]వినుపింతు
వినుము మని పలికి యిట్లనియె శివుఁడు
తొల్లి మనుష్యులు తొలుమేని కర్మంబు
[2]లెఱుఁగఁగాఁ జాలుట నెల్లవారు
మేలు సేయగ ననిమిషలోకమున నధి
కం బగు సందడి గాఁగ మనుజు
లమరులై పేర్చిన నజుఁడు వేల్పుల సంక
టము [3]వాయుటకు నుపాయము దలంచి
తే. మానవుల కయ్యెఱుకకల్మి మాన్చి కామ
రోషముల నొలయించిన దోషకృతుల
వారు నరకాదిసమ్మర్దకారు[4]లగుదు
నదియుఁ గా దని చింతించి [5]యనువు గాంచి.

160\. క. సరిగా నా రెండెడలకు
నరులు సనుట గోరి మనమునం గానమియుం
బరలోకవిధము శాస్త్రము
వెరవునఁ గనుటయు నొనర్చె విధి వారలకున్.

161\. వ. అనినం బార్వతి పునర్జన్మంబు గలదు లే దనుసంశయంబుతోన [1]పొట్టుపొర లగుదురు నరులు దాని[2] తెఱంగు నిశ్చయింపవే యనుటయు నంధకారాతి యి ట్లనియె.

---

158\. 1. గర్భమను - ఉ. బి. ఔ. ఖ. 2 తగన్ - అ

159\. 1. వివరింతు - ఎ. 2. తెలుఁగంగ - కొన్నిప్రతులు; నెఱుఁగఁగా - శ. ష. 3 బాపుట కు-ఎ పి. ఒ. ఓ. క. 4. లగుదురదియు - ఆ ఇ. ఓ.క.,పి. శ. ష. 5. యాత్మఁ దలఁచి - ఊ. చ.

161\. 1. పుట్టుపొ (వొ) రలగుదురు, పుట్టుదురునరులు - అనిపాతములు. 2. తెఱంగెఱింగింపవే- పి. శ. ష. న. - కొన్నిప్రతులు.

162. క. కలదో లేదో యనియెడు
తలపోతయ కాని నిశ్చితము గాదు సురా
దులకుఁ బునర్జన్మంబుల
కలిమియు లేమియును నరులు గానమి దప్పే.

163. క. కల దది యారక కానఁగ
నవియె శ్రుతివాక్యసమితి యర్థంబులపై
నిలిచిన శ్రద్ధం గ్రమమునఁ
దెలివొందినఁ గాక యెట్టి ధీమంతులకున్.

164. వ. అనిన విని గౌరి గంగాధరున కిట్లనియె.

165. క. మృతులైన[1]వారలు నిరా
కృతులై యుండుదురు వారిఁ గినాశభట
ప్రతతి కొని చనుట యాపితృ
పతి శాసించు[2]టవి యెట్టిభంగులు దేవా.

166. వ. అని యడిగిన నద్దేవుం డిట్లనియె.

167. సీ. తఱియైన మనుజులఁ దనువులు విడిపించి
మాయాశరీరసమన్వితులుగ
నొనరించి దూతలు గొనిపోదు రందును
ధర్మ[1]వర్తుల సుగంధంబు మృదువు
నైనమార్గమున మధ్యపువారి నిర్బాధ
సరణిఁ బాపాత్ములఁ బరుసఁ దనము
ముటికియుఁ గల పథంబున నడపింతురి
ప్పురుసునఁ జని పితృపతికిఁ జూప
ఆ. నతఁడు పుణ్యలోకగతియును మానవ
త్వంబు ఘోరనరకవాసమును వి
ధించి పుచ్చు వారిఁ దెలచి మన్నించి భ
ర్జించి వరుసతోడఁ జిగురుఁబోఁడి.

---

165. 1 వారుప్రేతాకృతులై, వారువిగతాకృతులై, వారువివిధాకృతులై - అనిపాఠములు
2. టయు నెట్టిభంగులు, టవియెట్టిభావము, దదియెద్దిభావము - అనిపాఠములు

167. 1. వర్తసులగంధంబు - ఆ ఈ. ఉ

168. వ. అని చెప్పిన నగేంద్రతనయ చంద్ర[1]శేఖరునితోఁడ.

169. క. నరకం బెట్టిది కల్మష
కరులగు జముఁ డెట్టిభంగిఁ గాఱియఁ బెట్టున్
వరదా చెప్పు మనుడు న
ప్పురహరుఁ డి ట్లనియె వృష్ణిపుంగవ ప్రీతిన్.

170. సీ. రౌరవం బనఁగ [1]ధరాస్థలి క్రింద మ
హారౌరవంబన నవుల దాని
కావల విను కంటకావనం బన నుండుఁ
గ్రమవృత్తిఁ జేర్చు దుఃఖములు గలిగి
యగ్నికుండంబు నానటఁ బంచకష్టంబు
నాఁ గల వి ట్లున్న నరక[2]తలము
లై దండుఁ బాపక్రియాతారతమ్యంబు
లూహించి యంతకుం డునుపఁ బనుచుఁ

తే. దగినయెడలఁ బాపాత్ములఁ దద్భటాలి
దహనకర్తన బంధన తాడనములఁ
[3]బఱుప [4]వారలఁ గుక్కలు గఱచుఁ గ్రిములు
దొలుచు గ్రద్దలు నొప్పించుఁ దుండనిహతి.

171. వ. మఱియు[1]ను యమదూతవ్రాతంబు నానావిధవేదనలం బెట్టి దండించుచుండు.

172. ఉ. అమ్మెయిఁ [1]బాపముల్ వొలయునంతకు దుఃఖము [2]లంది కీటజ
న్మమ్ములఁ బక్షియోనులఁ గ్రమంబునఁ [3]బొంది మృగత్వమానుష
త్వమ్ముల నొలిఁ [4]బొందుదురు వా రినుమెంతయుఁ గ్రాఁగి కల్మష
[5]త్వమ్ము దొలంగుమాడ్కి నవతామరసప్రతిమానలోచనా.

173. వ. అనిన విని పార్వతి పాపంబు లనునవి యెట్టివి యెఱింగింపవే యనుటయు
నీశానుం డి ట్లనియె.

---

168. 1. ధరునితోడ - కొన్నిప్రతులు.

170. 1. ఘోరముదాని క్రింద - ఓ క. 2. తతులయందుల - ఖ 3. బఱచు - పెక్కుప్రతులు
4. వారిని - ఎ

171. 1 నయ్యమదూత - ఒ. ఓ

172. 1. బాయుఁబాపములనంతక దుఃఖములందు - ఎ. 2. లొంది, పొంది - అనిపాఠములు.
3. నొంది - ఆ. 4. జెందుదురు, నొందుదురు - అనిపాఠములు. 5. త్వమ్మునఁ బాయు
మాడ్కి - ఐ. ఖ.

*—: శివుఁడు పార్వతికి మానస వాచిక కాయికము లను త్రివిధపాపములఁ దెల్పుట:—*

సం 13-అను I. 15-2792.

174. సీ. మానిని త్రివిధముల్ మానసవాచిక
కాయికంబులఁ బాతకంబు లందుఁ
బరధనాపేక్షణ పాపానుమోద ధ
ర్మద్వేషముఖములు [1]మానసంబు
లనృతదారుణభాషణాదులు వాచిక
ములు వధంబును బంధమును నభక్ష్య
భక్షణంబును నన్య[2]భామారతము మద్య
పానంబు మొదలైన [3]పాపకృతులు

తే. కాయికంబులు విను మధికం బవేయ
[4]పాన మది దుష్కృతంబులలోన నెల్లఁ
బానమున నిందతో వచ్చుఁ బ్రాణగొడ్డ
ములును జేటులు నరకాబ్ధిమునుఁగుటలును.

175. క. లోకము నిర్మర్యా[1]ద
త్వాకుల మై చెడదె సజ్జ[2]నావలి మధుపా
నాకాంక్ష దొఱఁగ కున్న గు
ణాకల్పా యేమి సేయ దక్కిఁడు నరున్.

176. క. కావున నేవిధమున సుర
[1]సేవింపక యుడుగు టొప్పుఁ జెలువ సకలవ
ర్ణావలికి దానఁ గీర్తి
శ్రీవైభవ పుణ్యగతులు సేర్చికొన నగున్.

177. క. అన విని యంబిక సుకృతము
లనునవి యెట్టి వని యడుగు నద్దేవికి ని

---

174. 1. మానసములు లనృత - అ. ఉ. ఐ. ఖ. 2. భామానురతి, భామానురతి, భామానురత- అనిపాఠములు. 3. పాతకములు - అ. ఔ. క. ష; పాపవిధులు - కొన్నిప్రతులు. 4. పానములు, పానమును - అనిపాఠములు.

175. 1. దావ్యాకులమై - కొన్నిప్రతులు. 2 నావళి - అ.

176. 1. సేవించుట - ఉ. ఓ.

ట్లనియెం జంద్రార్ధధరుం
డనుమోదోల్లాసి యగుచు నంబుజనాభా.

178. తే. ఔపరమికాభిధానంబు నంబుజాక్షి
[1]నిరుపకరణాఖ్యగును సోపకరణనామ
కంబు నయి లోకమున [2]సుకృతంబు వరఁగుఁ
ద్రివిధముల వానిఁ దగ వివరింతు వినుము.

179. సీ. ఔపరమిక మనునది పాపవర్జన
మకట కానఁగ నేర రజ్ఞజనులు
యత్నంబు వలదు [1]వ్యయం బేమియును లేదు
పరలోకభీతిఁ బాపములఁ దొఱఁగి
సంత[2]న సుగతిసౌఖ్యం బొడఁగూడెడు
నదియు నాత్మాధీన మట్టిదాని
సుకరత్వ మెఱుఁగక చొత్తురు నరకంబు
వెరవరుల్ శ్రుతమున వృద్ధయోగ
తే. మునను ధృతికల్మి నింద్రియ వినియమమున
నది దమకుఁ గలిగింతురు యమ మనంగఁ
బరగు నది దాన నాకంబుఁ బడయ వచ్చు
ననినఁ జెప్పంగ నేల [3]ధర్మాభియుక్తి.

180. ఆ. నిరుపకరణ మనఁగఁ బరఁగు శౌచంబు స
త్యంబు శాంతి దాంతి యార్జవంబు
వ్రతనిరూఢి సముపవాసంబు బ్రహ్మచ
ర్యంబుకల్మి నియమమంద్రు దాని.

---

178. 1. రలదు కరుణాఖ్య మదిసోవ - ఔ. అర్థమువిచార్యము 2 నంశ్రితంబు - ఏ.
179. 1. ప్రయత్నమేమియునులేదు - కొన్నిప్రతులు. 2 ననుగతి - అ. ఇ. ఈ; నసుకృతి - ఉ. 3 ధర్మాధినిరతి - ఇ.

181. సీ. అభ్యంతరంబు [1]బాహ్యము ననఁగా శౌచ
మిరుదెఱఁగై యుండు హృదయ సుకృత
మాభ్యంతరము విను [2]నాహారశుద్ధియు
నంగశోధనము బాహ్యంబు సత్య
మన్నది గన్నది విన్నది యున్న[3]రూ
పున నుక్త మగుట యంభోజవదన
శాంతి బుద్ధీంద్రియసన్నివారణ దాంతి
కర్మేంద్రియముల యోగ్యప్రవృత్తి
తే. యార్జవము గుటిలుఁడు గామి యగువ్రతంబు
మంచిపని పూని నడపుట యంచితోప
వాస మశననిగ్రహ మనవద్యమైన
బ్రహ్మచర్యంబుఁ గామునిబారిఁ బడమి.

182. ఆ. నాతి తీర్థసేవనంబును నియమవి
శేష మగుట దానిఁ జెప్ప వలయు
సకల[1]నదులఁ దీర్థసంజ్ఞలు గల వబ్ధి
కరుగునట్టి విచ్చు నధికఫలము

183. తే. వానియందును ముని[1]పదమాననీయ
దేశములు నబ్ధిసంయోగదేశములును
[2]దెలియు మన్యోన్యసంగమదేశములును
బరమతీర్థంబులగుఁ బద్మపత్త్రనయన.

184. క. వనధి మహాతీర్థం బం
దును సంయమివరులచేతఁ దొల్లి ప్రియమునం
గొనియాడఁ బడినచోటులు
విను ముత్తమతీర్థములు వివేకాభరణా.

---

181. 1. బాహ్యంబుననశౌచ - అ. ఈ. 2 మాత్మశుద్ధియుఁ దగనంగశోధ - ఉ. ఊ. చ. ష. 3. రూపొగి - ఈ. చ, రూపునక్రమమగుటయంభోజ - అ. ఈ; రూపు సుకరమగుటయంభోజ - ఎ.

182. 1. నదులు - అ. ఈ. ఊ. ఐ. ఖ.

183. 1. వర - పెక్కుప్రతులు. 2 దేవియన్యోన్య - ఈ. ఎ.

185. క. వెలి శుచియై మఱి తీర్థం
బులు సొచ్చుట మేలు నియమములు దీర్చి తగన్
[1]వెలలినయెడ దేవార్చన
ములు విప్రార్చన లవశ్యమును గృత్యంబుల్.

186 క. చేరువ తీర్థము కంటెను
దూరపుఁ దీర్థంబు మేలు తోయజవదనా
శారీరాయాసము [1]ద
త్కారణమై వేదవాక్యగతి యిట్టుండున్.

187. క. విను సోపకరణ [1]మనునది
ధనధాన్యాదికసమగ్రతను గృహామేధుల్
గొనియాడు తెలుఁగు దానం
బున [2]వైదిక పైతృకాది పుణ్యక్రియలన్.

188. సీ. న్యాయార్జితంబైనయర్థంబు వేద[1]వి,
త్త్వము శాంతి మొదలగువరగుణములు
గలవిప్రునకుఁ బుణ్య[2]కాలపావన దేశ
కలితంబుగా భక్తి గలిగి యీగి
మేలిదానము శక్తి మిగులుట శక్తికిఁ
దగుట దానికిఁ గడుఁ దగమి యుత్త
మము మధ్యమము నధమము నగుదానవి
ధానంబు వినుమిట్లు దైవికంబుఁ
తే. పైతృకంబును లోనైనపనులఁ దాను
వేడ్క[3]సేయువస్తువుఁ గొను విప్రుకోర్కి

185. 1. వెలువడునెడ - అ. ఉ,

186. 1. దత్కారణమని, దత్కారణమో, దత్కారణముగ - అనిపాఠములు.

187. 1. మన్నది - కొన్నిప్రతులు. 2. దైవికపైతృక - పెక్కుప్రతులు.

188. 1. తత్వము-అ. ఆ. ఈ. ఎ. ఓ. చ.జ. 2. కాలంబునను దేశ - ఉ, ఓ. ఔ. సేయవు
గోవును విప్రుకోర్కి - క.

కనుగుణం బగునదియును నర్థి నిచ్చు
టధికతర మైనఫల మిచ్చు నంబుజాక్షి.

189. తే. [1]చేయు సెంతయుమేలైనం జేసి పిదప
వగచినట్టిదానము దనుం బొగడికొన్న
దానవిధి నిష్ఫ[2]లంబులు గాన రెండు
నుడుగుదాత మహాఫల మొందం గాంచు.

190. వ. అనుటయు దాక్షాయణి దాతవ్యంబు లెయ్యవి చెప్పు మనిన భవుం డిట్లనియె.

-: శివుఁడు పార్వతికి దానఫలవిశేషంబుల నెఱిఁగించుట :-

సం 19- అను I 15-3206

191. సీ. అన్నంబుం దోయంబు నఖిలజంతువులకుం
బ్రాణముల్ గాన యప్పరమవస్తు
వులు మేలు దాతవ్యములలోన నెల్లను
నతిథుల కవి యిచ్చుం టమరలోక
చిరమహాసౌఖ్యంబుం జేయుం గాంచన మగ్ని
యగుటం దద్దానమత్యంతపావ
నము సర్వకామప్రదము గోవు సద్విప్రు
నకు నీగి తద్రోమనికరసంఖ్య
ఆ. [1]వరుసనాకలోకవాసంబు గావించు
నందుం గపిల నిచ్చునాతం డిరువ
దొక్కటతరమువారి నూర్ధ్వలోకమునకు
ననుపం జాలు వికచ[2]వనజవదన.

192. క. విను భూమిదానకర్తకు
ననిమిషలోకమున నిలువ నగు సౌఖ్యంబుల్
దనరుచు నుండంగ నెఱపెం
పున భూమి గలంతకాలమును గిరితనయా.

---

189 1. చేయుచెంతమేలైనను - పెక్కుప్రతులు. 2. లంబగు - క.
191. 1. వర్షమమరలోక - ఈ! వర్షనాకలోక - కొన్నిప్రతులు. 2. నలిన - అ. ఇ.
ఈపాఠమున అఖండయతిచూడనగును.

193. ఆ. భూమి [1]సకలమగువిభూతి విశేషజా
తంబు గలుగుఁ గానఁ [2]దత్ప్రదాన
మెల్లవస్తువులును నిచ్చినయట్లగు
దానఁ బోని [3]పాపతమము లేదు

194. క. అతివా కన్నియ నిచ్చినఁ
[1]బితృపతి ముద మందు సురలుఁ బ్రీతు లగుదు రం
చితగతి కర్తకు దొరకొను
నతితేజ[2]శ్రీయశస్కమగు నభ్భవమున్.

195. తే. విద్య యిచ్చుట సత్పాత్ర విషయమైన
నవ్యయానందపదముఁ జేయంగఁ జాలుఁ
[1]దగఁగ[2]దక్షిణ యిచ్చి పేదలకు విద్య
[3]యీ నియోగించుటయుఁ దత్సమానకృతియ.

196. సీ. [1]తిలరాశి యిచ్చినఁ గలుగు నగ్నిష్టోమ
[2]ఫలము వాసోదానఫలము చిరత
రాయువు గోడు గీగి యఖిలపీడలఁ బాపు
దాసదాసీజన[3]దానమహిమ
[4]కర్మవిమోక్షంబుఁ గలిగించు దీపదా
నముఫల మాత్మాతివిమలభావ
మంబు [5]ప్రవాహంబు నధిగమింపఁగఁ జేత
నిఖిలవ్యసనముల నిస్తరింపఁ

---

193. 1. నిఖిల - ఆ. ఉ. ఔ. ష. 2 దత్ప్రభావ - అ. ఈ. జ. 3 పాపతతులులేవు - ఏ. ఒ. ఖ.

194. 1. బితృతతి - కొన్నిప్రతులు 2 శ్రీ. ప్రశస్తమగు - ఆ; శ్రీకరంబున పునర్భవమున్- ఏ; ఈపాఠమున అఖండయతిచూడవలెను శ్రీయశస్కమగునుభవమున్ - ఔ.

195. 1. దగిన - అ. 2. దక్షిణలిచ్చి - ఈ. చ. 3 దానమిచ్చుటయునుదత్సమాన - జ. ల! దానియోగించుటయు దత్సమాన - ఐ. ఖ.

196. 1. తిలదానమిచ్చిన - ఎ. 2. ఫలములు మరియునుబరఁగఁజేత - ఔ 3. తతుల - అ. ఈ. 4. కమనీయమోక్షంబు - ఐ. ఖ. చ; కర్మవిమోక్షతఁ గలిగించు - ఏ. 5. ప్రభావంబు-ఔ; ప్రదానంబునధిగమింపగ దానములులేవు కల్మషములహరింప. ఐ; ప్రవాహంబునధిగమింపగ దానములులేవు కల్మషంబుల హరింప - ఐ.

ఆ. జేయుఁ జెరువు లెస్స సేయుట సంతాన
మిచ్చునోషధంబు లిచ్చుచెల్ల
తెవులు వాపు సాదు చెరువరి కునికిప
ట్టొసఁగుఁ దొసఁగుఁ [6]దనుసుఖోదయములు.

197. వ. అనిన విని యజ్ఞంబు తెఱంగెఱింగింపవే యని పార్వతి ప్రార్థించినం బరమే
శ్వరుం డిట్లనియె.

198. సీ. [1]విను మింతి వైదికంబును లౌకికంబును
నన రెండు[2]తెఱఁగులు యజ్ఞవిధులు
వర్ణయోగ్యార్జన వర్ధనాంచితధన
ధాన్యముల్ గొనిదేవతలకుఁ దృప్తి
యగునట్లుగా [3]ఋత్విగర్చన మొప్పఁగాఁ
గావించునది [4]వైదికంబు దేవ
తలకు మహోత్సవంబులు సేయుటయు గీత
వాద్య[5]నృత్యము లనవద్యములుగ
ఆ. సంఘటించుటయును సద్గంధమాల్యధూ
పప్రదీపభోజ్యభక్ష్యములు స
మాదరంబుతో నివేదించుటయు లౌకి
కంబు రెండు నమరగణహితములు.

199. తే. ధర్మములు దానములును సద్వ్రతచయంబు
సదృశములు గావు వినుము యజ్ఞమున కరయ
యజ్ఞకర్త లోకోత్తరుం డతని కిచ్చు
టతనిచేఁ గొను టధికపుణ్యములు చెలువ.

200. ఉ. [1]మానసకృత్యముల్ సురసమాజ [2]మెఱుంగఁగఁ జాలుఁ గావునన్
మానస మెక్కుడేనిఁ [3]జన మంచిగఁ జేసిర యేని యజ్ఞమున్

---

6 ధనసుఖోదయములు - చ

199. 1. వినుమింత - ఇ. ఏ. 2 విధములు - కొన్నిప్రతులు 3. ప్రీతినర్చన - ఊ; ఋత్వి జాదులకొప్పఁగా - ఔ రూపము విచార్యము 4 దైవికంబు - ఊ. ఏ. ఛ. నృత్య ములనవద్య - కొన్నిప్రతులు.

200. 1. మానవ - ఇ, ఎ ఏ. ఔ. చ. 2. యెఱుంగుదురట్టుగావునన్ - ఐ. ఖ. 3. యును మంచిగ - ఒ. ఓ; వినుమంచిగ - ఊ.

దానము నాదిగాఁ గల సుకృతంబు[4]లు లగ్గ ఫలింప [5]నీదు త
ద్ధ్యానపరత్వ[6]పూతసుకృతంబులకున్ ఫల మిచ్చు మెచ్చుచున్.

201. క. అని చెప్పిన హిమవద్గిరి
తనయ త్రిపురవైరితోడ దైవికవిధు లే
వినఁ గని సంతోషించితి
వినిపింపుము [1]పైతృకంబువిధము వృషాంకా.

202. సీ. అనిన నాసర్వజ్ఞుఁ డద్దేవి కిట్లను
గయ కురుక్షేత్రంబు గంగ యాది
యగుపుణ్యదేశంబు లతిఫలదంబులు
మాఘభాద్రపదాఖ్యమాసములు బ
హుళపక్ష మపరాహ్ణ ముగ్మలి యమవస
[1]ద్వాదశినవములు పరఁగు దుషిఁ
[2]బితృదేవతల కిచ్చుఁ గుతపరౌహిత్ర తి
లలు నితాంతపవిత్రములు పితృక్రి
తే. యలకు శౌచ మక్రోధ [3]మవ్యగ్రభావ
మర్హములు శుక్లపక్షపూర్వాహ్ణయుగ్మ
దివస జన్మదినములు నిందితము లాజ్య
ముద్గపాయసాపూపముల్ ముఖ్యకోటి.

203. క. [1]శ్రోత్రియు లరోగు లవికల
గాత్రులు పాత్రములు పైతృకములకు సచ్చా
[2]రిత్రత్వము ముఖ్యంబు [3]స
గోత్రు మృతకళత్రు నన్యకులుఁ గొన [4]రతివా.

---

4. లనంగ ఫలింప - ఎ; ల (లు) లగ్గు - ఊ. ఓ. క. ష 5. నీరు - ఉ. ఔ
6. చారు - ఔ

201 1 పైతృకముల - కొన్నిప్రతులు.

202. 1. బారసినవములు బరఁగుఁదుష్టి - ఉ. ఔ; ద్వాదశినవములువరఁగుఁదుష్టి - పి శ. ష.
'తేరసి' అనగాత్రయోదశి అని 'స' తేరసినపమాద్యతిథులుఁదుష్టి - వా. కొన్నిప్రతులు
2. కుఁదృప్తిగ పితిహోత్ర - ఓ ఛ. 3. మవ్యక్త - అ. ఈ.

203. 1. శ్రోత్రియులు కులజులవికల - ఆ. 2. రిత్రము ముఖ్యంబైన - అ. ఆ. ఇ. ఈ. చ.
3. స్వగోత్రు - చ. 4. రధిపా - ఒ.

204. ఆ. గంధపుష్పమాలికా ధూపదీపవ
స్త్రముల నర్పించి తగఁగ భోజ
నములు నిర్వహించి క్రమవృత్తిఁ బిండప్ర
దానవిధి యొనర్చు టేను మెత్తు

205. వ. అని యెఱింగించిన మేనకాత్మజ మృడునితో ని ట్లనియె

206. క. మృతిఁ బొంది పునర్జన్మము
నతర్క్యగుణజంతుకోటి యప్పుడ పొందుం
బితృపూజన [1]మని యెవ్వరి
కితవుగఁ జేయుదురు [2]దీని నెఱిఁగింపు శివా

207. ఆ. అనుడు నచట నున్నమునిజను లెల్లను
నగతనూజ నాత్మఁ బొగడి యభవుఁ
డిచ్చు నుత్తరంబు నేర్పడ వినువేడ్క
[1]గదుర నుండి రపుడు కంస[2]దమన.

208. సీ. అంబిక కి ట్లను హరుఁడు సందేహింపఁ
దగునది యిది గుహ్యతమము వినుము
దివిజు లట్టుల పితృదేవతలును దేవ
బృంద [1]ముత్తరదిశఁ బితృచయంబు
దక్షిణదిశ నుండుఁ దత్పూజనంబులు
వరుసన హవ్యకవ్యంబు లండ్రు
చచ్చినవారికి శ్రాద్ధంబు [2]సేయఁగా
నాపితృసంఘంబు హర్ష మొంది
తే. యాయువును శ్రీయుఁ గీర్తియు నాది యైన
[3]యైహికంబులు సుగతియు నాదరమునఁ
గర్త కొసఁగు సురాసుర గరుడయక్ష
తతులకును బూజనీయంబు పితృ[4]గణంబు.

---

206. 1. మది - చ. 2. వాని - అ.
207. 1. గలిగియుండి - ఉ. ఔ. 2. మథన - బ. ఒ. ఓ.
208. 1. ముత్తరమున-ఉ ఐ ఖ 2. సేయంగ-కొన్ని ప్రతులు. 3. యైహిక సుఖంబులెంత ము-
4. గణములు - కొన్ని ప్రతులు

209. వ అని నిర్దేశించి వెండియు.

210. క [1]తమతమసారములకుఁ దగఁ
[2]గమలాక్షి చేయుదానకల్పనలవిశే
షములఁ [3]బొక్కరూప యగుఁ ద
త్ప్రమాణరూపణము చేసి పలికెదఁ దెలియన్.

211. క. విను మొకకుంచెఁడుధాన్యము
తన కాయతి గల్గునతఁడు దాని నొసఁగినన్
ధనకోటి గల్గువాఁ డ
ద్దన మొసగిన నొక్కరూప తత్తత్ఫలముల్.

212. క పరుషత్వము లేకంతః
[1]కరణంబున శుద్ధి చాలఁ గలిగి ప్రియము పెం
పిరివోవఁ జేఁత దానము
[2]పరమోత్కృష్టంబు పద్మపత్త్ర[3]నిభాక్షీ.

213. క. అని చెప్పి కొన్నిధర్మము
[1]లనఘా [2]యెఱింగింతు నీకు నవధానముతో
విను మని పలికె శివుం డి
ట్లను విశదము గాఁగఁ [3]గూర్చి యంబుజనాభా.

214. చ [1]తెవులులు గొన్నవారి కవి దీఱుట కౌషధ మీగి దుర్గతుల్
దవులు[2]జనాలిఁ [3]బ్రోపు సుపథంబుగఁ దైర్థకకోటిఁ దన్పు బాం
ధవరహితత్వ దీన శవదాహము దుఃఖితు లైనవారిఁ దే
ర్పు వెరవు [4]నోర్పుఁ గల్మియును బ్రస్తుతి కెక్కినమేటిధర్మముల్.

---

210. 1. తమకలుములకున్దగఁగనుకమలాక్షి - అ, తమ తమ కలుములకున్ దగఁగమలాక్షి - ఈ ఔ. 2 గమలాస్యా - పెక్కుప్రతులు. 3. నొక్క - వా; లొక్క - పెక్కుప్రతులు
212. 1. కరణమునను - అ. 2 పరమోత్కృష్టత్వమట్ల - కొన్నిప్రతులు. 3.దళాక్షి - ఓ. క.
213. 1. లనయమునెఱిఁగింతు - అ. ఔ. ఖ. 2 వినుపింతు - ఐ 3. తెప్పెనంబుజనాభా, ననియెనంబుజనాభా, నెన్ననంబుజనాభా - అనిపాఠములు.
214. 1. తెవు(లు)లను - ఎ ఓ. క. చ. 2. ఆనాథ - కొన్నిప్రతులు. 3. ప్రోపును - ఐ. ఖ శ. వ. 4 నోపునుంగలిమి - కొన్నిప్రతుబు; నోవుపుంగలిగి - ఎ, బ్రో( ను) పునుంగలిమి - ఊ. చ.

215. వ. అని పలికినఁ బార్వతీదేవి పరమప్రియంబు నొంది

-: శివుఁడు పార్వతికి ధర్మవిశేషంబుల తెలంగ దెలింగించుట :-

సం 13-అను I 15-3690

216. సీ. ధర్మంబు నానావిధంబులఁ బరగు నం
ద్రవి యెఱిఁగింపవే యనుడు హరుఁడు
వితతంబు [1]లగు శ్రుతిస్మృతులచేఁ జెప్పఁగాఁ
బడినతెఱంగులు పడఁతి వినుము
[2]జాతిధర్మములు దేశజధర్మములుఁ గుల
ధర్మంబులును గణధర్మములును
గాయంబు వికృతులఁ గాలపర్యయముల
వచ్చునాపద్ధర్మవర్తనములుఁ

ఆ. గాఁగ నిట్లు ధర్మగతు లైదు గలవని
చెప్పుటయును గౌరి శివునితోడఁ
బుణ్యలోకకలితభోగంబు [3]లెట్టుండు
ననిన నిట్టు లనియె హరుఁడు గృష్ణ.

217. సీ. ఎల్లపుష్పంబులు [1]నెక్కాలమును దద్ద
[2]విలసిల్లుఁ గల్పకవృక్షజనిత
[3]మనులేప మాహార మమృత మంబరములు
నిత్యామలినములు నిరుపమాన
భంగి దీప్తంబు [4]లాభరణముల్ [5]వానర
మించుచు నన్యోన్యమిత్త్రభావ
మొప్పంగ మేనులయొప్పును మనముల
మార్దవంబును గుణమాన్యతలును

---

216. 1 లగ - కొన్నిప్రతులు. 2. ధర్మంబు లనజాతిధర్మంబులును గుణధర్మంబులునువచో ధర్మములను - ఉ. ఐ. ఔ. ఋ 3 వినవల్తునని - ఏ.

217. 1. నెక్కాలములు, నెక్కాలముల, నెక్కాలమున - అనిపాఠములు. 2 విలసిల్లు ఘన కల్పవృక్ష-ఐ, ఋ. విలసిల్ల సంకల్పవృక్ష-ఉ 3 మనుపమలేపనమతులితాంబరములు-అ. ఈ. 4. లాభరణంబులును గల్గిరమియించు నన్యోన్యరమ్యమైత్రి - ఉ. ఔ. 5. నాగ,దాన - అనిపాఠములు.

తే. గలిగి పురుషులుఁ గాంతలుఁగా సుహర్ష
లీల లెసఁగఁ గ్రోధాదులు లేక రుజయు
జరయు నెఱుఁగక [6]నలిఁ జరింతురు దివంబు
నందు సంతతనిర్భ రానంద మొంద.

218. వ. అనిన విని హైమవతి సుగతి దుర్గతులకు జనంగల వారిం జూచి పీ రిట్టి వారని
నిశ్చయింప వచ్చుట రామి యెఱింగింపు మనవుడు [1]మృడుండు విను మని
యి ట్లనియె.

219. చ. జనులకుఁ గీడు రోయక యజస్రము ధర్మరతిం జరించి స
జ్జనగురు పూజనంబులును సత్యహితో క్తులు దీనపోషణం
బును నతిథిప్రియత్వమును భూరిదయార్ద్రితయుం గలట్టివా
రనిమిషలోకగాములని యాత్మ నెఱుంగుము మేనకాత్మజా.

220. చ. [1]పరుసని [2]పల్కు లోంకు లగు[3]పల్కులు నన్యధనాభిలాషముం
బరవనితావిలోలతయు బాంధవసజ్జన[4]వి ప్రియంబు దు
శ్చరితులతోడి మైత్రియును సంతత ధర్మరతాభ్యసూయయుం
గరినిభయాన ఘోరనరకంబున కేఁగెడి వారి చిహ్నముల్.

221. క. అని చెప్పిన విని హిమగిరి
తనయ వృషధ్వజునితోడ ధర్మంబులు చె
ప్ప నుపమమూర్తి పరమం
బనఁ జాలెడు ధర్మ మెద్ది యన్నిటిలోనన్.

222. వ. చెప్పు మనిన నప్పరమేశ్వరుం డి ట్లనియె.

223. క. రమణి వర్గత్రయధ
ర్మము [1]లిచ్చు సుఖములు దుఃఖమయము లచిరముల్

6. నెఱి, నరి - అనిపాఠములు

218. 1. మృడుండు మెచ్చుచవినుమని - అ.

220. 1. పరుసఁదనంబులోంకు - అ. ఇ. పీ. శ ష. న. 2. మాటలోంకు - ఖ. ఖ చ. 3. భాషలు, మాటలు, - అనిపాఠములు 4. నిష్ప్రియంబు - పెక్కుప్రతులు; దుష్ప్రియంబు - చ ర నరకంబుల కేఁగెడు - పెక్కుప్రతులు.

223. 1. లిచ్చును సుఖముదుఃఖము దుఃఖ - కొన్నిప్రతులు

²గమనాగమకరములు ని
త్యమహాసౌఖ్యంబు మోక్షధర్మం బిచ్చున్.

224. సీ. కావున విను త్రి¹వర్గంబుకంటెను మేలు
దలపోయ మోక్షంబు దానిఁ బడయు
తెఱఁ గెఱింగించెదఁ ²దెలప గృహస్థ³ధ
ర్మంబున నిల్చి ఋణంబు లెల్లఁ
బాచి వనమునకుఁ బరమశాంతత నేఁగి
సద్గురుముఖమున సాంఖ్యయోగ
విదుఁ డగునది పంచవింశతి జ్ఞానంబు
⁴సాంఖ్యంబు ధర్మనిశ్చలత యోగ

తే. మానసమాచార⁵యుగళ మేకాధికరణ
మస్ఖలితముగ మది నది యలవరించి
ధ్యానపరుఁ డయి శీతోష్ణవార్షశోక
ముఖము ⁶లగు వివిధద్వంద్వములఁ దొలఁగి.

225. ఉ. శౌచము బ్రహ్మచర్యమును శాంతియు నభ్యసనంబు నై ¹యిశం
బూచుచు నంతరాత్మ నెడ సొచ్చిన విఘ్నవిశేషమున్ ధృతిం
ద్రోచుచు భక్తియుక్తికి గురుండు ప్రమోదమయుండు గాఁగఁ ద
ద్గోచరతం జరింపఁగ నకుంఠిత మోక్ష²సుఖంబు చొప్పడున్.

226. తే. అది సదాభ్యాస¹కలన నత్యంతనిర్మ
లంబు నవ్యయమును నచలంబు ఘనము
నై జరావ్యాధిమరణజన్మాదిదుఃఖ
బహుళ సంసార చక్రంబుఁ బాప నేర్చు.

---

2. గమనాగమనకములు - ఎ. ఏ. శ. ష.

224. 1. వర్గములకంటెను - పెక్కుప్రతులు. 2. దేవిగృహస్థ - ఆ. ఇ. పీ. శ. ష. స. 3 ధర్మంబులెల్ల నడపివిముక్తియదాని- త ఈ 4. సాంఖ్యయోగంబు - ఐ. ఔ. ఖ; సాంఖ్యధర్మంబు - అ. 5 కరణ - ఔ 6. లగునట్టియాద్వంద్వ - పీ. శ. ష.

225. 1. నిశం - కొన్నిప్రతులు; తనుం - జ; మదిం - ఆ. ఉ ఔ. చ. పీ శ. వ. స
2. పదంబు - ఒ. ఓ.

226. 1. యోగమత్యంత - ఎ

227. వ. అని యుపదేశించి వెండియు.

228. క. విను సంసారమునకు విసు
వనిమర్త్యుఁడు శోకమోహవశగతుఁడై మో
హనిరూఢిఁ బడయ నేరఁడు
[1]మనము విరక్తముగ విసివి మఱి ముక్తిఁ గనున్.

229. వ. అట్టిదశ [1]చింతావివర్జనంబునను భూతా[2]స్థిరత్వజ్ఞానంబునను తృష్ణారాహిత్యంబునను గాని కలుగదు గావున వానిభంగులు ప్రకటించెద.

230. సీ. ధనములు చెడిన బాంధవులు సచ్చినఁ దదీ
యము లగుగుణములయందు మనసు
వెట్టకయున్నది [1]యెట్టన్న వగచినఁ
దాపంబు వొందుటఁ దక్కనొండు
గలుగునే సుఖము దుఃఖంబును దోడివ
యవి మార్చి వచ్చుచు నరుగుచుండుఁ
గేవలసుఖములే దావానపునకైనఁ
జేటు [2]దృశ్యములకుఁ సిద్ధ మగుట
తే. మున్న కని యున్నవగ చిత్తమున [3]జనింప
దరయఁ గీడు [4]పరిగ్రహ మది సమగ్ర
మైనతఁడు [5]పౌత్తినూలి ప్రువ్వట్ల తాన
తనకు బంధంబు గావించికొను లతాంగి.

231. ఆ. విను ధనార్జనంబు ధనరక్షణంబు ధ
నవ్యయంబు ధనవినాశనముఁ బ్ర
గాఢదుఃఖ[1]దములు గావున దుఃఖభా
[2]జనము ధనము గాల్పు మనఁగ వలయు.

232. క. రమణీ తృష్ణానమదుః
ఖమును బరిత్యాగసముసుఖముఁ గలవే కా

---

228. 1. మనసు - పెక్కుప్రతులు.
229. 1. చింతావర్జనంబు - పెక్కుప్రతులు. 2 స్థిరత్వపరిజ్ఞానంబు - పెక్కుప్రతులు.
230. 1. వెరపెట్టవగచిన - బ. ఖ. 2 కృత్యములకు - ఓ క; 3, దరయ నేరకయజ్ఞతయది. ఔ. 4. ప్రతిగ్రహమది - ఉ. 5. పౌత్తిపువ్వన్నయట్లు; పౌత్తిపుర్వునయటు; పౌత్తిపుర్వులయట్లు - అని పాఠములు.
231. 1. చయము - ఉ ఔ 2. జనము గోరుచుండుటనఁ గవలయు - ఉ ఔ.

యము ముదిసిన ముగియదు ప్రా
ణముగొని పోఁ జాలు తెవు[1]లనం జనుఁ దృష్ణన్.

283. క. కామములు భోగములఁ దెగు
నే మెలఁతుక నేత నాఱునే చిచ్చు ధృతిం
గామములఁ దొఱఁగు సౌఖ్యము
నేమెయి సౌఖ్యములుఁ బోలునే యరయంగన్.

284. క. విచ్చలవిడి నింద్రియముల
నెచ్చటి కైనను జనంగ నిచ్చిన నరకం
బచ్చుపఱచుఁ గుదియించినఁ
దెచ్చు సుగతి నరున[1]కది సతిమౌళిమణీ,

285. తే. [1]కామరసమున నతి[2]తృష్ణుఁడై మనుష్యుఁ
డర్థతృష్ణాపరీతాంతరంగుఁ డైన
గొఱియ నడవిలో నెత్తెడుకోలుపులియుఁ
బోలె మృత్యు వాతనిఁ గొనిపోవు దేవి.

286. వ. అని పలికి జరామృత్యువులఁ ద్రోవం జాలుమే తెయ్యది యం చేనిఁ జెప్పెద
నాకర్ణింపు [1]మనుపలుకు పలికి యి ట్లనియె.

287. తే. ధనములును [1]దానములుఁ దపోధనము వాజి
పేయరాజసూయంబులు వేయు [2]నోపి
చేయుటలు గావు మోక్షదర్శిత్వ [3]మొకఁడ
మందు జరకు మృత్యువునకు నిందువదన.

288. తే. జాములును [1]దివసములు మాసములు నేండ్లు
నైనకాల మాయువుఁ గొని యరుగుచుండు

---

282. 1. లనందగుఁ దృష్ణన్ - పెక్కుప్రతులు.
284. 1. కవి - ఊ ఎ ఏ క
285. 1. కామరసమునఁదృప్తుండు గాని నరుఁడు నర్థ - ఊ. చ. 2. తృప్తుఁడై - కొన్నిప్రతులు.
286. 1 మనియిట్లనియె - పెక్కుప్రతులు
287. 1 రాజ్యమునుదపో - కొన్నిప్రతులు 2. గోరి - కొన్నిప్రతులు. 3. నరణి - ఉ. ఊ. శ; మొకడు, మొకట - అనిపాఠములు
288. 1. దినములును - ఊ

నెల్లి చేయుపనులు నేఁడ యింతి మాఁ బొ
నర్చు[2]పని [3]రేప చేయుట నామతంబు.

239. తే. మేలు గడువేగ చేయరు కాలపాశ
బద్ధులై యేమఱుటఁ జేసి పడఁతి మనుజు
లింత యెఱుఁగుట సంసార మెడలఁద్రోచు
నట్టివినువుటఁ బుట్టించునది హితంబు.

240. వ. ఇవ్విధంబున.

241. క. ఈతెరువు లాదరింపఁగఁ
జేతోగతికిని [1]విమర్శసిద్ధి యొదవుఁ [2]ద
జ్జాతవిరక్తియు ముక్తికి
నాతెరువ సమీపవర్తయగశైలేంద్రసుతా.

242. క. వైరాగ్యంబు ప్రశాంతికిఁ
గారణము ప్రశాంతిముక్తిఁ గను మోహానం
దారాను జరామృత్యువు
లేరూపునఁ జేరనేర [1]విద్ధచరిత్రా.

243. క. అని చెప్పి మఱియు శివుఁ డి
ట్లను హిమగిరిసుతకు సాంఖ్య మమలినహృదయా
విను వివరించెద సంసృతి
యనురోగంబునకు వైద్య మది యరయంగన్.

*-: శివుఁడు పార్వతికి సాంఖ్యప్రకారంబు దెలుపుట :-*

సం. 13-అను I-15-4096

244. ఆ. [1]జ్ఞానమున విముక్తి సాంఖ్యులు వడయుదు
రరసి చూడఁగా నిరర్థకంబు

2. నది, నవి-అనిపాఠములు. 3. రేపొనర్చుట - ఖ.

241. 1. నిదర్శసిద్ధి - ఆ; బహిర్తసిద్ధి - ష 2. తజ్జాత - ఒ. పీ. శ. ష. తజ్ఞాత - వా. కొన్నిప్రతులు; తజ్జా(జ్ఞా)లి దగముక్తి పంక్తికి-ఒ.ఓ. క. 8. తెరువు-పెక్కుప్రతులు.

242. 1. పిద్యచరిత్రా - కొన్నిప్రతులు.

244. 1. జ్ఞానముననుముక్తి, జ్ఞానముననముక్తి - అని పాఠములు.

ఘో[3]రతరము నంద్రు శారీర మైనత
పంబుఁ బంచవింశభజన [2]మూఁది.

245. సీ. ప్రకృతి యవ్యక్తనామకమును గలదందు
మహదహంకారతన్మాత్రలును మ
నము నింద్రియములు భూతములు [1]జన్యములుగా
నోలిన యిరువదినాలు గయ్యెఁ
[2]బంచవింశకతత్వభావిత క్షేత్ర మా
తత్వసంతానంబు సత్వమును ర
జస్సుఁ దమస్సు నాఁ జనునిజగుణములఁ
బ్రకృతి [3]దాఁ గరణరూపములు గాఁగఁ

ఆ. గొని సృజించు[4]లోకకోటి నయ్యవ్యక్త
మణువు నిత్య మేక మక్రియం బ
[5]హైతుకంబు చతురాదుల కగ్రాహ్య
మది ప్రధాన మనఁగ నతిశయిల్లు.

246. తే. సౌఖ్యతుష్టి [1]ప్రకాశముల్ సాత్త్వికములు
మోదఖేదాదిక ద్వంద్వములు లతాంగి
రాజసము లప్రకాశసంత్రాస[2]మోహ
ములును [3]దంద్రయుఁ దామసములుగ నెఱుఁగు.

247. క. ధృతి విజ్ఞానశ్రద్ధలు
నతివ[1] యసమ్మోహమును దయయు హర్షము[2]నం
చితసత్వవృద్ధిఁ బరిగ
ర్ధితంబు లగు సత్వ[3]మరుగఁ దెరలుం దారున్.

---

2 మొంది - అ. ఆ ఈ ఓ.

245. 1. తజ్జన్యంబులోలిన - ఇ ఏ; జన్యములగునోలిన - కొన్నిప్రతులు. 2 బంచవింశతి - ఈ. ఓ. 3. గారణపురూప - ఈ. 4. భూతకోటి, జాతకోటి - అనియుపాఠములు 5 నాత్మకంబు నక్షరాదుల - అ ఈ. అర్థము విచార్యము.

246. 1. ప్రకారముల్-కొన్నిప్రతులు 2. హేయములు - శ 3. మొదలుగ తామసములు - అ; దర్పయుఁదామస, నిద్రయుతామస - అనిపాఠములు.

247 1. వాసమ్మోదమును - ఇ. ఓ. ఖ 2 సంచిత - ఔ 3. మెఱుఁగఁదెలియుమువానిన్ - ఈ, రముగఁదెలియున్ దారున్ - ఓ. క

248. తే. క్రోధలోభ[1]కామాన్వృత ద్రోహచింత
తాపములకు రజోభివర్ధనము వృద్ధిఁ
జేయు వానికి నెల్ల సంక్షీణభావ
[2]మావహిల్లు [3]రజఃక్షయమావహిల్ల

249. తే. సంశయంబు విషాదంబు జడత నిద్ర
యను తమస్సు [1]వర్ధింపఁగాఁ దెనుపు నొందు
నది విహీనతఁ బొందిన నదియు హీన
భావ మొందు వికస్వరపద్మనయన

250 సీ. [1]ఒక్కఁ డొక్కనిచేత నెక్కుచుఁ దఱుగుచుఁ
త్రిగుణంబులను బ్రవర్తించు వీన
జనితంబు[2]లగు ప్రీతిసంతాప[3]మోహాదు
లొదవినఁ గ తద్గుణోదయములఁ
గని యుపేక్షించుచు [4]మనము నూనఁగ నీమి
కార్యంబు ధర్మార్థకామములకు
నమర మనుష్య[5]తిర్యగ్జననములకు
మూలముల్ సత్త్వాదు లొలి నెఱుఁగు

తే. బుద్ధి యనఁగ మహత్తత్త్వమునకు నామ
మది వివేక విజ్ఞానచిహ్నంబు భూత
జని యహంకారమునకు లక్షణ మహంక
రణము [6]దొలఁగుట మోక్షకారణము దేవి.

251. ఆ. అన్నియింద్రియముల నడరింప మగుడఁ జే
యంగ మనసు చాలు నవియు నదియు
భూతతద్వికారములును దేహము తద
న్యుండు దానఁ బరఁగి యుండు దేహి.

---

248. 1 కామోన్నత, మోహాధిక, కామాస్పద, కామాదృతి, కామ్యాకృత, కామాన్విత-అనిపాఠములు 2 వృందఁజేయు - ఓ చ 3. రజక్షయ- పెక్కుప్రతులు(యీపముచింత్యము)
249. 1. వాటింపంగ - ఉ
250. 1. ఒక్కొక్కనాఁడొక్కఁడెక్కుచు దిగుచను త్రిగుణంబులు-ఆ. 2. లగుధృతి - ఎ. 3. మౌర్ఖ్యాదు, మౌర్ఛ్యాదు, మౌఢ్యాదు - అనిపాఠములు. 4. మనమునమానంగఁగార్యంబు - న. కొన్నిప్రతులు. 5 తిర్యగ్జంతువులకును - పీ, శ ష. న. 6. దొలఁగుట - క.

252. క. విను దేహియు దేహము వే
అను నిశ్చయదృష్టి గల్గునాతఁడు చాలఁ
మనసు మగిడింప నది ని
ర్మనస్క[1]తఁ బొనర్చి మోక్షమార్గముఁ జూపున్.

253. వ. అప్పుడు ప్రకృతిం దొఱంగి పంచవింశకుండు వెలుంగు [1]నాతత్త్వంబు పరమహంసుం డనం బరఁగుఁ దద్విజ్ఞానంబు శాంతిసాధ్యంబును బరమశాంతిప్రదంబునై యుండు.

254. మ. రసగంధాది[1]గుణాళి లేమి నవికారత్వంబునన్ సర్వసం
వసనవ్యాప్తి నణుత్వభంగిని మహత్త్వస్ఫూర్తిఁ జతుఃప్రభృ
త్య[2]సమాలంబితఁ దేజరిల్లు పరమాత్మాఖ్యంబు షడ్వింశకం
బు సమత్వంబునఁ జూచుశాంతుఁ డతివా పొందున్ విమోక్షస్థితిన్.

255. వ. ఇది కపిలాది[1] పరమర్షి[2]సేవితంబైన సాంఖ్యధర్మంబు యోగప్రకారంబు వివరించెద

256. సీ. విను మింద్రియంబులు మనసును బుద్ధియు
నాత్మందు నొక్కటి యగుటఁ గాన్పు
యోగపరిజ్ఞాన [1]ముగ్మలి యగ్ని స
మారాధనంబును [2]నధికవాగ్వి
వర్జనంబును సత్త్వవర్తనంబు దానాధ్య
యనములు శౌచసత్యములుఁ బాప
ములఁ బాపుఁ బాపనిర్ముక్తుఁడై మఱి యోగ
మాచరింపఁగ యోగ్యుఁ డగునరుండు

---

252. 1. తనొనర్చి - కొన్నిప్రతులు
253. 1. నాతత్త్వంబుహంసుండనం - పెక్కుప్రతులు.
254. 1. గుణంబులేమి-ఇ; గుణాళిలేమి-అ. ఆ, 2. సమాలభ్యత, సమాలంఘ్యత, సమాలింగిత-అనిపాఠములు.
255. 1. పరమఋషి, పరమముని - అనిపాఠములు. 2. సమ్మతంబైన - ఆ ఇ. ఖ; సమేతంబైన - ఔ
256. 1. మొగిగల్గి - ఉ. ఇ. ఖ. 2. నతినవాగ్వి - కొన్నిప్రతులు; నరసివాగ్వి - ఉ. ఇ. ఖ; నతివదాని - శ. ష. (అర్థము విశదముకాలేదు).

తే. మనసు పట్టుట ముఖ్యపుటనువు దాని
కామిషము గాలిగాని కె ట్లట్ల శుచియు
నజనమును నగుచోట మృదాప్వసనమునఁ
గాయశోమన కార్జవముభంగి గలుగ నుండి.

257. క. మనమున నై దింద్రియములు
నునిచి మనం బాత్మ [1]నల్ల నొదిఁగింపఁగ నె
క్కొని ప్రాణంబు నపానం
బును వశ్యత నిలుచు [2]యోగమున సిద్ధికినై.

258. తే. అనహితుం డయి తద్దశ యనుభవింపఁ
గా నపానమిశ్రప్రాణగతికి మూర్ధ
మతివ [1]యమ్మెయి నెల వగునతఁడ చూవె
జీవుఁ డనఁ బరమాత్ముండు నా వెలుంగు.

259. వ. అనివెండియు,

260. ఉ. ప్రాణు నపానునందును నపానునిఁ బ్రాణునియందు నిల్పి ని
ర్వాణముఁ గోరి చిత్తము థిరంబుగఁ బట్టఁగఁ బ్రాణసంయమ
క్షీణత దేహమధ్య శిఖఁ దిమ్మగఁ [1]దత్త్రయ మొంది మూర్ధపా
రీణతఁ [2]గోర్కి సల్పు నపరిచ్యుతిఁ దగ్గతుఁ డైనయోగికిన్.

261. 1. అని చెప్పి [1]వెండియు.

262. చ. అలసతయున్ [1]విచిత్తతయు నత్యశనాదరణంబు రోగముం
గలయును [2]లోభముం భయముఁ గామముఁ గ్రోధము లౌల్యమున్ విరో

---

9. కంధరార్జవభంగి - కొన్నిప్రతులు
257. 1 నెల్ల - ఈ. ఎ. ఏ. ఓ. ఔ. 2. యోగమును సుఖసిద్ధిన్ - ఓ. క.
258 1. యిమ్మెయి - కొన్నిప్రతులు; యిమ్మెన - అ ఇ. ఏ. ఐ. ళ.
260 1. దత్రిక్రియనొంది - న; తత్రియమొంది - ఎ; తద్దయునొంది - ఓ. 2. గే(లి)శి - అ. ఈ. క. శ. ష. న
261 1. మతియును-పెక్కుప్రతులు.
262. 1. విచింత్యత, విచింతత, వినిద్రత - అనిపాఠములు. 2. భోగమున్ - ఉ. ఓ; శోకమున్ - ఓ.

ధులు విను యోగసేవకు నదుష్టతఁ జేర్చిన యోగ మిచ్చు ని
ద్ధు లెనిమిదింట నప్రతిహతుం డయి యోగి చరించు నెల్లెడన్.

263. ఆ. నిద్ర పెంపు నిద్ర నిగ్రహించుటయును
గోలఁది మీఱుకుడుపుఁ గుడువమియును
యోగి కొప్ప వతఁడు యుక్తవర్తనుఁడైన
నుడిద దుఃఖహారి యోగ[1]మొందు

264. వ. ఇట్టిది యోగ ధర్మం బనిన నంబిక సాంఖ్యయోగ[1]క్రమంబునఁ బరిజ్ఞాత[2]పర
మార్థనైతి భవదీయసాయుజ్యంబు భక్తు లెట్టి పరిచర్యం బడయుదు రెఱిం
గింపవే యని యడిగిన మృత్యుంజయుండు మృడాని కిట్లనియె.

—: శివుండు పార్వతికి నాత్మసాయుజ్యప్రాప్తిసాధనంబులు దెలుపుట :—

సం. 13-అను-4336

265. క. విను మవిచింత్యుఁడ సురలకు
మునులకు నేనియును యోగమును సాంఖ్యము నా
యొనరించినయవి యీశుఁడ
సనాతనుఁడ నవ్యయుండ నత్యాత్ముండన్.

266. క. విను ప్రసన్నుఁడనైనం
గానిది లే దర్చకులకుఁ గావున [1]మంత్ర
ధ్యానస్తుతి[2]వందనముఖ
నానాభజనముల వలయు నైష్ఠికత [3]శివా.

267. ఆ. నాలుగాశ్రమముల నలువురు విప్రుల
కలిన పాశుపతమహావ్రతంబు
తెలుఁగు లేను దొల్లి దెలిపితి శిష్యప్ర
శిష్యసరణి నది ప్రసిద్ధ మయ్యె.

---

263. 1. మందు - ఊ. ఓ. ఔ.

264. 1. ధర్మప్రకారం బనిన వినియంబిక - ఊ. 2. పరమార్థనైకృతార్థనైతి - అ. ఆ. క.

266. 1. నస్మర్ధ్యాన - ఒ 2 చందములను నానా - ఒ 3. నతి - పి. శ. ష.

268. క. మంగళరక్షాశుచితా
లింగార్చన యోగ్యతలు ఫలించుటకై భూ
తిం [1]గావించితిఁ దల్లి
ప్రాంగులును గపాలధరులునై [2]శాంతి మెయిన్.

269. తే. బ్రహ్మచర్య [1]భిక్షాశన పరత గలిగి
జటిల యొండె ముండిత యొండె [2]సంచరించి
మనసు [3]నాయంద తిరముగా నునిచి యొండు
వస్తువులదెస నొల్లమి [4]వర్తిలంగ.

270. క. చరియించుభక్తజనులకుఁ బర
మానందైకతానుభవ మొసఁగుదు న
వ్వెరవున మత్సాయుజ్యము
దొరకును వారలకు వికచతోయజవదనా.

271. వ. ఇది సాయుజ్యావాప్తిప్రకారం బని చెప్పి వెండియు.

272. క. శివలింగస్థాపనముఁ ద్రి
భువన[1]ములం బరమహితము [2]పొందెం గరుణా
ధవళాక్షి చేసితిం ద
త్ప్రవిమలలింగమున నన్ను [3]భావించు టుఱున్.

273. చ. కలమెయిఁ జాల నేత నుదకంబుల[1]నేని వరాభిషేకమం
గళము నొనర్చి భక్తి[2]రతి గంధము మాల్యము ధూపదీపసం
కలనములున్ నివేద్యమును గాఢ[3]సమర్పణ మొందఁజేసి లిం
గల[4]సితమూర్తియందు ననుఁ గాంచి భజించిన ముక్తి చేకుఱున్.

---

268. 1. గావించుట - ఔ. శ. 2 నిష్ఠమెయిన్ - చ.

269 1. భిక్షాటన - ఇ. శ.ష. 2. సంచరిం(లిం)చి - కొన్నిప్రతులు. 3. నాయందుదిర - కొన్ని ప్రతులు; 4. వర్తిలంగ - కొన్నిప్రతులు; వలయుఁజాన - ఒ.

272. 1. నంబులఁబరమ - కొన్నిప్రతులు 2. బొందున్ - కొన్నిప్రతులు. 3. భావించుటకున్ - కొన్ని ప్రతులు.

273. 1. నేమి - చ. 2. మతి - ఒ 3. సమర్చన - ఐ, ఖ. 4. లలిత - శ. ష. కొన్ని ప్రతులు

274. క. అని పలికి నీవు దేవాం
గన లాదిగఁ [1]గల త్రిలోకకాంతలకును ముఖ్యనకుం బాత్రం బగువద
వనటంబులు గల్గి యొప్పు వరసతి [2]పతివా.

275. క. చతురవు విశేషవిభవో
న్నతచిత్తవు వ్రతవిధాన నైష్ఠికతాసం
యుతమతివి లౌకిక[1]జ్ఞా
నితామహిమసహజ[2]మతి వనిందిత వరయన్.

276. క. కావునఁ గాంతాధర్మము
నీవలనం దెలియువేడ్క నెమ్మనమున నా
కావిర్భవించెఁ జెప్పం
గా వలయును దాని వికచకమలదళాక్షీ.

277. ఆ. అనిన సిగ్గుతోడి యలఁతిన వ్వొలసిన
చెన్ను [1]మొగము వింతచెలువుఁ దాల్ప
[2]వాంచి యెత్తి గౌరి వరునితో నిట్లను
నేను [3]మీకుఁ దెల్ప నెంతదాన.

278. క ఐనను [1]మీ రడిగిన మ
న్మానసబోధంబుకొలఁది మగువలతెఱఁగుల్
వూని [2]వినిపింప కుండుట
దాన తగదు గాన చెప్పెదను సర్వజ్ఞా.

279. క. అని పలికి మఱియు ని ట్లను
నను నెప్పుడుఁ బాయకుండు నదులెల్లను న

---

274. 1. దగ - ఓ. చ. 2 విశివా - పీ. కొన్ని ప్రతులు.

275. 1. జ్ఞానితమహిమవు సహజమతివి నీయందరయన్ - చ 2 మతివి నీయందగయన్ - పెక్కుప్రతులు

277. 1. మోమువింత-పెక్కుప్రతులు. 2. వాల్చి - ఇ ఏ. 3. నీకు - పెక్కుప్రతులు

278. 1. నీవడిగిన - పెక్కుప్రతులు. 2. వివరింప - కొన్నిప్రతులు, వినువింప - కొన్నిప్రతులు.

వ్వనితలతోడ సమాలో
చన మొనరించి [1]మఱి చెప్పఁ జను నిత్తెఱఁగున్.

280. వ. అని విన్నవించి గంగ యమున [1]గోదావరి కౌశికి కావేరి కృష్ణవేణి పెన్న నర్మద బాహుద రేవ తమస మొదలైననదులు మున్న తన తోడన వచ్చి యున్న నన్నాతుల గుఱించి యీశానుం డిట్లనియె నిట్లు చెప్పెద మనిన గంగాదేవి నీకంటె నే మెఱుంగుదుమే నీ వెఱింగిన తెఱంగున నంగనాధర్మం బెఱింగించి పతిం బ్రీతునిం జేయు మేము భవదీయవాగమృతంబు వీనుల నినిచెద మనుటయుఁ బార్వతి ప్రసన్నచిత్తయై వల్లభువదనంబునం జూడ్కి నిలిపి.

281. క. దేవా నీదు ప్రసాద
శ్రీ) వచ్చినయెఱుక సుందరివిధము భవ
[1]ద్భావంబునకుఁ బ్రియంబుగ
సేవా[2]ధర్మంబుఁ దెలియఁ జెప్పెద ననియెన్.

282. తే. అనిన విని సురమునులు ప్రియంబుఁ గొంది
రమరగంధర్వసిద్ధసాధ్యాంగనాజ
నంబు వినువేడ్క వచ్చి యన్నలినవదన
వెనుక దెసి నుండె దేవకీతనయ [1]యపుడు.

283. వ. అని చెప్పి యప్పురుషోత్తముపీనులు వికసిల్లుచుండ నారదుం డతని కిట్లనియె.

*-:పార్వతి శివునకుఁ బతివ్రతాధర్మంబుల తెఱఁ గెఱింగించుట:-*

284. క. వనితలుఁ బురుషులుఁ బ్రియమునఁ
దను వినుతింపంగ శైలతనయ సమాక

---

279 1. యును - అ. ఇ.

280. 1 ఇచ్చటమూతృకలలో గోదావరి. కృష్ణ, పెన్న లులేవు.

281. 1. ద్భావప్రియంబు గోరినసేవా-పెక్కుప్రతులు 2 ధర్మమును-టౌ; ధర్మమున - కొన్ని ప్రతులు; ధర్మములు - ఏ

282. 1. వినుము - చ

ర్గన[1]కౌతుకి యగుసీశా
నునితో మృదురీతి ని ట్లనుం [2]గమలేశా

285. సీ. [1]ఋతుమతి గాక శుద్ధతయుఁ గగ్గిన యింతి
కన్య తత్పరిణయకరణమునకు
నొడయులు విను తల్లియును దండ్రియును దండ్రి
తోఁ బుట్టినతఁడు మాతులుఁడు సోద
రుండును యోగ్యవరునిఁ జూచి వారిలో
నెవ్వ రైనను బ్రీతి నిచ్చువారు
పతి యంతనుండియుఁ బ్రభువు దానికి నట్లు
గావున నాతండ దైవ మనుచు
తే. నతనిమత మూఁది దేవతాపితృసమర్చ
నములు నతిథిపూజనము సన్మతి సమాచ
రించుచును [2]బతిహితము పాటించి నడపు
సతి పతివ్రత యిహపరసౌఖ్య[3]మహిత

86. వ. ఏతద్విషయం బయినయొక్క నిదర్శనం బవధరింపుము.

287. సీ. బ్రాహ్మణుఁ డొకనికి భార్య లిద్దరు గల
రందొకభామిని యతని హితము
నడపెడునవధాన మెడలి యాతఁడు పంప
కయుఁ దాన సురపితృకార్యపరత
నడచుఁ దక్కటియింతి [1]నాథుఁ బాటించుచుఁ
దన్మతంబునఁ జేయు ధర్మవిధులు
వారు మువ్వురు విధివశమున నొక్కట
మృతిఁ బొంది రాపతివ్రత వరుండు

824. 1. కౌతుకుఁడగు - చ. కొన్నిప్రతులు. 2. గమలాక్షా - ఐ. ఖ.

285. 1. ఇచ్చటమూలమందు 'ఋతుప్రాప్తా' అనియేకలదు 2 తద్ధితంబు పాటించిన - పెక్కుప్రతులు 3 నిరత, మొందు - అనిపాఠములు

287. 1. నాథునిబాటించి - కొన్నిప్రతులు.

తే. చనిన సుగతికిఁ [2]జనెఁ [3]బెఱవనిత జముఁడు
నీకుఁ [4]బోలదు మరలుము [5]నీళరిర
[6]మునక యని [7]యాఁగె నది శోకమున సబాష్ప
యైనఁ గన్గొని యతఁడు దయార్ద్రుఁ డగుచు.

288 క. పతివ్రతము గొనక దర్మగుణ
[1]సతిప నడపు టొప్పు టెంక నైనను బతికిన్
హితము లగువానిఁ జేసిన
నతనిఁ గలయు [2]దనినఁ జనియె నదియును మరలన్.

289. వ. కావునం బతికి ననువ్రత యగుట గృహిణికి ధర్మం బని పలికి వెండియు.

290. క. లలన యిలువాడి నాథుఁడు
[1]వలచినచవి వంటకములు వండి యిడి తనుం
గలయఁ దలంచిన మెయికొని
యెలమిం గైసేసి హృదయ మీ వలయు శివా.

291 తే. పనులయెడ నూఱు పలుకక యననధానుఁ
డైన పతిఁ దలఁపించి ధర్మార్థకలిత
కృతులు నడపుచు సవతి గల్గినను బోరి
తంబు లే [1]కొక్కటై [2]యున్కి తగవు సతికి.

292. క. సవతాలికిఁ బతి వలచిన
నవుఁ[1]గాకని యతనియిచ్చ కనురూపముగాఁ
దివిరి నడచుసతి దైవము
శివ యది [2]తగు నెల్ల[3]జనముచేఁ మ్రొక్కు గొనన్.

---

2. జన - కొన్నిప్రతులు 3. బెర - వా. కొన్నిప్రతులు; బెఱ - పీ.శ ష. 4. బోలేదు- వా శ. వ, బోరాదు-పీ, బోలదు - కొన్నిప్రతులు 5. నిజశరీర- ఐ, ఖ. 6. మునకు నని - పెక్కుప్రతులు. 7. యాఁగ - అ. ఐ. ఖ.

288. 1. లతివ - పెక్కుప్రతులు 2 దనియె - కొన్నిప్రతులు.

290. 1. వలసిన - ఉ. ఊ ఔ. శ. ష.

291. 1. కొక్కటై - ఇ ఒ 2 యుంట - ఉ, ఔ

292 1. గాదనకతని - ఐ. క. ఖ. 2. గను - ఔ. యగు - ఐ. ఖ 3 జనులచే-పెక్కుప్రతులు.

293. క. తనచేతికి నిచ్చిన వ
స్తునికాయము [1]నిల్లురువున చొప్పున మగుడం
గొని వచ్చి భార్య పతి రె
మ్మనినప్పుడ యిచ్చు టొప్పు నకపటవృత్తిన్.

294. క. పతి తనకు నేమి యిచ్చిన
[1]నతిముదమునఁ గొందవలయు నాత్మకుఁ దైనన్
మతిఁ గొంకక యేకాంత
స్థితి నేకాసనత నునికి [2]సెట్ట ప్రమదకున్.

295. క. ధని యధనుఁడు రూపసి యొ
ప్పని[1]వాఁడు వివేకి మూఢభావుఁ డరోగుం
[2]డనుగతరోగుఁ డనక యం
గన పతిఁ బాటింపవలయుఁ గామధ్వంసీ.

296. క. బలి భిక్షము గడప కిడ
న్వలయును దేవపితృపూజనంబుల కాలం
బులఁ బతిశుభ [1]మందుటఁ ద
త్ఫలంబుగాఁ గోరు టొప్పిదము సతికి శివా.

297. క. గతి పతియ సువ్వె భార్యకు
నతనిఁ గడచినట్టి సత్పరాయణము కృపా
యుత కలదే కావునఁ దా
నతనికి భక్తియగు [1]టిచ్చు నఖిలశుభంబుల్.

298. వ. అని చెప్పి యప్పరమేశ్వరునకుం బార్వతి భార్యల యధర్మంబులు వివరించు నదియై యి ట్లనియె.

---

293. 1 దొల్లిదాఁ చు బొప్పున - ఐ. ఖ; నిల్లడమున చొప్పున పీ న.
294 1. నతిపముదంబొంద - ఆ ఊ. 2. చెట్ట - కొన్నిప్రతులు.
295. 1. వాఁడవివేకి - వా. కొన్నిప్రతులు, వాడువివేకి - ఊ. ఎ. ఓ. ఔ. 2 దనకకదుభక్తితో నంగన - ఔ.
296. 1. మొందుట - కొన్నిప్రతులు
297. 1. డిచ్చు - ఇ. ఈ. ఏ. ఒ. ఔ. క.

-: పార్వతి శివునకుఁ బతివ్రత తనర్హంబు లగుధర్మంబులఁ దెలుపుట :-

సం. 13 - అను I 15 - 40(9

299. సీ. పరమేశ యాసురి పైశాచి రాక్షసి
యను[1] పేళ్లు గల వధర్మాంగనలకు
వ్యభిచారతత్పరత్వంబు వారికి సెల్లఁ
గల [2]దనుజాంగజ క్రౌర్య[3]నిరత
తన [4]యిచ్చఁ బొలియించు ధన[5]ధాన్యములు చల
హృదయ భోగపరాత్మ యాసుర్వి గలదు
పైశాచి క్రోధన భర్తృపుత్త్రిలయందు
నిఃస్నేహ గృహకార్య[6]నిపుణ గాదు
తే. కలహశీల రాక్షసి నయికంబు లేదు
బొంకు[7]పల్కు నెప్పుడు నిద్ర వోవు పీత
లజ్జ యిందఱు [8]నాథుకులంబువారి
దురిత మొందించి పోదురు నరకమునకు.

300. ఆ. ఎఱుక గలిగి పిదప నేనియుఁ బతిభక్తి
గలిగి ధర్మ మోపి సలిపి శాంతి
గలిగి యున్న మున్ను గలపాపములు వాసి
పురుషు[1]తోడ దివికిఁ [2]బోవఁ గంద్రు.

301. ఆ. అట్లు గాక [1]పతుల యంతిమసమయంబు
నందు (జింతఁ దక్కి [2]యనుమరణము

299. 1. పేరులగు నధర్మాం, పేళ్లనగునధర్మాం, పేళ్లెనఁగునధర్మా - అనిపాఠములు. 2. దానురాంగన క్రౌర్యనిరత - ష న; దనురాంగన కార్యనిరత - ఉ. 3. జనిత - ఓ. క. అర్థము సంశయితము 4. యిచ్చ - చ 5. ధాన్యములఁజల - చ కొన్ని ప్రతులు 6. నిరత జ 7. పలుకు - పెక్కుప్రతు.లు 8 నాఁడుకులంబు - కొన్ని ప్రతులు.

300. 1. తోన - కొన్నిప్రతులు. 2. బోవునంద్రు - అ ఈ; నరుగునంద్రు - ఒ. (కర్తృఏక వచనము) గమనిక:- ఈపాఠమున ప్రాసయతిచెల్లినది

301. 1. పతికినంతిమ, పతికినంత్యమ - అనిపాఠములు. 2. యనుగమనము - ఎ.

చేసి కేని సుగతి సిద్ధించు పతి సమే
తంబు గాఁగ నన్నితంబినులకు.

302. క. ద్విజ[1]భామినికి సధర్మను
ప్రజఁ గాంచినపిదప నయ్యపత్యము శోకో
ద్విజితయుఁ బతిభక్తయు నై
త్యజించి [2]యనుమరణనియత యగుట మహేశా.

303. క. అని చెప్పె గౌరి పతి కి
ట్లను నాదగుచాపలమున నఖిలేశ్వర నిన్
వినిపించితి నేఁ గొన్ని వ
చనముల నీతప్పు నాకు సైఁపుము కరుణన్.

304. క. అని సిగ్గునఁ దెన్నగునా
నన మించుక వాంచి యెత్తు నగతనయ శివుం
డును మునులును మునిపత్నులు
వినుతించిరి మధురవాక్య[1]విభవం బెసఁగన్.

305. క. సురగంధర్వఖచరకి
న్నరకింపురుషోరగాది నారీ[1]జనముల్
పరమప్రీతిని బొగడిరి
పరమేశ్వరి నెలుఁగు లదరఁ బంకజనాభా.

306. క. అని చెప్పె నారదుం డి
ట్లను నగ్గోవిందుతోడ నప్పుడు ప్రియ మా
ననమునఁ [1]బొదలఁగఁ బార్వతిఁ
గనుఁగొని సర్వేశ్వరుండు [2]గారవ మొప్పన్.

307. క. నానీసంవాదము శుచి
యై నైష్ఠికజనుల [1]కెవ్వఁ డాదర మెసఁగం

---

302 1. భామినుల కధర్మము – ఉ. 2. యనుమరణయగుట తగదుమహేశా–అ ఈ.
304. 1. వినయంబెసఁగన్ – ఉ. ఒ. ఔ.
305 1. జనులున్ – పెక్కుప్రతులు
306. 1. బొరయఁగ – ఉ క. ష. 2. గౌరవ – ఏ. ఔ.
307. 1. కెవ్వడునాదర – ఐ. ఋ; కెల్లనాదర – ఒ.

గా నలినాక్షీ చెప్పను
వానికి నిత్యామరత్వవైభవ [2]మొదవున్

808. క. మనసంవాదం బెవ్వరు
[1]వినిరి నియతి నజ్జనులకు విభవముఁ దేజం
బును గీర్తియు నాయువు శ్రీ
యును నారోగ్యంబుఁ [2]గల్గు నుత్పలనయనా.

809. క. అని నిర్దేశించి శివుఁడు
చనియె శివయుఁ గొలువుతోన [1]చనె నిద్దెసకుం
జని రన వశమే యద్భుత
మనిరూప్యం బప్రతర్క్య మది శ్రీరమణా.

810. క. అని పలికి నారదుఁడు నా
వినినకనిన యద్భుతంబు వినిపించితి నీ
కనియెం గృష్ణుని సభ్యుల
మనంబు లానందపూరమగ్నము లయ్యెన్.

811. వ. అని యిట్లు భీష్ముం డుమామహేశ్వర[1]సంవాదం బనుపుణ్యకథ చెప్పిన ధర్మ
తనయుండు సోదరసహితంబుగాఁ [2]ప్రమోదరసభరితుం డై.

-: భీష్ముఁడు ధర్మజునకుఁ బరప్రాప్తిహేతుభూతం బగు జపవిశేషంబు దెలుపుట :-
సం. 13 - అను I 17 - 6

812. సీ. అతనికిఁ బ్రణమిల్లి యనఘ [1]పరప్రాప్తి
యెద్దాన సమకూరు నెఱుఁగఁ జెప్పు
మనిన [2]నతండు నారాయణధ్యాన పూ
జాస్తుతి తత్కథా శ్రవణ నిరతి

---

808. 1. వినుతించిన యజ్జనులకు - ఈ.
809 1. ననవద్దెనకున్ చనిరనుటమేయమద్భుత - ఐ. ఖ.
811. 1. సంవాదంబుసెప్పిన - పెక్కుప్రతులు. 2. ప్రమోదభరితాత్ముండై - ఈ; ప్రమోద భరితచిత్తుండై. ప్రమోదంబునొంది - అనిపాఠములు.
812. 1. ధర్మ - ఐ.ఔ. ఖ 2. నారదుఁడు నారాయణ-ఔ. చ.

యమ్మేలు గావించు నధిప విద్వజ్జన
సంరక్షణము[3] కల్మషములఁ బాపు
వేశ్య యొక్కత తొల్లి విద్వాంసు నొకరిని
బ్రము చ్చని తలవరుల్ మోఁదఁ జూచి
తే. యితఁడు మావాఁడు [4]మీ రిది యేటి కాగ
డంబు చేసెద రని మోక్షణంబు [5]చేసి
యాసుకృతమున బ్రాహ్మణియై జనించెఁ
దగఁగ నర్చింపు మీవు విద్వజ్జనముల.

818. వ. అనిన విని యుధిష్ఠిరుండు దారిద్ర్యవ్యాధి శోకంబులకు శాంతి సంపాదింపం జాలు జపం బెయ్యది చెప్పవే యనుటయు ననిమిషపదీనందనుండు బ్రహ్మ విష్ణు [1]మహేశ్వరులను వినాయక విశాఖవహ్ని వాయు చంద్రాదిత్యులను శక్రవరుణ యమకుబేరులను సురభిని సముద్రంబులను గంగాదిమహానదులను మరుదశ్వివసురుద్రాదిదేవతలను పితృదేవతలను వాలఖిల్యాదిసిద్ధులను వేద వ్యాస వాల్మీకి నారదాగస్త్య గౌతమ కశ్యపాత్రికణ్వాది మహామునులను రంభాద్యప్సరఃస్త్రీలను ధర్మతపస్సత్యములను నహోరాత్రంబులను దారాగ్రహంబులను నశ్విన్యాది తారకంబులను మాసర్తువత్సరంబులను వైనతేయ కాద్రవేయులను గాశీక్షేత్రకురుక్షేత్రాదిపుణ్యక్షేత్రంబులను నైమిశారణ్యదండకారణ్యాది పుణ్యారణ్యంబులను మేరుహిమవత్కైలాసాదిప్రఖ్యాత శైలంబులను దిఙ్నభోభూములను బుణ్యభూరుహంబులను భూసురులను జక్రవర్తులను రాజులను బరమభక్తిం దలంచి కీర్తించి నమస్కరించి యీ సమూహం బంతయు నన్ను రక్షించి నాకు నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధి పరమానందంబు [2]లభినందనపూర్వకంబుగా నిచ్చుఁ గావుత మని యిచ్చఁ గోరి "యోన్నమో భగవతే వాసుదేవాయ నమః పురుషోత్తమాయ నమ స్సర్వలోకగురవే నమస్సర్వలోకపిత్రే నమ స్సర్వలోకపితామహాయ నమ స్సర్వలోకప్రపితామహాయ నమ స్సర్వలోకప్రధానాయ నమ స్సర్వలోకేశ్వరాయ నమస్సర్వలోకవిశిష్టాయ నమ స్సర్వలోకసుఖప్రదాయ నమ స్సర్వలోకకర్త్రే

3. యుఁగల్మష - అ. ఇ. 4 మీరేటి కిట్టులాగడంబు, మీరిటు లేలయాగడంబు - అని పాఠములు 5 సే(చే)సె.

818. 1. రుద్రులను - పెక్కుప్రతులు. 2 ర్యవరమానందంబు - కొన్నిప్రతులు.

నమ స్సర్వలోకకర్త్రే నమ స్సర్వలోకహర్త్రే నమ స్సర్వలోకనిధయే నమ స్సర్వలోకనిధానాయ నమ స్సర్వలోకహితాయ నమ స్సర్వలోకహితకరాయ నమ స్సర్వలోకోద్భవాయ నమ స్సర్వలోకోద్భవకరాయ నమో విష్ణవే ప్రభవిష్ణవే" యని పఠించుట మహాజపంబు.

314. క. పాపంబులును భయంబులు
నాపదలుం బాయు నిమ్మహాజపమున ధా
త్రీపాలోత్తమ శుభములు
ప్రాపించును ధర్మ[1]తత్పరత సిద్ధించున్.

315 వ. అని యిట్లు గంగాపుత్త్రుం డజాతశత్రునకు సర్వసిద్ధికరం బయిన యిమ్మహాజపం బుపదేశించె నని చెప్పి తదనంతర సత్కథ లాకర్ణింపు మని పలికి జనమేజయునకు వైశంపాయనుం డి ట్లనియె.

316. తే. [1]మనుజనాథ [2]యశేషధర్మములు సర్వ
[3]పావనములు శాంతనవుఁడు బహువిధములఁ
జెప్ప నిమ్మెయి విని యుధిష్ఠిరుఁడు భక్తి
నమ్మహాత్ముని ని ట్లని యడిగె [4]మఱియు.

317. చ. అతఁ డొకరుండ లోకముల కన్నిటికిన్ మహనీయ మైన దై
వతముఁ బరాయణంబు నను వైభవ మెవ్వని కొప్పు [1]నర్చన
స్తుతిరతి నెవ్వనిం గొలిచి శోభన [2]మొందు జనంబు [3]మేలు నా
నతిశయ మొంది నీకు [4]మత మై చను నెయ్యది ధర్మకోటిలోన్.

---

314. 1. తత్పరతి - కొన్ని ప్రతులు.

316. 1. శ. వ. ప్రతులలో ఈపద్యపాఠమిట్లున్నది :-
తే. మనుజనాథ యశేష ధర్మములు శాంత
నవుఁడు బహు విధములఁ జెప్పఁ గవి నియును యు
ధిష్ఠిరుఁడు భక్తి నమ్మహాధిషణుతోడ
నానతిమ్మని యిట్లని యడిగె మఱియు.

2 విశేష - ఊ. చ. 3 పావనుండుశాంత - ఏ. 4. నధిప - ట.

317 1. బాపన - ఓ. 2. మందు- అ. ఇ. ఈ. ఏ. ఓ. 3. మేలుగా - ఎ. ట. శ. వ
4. సురమై - ఉ. చ.

818. తే. జపములం దెల్ల నుత్తమ[1]జపము నాఁగ
నంచితం బయి తన్ను జపించు జంతు
[2]వునకు జన్మసంసారబంధనము [3]ద్రోపి
పాపు నెయ్యది యెఱిఁగింపు పరమయోధ.

819. వ. అని యడిగిన నాథూపతికి భీష్ముం డి ట్లనియె.

-:భీష్ముఁడు ధర్మజునకు విష్ణుమంత్రధ్యానం బవశ్యానుష్ఠేయం బని చెప్పుట:-

సం, 13-135-4

820. సీ. అఖిలజగత్ప్రభు వగు దేవదేవు న
నంతునిఁ బురుషోత్తమాభిధాను
[1]నంచితనామ [2]సహస్రకంబున సంస్తు
తించుచు సంతతోత్థితమనస్కుఁ
డై యజమానుఁ [3]డవ్యయుఁడైన యాతని
నర్చించుచును దృఢధ్యాననిరతుఁ
డగుచు నమస్కృతి యాచరించుచు ననా
ద్యంతు నవిష్ణు నచ్యుతు నెల్ల
తే. లోకములకు బ్రహ్మణ్యుఁ ద్రిలోకకీర్తి
వర్ధనుని సర్వధర్మజ్ఞు [4]వరదు లోక
నాథు భూతభవోద్భవు నమ్మి భక్తిఁ
గొలిచి సర్వదుఃఖంబులఁ దొలఁగఁ ద్రోచు.

821. తే. ప్రస్తుతులఁ బుండరీకాక్షుఁ బరమభక్తిఁ
[1]దగిలి యర్చించుటయ నామతంబు సర్వ

---

818. 1. జపమగాఁగ, జపముగాఁగ - అనిపాఠములు. 2. వులకుసంసార బంధంబుదలఁగ నోపి - ఊ ఓ. 3. తొలిపావు, తొరఁబాపు (విభక్తివైచిత్రి) - అనిపాఠములు

820. 1. నచ్యుతనామ-ఊ 2 సహస్రంబునను-అ ఇ ఉ ఐ, ఔ, ళ. 3. నవ్యయు డచ్యుతుండగు నాతనినర్చించు ధ్యాననిరతు - అ. 4. బరమలోక - ఎ.

821. 1. దలఁచి - వా పి, ళ, ష; గలిగి - ఎ; దగిలి - అ, ఆ. పెక్కుతాళపత్రప్రతులు

ధర్మములకును సమధికోత్త మమునైన
ధర్మ మింత యెఱుంగుము ధర్మతనయ.

322\. సీ. పరమతేజంబును బరమ [1]తపంబును
[2]బరమైన బ్రహ్మంబుఁ బరపరాయ
ణంబుఁ బవిత్రంబులు నాఁ దగువానికి
నెల్లఁ బవిత్రంబు నెల్లమంగ
ళంబులకును మంగళంబును నెల్లదే
వతలకుఁ బరమ[3]దైవతము భూత
సమితికి నవ్యయజనకుండు నగునట్టి
వాఁడెవ్వఁ డెవ్వానివలనఁ దోఁచు
తే. నాదియుగమునాగమమున నంత్యవేళ
నడఁగు నెవ్వానియందుఁ జరాచరములు
విశ్వలోకప్రధానుఁ డవ్విష్ణువేయు
భవ్య నామంబులును బాపభయహరములు

323\. తే. భూరిగుణయోగవిఖ్యాతములును ఋషిస
మాజ పరిగీతములును నై మహిమఁ దనరు
నమ్మహాత్ముని నామంబు లధికతరవి
[1]భూతికై చెప్పెదను విను భూపవర్య.

324\. వ. అని పలికిఁ విశ్వంబు విష్ణుండు వషట్కారుండు భూతభవ్యభవత్ప్రభు' వను నివి మొదలైన 'రథాంగపాణి యక్షోభ్యుండు సర్వ ప్రహరణాయుధుం' డనియెడు నివి [1]తుదగాఁ గల సహస్రనామంబు [2]లుపన్యసించి.

325\. ఆ. కీర్తనీయుఁ డైన కేశవు దివ్యనా
మంబు లివి [1]భవద్ధితంబుఁ గోరి

---

2\. ధర్మమైనధర్మ — ఓ; త్వమ్మునైనధర్మ - ఉ. ళ.

322\. 1. తపంబును - కొన్నిప్రతులు. 2. బరమ ధర్మములకుఁబర - ఐ. ఖ; బరమమైనధర్మం బుపర - ఎ ఓ. క. 3. దైవంబుభూత - ఉ. వీ.శ. వ.

323\. 1. భూతికిని - ఐ. ఖ.

324\. 1. తుది - కొన్నిప్రతులు. 2. ఉపదేశించి - ఐ. ఓ. ఖ.

325\. 1. జగద్ధితంబు - ఆ. ఉ. ఊ.

తరతరంబ కీర్తితంబు లయ్యె ననేక
భంగి [2]వేయుఁ గురున్నృపాలవర్య.

-: భీష్ముఁడు ధర్మజునకు విష్ణునామ ప్రభావంబుఁ దెలుపుట :-

సం. 13-135-121

826. సీ. విష్ణునామంబులు వేయును నిత్యంబు
వినినఁ బఠించినఁ మనుజుఁ డిహము
నందుఁ బరమ్మున నశుభంబు నొందక
యత్యంత శుభముల ననుభవించు
విప్రుండు వేదాంతవిదుఁ డగు రాజువి
జయ మొందు వైశ్యుఁ డక్షయ ధనంబుఁ
బడయు శూద్రుఁడు [1]సుఖ[2]భాగిత వెలయు ధ
ర్మార్థకామ ప్రజాభ్యర్థిజనులు
తే. గాంతు రయ్యె తెఱంగు [3]లేకాంతభక్తి
శాచియై విని కీర్తించి సారయశము
నచల[4]లక్ష్మియు వంశవర్యతయు మేలి
పెంపుసొంపును గలిగి శోభిల్లు నరుఁడు.

827. సీ. పురుషోత్తము నినామములు వేయుఁ గీర్తించు
నాతఁ డొక్కెడను భయంబుఁ బొందఁ
[1]డమితవీర్యమునఁ దేజమునఁ [2]గాంతిని [3]బల
రూప గుణంబుల రూఢికెక్కు
రోగ[4]బంధాపదార్తులకుఁ బఠనమాత్ర
నయ్యాయిదురితము లడఁగు వాసు
దేవాశ్రయుఁడు వాసుదేవపరాయణుఁ
డును నగుమర్త్యుఁ డప్పినుతనామ

---

2. వెలయుఁగురు - ఒ. ఔ. క.

826. 1. శుచి - ఉ. 2. భావిత-ఊ. క. 3. లేకాత్మ భక్తి — ఊ. ఏ. గమనిక - ఈపాఠములో అఖండ యతికనఁబడుచున్నది. 4. భక్తి - క.

827. 1. దమితవీర్యము నందు నతయకాంతిని - అ. 2. గీర్తిని - ఓ. 3. నిజ - అ. ఈ. 4. బంధనవధార్తులకు - ఐ. ఖ.

ఆ. క్రము లుపన్యసించి కల్మషంబుల నెల్లఁ
దొలఁగి దుర్గతులకుఁ దొలఁగి జన్మ
మరణములకు రోగజరలకు నందని
పరమ మైనబ్రహ్మపదము నొందు.

328. క. స్మృతిసౌఖ్యక్షాంతి శ్రీ
ధృతికీర్తులు గలుగు దుర్మతియుఁ గ్రోధము లు
బ్ధతయును మాత్సర్యము [1]లే
వతిపుణ్యాత విష్ణుభక్తు లైన[2]జనులకున్.

329. సీ. చంద్రార్క నక్షత్ర సహిత మైన నభంబు
సచరాచరోర్వియు జలనిధులును
సురదైత్యగంధర్వ గరుడయక్షోరగ
వ్రజములు హరివశవర్తనములు
బుద్ధియు నింద్రియములును మనంబు స
త్త్వంబును బలముఁ దేజంబు ధృతియు
క్షేత్రంబుఁ దద్గత[1]క్షేత్రజవస్తువు
లరయఁగా వాసుదేవాత్మకంబు
తే. లాగమోదితాచారమయంబు ధర్మ
మచ్యుతుండు తత్ప్రభువు సాంఖ్యమును యోగ
తంత్రమును శిల్పవేదశాస్త్రములుఁ [2]గర్మ
ములు జనార్దను[3]వలన [4]సముద్భవించె.

330. ఆ. విష్ణుఁ డొక్కరుండ వినుమహాభూతంబు
లక్క[1]భూతతతులు పెక్కు గలవు
సరిఁ ద్రిలోకములను [2]బరఁగి విశ్వంబు భూ
తాత్ముఁ [3]డమ్మహాత్ముఁ డనుభవించు.

---

5. యట్టి - జ.

328. 1. లేదతి పుణ్య, లేకతిపుణ్య - అనిపాఠములు. 2. నరులకున్, మునులకున్ - అని పాఠములు

329 1. క్షేత్రజ్ఞ - పెక్కుప్రతులు. 2. ధర్మములు - ఆ. 3. నందనముద్భవించె - ఊ. 4. నముద్భతములు, సముద్భవించు - అనిపాఠములు

330. 1. భూతములును - ఐ. ఓ. క. 2. బరఁగు అ. ఆ. ఈ. 3. దనఁగనతఁడయనుభ - ఇ. ఉ. ఏ ఐ. ఖ; దగుచుఁదాన యనుభ - పీ. శ. ష.

331 ఆ. వ్యాససంప్రణీతమైన [1]యీవిష్ణుస్త
వంబు సకల[2]శోధనంబులును సు
ఖములుఁ గోరుపురుషుఁ డమలిన[3]బుద్ధిఁ బ
ఠింపవలయు భక్తిపెంపుతోడ.

332. క. అజు విశ్వాధీశ్వరు స
ర్వ[1]జగత్ప్రభవావ్యయప్రవర్తనకరు నం
బుజలోచను నెవ్వారలు
భజింతురు పరాభవమునఁ బడ రప్పుణ్యుల్.

333. క కావున విష్ణునిపేళ్లగు
నీవేయుఁ బఠింపు [1]సీకు నెప్పుడు నాయు
శ్శ్రీవిభవారోగ్యంబులు
భూవర సిద్ధించుఁ బరమబోధముఁ గలుగున్.

334. క. అని యి ట్లుపదేశించిన
విని మోదము నెమ్మనమున వెల్లిగొనఁగఁ దాం
డునియగ్రసుతుఁడు గాంగే
యుని కభివందన మొనర్చి [1]యుచితవినయుఁడై.

335. వ. పూజానమస్కారంబులకు నెవ్వరుఁ భాజనంబు లెవ్వరికిఁ బెట్ట సేసినం జేటు
వాటిల్లు నెవ్వారలు సంతోషించిన శుభంబులు చొప్పడుం జెప్పవే [1]యనిన.
నతం డతని కిట్లనియె.

-:బ్రాహ్మణపూజానమస్కారంబులు పరమోత్కృష్టంబు లని చెప్పుట:-

సం - 13 - 136-1

336. సీ. పూజానమస్కారములకుఁ బాత్రములు బ్రా
హ్మణులు వారలకుఁ గీడాచరించి
వాసవుండును జెడు వారిసంతసమున
నఖిలశుభంబులు నావహిల్లు

331. 1. యవ్విష్ణు తత్వంబు - ఆ. 2 లోకవైభవము సుఖ - ఓ. 3. భక్తి జపింప-బ. భ
332. 1 జగత్ప్రభునవ్యయ - ఇ.
333. 1 నీవునిచ్చలు-ఊ ఐ ఔ. ఖ. ట. ల న; భక్తినెవ్వుడు - ఇ. ఏ;
334. 1. యుచిత - ఆ ఈ ఔ. భ.
335. 1. యనియడిగిన - పెక్కుప్రతులు.

ధర్మసేతువు లోకధారకం బఖిలశా
స్త్రప్రవర్తకము విప్రవజంబు
[1]తపమును వాక్కును ధనము విప్రుల కొక్క
కుడుపుమాత్రన పాపకోటిఁ బాపు

తే. రమ్మహాత్ములు చొప్పరు లఖిలమార్గ
ములకు [2]వీను [3]దేవతలకు బాలుఁ
డఙ్గుఁ డన లేదు పూజకు నర్హు లనిన
[4]నధిప వృద్ధులఁ బ్రాజ్ఞుల నడుగ నేల.

337. వ. అనిన విని యజాతశత్రుండు బ్రాహ్మణులఁ బూజించుటవలన [1]విశిష్టం బయిన శుభం బెయ్యది దృష్టం బయ్యె వారలయందు వర్ణనీయం బగువర్తనం బేమి గానం బడియె నీ విట్టి వారలం గొనియా[2]డె దెలింగింపవే యనుటయు నాపగాపుత్రుండు పవనార్జునసంవాదం బను నితిహాసంబు విను మది భవత్ప్రశ్నంబునకు [3]సదుత్తరంబై యుండు నని పల్కి యజ్ఞనపతి కిట్లనియె

*-: పవనకార్తవీర్యార్జున సంవాదంబు భీష్ముండు ధర్మరాజునకుం జెప్పుట :-*

సం. 13 - 137 - 2,

338. సీ. అధిప సహస్రబాహార్జునుఁ డేడుదీ
వులు నేలి యద్భుతబలపరాక్ర
మములఁ దనర్చి [1]మత్సము లెవ్వరును నెందు
లే రని యత్యవలేపయుక్తి
వాడిన నొకభూత మాకాశమున నుండి
యెలుఁగెత్తి పలికెద వెల్ల వారి
కధికులు గారె [2]ధరామరు లనవుఁడు
నతఁడు వారలు రాజు నాశ్రయించి

---

336. 1. ఘనమనోవాక్కాయ కర్మంబు విప్రునికుడుపు - ఊ. బ. ఔ. బ. 2 విప్రకులమునుబిత్రులకు బాలు - క. 3 ధారుణీ దేవతలకు - శ 4. నధిక, ననఘ - అనిపాఠములు.

337. 1. విశేషంబైన - ఇ. ఏ 2. యారుతెలంగెలింగింపవే - కొన్నిప్రతులు. 3. సుత్తరంబై - పెక్కుప్రతులు.

338. 1 మత్సమము వారెవ్వరు లేరని - ఉ. బ. ఖ. శ. 2 బ్రాహ్మణులనియనవుడు - ఉ. ఔ.

తే. నడపికొందురు మనుగడ పుడమితేని
కంటె నెక్కుడై రట్లుఁ గాక యేను
మనుతుఁ గూర్చినఁ దెలియు నల్గిన సమస్త
భూతముల నన్ను వెఱచి యాభూత మరిగె.

839. వ. [1]అట్టియెడం బవనుండు గగనంబున నుండి త న్నెఱింగించికొని యన్నర
పతితోడ.

840. సీ. భూదేవశక్తినకాదె రాజులు [1]ప్ర
రతయొనర్చుట బ్రాహ్మణులకు
నధికులు గలరె యహల్యకై యింద్రుడు
గౌతముఁ డలిగిన గాసిఁ బడఁడె
కుంభసంభవుచేత నంభోధి యడఁగదె
యనలుండు భృగుశాపహతుఁడు గాఁడె
యన విని [2]మఱుమాటయాడక యున్నయ
ర్జునునకుఁ [3]బవనుఁ డిట్లనియె మఱియు
తే. నాంగిరసవంశసంభవుం [4]డగు నుచథ్యుఁ
గోరి నిజపుత్రి సోముఁడు గారవమున
నిచ్చె నాదంపతులు దమయిచ్చ వనము
నందు వసియించి మునిహృదయంబు లలర.

841 వ. వర్తించునెడ నొక్కనాఁ డమ్ముని యమునానదీస్నానంబునకుం జనుటయు
మున్న యవ్వనితం గామించి వేచి తిరుగువరుణుండు.

842. క. ఎత్తికొని పోయి తనపురి
నత్తామరసాక్షి నునిచె నమ్మునికడకున్
మెత్తన చని నారదముని
యత్తెఱఁ గెఱిఁగింప నాతఁ డాతనితోడన్.

---

839. 1. అట్టియెడఁ బన్నుండై పవనుండు – ఊ.

840. 1. ధరా – ఊ ఓ 2. మాఱుమాటాడక – పీ, శ, న. 3. బవనుఁడనియె–ఊ. ఓ.
4. డైన భవ్యుఁ గోరి – అ. ఉ.

343. తే. [1]తాన దిక్పతి దన కిట్లు దగునె యొరుని
భార్యఁ గొనిపోవ నీ వేఁగి పలుకు [2]మిట్లు
యనినఁ జని నారదుండు సెప్పినను విడువఁ
డయ్యెఁ గామాంధుఁడై సతి [3]నధిపతుఁడు.

344. వ. విడువ కున్న నమ్ముని యు[1]చథ్యుకడకు మగిడి వచ్చి.

345. సీ. ఇంతిఁ దా విడువనియంతియ కాదు నల
బెడతల వట్టి క్రోపించె వరుణుఁ
డని చెప్పుటయు నగ్గి యతఁడు సర్వజలంబుఁ
ద్రావిన వరుణపురంబు ధూళి
మయమైన భయ మంది మానినిఁ గొని[1]వచ్చి
యొప్పించి [2]ప్రణమిల్లి తప్పు [3]వాపి
కొని మునికృపఁ గాంచి చనియె నాదిక్పతి
ధరణీశ రాజులో ధరణిసురులో

ఆ. యెక్కు డనిన విని యక్కిల్లు వడియున్న
యతనితోడ ననిలుఁ డమరు లసుర
సమితి కోడి వచ్చి శరణు సొచ్చిన నగ
స్త్యుండు విజయలక్ష్మి నొసఁగుటయును.

346. వ. గంగాతీరంబునం గ్రతువు లొనరించుగీర్వాణులం బూర్వగీర్వాణులు గాసి చేసిన వసిష్ఠునికడకు వారలు వచ్చియం బాఱుదేరం గోపించినయత్తాపసోత్త ముని రోషానలజ్వాలలు [1]సాకారంబు లయి యాదైత్యలోకంబు నేర్చుటయుం జెప్పి యక్కుంభసంభవుండును వసిష్ఠుండును శ్రేష్ఠు లగుట రాజుల కొడఁ

---

343. 1. తాను...,యొరుల - న కొన్నిప్రతులు 2 మచట, మిట్టులనినిన - క మిట్టులనినిన - అ ఊ. ఐ ఓ. ఖ.౩. నప్పిభుండు, నధిపరుఁడు - అనిపాఠములు.

344. 1. యుథవ్యు, యుశర్యు, యువర్యు, యుచైద్యు - అనిపాఠములు. ఈశబ్దము మహా భారత నామానుక్రమణిక యందు 'ఉతథ్యుడు' అనియున్నది.ఈయనభార్యభద్రచూడు వరుణ (పేజి 712)

345. 1 పోయి - ఉ. 2. ప్రణతుఁడై - ఐ ఖ 3 గావుమనుచుబ్రార్థన చేసిచనియె - క.

46. 1. సాయకాకారంబులై - శ. న

ఱాటు [2]గాదో కదే యని ననుం బలుక కున్న యన్నరపతితోడం [3]బవమా
నుండు మఱియు ని ట్లనియె.

-: పవనుండు కార్తవీర్యార్జునునకు నత్త్రిప్రభృతులమహిమ చెప్పుట :-

నం 18 - 141 - 1

847. సీ. ఒకతఱి దేవతలకు దైత్యులకు మహా
రణమయ్యె [1]నపూర్వ రాహునస్త్ర
సమితిచే నర్కుండుఁ జంద్రుండు [2]సొలసిన
[3]వెలుఁగడంగుడుఁ దమ మొలసి వెగడు
పడిన యద్దివిజుల వడి నంటఁ దాఁకి య
య్యసురలు నొప్పింప నత్త్రికడకుఁ
జాఱి మమ్ముం గావు పరమదయాత్మక
[4]యనుడు నతండు చంద్రార్కతనువు
ఆ. లత్తతములు సేసి యసురసైన్యము రూపు
మాపె నిజకటాక్షమాత్రమునన
యతని నృపులకంటె నధికుఁ డండమొ హీనుఁ
డండమో నిజంబు యధిప చెపుమ.

848. సీ. అనిన నూరక యున్న యర్జునుతోడ స
దాగతి యిట్లను ధరణినాథ
సురపతి యాశ్వినుల్ సోమపానంబున
కర్హులు గా రన్న నాశ్రయంబు
పాటించి వారికై భార్గవచ్యవనుండు
దనమంత్రముబల్మి ననిమిషులకు

2. గాదాకోయనీ - ఆ. ఐ. ఔ ఖ 3. బవనుండు - అ. ఆ. ఈ. శ. వ.

847. 1. నాప్పారు - ద. 2. నొచ్చిన - కొన్నిప్రతులు 3. వెలుఁగుతగ్గుడు - అ. ఈ; వెలుఁ
గడంగుట - ఈ. 4 యనిన - పెక్కుప్రతులు

నెగ్గు సేయంగ నయ్యింద్రుండు [1]పోటున
క్రేటున నాతని గీటడంచు
తే. బుద్ధి నొకశైలమును వజ్రమును రయమునఁ
గొని మహోగ్రతఁ [2]గవియ నమ్మునివరుండు
జలము చల్లిన శైలవజ్రములుఁ దాను
[3]ముడుఁగఁ బడి యబ్బలారాతి మూర్ఛ వోయి.

349. వ. ఒక్కింతసేపునకుం దెలిసె నంతకు నమ్మునివరుండు మదుం డనువాని శత
యోజనదీర్ఘసహస్రదంతుని సృజించి పంపిన.

350 ఆ. వాఁడు సురగణంబు వాసవుఁ గబళింప
వారు శరణుశరణు వరమునీంద్ర
యనిన వారిఁ గాచె నమ్ముని వా రిచ్చి
రపుడు సోమపాన మాశ్వినులకు

351. క. నీ వాచ్యవనుండును ధా
త్రీవరుసరి గామి యెట్లుఁ [1]దెలుప కుడుగుదే
నా వినియు నొక్కమాటయు
నావిభుఁ డాడండ దాని కలయక మఱియున్.

352. వ. వాయుదేవుం డన్నరదేవువలనికరుణం జేసి యతని[1]చే టొర్వనివాఁడై,

353. సీ. [1]అకట దత్తాత్రేయునకు [2]భక్తి శుశ్రూష
చేసి కాదే [3]యిష్టిశిష్టబలప
రాక్రమంబుల[4]నొంది రాజుల కెల్లను
నెక్కుడై శా కృత మేల మఱవ
విను మీ వొకండవే యనిమిషాది సమస్త
భూతంబులును వృద్ధిఁ బొందు [5]టవని

348. 1. దాటున - చ. 2 గదియ - ట. ఖ చ. 3. ము(ని) ఉఁగివడి - న. పెక్కుప్రతులు.
351 1. దెలుపకయుండదన్ - ఐ ఖ ల
352 1. చేటొప్పని - ఓ
353. 1. అత్రేయమునికి నీవలిభక్తి - ల. 2. నీవు, మున్ను అనిపాఠములు. 3. యిట్టిశిష్ట - ఐ. ఔ. శ. ష. 4 జేసి, గాంచి, చేర్చి - అనిపాఠములు 5. పుడమి, ధరణి - అని పాఠములు.

దివిజుల కృసన యీ తెఱఁ గెల్ల జనములు
నెఱిఁగినపని శాంతిఁ [6]గొఱలి విప్ర
తే. కులము దైవస్వరూపం బగుట మనంబు
నందు దృఢముగ నిల్పి తదాశ్రయమున
వెలయువాఁడ వైనను [7]మేలు వినుము నాదు
బుద్ధి యనవుడు నతఁడు [8]ప్రబోధ [9]మొలసి.

354. క. [1]నీపనుపుచేసి బ్రదికెద
నేపు నహంకృతియు [2]విడిచి [3]యెల్లవలన మే
లాపాదించుచు విప్రుల
శ్రీపాదము లాశ్రయించి చెందెద శాంతిన్.

355. ఆ. [1]అనిన సంతసిల్లి యనిలుఁ డానృపు బుద్ధి
గలిగి బ్రదుకు మనుచు గారవించి
పీడుకొల్పి చనియె విప్రులపెం పిట్టి
దని యెఱుంగు కురుకులాగ్రగణ్య.

–: భీష్ముండు ధర్మజునకుఁ గృష్ణుని ప్రభావం బుపన్యసించుట :–
సం. 13-148-9

356. వ. అనుటయు నవ్విభుండు బ్రాహ్మణమహానుభావం బింకను వినవలతుం జెప్పవే యనుటయు నప్పుడమితేనికి భీష్ముండు తనకు నింద్రియంబులును [1]వాఙ్మనసంబులు నపుడు [2]మస్వలంబు లగుట యెఱింగించి యునుండు దక్షిణాయనంబు తుదిచేరువ వచ్చె దేహ[3]న్యాసంబు తడవు లేమి దోఁచుచున్నది కృష్ణుండు నీకు విప్రజనవిశేషం[4]బు వివరించువాఁ డని పలికి యి ట్లనియె.

357. తే. ఏను గృష్ణు నెఱుంగుదు మానవేంద్ర
యెత్తెఁ గ్రీడావరాహమై యుద్ధరిత్రి

6. గోరి – ఈ. ఓ; గెలిచి–ఓ, 7 భక్తి – అ ఈ 8. ప్రమోద–ఓ.ల. 9 మొంది–ఇ
354. 1. నీపంపు వెక్కుప్రతులు. 2. మాని – ఇ ఏ. 3 యెల్లెడలను – అ. ఉ. ఔ. శ. వ.
355. 1. అనుడు – అ ఈ
356. 1. వాఙ్మనః సత్త్వంబులు – ఐ. ల. 2. దుర్లభంబు – క. 3. త్యాగంబు – పీ. ష. స
4. బెఱిగించువాఁ డని – ఉ. ష.

నిది యొకండును జెప్పఁగనేల కృష్ణు
లీలఁగాదె భూవ్యాద్యి[1]భూతాలి గలిగె.

858. వ. కృష్ణుండు.

859. తే. బొడ్డుతామరయం దొక్క పురుషుఁ డుద్భ
వించునట్లుగఁ [1]జేసి తద్విరచనాని
భమున నఖిలచరాచరప్రభవ మయ్యె
నరయ సామాన్యమే కృష్ణుపరములీల.

860. క. విను మెత్తఱి ధర్మంబులు
దనుజులచే బాధఁ బొందుఁ దత్సమయమునన్
జనియించి యద్దురాత్ములఁ
దునుముం గృష్ణుండు ధర్మధుర్యులఁ గాచున్.

861. క. శూలియునుం దాన దిశా
పాలురునుం దాన విశ్వపతియును గురుభూ
పాలవర తాన కృష్ణుఁడు
కాలము దిక్కులును దాన కలఁ డఖిలములన్.

862. ఆ. అరయఁ గృష్ణుఁ డధ్వరాత్మకుఁ డఖిలాగ
మోక్త మంత్ర[1]తంత్రయుక్తి నతనిఁ
బ్రస్తుతించి మేలు వడయుదు రధ్వర
కర్తలైన జనులు కౌరవేంద్ర.

863. క. చయనంబుల ఋగ్వేదం
బయ మహితసువర్ణనాముఁ డగు కృష్ణు గుణో
దయము వినుతించు యజ్ఞ
క్రియానిరతులైన సురలు ప్రీతిం బొందన్.

---

857. 1. భూతాళి - అ. ఓ.

859. 1. జేసెఁ దద్విరచనావిభవమునఖిల - ఓ. ఖ. వి. న; జేసితద్విరచనానుభావమునఖిల - అ. శా. ఓ

862. 1. తతుల భక్తియుక్తి - న. కొన్నిప్రతులు.

964. క. విను ఋగ్వేదము కృష్ణుని
వినుతించుట యరుదె యఖిలవేదంబులుఁ ద
జ్జనిత విలాసంబులు వే
దనిరూపితవస్తు[1]వు ననఁ దాన కుమారా

965. తే అగ్నులును యజమానుఁడు నాహుతులును
యాగఫలరూపమును గృష్ణుఁడని యెఱుంగు
మినశశాంక తారకముల నెసఁగు తేజ
ములును గృష్ణమయంబుల భూపవర్య.

966. క. పరమజ్యోతి యనఁగ [1]ని
ర్జరామరపదం బనంగ సత్యం బన భూ
వర యమృత మనఁగ దేవకి
వరసుతుఁడు వెలుంగు వేదవర్గముతుదలన్.

967. క. అని యిట్లుపదేశించిన
విని మోదము నొంది పాండువిభునగ్రసుతుం
డనిమిషతటినీసుతునకు
వినతుండై నెమ్మనమున వేడ్కఁ దలిర్పన్.

-: కృష్ణుఁడు ధర్మరాజునకు బ్రాహ్మణ ప్రభావంబు చెప్పుట :-

సం. 13 - 144 - 1

968. వ. కృష్ణునకుఁ బ్రణమిల్లి దేవా భూదేవమాహాత్మ్యంబు వినవలతు నానతీయవే [1]యని వినయసంభృతుం డగుచుఁ బ్రార్థించిన నప్పార్థివునిమీఁదఁ గరుణా మృతమయం బగునాలోకనం బొలయ నద్దేవుం డాదరభరితుం డై యి ట్లనియె

969. క. ననుఁ బ్రద్యుమ్నుం డివ్విధ
మున నడిగిన వానికేను ముద మందుచు నా

964. 1 వనఁగ - పీ శ. వ. పెక్కుప్రతులు
966. 1 నిర్జరహార పదమన నిత్యసత్య మనఁగభూ - ఆ; నిర్జరామర పదమననిత్య సత్యం బన భూ - ఈ. ఐ. ఖ
968 1. యనినవినయుంబుగాఁ బ్రార్థించిన - ఈ పీ. శ. వ. న

తని హితము గోరి కుంతీ
తనయాగ్రజ యున్నరూప తగ ని ట్లంటిన్

870\. సీ. వర్గత్రయము నపవర్గంబు సాధింప
నమరపితృప్రీతు లాచరింప
నైహికసుఖము లుపార్జింప వలసిన
[1]వారికి [2]విప్రుల చేరుగడలు
దివిజుల కైన నాయువు శ్రీయుఁ గీర్తియుఁ
దనరుట తత్ప్రసాదమునఁ [3]జూవె
యలిగి భస్మముసేయ [4]వలచి పెంపొసఁగంగ
[5]నవనీసురులు శక్తు లట్టు లగుట
తే. వారిఁ గోపింపఁ జేయక వారలకుఁ బ్రి
యంబు సేయుచు వారు ప్రవర్ష మొందఁ
దనకుఁ గలభంగి నిచ్చునతండు రెండు
భువనములందుఁ బెంపును [6]బొగడుఁ బడయు.

–దుర్వాసుఁడు కృష్ణుని మనశ్శుద్ధి పరీక్షించి యనుగ్రహించిన ప్రకారము:–
సం 13 – 144 – 14

871\. వ. నాకనిన యాశ్చర్యంబు సెప్పెద నాకర్ణింపుము స్వతంత్ర[1]ప్రవర్తనుండగు దుర్వాసుండు మనమందిరంబునకు వచ్చి మందహాసంబు సేయుచుఁ గోపించుచు సుముఖుం డగుచు విముఖత్వంబు నొందుచుఁ గుడువ నొల్ల ననుచుఁ బెక్కండ్రకుం గావించిన కూడుగూరదా నొక్కరుండ భుజించుచు సెజ్జ నిద్రించుచు భూమి శయనించుచు నెందేనిం బోవుచు మరలి వచ్చుచుఁ బ్రవర్తించుచుండి యొక్కనాఁడు కృష్ణా నాకుం బాయసంబు[2]మీఁద వేడుక పుట్టెడుఁ బెట్టింపవే [3]యనఁ దత్క్షణంబ కావించినం గొంత కుడిచి కొంత తవయొడలం

---

870\. 1 వారలు – చ. 2. విప్రులు – బ. బొ. భ 3 నువ్వె, నూవె, జూవ్వె – అనిపాఠములు 4. వలసి – పీ మున్నగుప్రతులు. 5. జగతీ సురులు శక్తులగుట – కొన్నిప్రతులు 6. బొగడు నొందు – ఛ.

871\. 1. ప్రవర్తకుండగు – ఈ. ఓ. 2 మీఁది – కొన్నిప్రతులు. 3 యనిన – పెక్కుప్రతులు

బూయు మనినం బూసితి నచ్చేరువ నున్న రుక్మిణిం జూచి కొంత యకాంత
మేనం [4]దానవపూసి రథరూపంబుగా రథంబున నప్పాలఁతిం బూన్చి రథారో
హణంబు చేసి వీథికి వెడలి యమ్మద్దియను [5]ములుకోలం బొడుచుచు రథంబు
నడడింప నాకుం గోపంబు నిర్వ్యయు నించుకయు జనింప కుండె నేనుం
జూచుచుం దోడన నడిచితి నప్పుడు యాదవు లాశ్చర్య కౌతుకయాయత్త
చిత్తులై యనేకప్రకారంబులం దమలోఁ బలుకుచుం జేయునదిలేక కెలంకుల
వచ్చు చుండ.

872 ఆ రథముఁ [1]దివిచి డస్సి రమణి మేదిని[2]మీఁద
మ్రొగ్గ తిలఁగఁ బడిన డిగ్గ నుఱికి
దానిమీఁద ధూళి దాఁజల్లి వెసఁ జాతె
నమ్మునిశ్వరుండు యామ్యదిశకు.

873. క. పాఱిన [1]నాతని[2]వెనుకన
పాఱితి సంప్రార్థనాప్రభాషణములతోఁ
దేఱి మరలి యమ్ముని మిముఁ
[3]గాఱియ వెట్టితిఁగదే యకట యనుచు దయన్.

874. వ. నన్నుం గనుంగొని నీవుకోపంబు జయించితివి నీకు వరంబిచ్చెదఁ గైకొనుము

875. ఆ. ఎల్లవారుఁ దనకు నెంతగూర్తురు నీకు
నంతగూర్చి నిన్ననుసరించు
వారు[1]గాత లోకవంద్యుండవై [2]యెందు
మాఱులేక యతుల[3]మహిమమనుము.

876. వ. అనినిర్దేశించి మఱియు నిట్లనిరి.

877. క. [1]నాయంగంబుల నెల్లం
గాయస మతిభక్తిఁ బూసి పాదతలమునం

4. దాను బూసి - అ. ఈ ఉ. ఏ శ 5 మునికోలం - పెక్కుప్రతులు.
872 1. విడిచి - ఈ ఒ; డిగిచి - అ. ? పైని, వయి, మీఱు - అనిపాఠములు
873. 1. వెనుకననేను బాఱితి - ఈ 2. వెనుకొని - ఓ. 3 గాఱియఁబెట్టితి - పెక్కుప్రతులు,
875. 1. గాక, గాఁగ - అని పాఠములు 2. యుండు, యుందు - అనిపాఠములు 3. మహిమ మునను - ఈ ఐ. ఖ.
877. 1, నాయంగకములనెల్లను - అ ఈ. ఒ.

బూయవు [2]గావునఁ గలుగు న
పాయం బఱకాల నీకు నవిఁ ఉఘ్యంబై.

378. క. నిను పరమపదప్రాప్తికి
ననుగుణమైయుండుఁ [1]గాన యది మును నశుభం
బనరాదు నీవు బ్రాహ్మణ
జనములయెడ నడపు మిట్టి[2]చందము నెపుడున్.

379. వ. అని పలికి రథవహనపరిశ్రాంత[1]యగు మీతల్లింజూచి నీవు సౌందర్యసౌభాగ్యం
బుల నప్రతిమానవై మాననీయత్వంబునం గృష్ణుని షోడశసహస్రాంతఃపుర
[2]కాంతల కంటె నెక్కుడగు మని దీవన యిచ్చి యమ్ముని యంతర్హితుం
డయ్యె.

380. ఆ. రుక్మిణియును నేను రుచిరసంపద నప్పు
డతిశయిల్లు నస్మదంగకములఁ
జూచికొనుచు మిగులఁ జోద్య మందుచుఁ [2]బ్రియ
మెడఁదనెలకొనంగ నింటి కరిగి.

381. ఆ. అందు వస్తుచయము ముందుకంటెను
[1]బహులమును మనోజ్ఞభంగికంబు
నగుటఁ జూచి యద్భుతాయత్తచిత్తుల
మైతి మిట్టివార లవనిసురులు.

382. క. కావున [1]వారికి భక్తుఁడ
వై వెలయు కుమార యనిన నతఁ డట్టిఁడఁడయ్యె

---

2. దానంగలుగు - అ. ఇ. ఈ. ఏ, ఐ, ఖ.

378 1. గానదది - పెక్కుప్రతులు. గమనిక :- 'కాన' అను ఈపదము కళగాను, ద్రుత ప్రకృతికముగాను కూడ మహాకవులచే ప్రయుక్తమైయున్నది. 2. చందంబెందున్ - కొన్నిప్రతులు.

379. 1. గ్రియున్నయాలతాంగిం జూచినీవు - ఉ; యగునాలతాంగిం జూచినీవు - ఔ; యగు రుక్మిణింజూచి - క. 2. కామినుల, వనితల - అనిపాఠములు.

380. 1. ములను - అ 2. ప్రియమెదను - ఏ; ప్రియయెద్ద నెలవుకొనఁగ - ఓ. చ.

381. 1. బహుళముగ, బహుళమగు - అనిపాఠములు

382. 1. భూసుర - ఉ. ఐ. ఖ.

తా పేలసె నీవు నట్టిఁడ
వై వెలయఁగ వలయుఁ గౌరవాన్వయ[2]ముఖ్యా.

883. వ. అనిచెప్పినం బ్రముది[1]తమానసుం డగుచు నమ్మానవనాథుండు మాధవుతో దుర్వాసుండు శర్వాంశసంభవుం డని విందు [2]శర్వునిమహిమ విన వలతుం జెప్పవే యనిన నప్పురుషోత్తముండు భరితాదరుం డై.

—: కృష్ణుఁడు ధర్మజునకు శివునిమహిమ చెప్పుట —
సం 13-145-3

884. ఆ. అడుగ[1]వలయుదాని నడిగితి నీవు న
న్నధిప నామనము ప్రియంబుఁ బొందె
శివునిఁ దలఁచి మ్రొక్కి శివుదివ్యమహిమ సె
ప్పెద నితాంతవిమలహృదయ[2]కమల.

885. వ. ఏకాగ్రచిత్తుండవై యాకర్ణింపు మని [1]పలికి యప్పాండవాగ్రజున కి ట్లనియె.

886. క. శతరుద్రీయము నేనరుఁ
డతిభక్తిని శివుని మనమునందు నిలిపి యం
చితముగఁ బఠించు సులభం
బతనికి సర్వంబు నిందు నందు నరేంద్రా.

887. వ. అని వెండియు.

888. సీ. అమరు మహాదేవుఁ డను పేరు శివునకు
నప్పరమునకు మీఁ దరయ లేదు
తలోకపద్రుకిఁ్కల ధర్మవిరుద్ధపు
జాతుల నెల్లను సమయఁ జేయు

2. దీపా - ఉ. ల.

883. 1. తాత్ముండగుచు - ఖ. 2. నతని - ఇ. ఏ. ఊ.

884. 1. దగిన - ఐ ఖ. ల 2. కలన - చ

885 1. ధర్మజునకిట్లనియె - వా. పీ శ. న; పలికియప్పాండవాగ్రజున కిట్లనియె - పెక్కు వ్రతులు.

[1]దేవతల్ మునులు నతిప్రయత్నంబునఁ
గావించు దక్షయాగమున శివుని
మఱచిన నయ్యజ్ఞ మఱవఱలై పోదె
భగనేత్రనాశ మాదిగ ననేక
తే. భంగములు రావె వారి కాప్రభువుచేత
శరణు వేఁడినఁ గావఁడే కరుణ నట్టి
వారి నీశుపెం పేమన వచ్చు మఱియు
వినుము తద్దివ్యలీలలు మనుజనాథ.

౩౮౯. సీ. ప్రబలదైత్యులు పురత్రయనాయకులు జ
గత్త్రియము [1]నప్రతిమ ప్రతాపలీల
బాధింప దివిజులు ఫాలలోచనుఁ గాంచి
కావుము కృపదేవదేవ మమ్ము
బశువుల మగువారిఁ బశుపతి వైనని
వనుచు మహా[2]క్రోశ మాచరింప
నప్పురంబులు మూఁటి నస్త్రమొక్కటన [3]భ
స్మముగాఁగఁ జేసి యమ్మార్గణంబు
తే. నంకమున నిడి నది బాలుఁ డైన నీతఁ
డెవ్వఁ డని [4]సూప వెఱఁ గంది యెల్ల సురలు
వినుతి సేయ బ్రాహ్మణమూర్తి వెలుఁగునతని
కిడియె దుర్వాసుఁ డనునామ మీశ్వరుండు.

౩౯౦. తే. అతఁడు సూవె మాయింటికి నరుగుదెంచి
[1]యంత సేసినాఁ డనవుడు నచ్చెరువును
భక్తి[2]యును మదిఁ [3]బిరిగొనఁ బాండునగ్ర
సుతుఁడు [4]నిర్భృతిమై దేవకీసుతునితోడ.

---

౩౮౮ 1. దేవతావితతులతి - శ. ష

౩౮౯. 1. నుప్రథిత - ఏ. శ. ష న 2 క్రోధ - అ ౩. భస్మంబుగానేసి - అ. ఈ. ఓ; భస్మము గాఁగనేసి - కొన్నిప్రతులు. 4. చూచి - పెక్కుప్రతులు.

౩౯౦. 1. యింతచేసినవాఁడన్న నిచ్చలోన-బ.ఖ ల; యంతసేసిన యతఁ డన నచ్చెరువున-ఏ.పి. శ.ష. 2. మెప్పిరి గొనఁగ నప్పాండు-బ.ఖ ల. 3. బెనగొన-ఓ.చ. 4. ప్రీతిమైఁ-ఉ.ఎ.

391. క. శివముఖ్యనామములు ప్ర
స్తవనకృతిఁ భోగమోక్షదము లగునని విం
దు విమలబోధ యెఱింగిం
పవె వానినిరుక్తి ననినఁ బరమప్రీతిన్.

392. వ. అతం డిట్లనియె.

393. క. [1]శివదేవు ముట్టఁ గొల్వఁగ
నవనీశ్వర యతనిపేళ్లయర్థ మెఱింగి సం
[2]స్తవనకృతిఁ గూర్ప నాకై
న [3]విధాతకు[4]నైన నరిది[5]నామునిఁ జూడన్.

394. వ. అయినను.

395. క. నీవిట్లు నన్నునడిగితి
గావున నాయెఱిఁగినట్టిగతిఁ జెప్పెద న
ర్దేవాదిదేవు వరనా
మావలి విను [1]మచలమైన యవధానముతోన్.

396. ఆ. అగ్నివాయువాసవాదిత్యవసుమరు
దాదిదేవతామయాత్ముఁ డైన
శివునిమహిమఁ బ్రీతిఁ జెప్పుట వినుట స
ర్వార్థసాధకంబు లగు నృపాల.

-: కృష్ణుఁడు ధర్మజునకు శివనామనిర్వచనంబు చెప్పుట :-
నం. 13 - 286 - 1 (కుంభ)

397. క. వినుము నరేంద్ర మహాత్త్వం
బు[1]నముండును నీశ్వరత్వమున [2]సకలమహా

---

393. 1. శివునునుముట్టగగొలువక - ఞ. ఖ 2 న వకృతిఁ గూర్పఁగ - ఓ. చ. 3. విరించికి
నైన - చ 4. నేనియరిది నాకుంజూడన్ - ఞ. ఓ. ఖ. ల. 5. నాకుంజూడన్ - త ఎ
ఞ. ఓ. ఖ. ల.

395. 1. కౌరవేంద్ర - ఞ. ఖ

397. 1. నకుందా నీశ్వర - కొన్నిప్రతులు. 2. వెలిఁగి - త. ట.

మునిజనములును మహేశ్వరుఁ
డని కొనియాడ వారుఁ దొప్పు [3]నప్రతిముండై.

398. సీ. ఉగ్రత్వమునఁ బ్రతాపోన్నతి రుద్రనా
మముఁ దాల్చె దేవసంఘమున కెల్ల
[1]మహతి నాఁ బొలుపారు మహనీయదేవత
గావున విను మహాదేవుఁ డయ్యె
నఖిలసత్కర్మ ఫలాకారశుభములు
సేయు వేడుకకల్మి శివుఁ డనంగఁ
జనియె [2]సుస్థిరతేజమున వెలుఁగొందుట
నంచితస్థాణుసమాఖ్యఁ బరఁగె
తే. జంగమస్థావరాత్మక [3]సకలభూత
రూపబహుత నొందుట బహురూపనామ
ధేయుఁ డై యొప్పె ధూమ్రముఁ జాయజటల
వలన ధూర్జటి యనుపేర వఱలె హరుఁడు.

399. ఆ. వినుము విశ్వు లనఁగఁ జనుదేవతలు దన
యంద పొడమి రట్టు లగుట విశ్వ
రూపనామకమున [1]దీపితుం డయ్యె నా
త్రిపురమర్దనుండు నృపవరేణ్య.

400. సీ. బహునేత్రములు మేనఁ బ్రజ్వరిల్లుట సర్వ
తశ్చక్షురాహ్వయోదాత్తకీర్తిఁ
బరఁగు భూతము లెల్లఁ బశువులు దాఁ బతి
గావునఁ బశుపతి నా వెలుంగు
[1]వృషభస్థుఁడై యునికి వృషవాహనుఁడు [2]మృత్యు
వనఁ జనుఁ బ్రాణపాలాఖ్యసమత

3. నప్రతిహతుఁడై, నప్రతిముఖుఁడై - అనిపాఠములు.

398. 1. మహిమతోఁ బొలుపొందు - అ. 2. సుజ్వల - ఎ. 3. సర్వ ఇ. ఏ.

399. 1. రూపితుండయ్యె - అ. ఈ.

400. 1. విషమస్థుఁడై - వా; వృషభస్థుడై - క. ష న కొన్నిప్రతులు. 2. మృడుఁడన - క. ష కొన్నిప్రతులు; మృడుఁడన - న.

నొంది వహించు వేదోక్తాభిధానముల్
మఱియుఁ బెక్కులు వానిమహిమ వేద
ఆ. వేత్తలైనవారు వివరించి యన్యోన్య
బోధకత్వమునఁ బ్రభూతసౌఖ్యు
లగుచు సంతతము శివారామతానిరూ
ఢాత్ములై చరింతు రధిపముఖ్య.

401. క. ఈనామనిర్వచనములు
మానవుఁడు పఠించిన సమాహితమతి యై
వీనుల నించిన సౌఖ్యము
నానందము నిందు నందు నతనికిఁ గల్గున్.

402. వ. అని చెప్పి మఱియును.

403. క. వ్యాసమహాముని లోకహి
తాసక్తిని శివునివిషయ[1]మై పఠ్యముగాఁ
జేసె నుప[2]స్థాన మొకటి
యాసమధికపుణ్యవాక్చయము [3]విను మధిపా.

404. సీ. సర్వజగన్నిత్యసాక్షి లోకైక శు
భావహామూర్తి నిరామయుండు
[1]ప్రథమభూతములకుఁ బ్రథమతమంబును
దాత్తంబు నయిన భూతంబు శివుఁడు
దినముఖంబున నగ్ని [2]జనియించె దను నభ
క్తికసమారాధనక్రతుల నియతిఁ
బాటించువారికి భవమోక్షణంబుగా
వించువేడుక మది [4]నించువాఁడు

403. 1. మాఖ్యానముగా, మైసాఖ్యముగా, మైపార్యముగా - అనిపాఠములు. 2. నుస్తవమొక్కటి- ఉ. 3 వినుము నృపా, విను మనఘా - అనిపాఠములు.

404. 1. భూమ్యాది నిజమహాభూతంబులకును - ఉ క. ష 2. జనియించుటయు, జనియించినను - అనిపాఠములు 3. క్రియల - అ ఇ ఈ. ఎ. ఓ. 4. నించినాఁడు - కొన్నిప్రతులు.

తే. వితతచతురాత్మకత్వవిశ్రుతి సహాయని
కరుణఁ [5]ద త్త్వద[6]స్థిరాకలన[7] కల్య
లగు సపర్యా[8]రతులకు నధ్యైశ్వర్యనిధంబు
[9]నిద్యపదవుల నొసఁగు మహేశ్వరుండు.

405. తే. [1]ఈయుపస్థాన [2]మచలిత[3]హృదయవృత్తి
నరుఁడు శివలింగసన్నిధానమున శాశ్వ
ర్యాధముగఁ జేసి యాయురారోగ్యసకల
కామ్యవై భవై శ్వర్యముల్ గలిగి [4]నెగడు.

-: భీష్ముఁడు ధర్మజునకు ధర్మసూక్ష్మ ప్రకారంబు చెప్పుట:-

సం. 19 - 147 - 10

406. వ. అనిన విని యత్యంతసంతోషంబు నొంది కుంతీతనయాగ్రజుండు శాంతనవుతో ధర్మంబులు బహుప్రకారంబులు గలవు పరమానుష్ఠేయం బగుప్రకారం బెయ్యది దాని నెఱింగింపవే యనుటయు నజ్జనపతికి [1]జాహ్నవీనందనుం డి ట్లనియె.

407. ఆ. ధర్మములకు సంజ్ఞ [1]తద్వేదు లగుమహా
త్ములు తగంగఁ [2]జెప్పుదురు నరేంద్ర
వినుము కాల[3]పాకమున నది యన్యథా
త్వంబు గలిగి యవిశదత్వ మొందు

408. వ. ఎ ట్లంటేని.

---

5. దత్తత్పరానందకలన - ఎ. 6. స్థితా - ఊ. క. శ. 7. కల్ప - కొన్నిప్రతులు. 8. వరులకు, గతులకు - అనిపాఠములు. 9. నిత్యపదవులనొసఁగును నీలగళుఁడు - ఆ ఈ. శాశ్వత పదవులొసఁగు మహేశ్వరుండు - ఇ. ఏ; లొసఁగు - ఓ. క.

405. 1. ఈయుపాఖ్యాన - అ. ఉ. ల 2 మమలిన - పెక్కుప్రతులు. 3. హృదయుడగుచు నరుడు - ఐ.ఖ. 4. వెలయు - ఊ.

406. 1 జాహ్నవీతనయుండు - ఊ.

407. 1. తత్వజ్ఞులగు - అ. ఉ. ఔ; తద్విదులగు - ఊ. 2. పెట్టుదురు - కొన్నిప్రతులు; జేయుదురు - ఉ. ఔ. శ. ష. 3. పాకమున - అ. ఎ. క. ల. శ.

409. క. అనఘ యధర్మము ధర్మం
బనుమతిఁ బుట్టించుఁ దృణ[1]సమావృతమై ప్ర
న్ననితలముచందమునఁ దోఁ
చిన నూయింబోలె సూక్ష్మ[2]చిత్రత లేమిన్.

410. క. తప్పక కాన్పఁగ లేమిం
జెప్పెడువారలును దద్విశేషము దప్పం
జెప్పఁగ ధర్మంబు [1]తెరువు
దప్పు నది క్రియాపరులకు దైన్యముఁ దెచ్చున్.

411. వ. కావున ధర్మంబు సూక్ష్మప్రకారంబు.

412. క. శ్రుతముఁ బరి[1]త్యాగముఁ గల
మతిమంతుల నడుగు లోభమదమోహ సమా
వృతబుద్ధులు గానిసమం
చిత[2]చరితులవలనఁ దెలియు శీలనిరూఢా.

413. క. కామార్థంబులు మోహో
ద్దామతకృత్యంబు లని యెదం గని ధర్మ
స్తోమమునఁ దగులు జనముల
చే [1]మేలఁగ నెఱిఁగికొనుము సిద్ధ[2]వివేకా.

414. తే. అనఘ యంచితస్వాధ్యాయమునను [1]యజ్ఞ
మున [2]సమాచారమున నిష్ఠఁ బొనుఁగుపడక
యుండు నెవ్వారలకు వార లోపి నడపు
నదియ కనుము ధర్మము సూక్ష్మ[3]పదము గాఁగ.

415. క. అన విని యుధిష్ఠిరుఁడు నా
మన మిప్పుడు మీరు సెప్పుమాటల సందే

---

409. 1. సమాశ్రితమై సమాదృతమై- అనిపాఠములు. 2. చిత్రంబెలమిన్ - క

410. 1. తెఱఁగు - అ. ఈ.

412. 1. జ్ఞానము - కొన్నిప్రతులు. 2. చతురుం - క.

413. 1 మెలఁగునెఱింగి కొనుము - అ. ఉ. 2. విచారా - ఇ.

414. 1. యజనమున - ఎ. శ. ష. 2. సమారాధనమునిష్ఠ - ఎ. 3. పదవి - కొన్నిప్రతులు.

హానిగూఢ మయ్యె ధర్మము
గనుఁగొన వలయుటకు బహుముఖత్వము [1]కల్మిన్.

416. క. పారంబు లేని [1]ధర్మా
చారంబున మునుఁగు మాదృశులు[2]ద్రుంకుం
దీరం బిట్టిది యని తెలి
వార ధవాదృశుల తగుదు రర్మిలిఁ జెప్పన్.

417. తే. ఆగమోక్తవిధంబుఁ బ్రత్యక్షమును స
మా[1]చరణము బృథగ్విధవ్యాకులములు
ధర్మసూక్ష్మత యిమ్మాటఁ దథ్య మిట్టి
దనఁగ రానియ ట న్నది యనఘచరిత.

418. వ. అనిన నాపగేయుండు కౌంతేయాగ్రజుతో ని ట్లనియె.

419. క. ఇవిమూ[1]ఁడు దెఱంగులు ధ
ర్మువుసూక్ష్మత [2]నిశ్చయింప [3]ముఖ్యపదంబుల్
దివిరికొని యివియ చూచుట
యవనీశ్వర పూర్వమునులయందుఁ గలుగుటన్.

420. క. అనుమానింపకు మందుం
డును నిశ్శంకాత్ముఁడును జడుండును [1]బోలన్
జననాథ యేను బల్కెద
[2]విని దృఢముగ [3]నూఁదు మింక వేయును నేలా

421. క. విమలాత్మ యహింసయు దా
నము సత్యముఁ గ్రోధవర్జనంబును విను ము

---

415. 1. తెలిమిన్ - ఊ.
416. 1. కర్మా - ఊ. ఏ. చ. 2. క్రోధులకుం - చ.
417. 1. చరితములు దద్విధ - ఉ. ఊ.
419. 1. గమనిక:- 'మూడు' అను పదము సానుస్వారమయినట్లు భారతకవులప్రయోగములు లభింపలేదు. కవిత్రయే తరులైన కొందరుమహాకవులుదీనిని సానుస్వరముగా ప్రయోగించి యున్నారు 2. నిశ్చయించు - పెక్కుప్రతులు. 3. ముఖ్యవుఁదెరువుల్ - ఓ. క.
420. 1. బోలెన్ - పెక్కుప్రతులు. 2. విను - కొన్నిప్రతులు 3. బూదు - ఐ. ఊ. ఖ.

త్త్వమధర్మ[1] రాశి యిది ధ
ర్మము[2]నకుఁ బరసీమ దీని మరుపుము మదిఁకీన్.

422. తే. బ్రాహ్మణారాధనము నఁ దత్పరుఁడ వగుము
దక్క మొండు విచారముల్ ధర్మ [1]పుత్త్రి
యనిన మానస మానంద మంద నాతఁ
డతని [2]కలితభక్తి వందనం బాచరించి.

423. వ. ఎవ్వరు ధర్మంబు[1]నెడ నసూయ సేయుదు రెవ్వరు దాని నుపాసింతు రెఱింగిం
పుము వారివారి పొందుగతులును విన వలతుం[2]జెప్పు మనిన నప్పారవో త్త
మునకు నప్పురుషసత్తముం డి ట్లనియె

424. సీ. వినుము రజస్తమో[1]వికృతులఁ దగిలిన
మానసంబులు గల[2]మానవులకుఁ
గలుగు ధర్మద్వేషకలనంబు వారలు
నరకవాసార్హులు ధరణినాథ
[3]సత్యపరాత్ములు సతతంబు ధర్మ ము
పాసింతు రూర్ధ్వలోకాధివాస
మునకు వా రుక్తులు మునుమును పుట్టిన
సుతుఁడుధర్మము పద్మజునకు దాని
తే. పాకసంపద [4]సుమతు లు[5]పార్జితగ ను
పాసనము సేయుదురు తియ్యపంటి పరువ
మాదరించి తదుపచార మాచరించు
వెరవు గలయట్టి జనములవిధము దోఁప.

425. వ. అనినం గౌంతేయాగ్రజుండు శాంతనవుతోడ సాధులు నసాధులు నన నెట్టి
వారు చెప్పు మనుటయు నమ్మహాత్ముం డి ట్లనియె.

---

421. 1. రాజి - ఎ. 2. నఁబరమసీమదీని, నఁబరమసిద్ధిదీని, నకుఁగుదు రెప్డదిని - అనిపాఠములు
422. 1. తనయ - ఓ. 2. కినభక్తి - చ.
423. 1. దెన, వఱన, నెందు - అని పాఠములు. 2 నాన్నతీవెయని యడిగిననప్పార - అ.
424. 1. వృత్తులు గలిగిన - జ, వికృతులు గలిగిన - పెక్కుప్రతులు. 2. మాన్యులకును-ల.
3. సత్య-ఔ.ల ష. 4. సూతులువార్చి- ఓ. అర్థము చింత్యము. 5. వార్చి-కొన్నిప్రతులు.

-: భీష్ముఁడు ధర్మజునకు సాధ్వసాధుజనుల నిరూపించి చెప్పుట :-

సం. 13 - 143 - 8

426. సీ. తనుయంత [1]నెఱుఁగక ధర్మంబు నడుప దే
శము ననుగాన రసాధుజనులు
ధర్మబోధం బివ్విధంబులు రెంటను
గలిగెడువారు సాధులు తదీయ
చరితంబు విను విడువరు మలమూత్రంబు
లర్థంబు గానిచో నధిప యతిథి
భోజనశిష్టాన్నభోజులు [2]చెరు విచ్చి తగిన
వారలకుఁ బ్రదక్షిణముగ

తే. నరుగుదురు నడపుదురు సత్యార్జవములు
శరణు సొచ్చినఁ గాతురు [3]సురతసక్తి
పరులు నిజదారతృప్తులు గురువినీతు
[4]లమలహృదయులు సంతోషమూరఁ గలరు.

427. వ. అని వెండియు.

428. తే. సాధు లింద్రియవిభ్రాంతి సంహరింతు
రఘముఁ దెలిసి ప్రాయశ్చిత్త మాచరింతు
రప్రకాశంబు గా ధర్మ [1]మాచరింతు
రఖిలభూతదయాళుత్వ మూరఁ గలరు.

429. వ. అనిన విని [1]యజాతశత్రుండు శంతనుపుత్త్రుతో నప్రయత్నులకు నర్థంబు సిద్ధించుట గలుగు ధర్మపరులును నీతి[2]విదు[3]లును నై బలవంతులు బహుమార్గంబు[4]లగు సదుపాయంబుల నర్థంబు [5]లాకాంక్షింప సిద్ధింప కుండెడుఁ గొందఱకు సిద్ధించియు నవి భోగంబుల కుపయోగ్యంబులు గాకుండుటలు పెద్దలేకయుం

---

426. 1. గానరుధర్మంబు - అ. ఈ. 2. తగవిచ్చి - జ. 3. నరసభక్తి - 4. లతుల - ఆ ఈ ఏ.

428 1. మాదరింతు - ఇ

429 1. ధర్మజుండు శంతనపుత్రుతోనప్ర - ఉ. శ. ష. 2. పరులు - క; మంతులు - ఎ 3. లయిన - అ. ఈ. 4. లందు - ఐ ఖ. 5. లాపాదింప - ఊ. ఓ. చ.

గొన్ని చిత్తంబులందు విద్యలలవడు శిక్షితులయ్యును నిర్విద్యులగుటయునుం గలుగుఁ [6]దెవుళ్ల నోసియుం బోట్లం బడియును గొందఱు చావరు పూరిపుడుక దాఁకి బలాధికులు చచ్చుట చూచెద మిట్లుగాఁ గతం బేమి [7]యెఱింగింపవే యనుటయు నమ్మహీపతి కమ్మహాత్ముం డిట్లనియె.

-: సుఖాసుఖంబులు పూర్వజన్మకృతపుణ్యపాపంబులచేఁ గల్గుననిచెప్పుట :-

సం. 13-149-10

430. క. మొలవం బెట్టని [1]యట్టిది
మొలచునె తొలుమేని దానముల నానార్థం
బులు సిద్ధించుఁ బ్రయత్నం
బులు లేకయు నింత నిజము భూపవరేణ్యా.

431. తే. అలఘుతపములు దొలుమేనఁ గలిగె నేని
వెదకి కొని వచ్చు నన్నరువిపులభోగ
ములు పురాకృత వృద్ధసేవల ఫలించు
[1]బుద్ధికలిమియు విద్యలఁ బొలుచుటయును.

432. క. తొలుమేన నహింసారుచి
గలిగిన దీర్ఘాయు వొందుఁ గారణభూతం
బులు భూవర యివి యీగుణ
ములు లేమియ [1]కీడులకును మూలం బరయన్.

433. వ. కావున.

434. తే. వినుము దానంబుఁ దపమును వృద్ధసేవ
నము నహింసయు [1]నియతకృత్యములు సర్వ
జనుల [2]కిమ్మహాగుణములు మనమునందు
[3]దృఢముగా నిల్పి నడపుము ధీరవర్య.

---

6. తెగుళ్ల వచ్చియు, తెగుళ్ల మోసియు, తెగుళ్ల నొచ్చియు, తెగుళ్ల దస్సియు - అనిపాఠములు 7. తెప్పవే - ఐ ఖ.

430. 1. యదిదా - చ; యట్టివి - ఉ. ఎ.

431. 1 భోగసంపద విద్యల - ఉ. ఔ.

432. 1 కీళ్లకెల్ల - ఐ. ఓ. ఖ.

434. 1 నియమ - అ. ఈ. 2. కిమహా - క. ష. 3. దిరముగా - ఓ.

485. వ. అని యుపదేశించి యాపగా [1]నందనుండు వెండియుఁ బాండవాగ్రజున కి ట్లనియె.

486. సీ. ఎప్పుడు ధర్మంబునెడ నాదరము [1]గల
వానికిఁ గాలంబు దాన యిచ్చు
ధర్మతత్త్వప్రబోధముఁ బరిస్ఫుటముగాఁ
గావున సుస్థిరభావశుద్ధి
సహితతప[2]శ్శ్రితస్నానదాన జపంబు
లను దేవతాపూజలను నమోఘ
కాలుఁదైవర్తింపఁగా ధర్మయోగంబు
సమకూరు ధర్మంబు [3]సాధనత్వ
తే. మొంది చేయించికొని [4]చెప్పఁ బొందు నిర్మ
లాత్మకుండు సంసారపారాత్మకంబు
సత్య మజరామరము బోధ నిత్య మచ్యు
తము పరానంద [5]మగు నప్పదంబు ననఘ.

487. వ. అని నిర్దేశించి మఱియును

488. తే. కనువెలుంగు వేదవ్యాసమునివరుండు
నధిప కృష్ణుండు నీకుఁ [1]బరాయణంబు
చింత దిగఁ ద్రావి [2]పాలింపు శాంతవృత్తిఁ
బ్రజల సర్వంబునందును [3]విజయి వగుము.

489. క. అని యి ట్లుపదేశించిన
యనిమిషతటినీతనూజునతులవచనముల్
విని[1]మో మలరఁగఁ బులకలు
దనువున [2]జాదుకొన నొప్పె ధర్మజుఁ [3]డధిపా.

---

485. 1 తనయుండు, సుతుండు - అనిపాఠములు

486. 1. గల్గు - అ. ఉ. ఔ. 2. స్థానసతతదాన - ఓ. 3. సాధకత్వ - ఋ. ఓ. చ. 4. నిష్ఠ - అ. 5. మను - పెక్కుప్రతులు; మనఁదత్పదంబు ననఘ, మున తత్పదంబుననఘ - అని పాఠములు.

488. 1. బరాయణుండు - అ. 2. పాలించు - కొన్నిప్రతులు. 3. విజయ మగును - ఉ. ఓ. ఔ.

489. 1. మనమలరఁగ - ఉ. ఐ. ఖ. ల. 2. బాదుకొన - కొన్నిప్రతులు 3. దంతన్ - అ. ఈ

440. సీ. అపుడు వీక్షించి సత్యవతీసుతుండు శం
తనునందనునితోడ ధర్మజుండు
దెలివొందె భవదుపదేశామృతంబున
ననుజులు గృష్ణుండు నాప్తసకల
రాజన్యులును ధృతరాష్ట్రుండుఁ దానును
దగ ని న్నుపాసించి దయకుఁ బాత్ర
మయ్యె వీడ్కొలుపు మియ్యవనీశుఁ దతి తోడఁ
గ్రమ్మఱ నితఁడు నీకడకు వచ్చు
ఆ. వాఁడు[1]గాక యనిన వాత్సల్యమున నార్ద్రి
మైనచూడ్కి నమ్మహాత్ముఁ డతనిఁ
జూచి పురికిఁ [2]జనుము శుభపరంపరలకు
భాజనంబ వగుము [3]రాజముఖ్య.

-: భీష్ముఁడు ధర్మజు నూఱడించి కరిపురంబునకుఁ బంపుట :-

నం 13-152-5

441. వ. [1]అని యనుజ్ఞ చేసి వెండియు.

442. సీ. నీబుద్ధి ధర్మైకనిష్ఠగావుతను స
మగ్రదక్షిణబహులయజ్ఞములు య
యాతిచందమున శ్రద్ధాన్వితంబుగ జేయుఁ
రాజధర్మంబునఁ బ్రకృతిరంజ
నము నాచరింపు చుట్టములను చెలులను
బండినవృత్తంబుఁ బత్తికులము
లెట్లు ని న్నాశ్రయించి సుఖించువా[1]
రట్లునియుత్తరాయణము వచ్చు

440. 1. గాఁగననిన - ల కొన్ని ప్రతులు, 2. బొమ్మశుభ - అ. ఇ ఏ. ఒ 3. భరతముఖ్య, రాజవర్య - అనిపాఠములు.

441. 1. అనియాజ్ఞ చేసి - ఈ, అనిచనననుజ్ఞఁజేసి - క.

442. 1 వారగుదురీయుత్త - ఇ ఏ

తే. టరసికొని యుండి నాకడ కరుగుదెప్పు
బొమ్ము తల్లియుఁ [2]దమ్ములు భూవరుండు
నీవు సుఖులరై యుండుఁడు నృపవరేణ్య
యనుడు నానంద మొంది ధర్మాత్మజుండు.

443. వ. అట్లు చేయువాఁడ నని సవినయంబుగాఁ బలికి దేవవ్రతునకు దండప్రణామం
బాచరించి యిట్లు వీడుకొని

444. క. మును లనుపఁగఁ గృష్ణాదులుఁ
జనుదేరఁగ [1]నాత్మపురికిఁ జనియె ముదితుఁడై
జను లెదురుకొనఁగఁ బుణ్యాం
గనలును విప్రులును వచ్చి కని [2]దీవనతోన్.

445. క. సేసలు చల్లఁగ మహిమో
ద్భాసితుఁడై యిట్లు వోయి ధర్మజుఁడు నిజా
వాసంబు సొచ్చి గాంధా
రీసంభావన మొనర్చి ప్రియము దలిర్పన్.

446. ఆ. తల్లి కెఱిఁగి [1]ముదము ద్రౌపది కొనరించి
సకల పౌరజనుల జానపదుల
నెలమి [2]యొలయ వీడుకొలిపి భూసురులకు
దానవిధుల సమ్మదం బొనర్చె.

447. వ. విపతులైన సతులకు సమగ్రధనంబు [1]లొసంగి ధృతరాష్ట్రునిం బ్రభూత
పూజాకరణంబునం [2]బరితుష్టునిం జేసి.

448. తే. తమ్ములును గృష్ణుఁడును బ్రమోదమునఁ దేల
నమ్మహీశ్వరుఁ డపుడు రాజ్యాభిషేక
మంగళము నొంది[1]నట్లు నెమ్మదిఁ దలంచి
గట్టి యైన యూఱటపెంపుఁ గాంచి పొలిచె.

---

2. దంత్రియు - (ధృతరాష్ట్రుఁడు కావలయును) కొన్ని ప్రతులు.
444. 1. దోడఁబురికి - కొన్నిప్రతులు 2 దీవింపన్ - ఉ, ఔ.
446. 1, ప్రియము - ట౦, 2 వెలయ, నొలయ, పొలయ - అనిపాఠములు.
447. 1. లిచ్చి - ఓ. ల 2 బరితృప్తునింజేసి - అ.
448. 1. నట్లుగమది - బ ఖ; ధన్యుఁగామదిఁదలంచి- ల

449. వ. అట్లు [1]కొల్చియున్న వారల సముచితప్రకారసమాచరణంబులకుం జన వినియోగించి యభ్యంతరమందిరంబున [2]కరిగె నట్లు జాతశత్రుండు [3]సమ్యగంగీకృత సామ్రాజ్యుం డయి జనసంపూజ్యంబగు [4]చరితంబున సంప్రవర్తిలుచుండఁ బంచాశద్వాసరానంతరంబ వాసరపతి యుత్తరాయణగతుం డగుటయు.

-: ధర్మజుఁడు కృష్ణాదులం దోడ్కొని భీష్మునియొద్దకుం బోవుట :-

సం. 13 - 168 - 6

450. సీ. ఆకురువరేశ్వరుం డప్పుడు కదలి గాం
ధారిని ధృతరాష్ట్రధరణివిభుని
గొంతిని [1]మున్నిడికొని కృష్ణుఁ దమ్ముని
దనతమ్ములను విదురుని యుయుత్సు
సంజయులను గృపాచార్యధౌమ్యుల [2]మంత్ర
[3]కోవిదు లగుయాజకులను దోడఁ
గొని [4]వస్త్రచందనాగురు[5]పుష్పఫలఘృత
కుండముల్ వట్టించుకొని యనేక
తే. రత్నములుఁ గాంచనంబుఁ దో రాఁగ నగ్ని
యంచితంబుగఁ దా సంఘటించి యోగ్య
జన సమానీతముగఁ జేసి సకలపరిజ
నంబుఁ గొల్వ మహావిభవంబు మెఱయ

451. వ. చని భీష్ముని వీరశయనస్థానంబున కనతిదూరంబునం దేరు డిగ్గినం గృష్ణాదులును రథావతరణంబులు చేసిరి తానును వారును బారాశర్యనారదదేవలప్రభృతిపరమ సంయమిసముపాస్యమానుం డగునమ్మాననీయుం జేర నరిగి మునిజనంబులకు

---

449. 1. కొల్చి కొలిచివచ్చినవారలనుచిత - శ. గొలిచివచ్చిన వారినందఱినుచిత - ఉ. ఋ. ఖ. ల. న. 2. నకుంజనియె - ఊ. 3. సమ్యగ్భంగీకృత - ల. న. సమ్యగ్విధిన్గృత - ఊ; చతుస్సముద్రముద్రితాఖిలదిగంగీకృత - క. 4. రాజ్యంబున - ఉ. ఋ. ఖ.

450. 1. మున్నిడుకొని - వా; మున్నిడికొని - కొన్నిప్రతులు. 2. తంత్ర - కొన్నిప్రతులు. 3. కోవిదులను - అ. ఈ. ఒ. ఓ. క. 4. వచ్చి - ఋ. ఖ. ల. 5. పుష్పములు - ఘృత ఔ. 6. చుకొనుచు సన్నుతింపుచు తను జేరినకల - ఉ. ఋ. ఖ.

వినతుం డయి తదభినందితుం డగుచు నా[1]ధర్మనందనుం డయ్యమరనదీనందను
నకు నభివందనం బాచరించి సముచిత[2]ధ్యానతత్పరుం డై నయద్దేవవ్రతు
నుద్దేశించి.

452\. తే. అనఘ వచ్చితి ధర్మనందనుఁడఁ [1]బ్రణతి
యాచరించెద నాపలు [2]కవధరింప
నవసరం బేని విను సమయంబు వార్చి
యగ్ని[3]మొదలుగఁ దేఁ దగునట్టివాని.

453\. సీ. తెచ్చితి ఋత్విజుల్ వచ్చిరి హరియు నీ
తనయుఁడు ధృతరాష్ట్రుఁడును సమస్త
బంధులుఁ గలమహీపతులు విప్రులుఁ బౌర
జనులు నేతెంచిరి సదయహృదయ
వీరిఁ జూడుము కనువిచ్చి నావుడు నమ్మ
హాత్ముఁ డందఱఁ జూచి యానృపాలు
కేలు చెమల్చుచు మేలు చేసితి దైవ
యోగంబు గాదె నీ వాదవు టరయ
ఆ. మనుజనాథ [1]మాఘమాసంబు శుక్లప
క్షంబు [2]నామనమున సంప్రమోద
మావహిల్లఁ[3]జేసె నని యభినందించి
యతని కధికహర్ష [4]మావహించె.

454 వ. తదనంతరంబ ధృతరాష్ట్రునితో ని ట్లనియె

455\. తే. వేదశాస్త్రపరిజ్ఞానవృద్ధసేవ
నములు గలిగి యశేషధర్మములు నెఱిఁగి
వ్యాసముని[1]పతి దేవరహస్య [2]మర్థిఁ
జెప్ప విని నిష్కళంకత [3]నొప్పి తనఘ

---

451\. 1. ధర్మజుండయ్యమర — ఉ శ 2 ధ్యానపరుండై — ఉ; ధ్యానవరుండై యద్దేవ — క.
452\. 1. ప్రణుతి — ఊ ఏ ఔ ఋ 2 కాంక్షింపు, కాదరింప, — అనిపాఠములు 3. మొద
లగు — అ. ఆ ఈ ఊ
453\. 1. పుణ్య న కొన్ని ప్రతులు, 2 నామనంబు సాంద్రమోద — ఉ 3. జేసితని — ఎ. ఓ.
4 మాచరించె — అ ఈ ఎ
455\. 1. నీకుదేవ — ఈ 2. మొప్పజెప్ప — క 3 జెంది — ఊ చ

456. క. కావున [1]భవితవ్యములకు
నీ వడలఁగ వలదు పాండునృపపుత్రులు స
ద్భావనమునఁ జూడ నేర్చిన
[2]భూవర తగ నీవు గన్నపుత్త్రులు గారే.

457. క. వీరిం బరిపాలింపుము
వీరలకుఁ బ్రీతిఁ జిత్తవృత్తి ముదమునం
గూరఁగ ధర్మసుతునిపైఁ
గారుణ్యము గలిగి పనులు గఱపుము నెమ్మిన్.

458. తే. ఏ నెఱుంగుదు నితఁడు నీయెడఁ బ్రియంబు
భక్తియును [1]గల్గి యక్రూరభావుఁ డగుట
నీవు వత్సలత్వమున నీ[2]నృపతిఁ బంచి
పనులు గొనుము కౌరవకులభారధుర్య.

459. క. విను నీతనయులు దురో్య
ధనాదు లవినీతిపరు లధర్మజ్ఞులు క్రో
ధను లతి[1]లుబ్ధులు వారల
మనమున నిడి వగవ వలదు మనుజాధీశా.

460. వ. అని పలికి కృష్ణు నాలోకించి.

-: *భీష్ముఁడు శరీరంబు విడుచుటకు శ్రీకృష్ణు ననుజ్ఞఁ గొనుట* :-

సం 18-168-86.

461. తే. దేవ[1]దేవ [2]జీవాత్మక దేవవంద్య
శంఖచక్ర గదాపద్మ[3]చారుహస్త

456. 1. భవదీయులకును – ఇ, ననిత్యములకును – ఓ 2 భూవల్లభ నీవుగన్న; భూవరవిను నీవుగన్న – అనిపాఠములు.

458. 1. గల్మి – క. ల. క. ష 2. నృపునిఁబంచి – ఌ. ఒ. ఖ.

459. 1. లోభులు – ఇ ఏ

461. 1. సర్వ – ఓ. 2. జనార్దన – ఎ, జితాత్మక – ల. 3 శార్ఙ్గ – కొన్నిప్రతులు

వాసుదేవ త్రివిక్రమ వరద పరమ
పురుష [4]ప్రణుతి యొనర్చెదఁ గరుణఁ జూడు.

462. వ. అనుచు నమస్కరించి,

463. ఆ. బలము నీవ నాకు భక్తుండ నీయెడ
నాలు బిడ్డ లేనియట్టివాఁడఁ
గావు మన్ను నధికకారుణ్యమున [1]నిమ్మ
నుజ్జఁ గమలదళమనోజ్ఞ[2]నయన

464. వ. అని వెండియు,

465. సీ. మాధవ పాండుకుమారవర్గమునకు
గతి నీవ రక్షించి కరుణ మెఱయ
దుర్బుద్ధి యైనయాదుర్యోధనునితోడఁ
గృష్ణుఁ డెక్కడ నుండు గెలుపు గలుగు
[1]నక్కడికంటె నేఁ జెక్కుమాఱులు నట్లు
చెప్పఁగా నాపంపుసేయకతఁడు
దమవారి నెల్లను సమయించి తాను
సమసె నిన్నెఱుఁగుదు నమితమహిమ

తే. నరుఁడు నారాయణుఁడు నను పరమమునులు
జగము రక్షించుటకుఁ [2]గేలిజన్మ మొంది
సంచరించెద రని పరాశరసుతుండు
నారదుండును జెప్పిరి నాకుఁ [3]దొల్లి.

466. వ. అనిన విని వాసుదేవుండు దేవవ్రతు[1]వదనం బత్యాదరంబున [2]నాలోకించి.

467. ఆ. [1]కీడొకప్డు లేదు కృతపుణ్యుఁడవు తండ్రి
వలనిభక్తి పెంపు గలవు [2]దానఁ

---

4. ప్రణతి - అ. బ ల

463. 1. నిమ్ము పరమగతికనుజ్ఞ పద్మనాభ - ఎ 2. నేత్ర - బ ఖ. ల.

465. 1. నక్కడనంటి - కొన్నిప్రతులు 2 గేళిజనన - ఆ. ఎ. ఔ ల. 3 ప్రీతి - క.

466. 1. చరణం - న 2. ననవలోకించి-అ ఓ.

467. 1 కీడొకింత, కీడొకండు, కీడొకపుడు - అనిపాఠములు 2 గాన - ఊ. ఎ. ఓ.

గాదె [3]బంటుఁబోలె గాంగేయ మృత్యువు
నీవశమున నిలిచె [4]నిర్భరముగ.

*—: భీష్ముఁడు శరీరంబు విడిచి నాకలోకగతుం డగుట :—*

నం. 13-168-46

468. వ. నీకు నే ననుజ్ఞ యిచ్చితి వసువులం బొందు మనినం బరమానందంబునం బొంది పాండునందనులను ధృతరాష్ట్రునిం దక్కటి[1]వారలనుం గనుంగొని మీచేత ననుజ్ఞాతుండన కదా యని పలికియు వదలఁ[2]గౌఁగిలించు[3]కొని యానృశంస్యంబును సత్యంబును నిత్యంబులుగాఁ బాటించి బ్రదుకుం డని చెప్పి తాను దొల్లి రాజుల గెల్చి తెచ్చినధనంబులు విప్రజనంబుల కిచ్చి ధర్మతనయుం జూచి యెల్లబ్రాహ్మణులనుం బూజనీయులు [4]ఋత్విజులు నాచార్యులు వృద్ధులు విశేషించి పూజింపవలయువా రని నిర్దేశించి యూరకుండి [5]ధారణానుక్రమంబున [6]సమాహితాత్ముం డయి వాయువుల సన్నిరుద్ధంబు చేసిన నవి యూర్ధ్వగతింగై కొనియె నమ్మహాత్ముం డవయవంబులం బ్రాణంబులు వాపికొనుచు వచ్చునయ్యె[7]చోట్లు శల్యరహితంబు లగుచుండె నట్లగుటం గాంచి కృష్ణాదు లగునఖిలజనంబులు నాశ్చర్యభరితాంతఃకరణు లగుచుఁ గీర్తించి రాసంయమచతురునిచే [8]సర్వాయతనసన్నిరుద్ధం బై యాత్మమూర్ధంబు భేదించి మహోల్కాకారంబున నాకసంబు కెగసి కొంతద వ్వరిగి [9]యంత నంతర్హితం బయ్యె నప్పుడు పుష్పవృష్టి గురిసె దేవదుందుభులు మొరసె నంబరంబున సిద్ధులు సాధ్యులుం బొగడుచుం బ్రమోదంబు నొందిరి ట్లు దేవవ్రతుండు దివంబునకుం జనుటయు.

*—: పరలోకగతుండైన భీష్మునకు నగ్నిసంస్కారంబు చేయుట :—*

నం 13-164-8

469. సీ. ధర్మపుత్త్రుండును దమ్ములు విదురయు
యుత్సులు [1]నగరుకాష్ఠోత్కరంబుఁ

---

3. బంధువోలె - క.ల 4. నిర్మలాత్మ - అ ఉ ఔ. నిర్భయముగ - ఊ చ.

468 1. రాజులం - ఐ. ఖ. 2. కౌఁగిలించి దయానూనృతంబులు నిత్యంబులుగా - ఋ. ఈ. 3. కొని యామృశంస్యంబును - ఓ. (అర్థము విచార్యము) 4. ఋత్విగాచార్య వృద్ధులవిశేషించి - పెక్కుప్రతులు. 5. వాయుధారణా - కొన్నిప్రతులు. 6. సముల్లసితాత్ముండై - జ 7 చోట్ల - వా చోట్లు-పెక్కుప్రతులు 8. సర్వావయవతను సన్నిరుద్ధంబై - కొన్నిప్రతులు. 9 యంతరానంబునొందె - ఐ. ఔ. ఖ.

469. 1. నగిరి - కొన్నిప్రతులు

చందనదారుసంచయమును గొనిసమ
స్థలిసమంచితచితి యలఘుభంగి
విరచించి రయ్యుధిష్ఠిరుఁడును ధృతరాష్ట్రుఁ
డును నమ్మరున్నదీతనయుపుణ్య
గాత్రంబు సుస్నానకలితంబు విహితాను
లేపంబుఁ బుష్పదామోపశోభి
తే. తంబు [2]నుత్తమ[3]క్షౌమావృతంబు నుజ్జ్వ
లాభరణభూషితంబుఁగా నధికభక్తిఁ
జేసి రప్పుడు సామంబు సెలఁగ హోమ
మాచరించిరి యాజకు లగ్ని యలర.

470. క. కనకములు మణులు భూసుర
జన[1]సంఘంబునకు జాతశత్రుఁడు శ్రద్ధా
వినయప్రీతియుతంబుగ
ననేకములు వేడ్క నొసఁగె [2]నవహితమతియై.

471. వ. తదనంతరంబ.

472. క. తలదిక్కు గవలుఁ [1]బాదం
బుల దెస ధృతరాష్ట్రి పాండుభూపాగ్రతనూ
జులుఁ బట్టి యధికవిభవో
జ్జ్వల [2]మగు పాడెపయి నిడిరి [3]శవరత్నంబున్.

473. వ. అమ్మెయి నన్నలువురును వహించిరి భీమసేనార్జునులు ధవళచామరంబు
[1]లిడిరి యుయుత్సుం డుత్తమచ్ఛత్త్రంబు వట్టె వృద్ధలగు కౌరవస్త్రీ
లాలవట్టంబులు వట్టిరి ధౌమ్యుండు క్రియాకలాపంబు నడపె నట్లు గొంద సేర్చి
దేవవ్రతుని దేహంబు శ్రౌతాగ్ని కాహుతిచేసి [2]బహుకుండంబు లెత్తి ఘృతంబు

---

2. నుజ్జ్వల క్షౌమవంతంబును - ఙ. ఖ. 3. వస్త్రావృతంబును, క్షౌమపీతంబును - అని పాఠములు

470. 1 సంచయమునకు - ఙ. ఖ 2 నాహితమతియై-ఙ. ఖ అ; నాయతమతియై - ఔ.

472. 1. బాదంబున - శ. ష (ప్రాసభంగము) 2. తవిమానము న - ఉ. 3. శబ కొన్ని ప్రతులు (వైరిసమాసము)

473. 1. లుదాల్చిరి - ఉ ఔ; లుపివ - క. 2. స్వర్ణ - ఉ.

ప్రయోగించి ప్రజ్వలింపఁ జేసి రవ్విధంబునం బితృమేధంబు [3]విభవమహితంబును విధిసహితంబునుంగా ననుష్ఠించి యక్కార్యావసానంబునఁ గృష్ణద్వైపాయన నారదదేవల ప్రభృతు లనుగమింప భాగీరథికిం జని సర్వ భరత భార్యాసమేతంబుగా నగ్గాంగేయునకుఁ దిలోదక[4]ప్రదానంబు లాచరించి రట్టి సమయంబున.

—: పుత్రశోకాతుర యైన గంగాదేవి కృష్ణాదులం గనుంగొని దుఃఖించుట :–

సం. 18 - 154 - 18

474\. సీ. [1]ఉదకంబు లందుండి యుత్థిత యై శోక
విహ్వలత్వంబున [2]వికలగమన
యగుచు నెమ్మోముపై నశ్రులు [3]గ్రమ్మఁ గాఁ
జనుదెంచి కౌరవసమితి [4]యెదుర
నిలిచి భాగీరథి యలఘుండు [5]తన కొడు
కిలఁ బరికింపఁగా నెట్టిభంగి
వాఁ డయ్యెఁ జరితంబు పోఁడిమి మీరెల్ల
నెఱుఁగుదు రైనను నేను గొంత

తే. సెప్ప వినుఁడు దృఢవ్రతశీలుఁ డమల
బుద్ధి రాజ[6]వృత్తాఢ్యుఁడు [7]భూరికృపుఁడు
కార్యసంవేది పితృభక్తిధుర్యుఁ డార్య
సమ్మతుండు విద్యాపరిశ్రమఘనుండు.

475\. తే. కాశిరాజకన్యకలకుఁ [1]గాఁ జెనంగి
[2]వానిచే గాసి[3]యైరి భూవరులు పలువు
రంబరై పూని [4]వాని [5]మహాబలంబు
జామదగ్న్యుండుఁ [6]దెరలుపఁ జాల [7]కరిగె.

3\. విభవసమాహితంబును - ల; విభవమహితంబుగాననుష్ఠించి - ఊ;4. ప్రదానస్నానంబు లాచరించి - అ; కొన్నిప్రతులు.

474\. 1. ఉదకంబునందుండి- అ ఇ. ఏ ఐ. ఖ 2 వివశగమన - ఎ 3 గ్రమ్మంగ జను దెంచి పెక్కుప్రతులు. 4. యందు - అ ఈ 5 నాకొడుకేఁ బరికింపఁ గనిట్టి - పెక్కుప్రతులు 6 నీతిజ్ఞుండు - ఊ. ఓ 7. భూరిబలుఁడు — అ. ఉ ఔ.

475\. 1. గాఁగఁజెనఁగి - అ. ఏ. క ఖ ల 2. యతనిచేగాని యైరిభూపతులు-ఇ ఏ. ల. ఫ; వానిచేగానియై భూమివరులు ఒ 3. పడిరి - ఐ. 4. వచ్చిమహాబలుండు ఐ. ఔ. ఖ. 5. బాహా - కొన్నిప్రతులు-6. గదల పజ - 7. దయ్యె - పి.శ.ష. న. కొన్నిప్రతులు.

476. వ. అని విలాపంబు సేసి వెండియు.

477. తే. అంతవాఁడు శిఖండిచే నట్టు లగుట
గనియుఁ బెక్కులు పలికియు గాక యునికి
[1]కతనఁ జేసి వజ్రమయంబు గాఁగ నోపు
నని తలంచెద నా[2]డెంద మన్నలార.

478. వ. అని వగచిన గంగాదేవికి దేవకీనందనుం డిట్లనియె.

-: పుత్రమరణదుఃఖిత యగుగంగను కృష్ణద్వైపాయను లూఱడించుట :-

సం 18-161-26

479. తే. నీవు శోకంబు దక్కుము నీసుతుండు
పరమగతి[1]నొందె శాపసంప్రాప్తిఁ జేసి
వసువు మర్త్యుఁడై [2]వర్తించె నసదృశప్ర
భావుఁ డాతఁడు వగ పేల దేవి [3]నీకు.

480. చ. అతని శిఖండి యేల యమరాధిపుఁడున్ సమయింపఁ జాలునే
యతఁడు నిజేచ్ఛఁ జేసి నరునంచితదివ్యశరంబు లంగసం
[1]గతములు చేసి పొన్పఁగ సుఖస్థితి మృత్యువు [2]మాన్పి యుండి కీ
ర్త్యతిశయ మొంది [3]తా వలచినప్పుడు వోయె విషాద మేటికిన్.

481. వ. అని యూఱడిలం బలికెఁ గృష్ణద్వైపాయనమునివరుండును బరమాద
రణీయ త[1]త్పరవచనంబుల [2]నజ్జాహ్నవీదేవికి నానందం బాపాదించెఁ దదనంత
రంబ యాత్మీయసలిలసాంగత్యంబు నొందు నమ్మందాకినిచేతం గృష్ణాదులు
నృపాదులు ననుమతులును ననుజ్ఞాతులు నాశీర్వాద[3]ప్రీతులు నై మునులును
దోడ నడవ నది వెడలి రని యిట్లు భీష్ముని వృత్తాంతంబు వైశంపాయనుండు
జనమేజయునకుఁ జెప్పిన నప్పుడమితేఁ డిత్తెఱంగున నత్తాతకు వలయు
[4]విధానం బాచరించి చరితార్థుండై నయపార్థివముఖ్యుండు మఱియెట్టి
చందంబున వర్తించె మునీంద్రా యెఱింగింపవే [5]యని యడుగుటయు.

---

477. 1 కతమున ఘనవజ్ర - అ ఖ 2. చిత్తమన్నలార, మదియన్నలార - అనిపాఠములు.
479 1 బొందె; ఇ ఈ. జెందె-ఓ 2. జనియించె, వసియించె - అనిపాఠములు. 3. మనకు - ఉ ఓ శ ష
480. 1 గతముగఁజేసి - అ. ఎ 2 గెల్చి, మాన్చి-అనిపాఠములు. 3. దాఁదలఁచి-ఫి. శ. ష. స.
481. 1. తత్వవచనంబుల - కొన్నిప్రతులు. 2. నద్దేవికి - పెక్కుప్రతులు. 3. ప్రీతులై - కొన్నిప్రతులు 4. విధానంబు లాచరించి - అ. ఇ. 5. యనుటయు - అ. ఉ. ఓ. క.

482. చ. సకరుణదివ్యచిత్త [1]పరి [2]శాంతమహత్త్వ [3]విధాన [4]విత్తని
ర్వికృతి విలాసహృద్యశ్రుతి[5]విస్తర విస్ఫురదైకవేద్య పా
వకబహు[6]భవ్యనామ పరివర్ధన సంతుయ[7]దూరధామ వి
[8]శ్వకలిత[9]తోషణా సుభగసాత్వవతేయనచోవిభూషణా.

483. క. [1]సత్సేవ్యాచరణకమల
ద్వాత్సల్యాభరణ ధర్మతత్త్వోద్ధరణా
[2]హృత్సంగత భక్తికదురి
తోత్సారణధుర్య ధృజ్మయూఖవిసరణా.

484. మాలిని. స్మయవిరహితపూజ్యా మంత్ర[1]గీతాధిరాజ్యా
నయనహిమగుసూర్యా నైష్ఠికశ్రేమధుర్యా
దయితభువనరక్షా [2]దాంతిసంపద్యక్షా
నియమనికటవర్తీ [3]నిష్కళానందమూర్తీ.

*గద్యము :-* ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధన విరాజి
తిక్కనసోమయాజిప్రణీతంబైన శ్రీమహాభారతంబున నానుశాసనిక
పర్వంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

శ్రీమదాంధ్రమహాభారతమునందలి యానుశాసనికపర్వము సమాప్తము.



482. 1. మతి – ఔ. 2. శాంతి – ఖ. చ. ళ. ష. 3. నిదాన – ఊ. 4. వృత్త – పెక్కు
వ్రతులు. 5. విస్తరిత, స్ఫురదైక–ఇ. ఒ. 6. దివ్యనామ–ఐ. ఖ. ల. వీ. ష. 7. కారి
భూమ, కారిధూమ, భూరిధామ అనిపాఠములు. 8. శ్వకపరిపోషణా – ఐ. ఔ. క. ఖ.
ల. 9. పోషణా – పెక్కుప్రతులు
483. 1. సత్సేవ్యా చరణ నముద్వాత్సల్యా – న. 2. హృత్సంభవభక్తి – ఎ
484. 1. తంత్రాధిరాజ్యా – అ. ఈ. 2 దాంతి సంవిత్సమక్షా, దాంతి సంవత్సమక్షా, దాంతి
సిద్ధ్యత్ప్రమోక్షా – న; దాంతి సేవత్సమక్షా, దాంతి హృద్యత్సమక్షా – అని
పాఠములు. 3. నిర్మలా – ఇ. ఐ. ఖ.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆనుశాసనిక పర్వము

### గద్య పద్య ప్రథమ పాద సూచి

## ఆ

## ఈ



## ఉ

## ఋ



## ఎ



## ఏ

## గ

## ద

## మ

## య



## ర

## హ